

Prophet Muhammad (SAS)
(Telugu)





**Telugu Islamic Publications Trust (Regd.)**
Sandesha Bhavanam, Chatta Bazar, Hyderabad - 500 002

₹150

ISBN : 81-86826-03-3

మహాప్రవక్త ముహమ్మద్ (స)

# మహాప్రవక్త
# ముహమ్మద్
సల్లల్లాహు అలైహి వ సల్లం

**Hayat-e-Tayyiba**
(Telugu)

# మహాప్రవక్త ముహమ్మద్

(సల్లల్లాహు అలైహి వ సల్లమ్)

*ఆధారం:*
**హయాతె తయ్యిబా**

*రచన:*
**అబూ సలీమ్ అబ్దుల్ హై**

*అనువాదం, సంపాదకత్వం:*
**ఎస్.ఎమ్. మలిక్**




**తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్**
సందేశభవనం, లక్కడ్‌కోట్,
హైదరాబాద్-500 002. ఫోన్: 24564583

**Maha Pravakta Muhammad (SAS)**
**Hayat-e-Tayyiba (Telugu)**

**TIP Series No. 13**

Author : Maulana Abu Saleem Abdul Hai

Translator : S.M. Mallick

*All Rights Reserved with Publishers*

20th Edition : December 2017

Copies : 2000

**Price : Rs.150**

ISBN : 81- 86826 - 03 - 3

Published by : **Telugu Islamic Publications Trust** (Regd.)
Sandesha Bhavanam,Lakkadkot,
Chatta Bazar, Hyderabad-500 002.
Phones: 040-24564583, 24576237
e-mail: geeturaiweekly@gmail.com

Typeset by : Geeturai Graphics
Lakkadkot, Hyderabad-2.

Printed at : Cosmic Printers
Lakkadkot, Hyderabad-2.



అపార కృపాశీలుడు పరమ కరుణామయుడు అల్లాహ్ పేరుతో

# నా మాట

విశ్వప్రభువయిన అల్లాహ్‌కు సహస్రకోటి ధన్యవాదాలు. ఆయన కటాక్షం వల్లనే ఈ దివ్యగ్రంథాన్ని పూర్తి చేసే భాగ్యానికి నోచుకున్నాను. ఆయన కృప వల్లనే ఈ కృతిని అయిదుకోట్ల ఆంధ్రప్రజలకు సమర్పించుకోగలుగుతున్నాను.

ప్రస్తుత కృతిలో దేవుని అంతిమ సందేశహరుడయిన ముహమ్మద్ సల్లల్లాహు అలైహివసల్లమ్ ఆదర్శజీవితాన్ని, ఆయన సందేశంలో గల మధురానుగ్రహాల్ని సంగ్రహంగా అందజేసే ప్రయత్నం జరిగింది. మానవ మహోపకారి మహాప్రవక్త ముహమ్మద్ (స) జీవిత గాథ అనంతమయిన శుభాల మహాసాగరం. ఇంత వరకు ప్రపంచంలో ఎందరు ఎన్ని విధాలుగా దాని అధ్యయనం చేశారో, దాన్ని గ్రంథస్థం చేశారో చెప్పుకోడానికే ఒక ప్రత్యేక గ్రంథం కావలసి వుంటుంది. ఈ జిజ్ఞాసువుల్లో ఆయన అనుయాయులూ ఉన్నారు, విరోధులూ ఉన్నారు. ఆయన్ని ప్రేమించి ఆ పవిత్ర జీవితంలో తమ ఆదర్శమూర్తిని తిలకించి ధన్యులయిన వారు కోటానుకోట్లుగా ఉండగా ఆ నిర్మల సరోవరంలో కల్మషపు దుర్జలం రెండు బొట్లు కలపడానికి ప్రయత్నించిన కుటిలాత్ములు కొందరు లేకపోలేదు.

అయితే ఒక సత్యాన్వేషి నిష్పాక్షిక హృదయంతో, చిత్తశుద్ధితో ఆ పావన జీవితాన్ని అధ్యయనం చేసి స్వతంత్రంగా ఒక నిర్ణయానికి రావడమే సమంజసం. ఆ అసమాన శక్తి సామర్థ్యాల మానవ శ్రేష్ఠుని జీవితానికి సంబంధించినంతవరకు ఒక విషయం మాత్రం సత్యం. ఆయన ద్వారా రూపొందిన విప్లవ కారణంగా ప్రపంచానికి కావలసిన గొప్ప ఆధ్యాత్మిక, నైతిక, సామాజిక, సాంస్కృతిక, రాజకీయ పరిణామం ప్రారంభమయింది. నేడు ప్రపంచం అనుభవిస్తున్న శాస్త్రీయ పురోభివృద్ధికి ఆ విప్లవమే మూలకారణమని గొప్పగొప్ప చరిత్రకారులు, శాస్త్రవేత్తలు ఏకగ్రీవంగా అభిప్రాయపడుతున్నారు.

మానవ జ్ఞానం ప్రగతి పథాన పయనించిన కొద్దీ మహాప్రవక్త (స) బోధనల మహత్తును లోకం మరింతగా అర్థం చేసుకుంటూ ఉంటుంది. మానవాళి ఆయన బోధల్ని, ఆయన సందేశాన్ని, ఆయన ఆదర్శ జీవితాన్ని మార్గదర్శకంగా స్వీకరించి మానవ మనుగడలోని వ్యక్తిగత, సామూహిక రుగ్మతల్ని, అవకతవకల్ని సరిదిద్దుకో గలుగుతుంది.

ఆయన జీవితం 1400 ఏళ్ళకు పూర్వం ఏ విధంగా అనుసరణీయంగా శాంతి దాయకంగా ఉండేదో ఈనాడు కూడా అదే విధంగా నేటి అధునాతన పీడిత మానవ అంతర్యానికి కూడా శాంతిని, స్థిమితాన్ని ప్రసాదించే అమృతపుజల్లు కాగలదు. దాన్ని తమ జీవితానికి ఆదర్శంగా భావించి జీవన పథాన పయనించదలచిన విప్లవ చిత్తులు, త్యాగధనులే నేడు ప్రపంచానికి అవసరం.

– మలిక్

**25-03-1974**
హైదరాబాద్

అపార కృపాశీలుడు పరమ కరుణామయుడు అల్లాహ్ పేరుతో

# మరో మాట

దైవకారుణ్యం అపారమయింది. ఆయన కటాక్షం వల్లనే దేవుని అంతిమ సందేశహరుడు ముహమ్మద్ (సల్లల్లాహు అలైహివసల్లమ్) జీవిత వివరాలను క్లుప్తంగా ప్రస్తావించిన ఈ గ్రంథం, "మహాప్రవక్త ముహమ్మద్" ప్రచురించిన తొమ్మిది నెలల లోపునే రెండో ముద్రణకు రావలసివచ్చింది.

"సర్వలోకాల కొరకు మూర్తీభవించిన కారుణ్యం" అని దైవం పేర్కొన్న మానవ మహోపకారి (సల్లల్లాహు అలైహివసల్లమ్) జీవితాన్ని అధ్యయనం చెయ్యడానికి తెలుగు ప్రజలు ఎంతగా పరితపిస్తున్నారో దీన్నిబట్టి బోధపడుతోంది. దైవం వారి సత్య పిపాసకు సరయిన తృప్తిని ప్రసాదించుగాక !

ఈ పుస్తకాన్ని సమగ్రంగా సమీక్షించి అది సర్వ జనాదరణ పొందడానికి దోహదపడిన తెలుగు, ఇంగ్లీషు, దిన, వార, మాస పత్రికల సమీక్షకులకు మా హృదయ పూర్వక కృతజ్ఞతాభి వందనాలు.

మలి ముద్రణలో మహాప్రవక్త జీవితంతో సంబంధమున్న కొన్ని ముఖ్యప్రదేశాల ఫోటోలు ఆయన వివిధ రాజ్యాధినేతలకు పంపిన సందేశ పత్రాల చిత్రాలను జత పరిచాము. ఇవి ఈ పుస్తకం విలువను మరింత పెంచాయనడంలో సందేహం లేదు.

పాఠకులు తమ సముచిత సలహాల ద్వారా మాకు సదా తోడ్పడుతారని ఆశిస్తున్నాము.

– ప్రకాశకులు



## విషయ సూచిక






అపార కృపాశీలుడు పరమ కరుణామయుడు అల్లాహ్ పేరుతో

# ఇస్లామీయ ఉద్యమం

ఇస్లామ్ లేక ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లమ్) ప్రపంచానికి అందజేసిన సందేశం నిజానికి ఒక మహోజ్వలమయిన సంస్కరణోద్యమం. అయితే ఈ ఉద్యమం ప్రపంచానికి కొత్తదేమీ కాదు. ఈ ఉద్యమాన్నే దైవం ప్రభవింపజేసిన ప్రవక్తలందరూ ప్రతి యుగంలో, ప్రతి దేశంలో నడిపారు. ఈ ఉద్యమం కేవలం ఆధ్యాత్మిక రంగాన్నే కాక మానవ జీవితానికి సంబంధించిన ప్రతి విభాగాన్ని అపురూపంగా, అద్వితీయంగా తీర్చిదిద్దింది. ఇది ఆధ్యాత్మిక, నైతిక, సామాజిక, ఆర్థిక, రాజకీయ రంగాలను పరివేష్టించిన సర్వతోముఖమయిన ఉద్యమం. మానవ జీవితపు ఏ ఒక్క రంగమూ దీని పరిధికి వెలుపల లేదు.

## ప్రాముఖ్యత

సంస్కరణోద్యమాలు, విప్లవాత్మకమయిన ఉద్యమాలు ప్రపంచంలో ఎన్నో వెలిశాయి. అయితే ఇస్లామీయ ఉద్యమం దాని వైవిధ్యం, దాని సర్వవ్యాపకం, ఇంకా కొన్ని విశేషాల రీత్యా తతిమ్మా ఉద్యమాలన్నింటిలోనూ ఒక ప్రత్యేకత సంతరించుకుంది. ఈ ఉద్యమం గురించి ఏ కాస్త పరిచయమున్నా మనిషిలో కొన్ని ప్రశ్నలు సహజంగానే ఉత్పన్నమవుతాయి. ఈ ఉద్యమం ఎలా ప్రజ్వరిల్లింది? దీని వైతాళికుడు దీని సందేశాన్ని ప్రజల ముందు పెట్టటంలో అవలంబించిన విధానం ఏది? దాని పర్యవసానం ఏమయింది? ఈ ప్రశ్నల సమాధానాలు తెలుసుకుంటే కేవలం చరిత్రను అధ్యయనం చేయాలనే కోరిక తీరడం మాత్రమే కాదు, దానికి తోడుగా యావత్తు మానవ జీవన వ్యవస్థను సంపూర్ణంగా సంస్కరించిన మహోన్నతమయిన ఒక ఉద్యమం మనకు పరిచయమవుతుంది. ఈ ప్రశ్నలకు ఉన్న అసలు ప్రాముఖ్యత ఇదే.

యదార్థమేమంటే మనిషి నేడు ఏ అపరిష్కృత జటిల సమస్యల చీకట్లలో కొట్టుమిట్టాడుతున్నాడో ఆ సమస్యల సంతృప్తికరమయిన పరిష్కారానికి ఈ ఉద్యమ

అధ్యయనం నేడూ అవసరమే. ఈ ఉద్యమం మనిషికి అతని నిజమయిన లాభనష్టాల వాస్తవికతను చాటి చెబుతుంది. మానవ జీవిత పరమార్థపు అసలు గమ్యమయిన పరలోక జీవితానికి సంబంధించిన యదార్థాలను విశదపరుస్తుంది. మానవ మనుగడకుగాను ఒక సవ్యమయిన, సమంజసమయిన కార్యక్రమాన్ని ప్రతిపాదిస్తుంది. ఇహలోక జీవితానికి సంబంధించిన ఈ కార్యక్రమం, ఈ ఆచరణా నియమావళి, మనిషి ఐహిక జీవితాన్ని సుఖమయం, సక్రమం చెయ్యడమే కాక అతని పరలోక జీవితాన్ని, శాశ్వత జీవనాన్ని జయప్రదం, ఫలవంతం చేస్తుంది. ఈ జీవనవ్యవస్థను త్రోసిపుచ్చి, మనిషి నిత్యం ఎనలేని ఇక్కట్ల పాలయినట్లు, నేడూ అసంఖ్యాకమయిన సంక్లిష్ట సమస్యలకు గురయి వీటినుండి బయట పడలేక సతమతమవుతున్నాడు. ఈ ఉద్యమం, ఈ సందేశం చూపే జీవనపథాన్ని అవలంబిస్తే ఈ ముప్పులన్నిటి నుండి విముక్తి పొందుతాడు మానవుడు.

ఇస్లామీయ ఉద్యమానికి వున్న ఈ ప్రత్యేకత మూలంగానే మేధావులు, జిజ్ఞాసువులు ఈ ఉద్యమాన్ని అధ్యయనం చెయ్యాలనీ, దీన్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకోవాలని అభిలషిస్తారు. ఈ ఉద్యమం లోకంలోని సకల సమస్యలకు సవ్యమైన పరిష్కారం చూపు తుందన్న ఈ గొప్ప ఉద్ఘోషణలో సత్యం ఏమాత్రం వుందో చూడాలని ఉత్సాహ పడతారు.

ఇస్లామీయ ఉద్యమాన్ని అర్థం చేసుకునేందుకు దోహదపడే గ్రంథాలు ఎన్నో వున్నాయి. ఇంకా వస్తాయి కూడా వీటి ద్వారా ఇస్లామీయ ఉద్యమం ప్రస్ఫుటంగా పరిచయమవుతుంది. సందేహం లేదు. కాని ఒక్క విషయం, వెలుగును చూడగానే దీపాన్నీ, సువాసన అనుభూతి కలగగానే పుష్పాన్నీ తలంచకుండా వుండలేము. అలాగే ఇలాంటి సర్వతోముఖమయిన ఉద్యమాన్ని పరిచయం చేసుకుంటున్నప్పుడు. ఆ ఉద్యమ సందేశ ప్రదాత, ఆ ఉద్యమ రథసారథిని గురించిన తలంపు రాకమానదు. అందువల్లనే ఇస్లామీయ ఉద్యమ ప్రస్తావన రాగానే ప్రజల్లో వెంటనే ఉద్యమ మూలపురుషుడు, మహాప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లమ్) జీవిత వివరాలను తెలుసుకోవాలన్న ప్రబలమైన కోరిక జనిస్తుంది. దీనితోపాటు ఈ ఉద్యమానికీ ఈ సందేశానికీ మూలాధారమయిన మార్గదర్శక గ్రంథమయిన దివ్య ఖుర్ఆన్, దాని వ్యాఖ్యానాలు అధ్యయనం చెయ్యాలని కాంక్ష పుడుతుంది. జిజ్ఞాసువుల ఈ కోరికలు అత్యంత సహజమయినవే.

## ప్రత్యేకత

మనుషులను నీతిమంతులుగా సుశిక్షితులుగా చేసి వారి జీవితాలను పవిత్రంగా మలచడమే అత్యుత్తమ మానవ సేవ అని, అదే మానవుల అతి ముఖ్యమైన విద్యుక్తధర్మమని అందరూ అంగీకరిస్తారు. మానవాళిని తొలచివేస్తున్న రుగ్మతల్ని దూరం చేసి, మానవుడు



నిజమయిన సాఫల్యాన్ని పొందగల పరిపూర్ణమయిన జీవన వ్యవస్థను అతనికి అందజేయడం సకల సేవలకంటే శ్రేష్ఠమయినదే. ఈ ఉత్తమ కార్యసిద్ధికై ఎందరో సజ్జనులు తమకు తోచిన రీతిలో సమయోచితంగా కృషి చేశారు. అయితే ఈ మహనీయులంతా ఆ సమయాన మానవ సంస్కరణ ఏ రంగంలో జరగడం అత్యంతావశ్యకం అని భావించారో ఆ రంగాన్ని ఎన్నుకుని జీవితపు ఆ విభాగాన్నే సముద్ధరించడానికి శాయశక్తులా కృషి సలిపారు, కొందరు నైతిక శిక్షణలపై, ఆధ్యాత్మిక సాధనలపై తమ కృషినంతా కేంద్రీకరిస్తే, కొందరు సంస్కృతీ సభ్యతల్ని తీర్చిదిద్దడంలో నిమగ్నులయ్యారు; మరి కొందరేమో పరిపాలనా వ్యవస్థ, రాజకీయా లనే తమ కార్యరంగంగా తీసుకున్నారు. కాని మానవాళి జీవితం మొత్తాన్ని పరిపూర్ణంగా చక్కదిద్దే ధ్యేయాన్ని ఒక్క దైవప్రవక్తలు తప్ప మరెవ్వరూ చేపట్టలేదు.

దైవ ప్రవక్తలందరిలోనూ అంతిమ దైవసందేశహరుడు, అందరికీ చివరన ప్రభవించిన దైవప్రవక్త అందజేసిన సందేశమూ, ఆయన జీవిత వివరాలూ అన్నీ 1400 ఏళ్ళ తరువాత నేటికీ సురక్షితంగా ఉన్నాయి, వాటికి ప్రాప్తమయిన రక్షణ మానవాళి ఇతిహాసంలో మరే సందేశానికీ మరే జీవిత చరిత్రకు లభ్యం కాలేదు. ఈ రక్షణ ఏర్పాటు విశ్వప్రభువు మానవాళికి చేసిన మహోపకారాల్లో ఒకటి.

అంతిమ దైవసందేశహరుడు మహనీయ ముహమ్మద్ (స) జీవిత వివరాలు గ్రంథస్థం అయిన తీరే వేరు. వాటి సేకరణ కొరకు, వాటి నిర్దుష్టత కొరకు జరిగిన ఏర్పాట్లు అద్భుత మయినవి, నిరుపమానమైనవి. ఇలాంటి ఏకైకమైన ఏర్పాట్లు ప్రపంచంలో మరే చారిత్రక సమాచారానికి ప్రాప్తం కాలేదంటే అతిశయోక్తి కాదు. వాటి నిర్ధారణా ప్రామాణికతలే కాదు, వాటి వివరణ వాటి విషయవిస్తరణ కూడా అద్వితీయమయింది, ఆశ్చర్యకరమయింది. ఆయన రూపురేఖలు, వస్త్రధారణలేకాక, ఆయన మాటలు, మాటలాడిన తీరు, నలుగురి మధ్యన మసలుకున్న రీతి, చేసిన పనులు అన్నీ సవివరంగా వర్ణించడం జరిగింది. నిత్య జీవన వ్యవహారాల్లో ఆయన అవలంబించిన వైఖరి, మనుషులతో జరిపిన సంభాషణ, సంవాదన, వ్యవహారాలు, వ్యాపారాలు సమస్తం ఉల్లేఖించారు. చివరికి ఆయన భోజన పానీయాల వివరాలు, వర్ణనలు, నిద్రపోవడం, మేల్కొనడం లాంటి అంతరంగిక పద్ధతులు, మిత్రులతో నవ్వుతూ హాయిగా గడుపుకున్న క్షణాలు సర్వమూ పదాలతో చిత్రించిపెట్టారు. ఆయన ఒక్కో కదలికను గ్రంథస్థం చేసి భద్రపరిచారు.

గతించిన ఒక్క శతాబ్దంలో జీవించిన మహాపురుషుల జీవిత వివరాలు సయితం మనం తెలుసుకోలేము. కాని, దాదాపు వేయిన్నర ఏండ్లనాడు ఫోటోలు, టేపు రికార్డర్లు లేని కాలంలో ప్రభవించిన ఒకానొక వ్యక్తి ముహమ్మద్ (స) గురించి నేడు మనం తెలుసుకో లేని విషయమంటూ ఏదీ లేదు.

హజ్రత్ ముహమ్మద్ (స) జీవిత విశేషాలు అధ్యయనం చేసేముందు మరో విషయాన్ని మనం దృష్టిలో ఉంచుకోవడం అవసరం. ఏ కార్యమయినా అది ఎలాంటి పరిస్థితుల్లో జరిగింది అన్న దానిని బట్టి దానికి ప్రాముఖ్యత ఉంటుంది. సానుకూల వాతావరణంలో దినదినాభివృద్ధి చెందుతూ విజయశిఖరాల్ని అందుకున్న ఉద్యమాలే ప్రతికూల పరిస్థితుల్లో అడుగంటిపోతాయి.

## ఉద్యమాలు, వాటి తీరు

సాధారణంగా ఉద్యమాలు బయల్దేరే పంథా, పరిణామక్రమం ఇలా వుంటుంది: ప్రథమంగా ప్రత్యేక పరిస్థితుల్లో, జనసామాన్యంలో విశేషమయిన వాంఛ, కోరికలు జనిస్తాయి. ఆ విశేషమైన వాంఛ పరిపూర్తి కొరకు ప్రజల్లో తహతహ బయలుదేరుతుంది. దాని కొరకు ఏదయినా పిలుపు వినిపిస్తే దాన్ని స్వీకరించేందుకు అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. అంతటా కుతకుత ప్రారంభమవుతుంది. పరిస్థితులు పరిపక్వం చెందిన మీదట అదనుచూచి ఎవరయినా చొరవ తీసుకుని ఉద్యమాన్ని లేపగానే దానికి సర్వత్రా ప్రజాదరణ, ప్రజాభిమానం, ఆహ్వానాలు లభిస్తాయి, అప్పుడు ఉద్యమం ఏకధాటిగా ముందుకు సాగుతుంది.

ఉదాహరణకు స్వాతంత్ర్య ఉద్యమాన్ని తీసుకుందాము. సామాన్యంగా ప్రజలు విదేశీపాలకుల దౌర్జన్యాలను, అత్యాచారాలను అనుభవ పూర్వకంగా గ్రహించి నిరసిస్తూ వుంటారు. విదేశీపాలన పట్ల కోపావేశాలు కలిగి వుంటారు. ఆ ప్రభుత్వానికి వ్యతిరేకంగా మనుషుల మనస్సుల్లో విద్వేషం జనించి వృద్ధి చెందుతూ వుంటుంది. అట్టి తరుణంలో సాహసవంతుడయిన ఒక వ్యక్తి లేచి దేశ స్వాతంత్ర్యం కొరకు పిలుపునిస్తే ప్రారంభంలో కష్టనష్టాల కారణంగా, శంకలూ సందేహాల మూలంగా కొద్దిమందే అతనితో సహకరించినా జనబాహుళ్యం ఆంతర్యాల్లో అతని నినాదంపట్ల, అతనిపట్ల సానుభూతి ఆదరాభిమానాలకు మాత్రం కొదువ వుండదు.

ఆర్థిక ఉద్యమాల వైనం కూడా దీనికి భిన్నం కాదు. ప్రజలు తమ లేమినీ, ఇతరుల ఆర్థిక దోపిడీనీ, వాళ్ళ దౌర్జన్యాలను ఏ మాత్రం సహించలేని పరిస్థితి ఏర్పడి నప్పుడు, ఆర్థిక సముద్ధరణ పేరుతో ఉద్యమం ప్రజ్వరిల్లితే జనసామాన్యం దానికి చేయూత నిస్తారనడంలో ఏమాత్రం సందేహం వుండదు.

అయితే పూర్తిగా ప్రతికూల వాతావరణంలో వెలిసే ఒక ఉద్యమాన్ని కాస్త ఊహించండి. ఉదాహరణకు, స్వేచ్ఛగా వీలయితే విశృంఖలంగా జీవించాలన్నది మనుషుల ప్రగాఢవాంఛ. అలాంటప్పుడు ఒక స్వతంత్ర దేశంలో ఎవరయినా లేచి ఈ దేశం ఫలానా రాజ్యానికి లొంగిపోవాలని, దాసోహమవ్వాలని ఉద్యమం లేవదీస్తే జరిగే పర్యవసానాన్ని ఆలోచించండి. స్వేచ్ఛా ప్రియులయిన మనుషులు ఇలాంటి వింతఘోషణ



చేసే విచిత్ర మానవుడి పట్ల వ్యవహరించే తీరు, అతనికి ఆసన్నమయ్యే అవాంతరాలు, అతని ఉద్యమాన్ని చుట్టు ముట్టే కష్టనిష్ఠూరాలు వర్ణనాతీతం.

## ఇస్లామీయ ఉద్యమం

ఇస్లామీయ ఉద్యమ సందేశ దాత అయిన ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లమ్) సాధించిన అనన్యమైన ఘనకార్యం గురించి ఊహా మాత్రంగానయినా తెలుసు కోవాలన్నా, దాని ఔన్నత్యాన్ని స్థూలంగా అంచనా వేయాలన్నా, కనీసం ఆయన ఎలాంటి వాతావరణంలో, ఏ ప్రజల ముందు తన సందేశాన్ని సమర్పించారో తెలుసుకోవడం అవసరం. అందువల్ల, ఆయన ఇస్లామ్ సందేశాన్ని ప్రపంచానికి అందజేసేందుకు ప్రారం భంలో ఏ దేశ ప్రజల ముందయితే దాన్ని సమర్పించారో ఆ దేశం- అరేబియా దేశంలోనూ ఇంకా ప్రపంచం మొత్తాన నెలకొనివున్న పరిస్థితుల్ని కనీసం స్థూలంగానయినా పరిశీ లించడం సమంజసం, అవశ్యం కూడా.

## ప్రపంచ వాతావరణం

ఇస్లామ్ సందేశానికి మూల సూత్రం "తౌహీద్"- ఏకేశ్వరోపాసన, దేవుని ఏకత్వపు భావన. అయితే మహాప్రవక్త ముహమ్మద్ ఆవిర్భావ కాలంలో ఒక్క అరబ్బు దేశంలోనే కాదు, ప్రపంచ మొత్తాన ఈ తౌహీద్ వెలుగే కరువయింది. దైవం ఒక్కడే అన్నభావన మనుషుల మస్తిష్కాలనుండే మాయమయిపోయింది. మహాప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహివసల్లమ్) ప్రభావానికి పూర్వం "ఇస్లామ్" సందేశ దాతలు అనేక మంది ప్రపంచంలో ప్రతిచోటా ప్రభవించిన మాటా నిజమే. ప్రజల్లో తౌహీద్ సందేశం భాసిల్లిన విషయమూ వాస్తవమే. కాని దురదృష్టవశాన మానవులు సర్వత్రా ఈ సందేశాన్ని సదా విస్మరిస్తూ వచ్చారు. తమ మనోవాంఛల ప్రకారం సూర్యచంద్రాది నక్షత్రాలను గ్రహాలను, జిన్నులను, దైవదూతలను, నదులూ పర్వతాలను, మనుషుల్ని చివరికి పశువుల్ని సయితం దైవాలుగా, దైవత్వంలో సహవర్తులుగా పరిగణించసాగారు. ఒకే దేవుని ఉపాసనలో శాంతిని, తృప్తిని పొందలేక అసంఖ్యాక దైవాల వ్యూహంలో ఇరుక్కుపోయాడు మనిషి.

ఆ కాలంలోని నాగరిక లోకంలో రెండే ప్రాముఖ్యంగల రాజ్యాలు - నేటి పరిభాషలో చెప్పాలంటే అవి ఆనాటి అగ్రరాజ్యాలు - పర్షియా ప్రభుత్వం, రోమ్ సామ్రాజ్యం. పర్షియాలో అగ్ని పూజా ప్రధానమైన "మజూసి" మతం, నాటి పర్షియా నేటి ఇరాన్ దేశం కాదు. అది ఇరాక్ మొదలుకొని భారతావని పొలిమేరల వరకు విస్తరించి వుండింది. రోమ్‌లో సర్వసాధారణంగా ప్రజలు క్రైస్తవ మతాన్ని అవలంబించేవారు. అప్పటి రోమను సామ్రాజ్యం అటు యూరోపు, ఆసియా ఖండాల వరకు, ఇటు ఆఫ్రికా ఖండం వరకు వ్యాపించి వుండింది. మత రీత్యా చూస్తే ప్రపంచంలో ప్రముఖ మతస్థులు యూదులు, హిందువులు. ఈ మతావలంబీకులంతా తమ తమ మతాల పరిధుల్ని దాటి పోలేకపోయారు.

పర్షియాలో అగ్ని పూజతోపాటు నక్షత్రపూజ కూడా సామాన్యంగా జరుగుతూ వుండేది. అంతేకాక, రాజు, ఇతర ప్రభుత్వాధికారులు తమ తమ స్థాయికి తగ్గట్టు ప్రజల పాలిటి దేవుళ్ళుగా, దేవతలుగా చెలామణి అయ్యేవారు. వీరందరి ముందు ప్రజలు మోకరిల్లడం, సాష్టాంగ పడటం, వారి కీర్తిని కొనియాడటం సామాన్యంగా జరిగేది.

## రోమన్ సామ్రాజ్యం

గ్రీకు సామ్రాజ్య పతనానంతరం రోమను సామ్రాజ్యం ప్రపంచంలోకెల్లా పెద్ద రాజ్యంగా ఎంచబడేది. కాని క్రీ.శ. ఆరవ శతాబ్దం అంతంలో ఈ ప్రభుత్వం అధోగతి పాలయింది. పాలనా వ్యవస్థలో సంక్షోభం, శత్రుభీతి, దేశంలో అరాచకం నలుమూలలా కొట్టవచ్చినట్టు కానరాసాగాయి. పైగా నైతికంగా దిగజారిన సమాజం, భోగవిలాసాలకు దాసులయిన ప్రజలు అంతా కలసి కీడు అనేది మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లే అవకాశం కలిగింది. మత పరంగా కూడా వారి స్థితి ఎంతో హీనంగా తయా రయింది. కొందరు నక్షత్రాలను దేవతా విగ్రహాలను ఆరాధించేవారు. క్రైస్తవ మతం ఆశ్రయించిన వారిలోనూ దేవుని ఏకత్వపు భావం పూజ్యమయింది. తండ్రి కుమారుడు, పరిశుద్ధాత్మ, మరియా – వీరందరికి దైవత్వం ఆపాదించారు క్రైస్తవులు. వారిలోనూ వందల కొద్ది మత వర్గాలు బయల్దేరాయి. అందరూ పరస్పరం ఘర్షించుకునేవారు. సమాధుల పూజ సర్వసాధారణమయిపోయింది. పాదరీలకు సాష్టాంగ దండ ప్రణామాలు జరిగేవి. పోపు, ఆయన క్రింది మతసంబంధమయిన పదవులు అలంకరించిన వారు తమ తమ హోదాకు తగ్గట్టు పాలనాధికారాలు, దైవత్వపు అధికారాలు తమకు తామే సంక్రమింపజేసుకున్నారు. ధర్మాధర్మాల నిర్ణయ అధికారం వారికి వుండేది. వారి మాట దైవ వాక్కుగా పరిగణించబడేది. ప్రాపంచిక కార్యకలాపాలన్నీ త్యజించి వైరాగ్యం, సన్యాసం పుచ్చుకోవడాన్ని ధర్మనిరతిగా అత్యున్నత ఆధ్యాత్మిక సోపానంగా భావించేవారు. సకల సౌఖ్యాలకు సమస్త సౌకర్యాలకు దేహాన్ని దూరంగా ఉంచటమే అత్యుత్తమ ఆరాధన అనుకునేవారు.

## భారతదేశం

భారతదేశంలో ఆ కాలం, పౌరాణిక యుగంలో అంతర్భాగంగా, భారతదేశ చరిత్రలో అత్యంత అంధకారమయమయిన అధ్యాయంగా భావించబడుతుంది. అప్పుడు బ్రాహ్మణులు తిరిగి మతాధిపత్యం వహించసాగారు. బౌద్ధులు ఇంచుమించుగా అంతమై పోయారు; ఆ కాలపు విశేషాల్లో "బహు దైవారాధన" హద్దులు మీరి పోవడం ముఖ్యంగా చెప్పుకోతగ్గది. దేవతల సంఖ్య క్రమంగా 33 కోట్ల వరకు పెరిగింది. ముప్పది మూడు కోట్ల దేవత



లెగబడ్డ దేశంగా భారతావనిని వర్ణించేవారు. వేదకాలంలో విగ్రహారాధన జరిగేది కాదని ప్రతీతి, కాని మన ప్రస్తావనలో ఉన్న కాలంలోని ఆరాధనాలయాల్లో విగ్రహారాధనే ఘనంగా జరిగేది. పూజారులు తమ దుర్గుణాలకు తామేసాటి అనిపించు కుంటూ ఉండేవారు. అమాయక మూఢ ప్రజల్ని మతం పేరిట దోచుకోవడం వారి ధర్మాచరణగా మారింది.

ఆ కాలంలోనే వర్ణాశ్రమ వ్యవస్థ, కులతత్వం పెచ్చు పెరిగాయి. వాస్తవానికి ఆది కాలంలో అలాంటి తారతమ్యాలు కానవచ్చేవి కావని కొందరు అభిప్రాయపడతారు. ఈ కుల విభజన సమాజ వ్యవస్థనే అస్తవ్యస్తం చేసి పారేసింది. న్యాయం నిలువునా నీరైపోయే చట్టాలు తయారయ్యాయి. వంశాలు, వర్ణాల రీత్యా ప్రజలకు సౌకర్యాలు ప్రాప్తమయ్యేవి. మద్యపాన (సురాపానం) సేవనం సర్వసామాన్యమయిపోయింది. భగవదన్వేషణకై వనాల్లో, పర్వతాల్లో వైరాగ్యజీవితం గడపడం అవశ్యమని భావించబడేది. భ్రమలు, భ్రాంతులు ఊహాజనిత సిద్ధాంతాలు, మూఢనమ్మకాలు జనబాహుళ్యంలో ప్రచారానికెక్కాయి.

భూత ప్రేత పిశాచాలపట్ల నమ్మకం, రకరకాల శకునాలు మానవ జీవితాన్ని దుర్భరం చేసివేశాయి. వింతయిన ప్రతి వస్తువు దైవంగా రూపొందేది. ప్రకృతిలోని ప్రతి నిదర్శనం ముందు మోకరిల్లడమే ధర్మమయి పోయింది. దేవుళ్ళు, దేవతలు, విగ్రహాలు, గుళ్ళు అసంఖ్యాకంగా, అనూహ్యంగా వెలిశాయి. మహిళా పూజారిణిలు, దేవదాసీల నైతిక పరిస్థితి లజ్జావిహీనంగా తయారయింది; ఇదంతా మతం పేరిటే జరిగేది.

స్త్రీలను జూదంలో పందెం కట్టి ఓడిపోవడం ఒక్కో స్త్రీకి అనేక మంది భర్తలుండటం వరకు సమాజం "అభివృద్ధి" చెందింది. అయితే ఆ సామాజిక వ్యవస్థలో వితంతువుల పరిస్థితి మరీ అధ్వాన్నంగా వుండేది. వారు పునర్వివాహానికి అర్హులు కాకపోవడమే కాక జీవితంలో ఎలాంటి సౌఖ్యం, సౌకర్యం ఆస్వాదించే భాగ్యం కూడా వారికి ప్రాప్తమయ్యేది కాదు. సమాజంలో వితంతువు కూడా ఒక "మనిషి"గా గౌరవప్రదమైన స్థానం పొందలేక పోయింది. సమాజం చేసే ఈ జులుం మూలంగానే స్త్రీలు భర్త మరణానంతరం జీవించి ఇవన్నీ భరించటం కంటే సజీవంగా దహనమై పోవడమే మేలని భావించేవారు. యుద్ధాల్లో ఓడిపోయే ప్రమాదం ఏర్పడినప్పుడు స్త్రీలను, స్వయంగా వారి తండ్రులు, సోదరులు, భర్తలు తమ చేతులారా అంతమొందించే వారు– అలా నిండు ప్రాణాలు తీసి గర్వపడే వారు కూడా! దిగంబర స్త్రీ పురుషుల పూజ జరిగేది. ధార్మిక ఉత్సవాల్లో సారాయి సేవించి ఒళ్ళు తెలియని మత్తులో నానా హడావుడీ చేసేవారు. వీటన్నింటినీ సత్కార్యాలుగా భావించి మరీ చేసేవారు. మొత్తానికి దేవుని ఈ భూభాగంపై ధార్మిక, సామాజిక, నైతిక వ్యవస్థలన్నీ షైతాన్ పైశాచిక కబంధ హస్తాల్లో అస్తవ్యస్తంగా తయారయ్యాయని చెప్పవచ్చు.

## యూదులు

ప్రపంచంలో సంస్కరణ జరిగే ఆశ ఎవరిపట్లయినా ఉంటే అది, బహుశా దైవ ధర్మం కలవారవడం చేత యూదులపట్లనే వుండేదేమో కాని, వారి ధార్మిక సామాజిక పరిస్థితి కూడా ఎంతో దిగజారిపోయింది. వారిది అతి ప్రాచీనమయిన ఇతిహాసం. అదంతా ఎనలేని అత్యాచారాలు అపరాధాలతో నిండిపోయింది. అందుచేత ఎలాంటి సంస్కరణ కార్యాన్నయినా చేపట్టే యోగ్యత వారికి లేకపోయింది. చివరికి, దైవప్రవక్తలు వారిలో ప్రభవించినప్పుడల్లా వారి బోధనలను సయితం యూదులు సహించలేక పోయేవారు. దైవప్రవక్తలు ఎందరిని వారు హతమార్చారో లెక్కేలేదు. తమకు దైవంతో ఏదో ప్రత్యేక బాంధవ్యం వుందని భావించి అందువల్ల నరకయాతనల గాలి కూడా తమకు సోకదనే భ్రమకు లోనయ్యారు. స్వర్గంలోని సకల సౌభాగ్యాలు తమకోసమే సిద్ధం చెయ్యబడ్డాయని, దైవదౌత్యం, ప్రవక్తా పదవులు తమ జాతి వారసత్వాలే అని వారు అపోహపడే వారు. మతగురువులు దురాశాపరులుగా, అవకాశవాదులుగా, ధనవంతుల తొత్తులుగా, అధికారుల పనిముట్లుగా మెలిగేవారు. వారి మెప్పును, ప్రసన్నతను పొందటానికి ధార్మిక ఆదేశాలను అనుదినం తారుమారు చేసేవారు. దైవాదేశాల్లో తేలికైన వాటిని, తమ అభీష్టానికి అనువైన వాటిని ఆచరించేవారు; కఠినమయిన వాటిని, తమకు ఇష్టం లేని వాటిని త్రోసిపుచ్చేవారు.

పరస్పరం కొట్లాడుకోవడం, ప్రతి చిన్న మాటపై ఘర్షించుకోవడం వారికి మామూలయిపోయింది. ధన పిపాస, ప్రాణభీతి పెచ్చుపెరిగాయి. ఏదయినా కార్యం మూలంగా ధన ప్రాణాలకు హాని కలిగే అనుమానం ఏమాత్రం పొడసూపినా ఆ పని చేసే వారు కాదు. అందుచేత వారి నైతిక పరిస్థితి ఎంతో బలహీనమైపోయింది.

బహుదైవారాధన, విగ్రహారాధన ప్రభావాలు కూడా వారిలో తొంగిచూడ నారంభించాయి. మూఢనమ్మకాలు, మంత్ర తంత్రాలు, భూతప్రేతాలు, తాయిత్తులు, చేతబడులు మొదలయిన విషయాలన్నీ వారిలో చోటు చేసుకోవడం మూలాన దేవుని ఏకత్వపు భావన వారి మనస్సుల్లో నుండి పూర్తిగా సమసిపోయింది. చివరికి, దేవుని అంతిమ సందేశహరుడు ముహమ్మద్ (స) ఏకేశ్వర వాదాన్ని విస్పష్టంగా విశదీకరించి నప్పుడు ఈ యూదులే "ఈ ముస్లిములకన్నా అరబ్బు బహు దైవారాధకులే మిన్న" అనడానికి జంకలేదు!

## అరేబియాలో

దైవ సందేశహరుడు ముహమ్మద్ (స) ఆవిర్భవించింది అరేబియాలోనే గనుక, ఆ దేశపరిస్థితుల్ని కాస్త వివరంగా పరిశీలించటం అవసరం. అప్పుడే ఆయన తన ఉద్యమం



ప్రారంభించినప్పుడు ఎలాంటి వాతావరణంలో ఎటువంటి పరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చిందో అర్థమవుతుంది.

అరేబియాలోని అధిక భూభాగంపై యూదులే నివసిస్తూ ఉండేవారు. కురా లోయ, ఖైబర్, ఫిదక్ తదితర ప్రాంతాలే కాక ఎస్రిబ్ (నేటి మదీనా) కూడా యూదుల అధీనంలో వుండేది.

మిగతా దేశంలో అత్యధికంగా బహు దైవారాధకులు నివసిస్తూ ఉండేవారు. వారు విగ్రహాలను, రాళ్ళు రప్పలను, వృక్షాలను, నక్షత్రాలను, దైవదూతల్ని, జిన్నుల్ని పూజించేవారు. అయితే దేవదేవుడు, అందరికంటే గొప్ప దేవుడు అల్లాహ్ ఒక్కడున్నాడని కూడా వారు భావించేవారు. కాని ఈ భావన కూడా బహుదైవారాధన తెరల వెనుక మరుగున పడిపోయింది. క్రియారూపేణ వారు అల్లాహ్‌ను వదిలి తాము ఏర్పరచుకున్న ఆ చిన్న చిన్న దేవుళ్ళను సంతోషపరచడంతోనే సతమతమయ్యేవారు. వారు దైనందిన కార్యకలాపాల నిర్వహణకు, తమ అవసరాలను తీర్చడానికి ఆ చిల్లర దేవుళ్ళే ఉపకరిస్తారని, వాటినే పూజించే వారు. వాటికే అర్చనలు, బలిదానాలు, మొక్కుబడులు అర్పించుకునే వారు. ఆ దేవతలనే తమ మొక్కులు తీర్చమని, తమకు వరాలు ప్రసాదించమని అర్థించేవారు. ఈ చిల్లర దేవుళ్ళను సంతృప్తి పరిస్తే అల్లాహ్ కూడా ప్రసన్నుడవుతాడనే అపోహ వారికి వుండేది.

దైవదూతల్ని వారు దేవుని కూతుళ్ళుగా, జిన్నుల్ని దేవుని అప్తులుగా, సన్నిహితులుగా దైవత్వంలో భాగస్వాములుగా భావించేవారు. ఈ సంబంధాల దృష్ట్యా వారికి పూజా పురస్కారాలు జరిపేవారు. ఈ విధంగా బహు దైవారాధన సర్వసామాన్యమయి పోయింది. ఆకర్షణీయమయిన రాయి ఏదయినా అగుపిస్తే దాన్ని పెట్టి పూజలు జరుపుకునే వారు. ఏదీ దొరక్కపోతే మట్టితో కనీసం ఒక ముద్దచేసి దానిపై మేక పాలు చల్లి దాని చుట్టూ ప్రదక్షిణలు చేయడం ప్రారంభించేవారు. వారు పూజించే విగ్రహాలు అసంఖ్యాక మయ్యాయి. విగ్రహాలే గాక నక్షత్రాలను, ముఖ్యంగా సూర్యచంద్రుల్ని పూజించడం కూడా జరిగేది. భూతప్రేతాలు, శకునాలు మూఢ నమ్మకాలు – ఒక్కమాటలో చెప్పాలంటే బహు దైవారాధకుల్లో కానవచ్చే కీడులన్నింటికీ అరేబియా దేశం అలవాలమయి పోయిందన్నమాట.

ధార్మికంగా దిగజారిపోవడం మూలంగా, నైతికంగా, సామాజికంగానూ వారి జీవనవ్యవస్థ పతనానికి గురి అయింది. నిత్యం కలహాలు కలతలతో అరేబియా నిత్యరణరంగంగా రూపుదాల్చింది. చిన్న చిన్న తగాదాలు చిలవలు పలవలై భీకర యుద్ధాలుగా పరిణమించేవి. విద్వేషం విషబీజంలా తరతరాల రక్తంలో జీర్ణించుకుపోయి సమర సంఘర్షణల పరంపర సాగుతూ ఉండేది. తత్కారణంగా ఒక సమగ్రమైన రాజకీయ వ్యవస్థ వారి మధ్యన రూపుదాల్చలేక పోయింది. తెగల వ్యవస్థ పటిష్టంగా ఉన్నా సరయిన రాజకీయ చైతన్యం లేకపోయింది.

వడ్డీ వ్యాపారం, దోపిడి, దొంగతనాలవల్ల వారు కఠిన హృదయులుగా, కఠోర మనస్కులుగా తయారయ్యారు. ఈ కాఠిన్యం, క్రూరత్వం, రక్తపాతాలు వారిని మానవ రూపంలో దానవులుగా రూపొందించాయి. కడకు తమ సొంతకూతుళ్ళనే వారు సజీవంగా పూడ్చిపెట్టేవారు.

జూదం, మద్యపాన సేవనాల్లో వారికి వారేసాటి అనిపించుకున్నారు. మధువును స్తుతిస్తూ పాడిన పాటలతో, దాన్ని సేవించి మనిషి చేసే నీచకార్యాల వర్ణనలతో, వారి సాహిత్య క్షేత్రమంతా కలుషితమయి పోయింది.

నీతి, నిజాయితి, సిగ్గు, సౌశీల్యం వారి జీవితాల నుండి పూర్తిగా నిష్క్రమిం చాయి. వ్యభిచారం సర్వసామాన్యమయి పోయింది. పరస్త్రీలతో ప్రేమ కలాపాల కథనాలు గానం చేసి గొప్పలు చెప్పుకునేవారు. స్త్రీపురుషులు దిగంబరులై కాబాగృహ ప్రదక్షిణ చెయ్యడం పుణ్య కార్యంగా భావించేవారు.

ఈ విధంగా వారు, ధార్మికంగా, నైతికంగా, సామాజికంగా, రాజకీయంగా, సర్వవిధాలా పతనావస్థకు చేరిన ఒక జాతిగా రూపొందారు.

## అరబ్బుల విశిష్టత

కేవలం అరేబియా దేశాన్నే కాదు, ప్రపంచం మొత్తాన్ని ఆవరించిన అజ్ఞానాంధ కారంలో మానవాళి తడుముకుంటూ తట్టాడుతూ ఉంది. ఆ చీకట్ల తెరలను చీల్చుకుని ప్రత్యక్షమయ్యే ఉజ్వల శుభోదయం కొరకు నిరీక్షిస్తోంది లోకం. ఆ నిర్మల ఉదయ కాంతుల్లోనే మార్గవిహీనులైన దేవుని దాసులు, మానవులు, తమ ప్రభుమార్గాన్ని, రుజు మార్గాన్ని కానగలుగుతారు. అయితే ఆ శుభోదయం ఏ దిఙ్మండలంలో జరగాలి? సర్వలోకే శ్వరుడు అరేబియా భూభాగాన్నే ఆ తొలి కిరణాల ప్రసారానికి ఎందుకు ఎన్నుకున్నట్లు? అనే ప్రశ్నలు ఎదురవుతాయి.

లోకానికంతటికీ మార్గదర్శకం కాగల బోధనా సందేశాన్ని ఆఖరుసారిగా పంపేందుకు, తన అంతిమ సందేశహరుడుగా హజ్రత్ ముహమ్మద్ (స)ను ఎన్నుకున్నాడు అల్లాహ్. ముహమ్మద్ (స) అందజేసే ఆ సందేశమే దేవుని అంతిమ సందేశం కావటం చేత, అది జగమంతా ప్రచారం కావడం అనివార్యం. ఇంత మహత్తర కార్యాన్ని సాధించాలంటే ఒక మానవునికి లభించే జీవన వ్యవధి సరిపోతుందా? అలాంటప్పుడు జరగవలసిందేమిటి? దీనికిగాను, దైవసందేశహరుడు ఉద్యమం లేవదీసి ఆ ఉద్యమాని కనుగుణంగా ఒక సమగ్ర జీవనవ్యవస్థను స్థాపించడమే కాక ఆ ఉద్యమాన్ని కొనసాగించి దాన్ని ప్రపంచమంతా వ్యాపింప చెయ్యగల ఒక సంఘాన్ని కూడా సమాయత్తపరచి పోవాలి. ఆ అనుచరుల



సంఘం, ఆయన నిష్క్రమణానంతరం కూడా ఆ సందేశ ప్రచారం నిరంతరంగా, నిరవధికంగా కొనసాగేలా కృషి చేస్తూ వుండాలి. అప్పటికిగాని ఆ మహత్కార్యం నెరవేరదు.

ఈ బృహత్పథకం ప్రకారం కార్యనిర్వాహణ కొరకు కావలసిన గుణవిశేషాలు, లక్షణాలు అరబ్బుల్లో అత్యధిక పరిమాణంలోనూ, సర్వసామాన్యంగానూ లభించడం గొప్ప విశేషం.

అరేబియా దేశం, భౌగోళికంగా, ఈ సందేశాన్ని నలువైపులా ప్రచారం చేసి వ్యాపింపజేయడానికి అనువుగా ఆనాడు జనావాసంగల భూభాగానికి మధ్యన ఉండటం మరో ముఖ్యాంశం.

ఇక, అరబీ భాషను పరిశీలిస్తే అది ఎంతో ఉదాత్తమైనదని, కమనీయమయిందని, గంభీరమయినదనీ ఇట్టే తెలిసిపోతుంది. దాని విస్తృతి, విశిష్ట లక్షణాల రీత్యా దాని అనన్యమైన ప్రత్యేకతలు దైవ సందేశానికి సంబంధించిన విషయాల బోధనకు, వాటి వివరణకు సర్వవిధాలా యోగ్యమయినవని ద్యోతకమవుతుంది; దైవాదేశాలను అరబీ భాషలో వివరించినంత సులువుగా, సులభ గ్రాహ్యంగా మరే ఇతర భాషల్లోనూ బోధించడం సాధ్యపడదని అర్థమవుతుంది; దానికున్న పద సంపన్నత, భావవిస్తృతి అలాంటివి.

అరబ్బుల్లోని గొప్ప విశేషమేమంటే, వారు ఏ పరజాతీయులకూ దాసులు కారు, స్వతంత్రులు, పరరాజ్యాధికార దాస్యం వల్ల జనించే మానసిక దౌర్బల్యాలకు, ఉత్తమ మానవీయ గుణాల్లో కలిగే పతనానికి వారు దూరంగా వున్నారు. వారి చుట్టూ పర్షియా, రోము లాంటి గొప్ప సామ్రాజ్యాలున్నా అవేవీ అరబ్బుల్ని వశపరచుకోలేక పోయాయి. సామాన్యంగా నిస్సారమైన భూభాగంలో, నిత్యం ప్రమాదభరితమైన, కష్టభూయిష్టమైన ఎడారి జీవితం గడపటం మూలాన వారిలో అనేక ఉన్నత గుణాలు మనగలిగాయి. ధైర్యసాహసాల్లో వారికి వారే సాటి. ప్రమాదాలను వారు ఏనాడూ ఖాతరు చెయ్యలేదు. యుద్ధమంటే వారికి మంచి నీళ్ళప్రాయం. వారు సహజంగానే ఉత్తేజవంతులు, సంకల్పనిరతులు, కార్యదీక్షాపరులు. మనసులోని మాటను మొహమాటం లేకుండా నిష్కర్షగా చెప్పివెయ్యగలిగే పరిశుద్ధ చిత్తులు. జంకు గొంకు లేకుండా, పక్షపాతం కనబరచకుండా వ్యవహరించే నిష్కపట మనస్కులు, విశాల హృదయులు. సామాన్యంగా బానిస జాతుల్లో ఉద్భవించే రుగ్మతల గాలి వారికి సోకలేదు.

ఇంగిత జ్ఞానం, బుద్ధీ వివేకాల దృష్ట్యా కూడా వారు ఎంతో ఉత్తమస్థాయిని అందుకున్నారు; మేధావులు అత్యున్నత వివేచనాపరులు, సూక్ష్మగ్రాహులు, జ్ఞాపకశక్తి, స్మరణశక్తిలో సమకాలీన జాతుల్లో వారు అద్వితీయులని చెప్పినా, వారిలో చాలా మంది ఏక సంథాగ్రాహులన్నా అతిశయోక్తి కాదు.

అరబ్బులు స్వభావం రీత్యా పరమ ఉదాత్తులు. దాతృత్వంలో అగ్రగాములు. ఆత్మగౌరవం, ఆత్మాభిమానం వారి సహజ సిద్ధమైన గుణాలు. ఒకరికి దాసోహమనడమన్నా, ఒకరికి తల ఒగ్గడమన్నా వారు భరించలేరు. కఠిన జీవితానికి అలవడ్డ వారవడం చేత కార్యవాదులుగా, ప్రతి విషయాన్ని క్రియారూపంలో పరికించే వారుగా రూపొందారు. ఒక కార్యభారాన్ని స్వీకరించి, దాని గురించి తలపోస్తూ, గోళ్ళు గిల్లుకుంటూ, మీనమేషాలు లెక్కించుకుంటూ కూర్చోవడమంటే వారికి సహించేది కాదు; దాన్ని స్వీకరించిన మరుక్షణమే వజ్రసంకల్పంతో, ఏకదీక్షగా, దానికోసం తమ జీవితాన్ని సయితం ధారపోసేలా క్రియా రంగంలో దిగేవారు.

అరబ్బుల ఈ గుణగణాలకు, ప్రత్యేకతలకు మూలకారణాలు, ముందే చెప్పినట్టు, ఆనాటి నాగరికులనబడే జాతులకు వారు లొంగకపోవడం, కఠినమయిన ఎడారిజీవితానికి అలవాటుపడడం, తమ ప్రత్యేకతను కాపాడుకోవటానికి నిరంతరం కృషి జరపడం.

## అరబ్బుల సంస్కరణలో అవాంతరాలు

ఒక వైపున అరేబియా భూభాగం, అరబీ భాష, అరబ్బుల ఈ విశేష లక్షణాలు సంస్కరణోద్యమానికి ఎంతో దోహదకరంగా ఉన్నాయి. ఈ ప్రత్యేకతల దృష్ట్యా అల్లాహ్ తన అంతిమ సందేశాన్ని ప్రథమంగా ఆ దేశంలో, ఆ భాషలో, ఆ ప్రజల్లో అవతరింపజేసే నిర్ణయం తీసుకున్నాడు. అయితే మరో వైపున మహాప్రవక్త ముహమ్మద్ (స) ఆ జాతిని సముద్ధరించడంలో ఎదుర్కొన్న అవాంతరాలు కూడా తక్కువ కావు. మనమింతవరకు ఆ దేశం, ఆ ప్రజల ప్రత్యేక గుణాల్ని ఆ ప్రజల నమ్మకాలు, ఆచార వ్యవహారాలను పరిశీలించాము. వాటిని దృష్టిలో పెట్టుకుని ఇస్లామీయ ఉద్యమం ప్రారంభమైన నాటి పరిస్థితుల్ని గమనిస్తే ఆ కాలంలో అలాంటి ఉద్యమం జయప్రదంగా సాగడం, ఫలవంతం అవడం మానవ చరిత్రలో అత్యద్భుతమయిన మహిమే అనిపిస్తుంది. ఇంకా, ఈ కార్యనిర్వహణలో మహాప్రవక్త (స) ఎలాంటి ప్రజల్ని ప్రపంచ నాయకత్వానికి యోగ్యులుగా తయారుచేశారు? ఎలాంటి కష్టనిష్ఠూరాలను సహించారు?? అన్న విషయం దృష్ట్యా కూడా అదొక అత్యద్భుత కార్యమే అనిపిస్తుంది.

అరబ్బుల ఈ ప్రత్యేకతలు, ఆనాటి పరిస్థితులు దృష్టిలో లేకపోతే దేవుని అంతిమ ప్రవక్త (స) నిర్వహించిన అనన్యమైన సంస్కరణోద్యమం పట్ల సమగ్ర అవగాహన ప్రాప్తం కాదు. ఆ జాతిని సముద్ధరించడంలో అసంఖ్యాకమైన అవాంతరాలు అనేక రూపాల్లో ఆసన్నమయ్యాయి. వాటిలో ముఖ్యమైన వాటిని పరిశీలిద్దాము.

అరబ్బులు పూర్తిగా నిరక్షరాస్యులు. ఆ కారణంగా దైవవాణి, దైవగ్రంథం, దైవసందేశం, ప్రవక్తలు, దేవుని ఉనికి, దానికి సంబంధించిన వివరాలు ఇవేవీ వారికి



తెలియవు. మరణానంతర జీవితం పట్ల వారికి ఏ అభిప్రాయమూ లేదు. దైవారాధన ఎందుకు చెయ్యాలో, దాని ప్రాముఖ్యం ఏమిటో వారు ఎన్నడూ ఆలోచించలేదు. ఇదిలా ఉండగా వారు తమ పూర్వీకుల ఆచార నియమాలను గ్రుడ్డిగా పాటించడంలో మొండిగా వ్యవహరించేవారు. ఆ ఆచార వ్యవహారాలకు భిన్నంగా వ్యవహరించడానికి వారు ససేమిరా ఒప్పుకోరు. ఇంతకుముందు సూచించినట్లు బహుదైవారాధన వల్ల జనించే సమస్త రుగ్మతలు వారిలో చోటు చేసుకున్నాయి. అంధ విశ్వాసాలను, మూఢ ఆచారాలను ఆశ్రయించడం మూలాన వాళ్ళ బుద్ధీ వివేకాలే ఘనీభవించాయి. పూర్వీకుల అంధాను సరణ వల్ల అంతరంగిక కలహాలు వారి జాతీయ లక్షణంగా తయారయ్యాయి. ఈ కారణాలవల్ల ఏ విషయాన్నయినా నిలకడతో, నిర్మలమైన మనస్సుతో, శాంతంగా, సౌమ్యంగా ఆలోచించడం వారికి సాధ్యపడేది కాదు, ఏది ఆలోచించినా అంతా విద్వేషం వివాదం, ఘర్షణ, పగ పోరాటాల ఫక్కీలోనే పోయేది.

ఈ పూర్వరంగంలో, మహాప్రవక్త (స) ఇస్లామ్ సందేశం అందజేసినప్పుడు ఎలాంటి పరిణామాలు కలిగి ఉంటాయో ఊహించడం ఏమంత కష్టం కాదు. ఆయన చెప్పే మాటలు వారి మత భావనకు, ఆచరణకు పూర్తిగా విరుద్ధమైనవి. వారు పూర్వీకుల ద్వారా గ్రహించిన దానికి వారు ప్రాణ ప్రదంగా కాపాడుకుంటూ వచ్చిన విలువలకు, నైతిక ప్రమాణాలకు భిన్నమైనవి. ఈ కొత్త సందేశం వాళ్ల నుండి కోరేదేమిటి? ఈ పరస్పర ఘర్షణలు, రక్తపాతాలు, పోరాటాలు చాలించమనీ, శాంతియుతంగా బ్రతకడానికి నిర్ణయించుకొమ్మనీ, దోపిడీ దుండగాలు తప్పనీ, మూఢాచారాలు, అంధవిశ్వాసాలు, అపసవ్యమైన స్వభావాలు అన్నింటినీ త్యజించమనీ ఇంకా, అధర్మమైన, అవినీతికరమైన, దౌర్జన్యపరమైన జీవనోపాధిని వదలు కొమ్మని – అంతే. అయితే పై పరిస్థితుల్లో ఇలాంటి పిలుపునకు చేదోడువాదోడుగా నిలిచేందుకు ప్రజల్ని సమాయత్త పరచడం సులభ సాధ్యమా?

కనుక, ప్రపంచ పరిస్థితులు, అరేబియా వాతావరణం, ఉద్యమం ప్రారంభమైన దేశ ప్రజల లక్షణాలు ఇవన్నీ ఈ సందేశానికి ఏ విధంగానూ అనుకూలంగా లేవని ద్యోతకమవుతోంది. కాని, జరిగిన పరిణామాలు ఆ ఉద్యమం సాధించిన విజయాలను చూస్తే ఇదంతా ఒక మహిమోపేత కార్యం అనీ, అసాధ్యమైనదేదో 'సాధ్యం' అయి పోయిందని అనుకోవడం తప్ప మార్గాంతరం లేదు.

మానవ మేధను స్పందింపచేసే ఆ అద్భుత, అనుపమ, మహిమోపేత సత్యాన్ని గురించి తెలుసుకోగానే, ఆ ఉద్యమ నాయకుడు, నవజీవన వైతాళికుడు అయిన ఆ మహనీయుని గురించి వివరంగా తెలుసుకోవాలనీ, దగ్గర నుండి అర్థం చేసుకోవాలనీ, మానవ ఆంతర్యం కోరుకుంటుంది. ఇది సహజమైన, సమంజసమైన, సహేతుకమైన కోరిక. ఈ కోరికను తీర్చడానికే ఈ స్వల్పమైనకృషి.

# జననం - బాల్యం

## వంశం

మహాప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహివసల్లమ్) తండ్రి, అబ్దుల్ ముత్తలిబ్ కుమారుడయిన అబ్దుల్లాహ్. మహనీయ ముహమ్మద్ వంశవృక్షపు వేళ్ళు ఇంచుమించుగా అరువయి తరాల వెనుక హజ్రత్ ఇబ్రాహీమ్ (అలైహిస్సలామ్) పుత్రుడు హజ్రత్ ఇస్మాయీల్ (అలైహిస్సలామ్)తో కలుస్తాయి. ఈ వంశానికి 'కురైష్' అని పేరు. కురైష్ వంశం అరబ్బుల్లో ఎంతో గౌరవనీయమైన, ఆదరణీయమైన వంశంగా పరిగణించబడుతూ వచ్చింది. ఈ వంశంలోని వ్యక్తులు చాలామంది తాము చేసిన అనేక సత్కార్యాల మూలంగా అరేబియా దేశ చరిత్రలో ప్రసిద్ధికెక్కారు. సంఘంలో ప్రముఖ వ్యక్తులుగా చెలామణి అయ్యారు. అలాంటి వారిలో నజర్, ఫహర్, కసీ బిన్ కలాబ్ తదితరులు పేర్కొనదగ్గవారు. కసీ కాబా గృహనిర్వాహకుడుగా ఎన్నికయ్యారు. దీనివల్ల ఆయన ఖ్యాతి మరింత పెరిగింది. కసీ తన హయాంలో ఎన్నో గొప్ప కార్యాలు చేశారు. 'హజ్జ్' యాత్రికులకు నీటి వసతి కల్పించడం, వారికి భోజన సదుపాయాలు సమకూర్చడం లాంటి సేవా కార్యాలు ఆయన ప్రారంభించినవే. ఆయన తరువాత ఈ కార్యాలను ఆయన వంశీయులే నిర్వహిస్తూ వచ్చారు. ఇలాంటి సేవా కార్యక్రమాలు చేపట్టడం మూలాన, కాబా గృహ నిర్వహణ భారం వహించడం మూలాన కూడా కురైష్ వంశానికి అరబ్బుల్లో విశేష స్థానం, గౌరవ ప్రతిపత్తులు ప్రాప్తమయ్యాయి.

అరేబియాలో సామాన్యంగా దారిదోపిడీలవల్ల, బందిపోట్ల వల్ల రాకపోకలు సురక్షితంగా జరిగేవి కావు. కాని, కాబా గృహంతో కురైష్ వంశానికి ఉన్న ప్రత్యేక సంబంధం వల్లనూ, కురైషీయులు హాజీలకు చేసే ఉపచారాల కారణంగానూ బందిపోటు దొంగలు, దారి దోపిడీగాళ్ళు వాళ్ళ బృందాలను ముట్టుకునేవారు కారు. అందువల్ల కురైషీయులు తమ వర్తక సామాగ్రిని ఎక్కడికయినా నిర్భయంగా, భద్రంగా, సులువుగా తరలించుకు పోగలిగేవారు.



అబ్దుల్ ముత్తలిబ్‌కు సంతానం 10 లేక 12 మంది. వారిలో అయిదుగురు ప్రసిద్ధికెక్కిన వారు. 1. అబ్దుల్లాహ్ ఈయన మహాప్రవక్త తండ్రి. 2. అబూతాలిబ్, ఈయన మహాప్రవక్తను పోషించి పెద్ద చేసిన సజ్జనుడు. అబూతాలిబ్ ఇస్లామ్‌ను స్వీకరించకపోయినా బ్రతికున్నంత కాలం మహాప్రవక్తకు తోడునీడగా, ఆసరాగా నిలబడ్డారు. 3. హజ్రత్ హమ్జా 4. హజ్రత్ అబ్బాస్. ఈ పినతండ్రులిద్దరూ ఇస్లామ్ సందేశాన్ని స్వీకరించి ఇస్లామీయ ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు. 5. అబూ లహబ్; ఇతను ఇస్లామ్ పట్ల మహాప్రవక్త (స) పట్ల శత్రుత్వం వహించి పేరు గడించిన వ్యక్తి.

కురైష్ వంశానికి సంబంధించిన జహరా తెగవాడయిన వహబ్ బిన్ అబ్దుల్ మునాఫ్ కుమార్తెతో అబ్దుల్లాహ్ వివాహం జరిగింది. ఆమె పేరు ఆమినా, వంశంలో ఎంతో గౌరవస్థానం గల మహిళ. వివాహం జరిగినప్పుడు అబ్దుల్లాహ్ వయసు సుమారు 17 సంవత్సరాలు. వివాహానంతరం వంశాచారం ప్రకారం అబ్దుల్లాహ్ మూడు రోజుల పాటు అత్తవారింట గడిపి వర్తకం రీత్యా సిరియా వెళ్ళిపోయారు. సిరియా నుండి తిరుగు ప్రయాణంలో మదీనా వద్ద వ్యాధిగ్రస్తులయి ఆయన అక్కడే తనువు చాలించారు. అప్పుడు ఆమినా గర్భవతి.

## జననం

రబీ ఉల్ అవ్వల్ మాసం 9వ తేదీ (క్రీ.శ. 571 ఏప్రిల్ నెల 20వ తేదీన) సోమవారం నాడు దైవకారుణ్యానుగ్రహాల శుభోదయం అవతరించింది. మంగళ ప్రదుడయిన మహాపురుషుడు జన్మించాడు. లోకాన్ని ఆవరించిన కారు చీకట్ల నల్లతెరలు తొలగించే జ్యోతిర్మయుడు ప్రభవించాడు. ఆయన ద్వారానే మానవుల గమ్యం లేని జీవితాలకు మార్గదర్శకమైన ఉజ్వల కాంతి ఉదయించబోతోంది. ఈ అమరజ్యోతుల కాంతి కిరణాలే భువిపై బసచేసే మనషులందరికీ ప్రళయం వరకు ఋజుమార్గంపై నడిపించే అనుపమశక్తిగల విశ్వ ప్రభువు ప్రదానం చేసిన మహదానుగ్రహం.

ఈ బృహత్తర కార్యసాధనకై ఆవిర్భవించిన ఆ పరమోన్నత వ్యక్తి పుట్టక మునుపే తండ్రి గిట్టిపోయ్యారు. తాతగారయిన అబ్దుల్ ముత్తలిబ్ ఆయనకు 'ముహమ్మద్' అని నామకరణం చేశారు.

## పోషణ

అరేబియాలో పట్టణవాసులు సాధారణంగా తమ పిల్లల్ని పాలు త్రాగించి పోషించడానికి దాదీలకు అప్పగించి, పల్లెవాసాలకు పంపేవారు. పల్లెల్లో సువిశాలమైన స్వేచ్ఛా వాతావరణంలో పిల్లలు ఆరోగ్యవంతంగా పెరుగుతారని అలా చెయ్యటం అక్కడి రివాజు. అదీ కాక జానపదులు మాట్లాడే భాష నాగరికుల భాషకంటే స్వచ్ఛమైనదిగా,

శ్రేష్ఠమైనదిగా ఉండేది. తమ పిల్లలకు శిష్ట అరబీభాష అలనడాలని కూడా వారు శైశవంలోనే సంతానాన్ని పల్లె సీమలకు పంపేసేవారు.

తండ్రిలేని ఆ పసికందుకు మొదట తల్లిగార్రైన ఆమినా పాలు త్రాగించారు. తరువాత అబూలహబ్ ఇంట్లో పనికత్తె అయిన సౌబియా పాలు త్రాగించే భాగ్యానికి నోచుకుంది. కొన్ని దినాల తరువాత 'హవాజున్' తెగ స్త్రీలు కొందరు పిల్లల పోషణార్థం దాదీలుగా మక్కా నగరానికి వచ్చారు. వారిలో 'హలీమా సాదియా' అనే మహిళ కూడా ఉంది. ఈమె దీనస్థితి చూసి ఎవ్వరూ తమ బిడ్డల్ని అప్పగించలేదు. అలాగే, ఆమినా తనయుడు ముహమ్మద్, అనాథ బాలుడు కాబట్టి అతణ్ణి స్వీకరించడానికి కూడా ఎవ్వరూ ముందుకు రాలేదు. ఈ విధంగా ఆ అనాథ బాలుడే హలిమాకు మిగిలాడు. దైన్యస్థితిలో ఉన్న హలీమా కుటుంబమే ఆమినా సుతుడిని స్వీకరించింది. అది ఆ మహిళకు ప్రాప్తించిన మహాభాగ్యం.

రెండేళ్ళ తరువాత హలీమా ఆ బాలుని తీసుకుని మరలి వచ్చింది. ఆ రోజుల్లో మక్కా నగరంలో ఏదో జాడ్యం వ్యాపించి ఉండటం మూలాన ముహమ్మద్ (స) ను మళ్లీ ఆ పల్లె ప్రాంతానికే పంపివేశారు. ఆయన అక్కడ ఆరేళ్ళ వయసు వచ్చే వరకు గడిపారు.

ముహమ్మద్ (స) పల్లె వాతావరణంలో ఆరేళ్ళు గడిపాక ఆయన్ని తీసుకుని మదీనా వెళ్లారు తల్లి ఆమినా. బహుశా తన భర్త సమాధిని దర్శించటానికో లేక ఎవరయినా బంధువులుంటే వారిని చూసిరావటానికో ఆమె ఆ ప్రయాణం చేసి ఉంటారు. ఆమె దాదాపు ఒక నెల రోజుల పాటు అక్కడ గడిపి మక్కాకు తిరుగు ప్రయాణమయ్యారు. మార్గ మధ్యంలో 'అబ్వా' అనే చోట ఆమె పరమపదించారు. అక్కడే ఆమెను సమాధి చేశారు.

తల్లి మరణానంతరం ఆయన పోషణ సంరక్షణాభారం తాత అబ్దుల్ ముత్తలిబ్‌పై పడింది. ఆయన ముహమ్మద్ (స)ను క్షణకాలమైనా వదలి వుండే వారు కారు. కంటి పాపలా ఆయన్ని సాకారు. రెండేళ్ళ తరువాత అబ్దుల్ ముత్తలిబ్ కూడా అసువులు బాసారు. పోతూపోతూ మనుమడి పోషణ భారం తన తనయుడు అబూతాలిబ్‌కు అప్పజెప్పిపోయా రాయన. అబూతాలిబ్ ఈ బాధ్యతను ఎంతో సమర్థనీయంగా నిర్వర్తించి తన తండ్రి ఆశించి నట్లే ప్రవర్తించారు. అబూతాలిబ్, ముహమ్మద్ (స) తండ్రి అబ్దుల్లాహ్ ఒకే తల్లి బిడ్డలవడంచేత అబూతాలిబ్‌కు ముహమ్మద్ (స) అంటే ప్రత్యేక ప్రేమానురాగాలు, వాత్సల్యాలుండేవి. ఒక్కోసారి ఆయన ముహమ్మద్ (స) సమక్షంలో తన సొంత సంతానాన్ని కూడా ఖాతరు చేసేవారు కారు. బయటికి ఎక్కడికి వెళ్ళినా ముహమ్మద్ (స)ను తోడుగా తీసుకెళ్ళేవారు. నిద్రపోయేటప్పుడు సయితం తనతోనే పడుకో బెట్టుకునేవారు.

పది, పన్నెండేళ్ళ వయసు రాగానే తోటి బాలురతో ముహమ్మద్ గొర్రెల్ని కాయడానికి వెళ్ళేవారు. అరేబియాలో గొర్రెల్ని కాసే పని కూడా అక్కడి బాలురి శిక్షణా కార్యక్రమంలో



ఒక భాగమే. దాన్నెవరూ నీచంగా భావించేవారు కారు. గొప్ప వంశంలోని బాలురు కూడా ఈ తర్ఫీదును పొందవలసిందే.

అబూతాలిబ్ వ్యాపారి. ఖురైష్ నియమానుసారం సంవత్సరానికి ఒకమారు ఆయన వ్యాపార నిమిత్తం సిరియాకు వెళ్ళేవారు. ముహమ్మద్ వయసు సుమారు 12 ఏళ్లున్నప్పుడు అబూతాలిబ్ ఒకసారి సిరియా ప్రయాణాన్ని సంకల్పించారు. ప్రయాణంలో ఎదురయ్యే కష్టాలదృష్ట్యా ముహమ్మద్ (స)ను తనతోపాటు తీసుకెళ్ళదలచలేదు. ప్రయాణానికి సిద్ధమవుతూ ఉన్నప్పుడు ముహమ్మద్ వచ్చి తన్ను కావలించుకుని మారాము చెయ్యసాగారు. ఆయనపైగల ప్రగాఢ అనురాగం చేత, ఆయన బాధపడతారని తలచి ఆయన కోరికను అబూతాలిబ్ కాదనలేక పోయ్యారు. ఆయన్ని తోడు తీసుకెళ్ళక తప్పింది కాదు.

# దైవదౌత్యానికి పూర్వం

## ఫిజ్జార్ పోరాటం

ఇస్లామ్ ఆవిర్భావానికి పూర్వం అరబ్బుల్లో అంతందెలియని అంతర్‌యుద్ధాలు ప్రజ్వరిల్లేవి. అలాంటి వాటిలో ఎంతో ప్రసిద్ధి కెక్కిన, భీభత్సమైన పోరాటం ఫిజ్జార్ పోరాటం. ఇది కురైష్, ఖైస్ తెగల మధ్యన జరిగింది. ఈ యుద్ధంలో న్యాయం కురైష్ పక్షాన ఉండటం మూలాన ముహమ్మద్ (సల్లల్లాహు అలైహివసల్లమ్) కురైష్ పక్షాన యుద్ధంలో పాల్గొన్నారు. యుద్ధంలో ముందు ఖైస్ తెగవారు గెలుపొందినా తుదకి కురైష్ ప్రజలే జయించారు. ఆ తరువాత సంధి ఒడంబడిక జరిగి సద్దుమణిగింది.

## హిల్ఫుల్ ఫజూల్ (ఫజూల్ ఒప్పందం)

అనుదినం జరిగే ఈ పోరాటాల వల్ల వందలకొద్ది కుటుంబాలు సర్వనాశన మయ్యాయి. ప్రజల్లో అశాంతి ప్రబలి సుఖం అన్నది కనుమరుగయింది. ఫిజ్జార్ పోరాటానికి దరిమిలా ఈ పరిస్థితిని భరించలేని కొందరు సజ్జనులు, శాంతికాముకులు ఒక సంస్కరణోద్యమం తలపెట్టారు. ముహమ్మద్ (స) పిన తండ్రి, జుబైర్ బిన్ అబ్దుల్ ముత్తలిబ్ దానికి సారథ్యం వహించారు. ఆయన ప్రతిపాదించిన ఒక తీర్మానం ప్రకారం కురైష్ ప్రముఖులంతా క్రింది ఒప్పందాన్ని ఏకగ్రీవంగా ఆమోదించారు.

★ మేము దేశాన్నుండి అశాంతిని పారద్రోలి ప్రశాంతతను నెలకొల్పుతాము.

★ బాటసారుల కొరకు రక్షణ సదుపాయాలు కలుగజేస్తాము.

★ నిరుపేదల అవసరాలను తీర్చడానికి సహాయ సహకారాలు అందజేస్తాము.

★ దుర్మార్గుల దౌర్జన్యానికి గురయ్యే వారికి రక్షణ కల్పించి వారిని ఆదుకుంటాము.

★ దౌర్జన్యపరులకి యే ఒక్కరికీ మక్కాలో స్థానం లేకుండా చేస్తాము.



ఈ ఒప్పందంలో ముహమ్మద్ (స) ఎంతో ఉత్సాహంతో పాల్గొన్నారు. ఇలాంటి ఒప్పందాలంటే తనకెంతో ఇష్టమనే అభిప్రాయాన్ని ఆయన పలుమార్లు వ్యక్తం చేశారు. దైవదౌత్య కాలంలో ఆయన దీన్ని ప్రస్తావించి, "ఆ ఒప్పందానికి బదులు నాకు (మేలు జాతి) ఎర్ర ఒంటెల్ని బహూకరించినా నేను తీసుకునే వాణ్ణి కాను. ఇప్పుడయినా అలాంటి ఒప్పందాలు చేసుకోడానికి నేను సిద్ధమే" అని పలికారు.

## కాబా నిర్మాణం

కాబా కట్టడంలో అంతకు మునుపు కేవలం నాలుగు గోడలుండేవి. పై కప్పు లేదు. ఆ గోడలు కూడా నిలువెత్తుకు మించి ఉండేవి కావు. కట్టడం పల్లపు భూభాగంలో ఉండడం మూలాన వానాకాలంలో కురిసే నీరంతా నగరం నలుమూలల నుండి అక్కడికే ప్రవహించేది. దాన్ని ఆపడానికి కట్టఒకటి కట్టారు. కాని అది తెగిపోయి కాబా వద్ద నీరు నిండిపోయేది. అందుచేత కట్టడాన్ని పూర్తిగా పడగొట్టి గట్టిపునాదులతో పటిష్టమయిన కట్టడం నిర్మించాలని తీర్మానించుకున్నారు. కురైష్ ప్రజలంతా కలిసి నిర్మాణ కార్యాన్ని మొదలెట్టారు. వివిధ తెగల ప్రజలు కట్టడంలోని విభిన్న భాగాల్ని పంచుకున్నారు. కాబా గృహ నిర్మాణ భాగ్యాన్ని ఎవరు వదులుకుంటారు? అయితే "హజ్రె అస్వద్"★ను ప్రతిష్ఠింప చేయవలసి వచ్చినప్పుడు పెద్ద వివాదం బయల్దేరింది. ప్రతి తెగవారు దాన్ని ప్రతిష్ఠించే ఘనత తమకే దక్కాలని వాదించారు. వివాదం చిలికి చిలికి గాలివానయింది. ఖడ్గాలు, కరవాలాలు చేతుల్లోకి వచ్చాయి. వివాదం నాలుగు దినాలవరకు సాగింది. వివాదం పోరాటంగా మారే ముందు అయిదవరోజున కురైష్‌లోని ఓ వృద్ధనాయకుడు ఒక సలహా ఇచ్చాడు. దాని ప్రకారం : "రేపు ప్రొద్దున ప్రప్రథమంగా ఇటువైపు వచ్చే వ్యక్తిని న్యాయనిర్ణేతగా అంగీకరించి ఆయన చేసే తీర్పును అందరూ సహృదయంతో స్వీకరించాలి" అని నిర్ణయించుకున్నారు. మరుసటి రోజున ఆ రీతిలో అందరికంటాపడిన మొదటి వ్యక్తి ముహమ్మద్ (స). ఆయన్ని వారంతా కలసి నిన్నటి వృత్తాంతం అంతా వినిపించి ఈ తగాదాను పరిష్కరించమని అర్థించారు. ఆయన ఒక పెద్ద దుప్పటిని తెప్పించారు. హజ్రెఅస్వద్ ప్రతిష్ఠ చేయాలని కోరుకునే వారందరిలో అగ్ర నాయకులయిన వారిని ఆ దుప్పటిని చుట్టూ పట్టమని ఆదేశించారు. తానే స్వయంగా హజ్రె అస్వద్‌ను ఆ దుప్పటిలో పెట్టారు. అందరూ ఆ దుప్పటిని లేవనెత్తి ఆ శిలను అమర్చవలసిన చోటికి తెచ్చారు. తిరిగి ముహమ్మద్ (స) ఆ శిలను ఎత్తి గోడలో అమర్చివేశారు. ఈ విధంగా గొప్ప రక్తపాతంగా పరిణమించగల వివాదాన్ని తన వివేచనా శక్తితో ఆయన అతి సులువుగా పరిష్కరించారు.

★ ఒక నల్లని శుభప్రదమైన రాయి, ఇది కాబా గోడలో అమరి ఉంటుంది.

అప్పుడు నిర్మించిన కాబా గృహానికి కప్పు కూడా వేశారు. నిర్మాణ సామాగ్రి సమృద్ధిగా లేనందువల్ల కొత్త పునాదుల్ని తవ్వేటప్పుడు ఒక వైపు కొంతభాగాన్ని వదలవలసి వచ్చింది. ఆ వదలిన భాగాన్నే నేడు 'హతీమ్' అని అంటారు.

## వర్తకం

అరబ్బుల్లో, అందునా కురైషీలలో ప్రాచీనకాలం నుండి వర్తకమే వృత్తిగా వస్తోంది. ముహమ్మద్ (స) పినతండ్రి అబూతాలిబ్ కూడా వర్తకులే. అందువల్ల ముహమ్మద్ (స) యుక్త వయస్సు రాగానే వర్తకాన్నే వృత్తిగా స్వీకరించారు. తాను బాబాయితోపాటు చేసిన వాణిజ్య పర్యటనల్లో ఎంతో అనుభవాన్ని గడించారు. వ్యాపార రంగంలో అడుగుపెట్టగానే ఆయన వ్యవహారాల్లో కనబరచే నిజాయితీ తత్పరత, సత్యసంధతల ఖ్యాతి నలువైపులా ప్రాకిపోయింది. లావాదేవీల్లో సత్య వ్రతునిగా, అత్యంత విశ్వసనీయునిగా గుర్తించి వర్తకులు ఆయన చేసే వర్తకంలో పెట్టుబడి పెట్టి వాటా దారులుగా చేరసాగారు. ఇచ్చిన మాటను నిలబెట్టుకోవడం, నీతిమంతంగా అందరితో వ్యవహరించడం, నిష్కర్షగా, నిష్పాక్షికంగా, న్యాయంగా మాట్లాడటం మొదలయిన సద్గుణాలవల్ల ఆయన ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్నారు. ప్రజలు ఆయన్ని 'సాదిక్' (సత్యసంధుడు) అని, 'అమీన్' (విశ్వసనీయుడు) అనీ పిలువసాగారు. వ్యాపారం రీత్యా ఆయన సిరియా,బస్రా, యమన్ దేశాలలో ఎన్నో సార్లు పర్యటించారు.

## వివాహం

మక్కాలో హజ్రత్ ఖదీజా ఎంతో గౌరవనీయ కుటుంబానికి చెందిన శ్రీమంతురాలు. మహాప్రవక్తకు దూరపు బంధువు కూడా. వరుసకు పినతండ్రి కూతురు. మొదటి పెళ్ళయి భర్తపోగా రెండవ వివాహం జరిగింది. కొంత కాలానికి రెండవ భర్త కూడా మరణించారు. తరువాత విధవగానే ఉండి పోయారామె. ఆమె సచ్ఛీలవతి, సద్గుణవతి. ఆమె సౌశీల్యాన్ని, పరిశుద్ధ స్వభావాన్నీ చూసి జనులామెను 'తాహిరా' (పరిశుద్ధురాలు) అని పిలిచేవారు. ఖ్యాతి, సౌశీల్యాలతోపాటు సిరి కూడా ఆమెను వరించింది. దళారీలను ఏర్పాటు చేసుకుని వ్యాపారం సాగించేది.

అప్పుడు మహాప్రవక్త (స)కు పాతికేళ్ళు. ఆయన వాణిజ్య పర్యటనల ద్వారా తన సత్యసంధతను, విశ్వసనీయతను సద్గుణ సంపత్తిని నిర్ద్వంద్వంగా నిరూపించుకున్నారు. ఆయన ఖ్యాతి మక్కా సంపన్నురాలు ఖదీజాను ఆకర్షించింది. ఆమె తన వర్తక సామాగ్రిని ఆయనకు అప్పగించి సిరియా దేశానికి వెళ్ళవలసిందిగా కోరింది. ఇతరులకు ఇచ్చే కమీషన్ (తరుగు పద్ధతి) మహాప్రవక్త (స)కు ఇస్తానని మాటిచ్చింది. ఆయన ఒప్పుకుని వర్తక పర్యటనకై పయనమయ్యారు. వ్యాపారంలో ఎన్నో రెట్లు లాభాలు గడించి తన నిజాయితీ సచ్ఛీలతల ద్వారా వ్యాపారుల హృదయాల్లోనూ, తనతోపాటు ప్రయాణం చేసిన ఖదీజా



సేవకుని మనసులోనూ చెరగని ముద్రవేశారు. ఆ పర్యటన ముగించుకుని తిరిగి వచ్చిన దాదాపు మూడు నెలలకు హజ్రత్ ఖదీజా, తానాయనను వివాహమాడదలచి నట్లు సందేశం పంపింది. ఆయన కూడా తన పెద్దలతో సంప్రదించి దాన్ని స్వీకరించారు. తేదీ నిర్ణయమయింది. నిర్ణీత దినాన అబూతాలిబ్, హజ్రత్ హమ్జా తదితర వంశంలోని పెద్దల సమక్షంలో హజ్రత్ ఖదీజా ఇంట ఆయన వివాహం నిరాడంబరంగా జరిగింది. అక్కడ అబూతాలిబ్‌గారు నికాహ్ ప్రసంగం చేశారు. ఐదు వందల బంగారు నాణాల మహర్‌తో జరిగింది వివాహం.

పెళ్ళి నాటికి హజ్రత్ ఖదీజా వయసు నలభయి ఏళ్ళు, గతించిన ఇద్దరు భర్తల సంతానంలో ఇద్దరు అబ్బాయిలూ ఒక అమ్మాయి ఉన్నారు.

## అసాధారణ విషయాలు

ప్రపంచాన గొప్పవారుగా, మహనీయులుగా వినుతి కెక్కిన వారి జీవితాల్లో ప్రారంభం నుంచే, వారి భవిష్యత్తు మహోజ్వలంగా రూపొందుతుందనడానికి ప్రస్ఫుట మయిన లక్షణాలు గోచరిస్తుంటాయి. సాధారణంగా ఒక వంశాన్ని, ఒక జాతిని లేదా ఒక దేశాన్ని సముద్ధరించడానికి పూనుకుని నిలబడే వారి జీవితాల్లోనూ, మానవ జీవితానికి సంబంధించిన ఏ ఒక్క విభాగాన్నయినా పరిమిత అవధుల్లో సంస్కరించడానికి ముందుకు వచ్చిన వారి జీవితాల్లోనూ ఈ చిహ్నాలు కనిపిస్తాయి. ఒక దేశం, ఒక్క జాతినే కాదు, జీవితపు ఒక్క విభాగాన్నే కాదు, ఒక కాలానికి యుగానికి పరిమితమైన వారినే కాదు - యావత్తు ప్రపంచాన్ని, మానవ జీవితం మొత్తాన్ని, ప్రళయ కాలం వరకు సముద్ధరించి, సంస్కరించి, సన్మార్గం చూపడానికి ప్రభవింప జేయబడిన వ్యక్తి జీవితపు ప్రారంభదశలో ఇలాంటి అసాధారణ లక్షణాలు విశేష సంకేతాలు ప్రస్ఫుటమవకుండా ఉంటాయా? అవి బహువిధాలుగా బహు రూపాల్లో ప్రత్యక్షమవడం సహజమే. ఇలాంటి అనేక విషయాల ప్రస్తావన మహా ప్రవక్త ముహమ్మద్ (స) జీవిత చరిత్ర గ్రంథాల్లో పలుచోట్ల కనిపిస్తుంది. అయితే ఇలాంటి వందలాది సంఘటనల్లో నుంచి, విశ్లేషణాత్మక అనుశీలన తరువాత నిర్ధారితంగా ఋజువయిన వాటిని కొన్నింటిని తెలుసుకోవడం ఉచితం.

మహాప్రవక్త ముహమ్మద్ (స) ఒకసారి ఇలా అన్నారు: "నేను మాతృ గర్భంలో ఉన్నప్పుడు మా అమ్మ ఒక కలగన్నారు. అందులో తన దేహం నుంచి ఒక వెలుగు వెలువడి సిరియా రాజభవనాలను కాంతిమయం చేసినట్టు చూశారామె".

ఆయన ప్రభవన కాలంలో యూదులూ, క్రైస్తవులూ ఒక ప్రవక్త రానున్నారని ఆత్రుతగా ఎదురుచూస్తూ ఉండేవారని ఈ సందర్భంలో రకరకాల జోశ్యాలు పలికేవారని అనేక చారిత్రక ఉల్లేఖనాల ద్వారా తెలుస్తోంది.

ఆయన బాల్యంలో ఒకసారి కాబాలో ఏదో మరమ్మతు జరుగుతూ ఉండగా పెద్దవారితోబాటు చిన్న పిల్లలు కూడా రాళ్ళు, ఇటుకలు మోస్తున్నారు. ఆ బాలురుల్లో ముహమ్మద్ (స) ఆయన పినతండ్రి అబ్బాస్ కూడా ఉన్నారు. లుంగీ విప్పి భుజం మీద వేసుకుంటే ఇటుకల రాపిడి బాధ ఉండదని సలహా ఇచ్చారు అబ్బాస్. అరబ్బుల్లో అదీ పిల్లవాళ్ళు అలా చెయ్యడం వింత విషయమూ కాదు, కొత్త విషయమూ కాదు. పిల్లలే కాక పెద్దలు కూడా దిగంబరులుగా ఉండడానికి సిగ్గుపడని వాతావరణం అది. ఆ వాతావరణంలో ఆయన అయిష్టంగానే, తన బాబాయి సలహాని పాటించారు. కాని నగ్నత్వపు అనుభూతి కలగగానే స్పృహ తప్పి పడిపోయారు. కళ్ళు ఎక్కడో పైపైకే చూస్తున్నాయి. స్పృహ రాగానే "నా లుంగీ, నా లుంగీ"అంటూ కలవరించ సాగారాయన. అక్కడున్న వారు తక్షణం లుంగీ తీసి నడుముకు చుట్టివేశారు. తరువాత బాబాయి అబూతాలిబ్ ఏమి జరిగిందని విచారించగా ఆయన ఇలా తెలిపారు. "తెల్లని వలువలు ధరించిన ఓ వ్యక్తి నాకు అగుపించాడు, ఆయన నన్ను సంబోధించి "మర్మాంగాల్ని మరుగుపరచుకో' అని హెచ్చరించాడు".

ఇది బహుశా మహాప్రవక్తకు అజ్ఞాతవాణి అందించిన ప్రథమ సందేశమేమో!

రాత్రుల్లో కథలు వింటూ కాలక్షేపం చేసే ఆచారం అరబ్బుల్లో సర్వ సమాన్య మయింది - మన దేశంలో బుర్రకథా కాలక్షేపం లాంటిది. రాత్రులంతా కథకుడు కథలు వినిపిస్తూ వుంటే జనులంతా ఓ చోట చేరి తాపీగా వింటూ వినోదంగా హాయిగా కాలం గడిపేవారు. మహా ప్రవక్త ముహమ్మద్ (స) కూడా తన నవయవ్వన దశలో ఇలాంటి కార్యక్రమం ఒక దానిలో పాల్గొనాలని బయల్దేరారు. మార్గమధ్యంలో ఏదో వివాహ తతంగం జరుగుతూ ఉంటే దాన్ని చూస్తూ ఆగిపోయారు. అలాగే అక్కడే నిద్రపోయారుకూడా. కళ్ళు తెరిచేటప్పటికి సూర్యోదయం అయిపోయింది. ఇలాంటి సంఘటనే మరోసారి కూడా జరిగింది. అప్పుడు కూడా ఆయన యాధృచ్ఛికంగా నిద్రపోయారు. వృథా కాలయాపనలో కాలం వెళ్ళబుచ్చకుండా దైవికంగా కాపాడే ఏర్పాటు జరిగింది.

మహాప్రవక్త ప్రభవన కాలంలో విగ్రహారాధనకు పట్టు కొమ్మగా రూపొందిన మక్కాలో, స్వయంగా దైవ గృహమైన కాబాలో 360 విగ్రహాలు పూజలను అందుకునేవి. ఆయన వంశీయులు అంటే కురైష్ ప్రజలే కాబా గృహానికి పూజారులు, మఠాధిపతులు కూడా. అయితే ఆయన ఏనాడూ విగ్రహాల ఎదుట తలవంచలేదు. అక్కడ జరిగే బహు దైవారాధనకు సంబంధించి అర్చనల్లో పాల్గొననూ లేదు. కురైష్ ప్రజలు తల మునకలయి ఉన్న మూఢాచారాల్లోనూ తన వంశీయులకు తోడ్పడలేదాయన.



# దైవదౌత్యం ప్రారంభమయింది

మహాప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహివసల్లమ్) జీవితంలో క్రమేణా ఒక విప్లవం రాసాగింది. ఏకాంతంలో, ఏకాగ్రతతో కూర్చుని దైవ ధ్యానంలో నిమగ్నులవడం లోను, తన చుట్టూ వాతావరణాన్ని ఆవరించి ఉన్న నైతిక పతనాన్ని గురించి, ధార్మిక మార్గవిహీనతను గురించి ఆలోచించడంలోనూ తన కాలం అధికంగా గడపసాగారాయన. నిత్యం తన జాతివారి విగ్రహారాధనలాంటి అత్యాచారాలను గురించి, వారి నైతిక దుస్థితి గురించీ అతి తీవ్రంగా యోచించేవారు. వారిలోని ఈ కీడుల్ని దూరం చెయ్యడం ఎలా? విశ్వప్రభువు, సృష్టికర్త, మానవుల ఆ నిజ స్వామిని ఆరాధించే సరయిన పద్ధతి ఏది? దాన్ని తన వారికి తెలుపడం ఎలా? ఇలాంటి ప్రశ్నలెన్నో ఆయన అంతర్యాన్ని కలవర పరచేవి. ఆయన ఆలోచనలు, దృష్టి, మనస్సు అన్నీ వీటిపైనే కేంద్రీకరించాయి.

## 'హిరా' గుహ

పవిత్ర మక్కా నగరం నుంచి మూడు మైళ్ళ దూరాన ఒక గుహ ఉంది. దానికి 'హిరా' అని పేరు. ఆయన తరచుగా అక్కడికి వెళ్ళి ఆలోచనలో, దైవచింతనలో నిమగ్నులయ్యేవారు. అన్న పానీయాలు వెంట తీసుకెళ్ళి అవి నిండుకున్నప్పుడు ఇంటికి వచ్చి తిరిగి తీసుకెళ్ళేవారు. లేదా అప్పుడప్పుడు హజ్రత్ ఖదీజా తీసుకెళ్ళి ఇచ్చేవారు.

## తొలిదైవవాణి

అది రమజాన్ నెల. ఆయన యెప్పటివలెనే దైవ ధ్యానంలో నిమగ్నులై ఉన్నారు. అకస్మాత్తుగా అక్కడ ఒక దైవదూత ఆయన ముందు ప్రత్యక్షమయ్యారు. పేరు జిబ్రీల్. జిబ్రీల్ (అలైహిస్సలామ్) దైవ దూతల్లోకెల్లా ఉన్నత స్థానం కలవారు. దేవుని సందేశహరు లయిన మానవులకు దేవుని సందేశం అందజేయడమే హజ్రత్ జిబ్రీల్ నిత్యసేవ. హిరాలో ప్రత్యక్షమైన జిబ్రీల్ (అ) ముహమ్మద్ (స)తో "పఠించు" అన్నారు. ఆయన, "నాకు చదువనురాదు" అని సమాధానం ఇచ్చారు. అప్పుడు జిబ్రీల్ మహాప్రవక్తను గట్టిగా పట్టుకుని

అదిమి వదిలారు. దానివల్ల మహాప్రవక్త (స) అలసిపొయ్యారు. తిరిగి "పఠించు" అని పురమాయించారు జిబ్రీల్. ఆయన (స) మళ్ళీ "నేను చదువలేను" అని పలికారు. మళ్ళీ జిబ్రీల్ ఆయన్ని గట్టిగా అదిమి వదిలారు. "పఠించు" అని కోరారు. "నేను చదువలేను" అనే తిరిగి బదులిచ్చారు ముహమ్మద్ (స). మూడవసారి కూడా జిబ్రీల్ అలాగే అదిమి వదిలి ఇలా అన్నారు:

| | |
|---|---|
| **ఇక్‌రా బిస్మి రబ్బికల్లజీ ఖలక్.** | "చదువు, సృష్టించిన నీ ప్రభువు పేరుతో, ఆయన |
| **ఖలకల్ ఇన్సాన మిన్ అలక్.** | మనిషిని కరడు గట్టిన రక్తంతో సృష్టించాడు. చదువు |
| **ఇక్‌రావరబ్బుకల్ అక్రముల్లజీ** | నీ ప్రభువు ఎంతో పునీతుడు, శ్రేష్ఠుడు. ఆయన కలం |
| **అల్లమబిల్ కలమి, అల్లమల్** | ద్వారా జ్ఞానం ప్రసాదించాడు. మానవునికి అతను |
| **ఇన్సాన మాలమ్ యాలమ్.** | ఎరుగనిదంతా నేర్పాడు." |

దీన్ని జిబ్రీల్ పఠించినట్టే పఠించారు మహాప్రవక్త (స). ఇది దైవం పంపిన ప్రథమ వహీ – దైవవాణి. ఈ సంఘటన జరిగిన వెంటనే మహాప్రవక్త ఇంటికి తిరిగి వచ్చారు. ఆ సమయంలో ఆయన పవిత్ర హృదయమంతా అనిర్వచనీయమయిన ఓ కంపనం వ్యాపించింది.★ ఇంటికి వచ్చిరాగానే ఆయన హజ్రత్ ఖదీజాని "కంబళి కప్పు, కంబళి కప్పు" అని తొందర పెట్టారు. తక్షణం కంబళి కప్పారామె. ఆ తరువాత కొంత శాంతించిన మీదట ఆయన జరిగినదంతా హజ్రత్ ఖదీజాకు వివరించారు. "నాకు ఏదో ప్రాణాపాయం కలగబోతోంది" అని ఆందోళన వ్యక్తపరచగా దానికి హజ్రత్ ఖదీజా ఇచ్చిన సమాధానం చారిత్రకమయింది మాత్రమే కాదు, సిద్ధాంతపరంగా, ఆచరణాత్మకంగా ఇస్లామీయ ఉద్యమ కార్యంలో కార్యకర్తల మౌలిక రూపురేఖల్ని విశదపరుస్తుంది – ఆమె ఇలా అన్నారు: "కాదు కాదు, అలా ముమ్మాటికీ జరగదు. మీకు ఎలాంటి ప్రాణాపాయం వాటిల్లదు, దైవం మీకు పరాభవం కలగనివ్వడు. మీరు బంధువుల పట్ల, సంబంధీకుల పట్ల బాధ్యతా నిర్వహణలో ఎలాంటి లోటూ రానివ్వరు. ఇతరుల భారమంతా మీరే భరించేందుకు ముందుకు వస్తారు, ఆర్తులకు, అనాథలకు సహాయపడతారు. బాటసారుల్ని ఉచిత రీతిలో సత్కరిస్తారు. ఆపదల్లో ఉన్నవారికి న్యాయప్రాప్తి కొరకు తోడ్పడతారు. ఇలాంటి మీకు ఏ విధంగాను అన్యాయం జరగబోదు" అని హజ్రత్ ఖదీజా ఆయన్ని ఓదార్చారు.

★ తనపై మోపబడిన గురుతరమైన బాధ్యతా భారం గురించి ఊహవల్ల ఈ కంపనం కలిగింది. ఆ సందర్భంలో ఆయన నుడివిన మాటలు దానికి హజ్రత్ ఖదీజా పలికిన సాంత్వన వచనాలు, ఆమె ఓదార్పు తీరు అంతా మానవ సహజ మానసిక పరిస్థితికి నిదర్శనాలు.



ఆ తరువాత ఆయన్ని తీసుకుని ఆమె "వరకా బిన్ నౌఫిల్" అనే క్రైస్తవ వృద్ధుని వద్దకు వెళ్ళారు. ఆయన తౌరాహ్ బాగా అధ్యయనం చేసిన విద్వాంసుడు, ఏకేశ్వరోపాసకుడు. ఆయనకు జరిగిన ఉదంతమంతా వివరంగా చెప్పారు హజ్రత్ ఖదీజా. 'వరకా' అంతా విని ఇలా అన్నారు:

"మూసా (అలైహిస్సలామ్) వద్దకు అవతరించిన, దైవిక మర్మాలను యెరిగిన దైవదూతే మీకూ దర్శనమిచ్చారు. మీ జాతి వారు మిమ్మల్ని బహిష్కరించే ఆ రోజు వరకు నేను సజీవంగా ఉంటే ఎంత బాగుండు" అని విచారం వ్యక్తం చేశారు.

"నా జాతి వారు నన్ను బహిష్కరిస్తారా?" ఆశ్చర్యంగా, బాధగా అడిగారు మహాప్రవక్త (స).

"అవును, మీకు లభించిన ఇటువంటి సందేశాన్ని పొంది, దాన్ని ప్రజలకు అందజేసిన వారందరిపట్ల శత్రుత్వమే వహించారు ప్రజలు. మీకు ఆ పరిస్థితులు ఎదురయ్యే వరకు నేను జీవించి ఉంటే, మీకు తోడుగా ఉంటాను" అని సమాధానంగా అన్నారు వరకా. ఆ తరువాత కొన్ని దినాలకే మరణించారాయన.

ఇది జరిగిన తరువాత కొన్ని దినాల వరకు హజ్రత్ జిబ్రీల్ (దైవవాణిని అందజేసిన దైవదూత) ఆగమనం నిలిచిపోయింది. మహాప్రవక్త (స) మటుకు హిరా గుహకు మామూలుగా వెళుతూనే ఉన్నారు. ఈ విధంగా దాదాపు ఆరు మాసాలు గడిచిపొయ్యాయి. ప్రారంభంలో, ఆయన అంతర్యాన్ని ఆవరించిన మానవ సహజమయిన భావాలు అనుభూతుల ప్రభావం క్రమేణా సమసిపోయాయి. ఆయన మనోద్వారాలు తెరుచు కున్నాయి. ఇప్పుడు వహీ (దైవవాణి) ఆగమనానికై ఆత్రుతతో ఎదురు చూడసాగా రాయన. ఈ కాల విలంబనం వల్ల ఆయనలోని ఉత్సాహం ఉత్తేజవంతమయింది. ఇలాంటి పరిస్థితుల్లో ఆయన్ని శాంత పరచడానికని, ఆయనకు సంతృప్తిని చేకూర్చడానికని అప్పుడప్పుడు హజ్రత్ జిబ్రీల్ (అ) వచ్చి ఓదార్చి వెళ్ళేవారు.

"నిజానికి మిమ్మల్ని దైవ సందేశహరునిగా అల్లాహ్ ఎన్నుకున్నట్లే. మీరు శాంతంగా నిరీక్షించండి" అని ధైర్యం చెప్పేవారు జిబ్రీల్. ఆ తరువాత కొన్ని దినాలకు హజ్రత్ జిబ్రీల్ రాకపోకలు అధికమయ్యాయి.



# సందేశం

హిరా గుహలో తొలి వహీ అవతరించిన తరువాత కొంత కాలం వరకు దైవవాణి అవతరణ నిలిచిపోయింది. అటు తరువాత అవతరించిన దైవవాణి "ముద్దస్సిర్" సూరాలోని ప్రారంభ వాక్యాలు : "ఓ కంబళధారీ!, లే, లేచి జనుల్ని మార్గవిహీనత వల్ల కలిగే దుష్పరిణామం గురించి హెచ్చరించు, నీ ప్రభువు ఔన్నత్యాన్ని స్తుతించు, వస్త్రాలను పరిశుద్ధపరచుకో, విగ్రహాల నుండి దూరంగా మసలుకో, మరింత ప్రతిఫలం పొందే సంకల్పంతో మాత్రం ఇతరులకు మేలు చేయకు. నీ ప్రభువుకు సంబంధించిన వ్యవహారం వల్ల కలిగే బాధల్ని, కష్టాల్ని సహనంతో భరించు". ఇక ముహమ్మద్ (సల్లల్లాహు అలైహివసల్లమ్) దైవ దౌత్యకార్యానికి నియుక్తులయినట్లే అని లాంఛనంగా లభించిన ఆదేశం ఇది: "లేచి మార్గభ్రష్టులయిన మానవులకు మంగళ శ్రేయాలను, విజయ సాఫల్యాలను చేకూర్చే మార్గాన్ని చూపించు. సాఫల్యం సాధించే మార్గం ఒక్కటే అని సావధానపరచు – అంటే ఒక్క అల్లాహ్‌నే ఆరాధించటం. ఈ మార్గాన్ని అనుసరించిన వారిదే సాఫల్యం. మరెవరయితే దీన్ని కాదని మరో విధానాన్ని అవలంబిస్తారో వారికి మరణానంతర జీవితంలో కలిగే దుష్ఫలితం గురించి భయపెట్టు. మానవ జీవితం, ఒకే దేవుని ఆరాధన, ఆయన మహిమల మహోన్నత అంగీకారం ఆధారంగానే నిర్మించబడాలి. అప్పుడే మానవ జీవితం, సర్వవిధాల, బాహ్య అపరిశుద్ధతలకు, అంతర్ మలినాలకు దూరంగా మనగలుగుతుంది. దైవాన్ని త్యజించి మానవులు ఇతరులకు బానిసలవడం మానవ వినాశనానికి దారితీస్తుంది. మానవులంతా పరస్పరం సద్వర్తనులై మెలగాలి. ఈ సద్వర్తనకు వెనుక ఎలాంటి స్వార్థమూ లాలస ప్రలోభాలూ ఉండకూడదు" అని తొలి ఆదేశానికి అర్థం.

## సందేశం - రెండు దశల్లో

సందేశ ప్రచారం ప్రారంభమవటంతో మహాప్రవక్త జీవితంలో గొప్ప మలుపు ఆసన్నమైంది. దైవ సందేశహరునిగా ఆయన జీవితాన్ని రెండు ముఖ్య భాగాలుగా



ప్రవక్త మహనీయులు ఏకాంతంలో ధ్యానం చేసిన హిరా గుహ





విభజించుకోవచ్చు. ఒకటి మక్కాలో 'హి(జత్' కంటే ముందు ఆయన గడిపిన కాలం; రెండవది 'హి(జత్' చేసిన మీదట మదీనాలో గడిపిన కాలం. మొదటి దశను మక్కా కాలమని, రెండవ దశను మదీనా కాలమని సామాన్యంగా వ్యవహరిస్తారు. మొదటి దశ సుమారు పదమూడు సంవత్సరాలూ, రెండవ దశ పది సంవత్సరాలూ సాగింది.

## మక్కా జీవితం

మక్కాలో మహాప్రవక్త గడిపిన సందేశ కాలం దాని పరిణామాల రీత్యా అత్యంత ప్రముఖమయింది. నిజం చెప్పాలంటే ఈ కాలంలోనే ఇస్లామ్ సౌధపు పటిష్టమయిన పునాదులు ఏర్పడ్డాయి. ఈ దశలోనే మానవత్వానికే ఆదర్శమూర్తులుగా నిలిచి ఇస్లామీయ ఉద్యమాన్ని మొత్తం ప్రపంచానికి పరిచయం చేసిన మహాపురుషుల సుశిక్షణ జరిగింది. మనకు అందుబాటులో ఉన్న చారిత్రక గ్రంథాల్లో, ముహమ్మద్ (స) జీవిత చరిత్రకు సంబంధించిన పుస్తకాల్లో మక్కా దశ వివరాలు చాలా స్వల్పంగా లభిస్తాయి. ఆ కాలం ప్రాముఖ్యతను, సందేశంపై అప్పటి పరిస్థితుల ప్రభావాన్ని తెలుసుకునేందుకు మక్కాలో అవతరించిన 'దివ్యఖుర్ఆన్' భాగాలను కడు శ్రద్ధగా అధ్యయనం చేయడం అత్యవసరం. అసలు విషయమేమంటే మక్కా కాలం వాస్తవమయిన ప్రాముఖ్యతను సరిగ్గా అర్థం చేసుకోవడం అనేది కొన్ని విషయాలను తెలుసుకోనంత వరకు సాధ్యపడదు. మక్కాలో అవతరించిన సూరాలలో సందేశం అందచేయడానికి అవలంబించబడిన విధానం అవగతమవాలి; ఆనాటి పరిస్థితుల, జరిగిన సంఘటనల వివరాలు బోధపడాలి; ఏకేశ్వర వాదనకు, పరలోక జీవితానికి దివ్యఖుర్ఆన్ చూపెట్టిన నిదర్శనాలు, నిర్ధారణలు దృష్టిలో ఉండాలి. మానవుల స్వరూప స్వభావాల సముద్ధరణ కొరకు చేయబడిన ఉప దేశాలు బోధపడాలి. సత్యాసత్యాల మధ్య జరిగిన అత్యంత దుస్సహమైన సంఘర్షణ కాలంలో ఉద్యమ వికాసానికి, ఉద్యమ ధ్వజవాహకులు తమ స్థానాన్ని నిలదొక్కుకునేందుకు సలిపిన కృషి వివరాలు ముందుకు రావాలి. ఈ విషయాలను క్షుణ్ణంగా తెలుసుకోవాలంటే, స్వయంగా దివ్యఖుర్ఆన్నే శ్రద్ధగా అధ్యయనం చెయ్యడం కన్నా మార్గాంతరం లేదు. అయినప్పటికీ ఇక్కడ మక్కా జీవితపు వివరాలు కొంతవరకు తెలుసుకునేందుకు ప్రయత్నిద్దాము.

## మక్కా జీవితంలో -నాలుగు దశలు

మహాప్రవక్త (స) ఉద్యమ జీవితంలోని హి(జత్కు ముందు కాలాన్ని, దాని కొన్ని ప్రత్యేకతల మూలంగా, నాలుగు విభిన్న దశలుగా విభజించడానికి వీలుంది. ఈ దశలో ఉద్యమానికి, సందేశ ప్రచారం దృష్ట్యా విభిన్నమైన మలుపులు, సంఘర్షణలు ఎదురయ్యాయి.

**తొలిదశ :**

దైవదౌత్యం స్వీకరించిన పిదప దాదాపు మూడు సంవత్సరాల వరకు మహాప్రవక్త సందేశ ప్రచార కార్యాన్ని గోప్యంగా నిర్వహించారు.

**రెండవ దశ :**

దైవదౌత్య ప్రకటనకు తరువాత సుమారు రెండేళ్లపాటు కాలంలో తొలుత వ్యతిరేకత అగుపించింది. ఆ తరువాత అవహేళన జరిగింది. వివిధ అభాండాలు మోపబడ్డాయి. దూషించటం జరిగింది. దుష్ప్రచారమూ జరిగింది. వ్యతిరేక ప్రచారం ద్వారా ఇస్లామీయ సందేశాన్ని అణచివేయడానికి ప్రయత్నాలూ జరిగాయి.

**మూడవ దశ :**

ఇంత జరిగినా ఇస్లామీయ ఉద్యమం అనుదినం అభివృద్ధి చెందటంవల్ల, అనుయాయుల్ని శారీరకంగా బాధపెట్టడం, హింసించడం మొదలుపెట్టారు విరోధులు. ఇది ఇస్లామీయ ఉద్యమకారుల ఎడల దౌర్జన్యం అత్యాచారాల దశ. ఈ దశ దాదాపు అయిదారేళ్ళు సాగింది. ఇందులో ముస్లిములు ఎన్నెన్నో విధాల పీడనలకు గురయ్యారు.

**నాలుగవ దశ :**

అబూతాలిబ్, హజ్రత్ ఖదీజాగార్ల నిర్యాణం తరువాత హిజ్రత్ వరకు సుమారు మూడు ఏండ్ల ఈ కాలం మహాప్రవక్తకూ, ఆయన సహచరులకూ అత్యంత కష్టభూయిష్ట మయిన దుర్భరకాలం.

### *తొలిదశ*

## ప్రశాంత సందేశం

దైవదౌత్య కార్యభారం స్వీకరించిన పిదప మహాప్రవక్తకు ఆసన్నమయిన మొట్టమొదటి సమస్య అనేక మంది కాల్పనిక దేవుళ్ళను పరిత్యజించి ఏకైక ప్రభువును ఆరాధించమని ప్రబోధించే ఈ సందేశం ప్రప్రథమంగా ఎవరికి అందజెయ్యాలి? అన్నది. ఆయన సొంత దేశ ప్రజలు, సొంత జాతివారు ఏ స్థితిలో ఉన్నారో ఇంతకుముందే క్లుప్తంగా చూశాము. అలాంటి వారి సమక్షంలో, వారినైజానికి, వారి అభీష్టానికి, వారి అభిరుచులకు పూర్తిగా విరుద్ధమయిన విషయాన్ని సమర్పించటం ఎంతో శ్రమతో కూడుకున్న పని. కనుక ముహమ్మద్ (స) ప్రారంభంలో తనకు ఆప్తులయిన వారినే ఈ సందేశం వైపునకు ఆహ్వానించడానికి ఎన్నుకున్నారు. వీరు మహాప్రవక్త నైజాన్ని గుణగణాల్ని వ్యక్తిగతంగా బాగా ఎరిగినవారు. ఆయన స్వరూప స్వభావాల్ని ప్రత్యక్షంగా చూస్తున్న వారవడం చేత వారికి ఆయన సత్యసంధత,



నిజాయితీ తత్పరతల పట్ల, ఒక నిర్దిష్టమైన అభిప్రాయం ఉంది. మహాప్రవక్త చెప్పిన మాటను త్రోసిపుచ్చడం వీరికి అంత సులభం కాదు. వీరిలో అందరికంటే ఆత్మీయురాలు, ఆయన బాహ్యాంతరాలను, బాగా ఎరిగిన వ్యక్తి హజ్రత్ ఖదీజా (రజి అల్లాహు అన్హు). తరువాత చెప్పుకో తగ్గవారు హజ్రత్ అలీ, హజ్రత్ జైద్, హజ్రత్ అబూబక్ర్ (రజి అల్లాహు అన్హుమ్) ప్రభృతులు, హజ్రత్ అలీ మహాప్రవక్త బాబాయి కుమారుడు; హజ్రత్ జైద్ ఆయన బానిస; హజ్రత్ అబూబక్ర్ ఆయన ప్రియమిత్రుడు. వీరంతా ఏళ్ళతరబడి ఆయన సాంగత్యంలో ఉంటూ వచ్చారు. ఈ సంబంధాన్ని పురస్కరించుకుని ఆయన మొదమొదట హజ్రత్ ఖదీజాకు సందేశం వినిపించారు. అటు తరువాత ఇతరులకు అందజేశారు. వీరంతా ముందే విశ్వాసం గలవారా అన్నట్టు వినీ వినగానే ఆ సత్సందేశాన్ని స్వీకరించి, ధృవపరిచారు. వీరే విశ్వాసుల్లో అగ్రగాములు. అగ్రగణ్యులు కూడా. ఆ తరువాత హజ్రత్ అబూబక్ర్ ప్రోద్బలం, ఉపదేశాల వల్ల హజ్రత్ ఉస్మాన్, హజ్రత్ జుబైర్, హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ఔఫ్, హజ్రత్ సాద్ బిన్ అబీ వక్కాస్, హజ్రత్ తల్హా (రజి) విశ్వాసం గైకొన్నారు. ఇలా ఇస్లామ్ సందేశం గుట్టుగా వ్యాప్తి చెందసాగింది. ముస్లిములు రోజురోజుకు మరింత బలం పుంజుకో సాగారు.

## దివ్య ఖుర్ఆన్ ప్రభావం

ఈ కాలంలో అవతరించిన ఖుర్ఆన్ భాగాలు, సందేశపు తొలి దశకు అనువుగా చిన్న చిన్న వాక్యాలతో శ్రవణానందంగా ఉండేవి. ఉత్కృష్టమయిన భాష, అమృతమయ మయిన వచనాలు, ప్రభావవంతమయిన శైలి, ఎంతో హృద్యంగా, మనోజ్ఞంగా ఉండేవి. మనసుల్ని, మనుషుల్ని ఇట్టే ఆకట్టుకునేవి. వాటి సాహిత్య సరళి కూడా ఎంతో ఉత్తమంగా, ఉదాత్తంగా ఉండేది. వినేవారి మనసుల్ని ఆ వచనాల మాధుర్యం ఆక్రమించుకునేది. మాటలు బాణాల్లా దూసుకుపోయి అంతర్యాన్ని పెకలించేవి. విన్నవాడు విన్న పళంగా ముగ్ధుడయ్యేవాడు. ఆ మాటల్ని మాటిమాటికి మననం చేస్తూ ఉండాలని అతని మనస్సు తహ తహలాడేది.

## విశ్వాసాల సంస్కరణ

ఆ కాలంలో అవతరించిన పవిత్ర గ్రంథంలోని సూరాలలో ఏకేశ్వరోపాసనను గురించి, పరలోక జీవితాన్ని గురించి యదార్థాలు వర్ణించబడ్డాయి. వాటిని గురించి సహేతుకమయిన నిదర్శనాలు, తార్కాణాలు సమర్పించడం జరిగింది. వినే వారికి సమీపంలో గల వాతావరణంలోని విషయాలనే తార్కాణాలుగా, నిరూపణలుగా చూపడం జరిగింది. వాటిని నిర్ధారణ పరచే విధానం కూడా ఎంతో సుబోధకంగా ఉండేది. సంబోధితులకు తెలిసివున్న ఐతిహాసిక సంఘటనల్ని, వారి మధ్య ప్రచారంలో వున్న కథనాల్ని వారి సంప్రదాయాల్ని ఆధారంగా తీసుకుని అసలు విషయం బోధించే ప్రయత్నం జరిగింది.

విశ్వాసాల రీత్యా వారు ఏ భ్రమలకు, ఏ భ్రాంతులకు, ఏ వక్రమార్గాలకు గురయి ఉన్నారో వాటిని ఎత్తి చూపటం జరిగింది. వాళ్ళు బాగా ఎరిగి వున్న, అనుభవిస్తున్న నైతిక, సామాజిక దురాచారాలను, కీడుల్ని సూచించడం జరిగింది. ఈ కారణాల వల్లనే ఆ దివ్యవాణిని విన్నవారు దాని ప్రభావానికి లోనవకపోవడం దుస్సాధ్యమయిపోయింది. దైవప్రవక్త (స) ఒంటరిగానే ఈ సందేశాన్ని ప్రారంభించారు. కాని ఈ రంగంలో పని చేసిన అత్యంత ప్రభావవంతమయిన అస్త్రాలు పవిత్ర ఖుర్ఆన్‌లోని ఈ తోలి మధుర వచనాలే. సందేశం మెల్లిమెల్లిగా గుట్టుమట్టుగా వ్యాపించసాగింది.

ఈ దశలో సందేశ ప్రచారం కోసం ఏకేశ్వరోపాసననూ మరణానంతర జీవితాన్నీ నిర్ధారణలతో, తార్కాణాలతో వివరించటమే కాక, దివ్య ఖుర్ఆన్‌లో, ప్రవక్త (స) ఈ మహోజ్వల కార్యాన్ని నిర్వహించేందుకు తగిన విధంగా సన్నద్ధమవ్వాలని కూడా శిక్షణాత్మక సందేశాలు అందాయి. ఈ బృహత్ కార్యాన్ని సాధించడానికి ఏయే విధానాలు అవలంబించాలో బోధించటం జరిగింది.

## ఆనాటి విశ్వాసుల ప్రత్యేకతలు

అప్పుడు ఇస్లామ్ స్వీకరించడమంటే, మహాప్రవక్త (స)తో సహకరించడమంటే, ప్రాణాల్ని అరచేతిలో పెట్టుకుని తిరగడమన్న మాట. ఈ దశలో ఎవరయితే ముందంజ వేసి ఈ సందేశాన్ని స్వీకరించారో వాళ్ళలో తప్పనిసరిగా కొన్ని విశేషమయిన లక్షణాలు ఉండేవి – వాటి ఆధారంగానే ఆ మహనీయులు సందేశ ప్రచార రంగంలో పురోగమించ గలిగారు. వాళ్ళలో సర్వసామాన్యంగా ఉన్న గుణాల్లో ఒకటేమంటే – వీరంతా మొదటి నుంచే బహుదైవ వాదనను, అసంబద్ధమయిన ఆచారాల్నీ, ఆరాధనల్నీ నిరసించిన వారు, సత్యాన్వేషణలో ఉండి ఇలాంటి సందేశం కోసం ఎదురుచూస్తూ ఉన్న వారు, సహజంగా సదాచారులు, సద్గుణ సంపన్నులు, ఆ తొలి దశలోని వారిలో గల ప్రత్యేకత ఇదే.

## గుట్టుగా ప్రార్థనలు

అప్పుడు ఏది జరిగినా రహస్యంగానే జరిగేది. విశ్వసనీయులయిన వ్యక్తులకు తప్ప ఇతరుల వరకు మాట పొక్కి పోకుండా తగు జాగ్రత్తలు తీసుకునేవారు. నమాజ్ సమయం ఆసన్నమవగానే మహాప్రవక్త (స) ఏదో గుట్టదాపుల్లోకి పోయి ప్రార్థన సలుపుకునేవారు. ఒకసారి ఆయన హజ్రత్ ఆలీతో కలిసి ఒక కొండ చరియలో నమాజ్ చేసుకుంటూ ఉండగా సందర్భవశాత్తు ఆయన (స) బాబాయి అబూతాలిబ్ అటువైపు వచ్చారు. ఈ కొత్త దైవోపాసనా రీతిని సంభ్రమాశ్చర్యాలతో చాలాసేపు తిలకిస్తూ నిలబడ్డారు. నమాజ్ ముగిసిన పిదప "ఇది ఏ ధర్మం?" అని అడిగారు అబూతాలిబ్. "మన తాతగారయిన ఇబ్రాహీమ్‌గారి



ధర్మం" అని మహా ప్రవక్త (స) పలికారు. దానికి అబూతాలిబ్, "నేనైతే దీన్ని స్వీకరించలేను. కాని నీకు అనుమతినిస్తున్నాను, నిన్ను ఇతరులెవ్వరూ ఎదిరించలేరు" అని అభయమిచ్చారు.

ఈ విధంగా మూడేండ్ల వరకు సందేశ ప్రచారం గోప్యంగా జరుగుతూ వచ్చింది. అయితే ఎంతకాలమనీ? తేజోవంతమైన కిరణాలతో విశ్వాన్నంతటినీ కాంతిమయం చేయనున్న ప్రభాకరుడు ఎప్పటికయినా ప్రత్యక్షమవవలసిందే! కళ్ళను మిరుమిట్లు గొలపవలసిందే!! సందేశం రెండవదశలో ప్రవేశించింది.

# రెండవ దశ

## సందేశ ప్రకటన

ఇప్పుడు సందేశాన్ని బాహాటంగా ప్రకటించాలని స్పష్టమైన దైవాజ్ఞ లభించింది ప్రవక్తకు. ఒక రోజు మహాప్రవక్త (స) సఫా కొండ ఎక్కి అక్కడి నుంచి "యా సబాహా!" అని కేకవేశారు. ఆనాటి ఆచారం ప్రకారం ఏదయినా అపాయం ముంచుకు వచ్చినప్పుడు దాన్ని మొదట గమనించిన వ్యక్తి ఒక ఎత్తయిన చెట్టునో, గుట్టనో యెక్కి ఈ విధంగా కేకలు పెట్టేవాడు. జనులు ఆ కేకలు విని అక్కడ పోగయ్యేవారు. ఆ ఆచారం ప్రకారం మహాప్రవక్త (స) ఈ నినాదం చెయ్యగానే ఖురైష్ జనులు చాలా మంది సఫాకొండ వద్ద సమావేశమయ్యారు. వాళ్లలో ఆయన బాబాయి అబూలహాబ్ కూడా ఉన్నాడు.

అందరూ కూడిన తరువాత, "కొండకు అవల ఒక పెద్ద సైన్యం నిలబడి వుందనీ, అది మీపై దండెత్తడానికి సిద్ధంగా ఉందనీ నేనంటే నా మాటను మీరు నిజమని నమ్ముతారా?" అని అడిగారు మహాప్రవక్త.

"నిస్సంకోచంగా నమ్ముతాము. మీరు ఇంతవరకూ ఒక్కమాటయినా అబద్ధం పలికియెరుగరు. మేము మిమ్మల్ని సత్యసంధులుగా, విశ్వసనీయులుగానే చూశాము" అని అక్కడ సమావేశమయిన వారంతా బదులు ఇచ్చారు.

అప్పుడు మహాప్రవక్త (స) వారిని ఉద్దేశించి ఇలా ప్రసంగించారు: "జనులారా! నేను మిమ్మల్ని ఒకే దేవుని ఆరాధన కొరకు ఆహ్వానిస్తున్నాను. విగ్రాహారాధన నుండి మిమ్మల్ని రక్షించాలని ఆకాంక్షిస్తున్నాను. కాని మీరు నా మాటను కాదన్నారంటే ఇదో, ఒక భయంకరమయిన శిక్షను గురించి హెచ్చరిస్తున్నాను జాగ్రత్త".

ఖురైష్ ప్రజలు ఈ మాటలు వినగానే ఉగ్రులయ్యారు. అబూలహబ్ ఆపలేని ఆగ్రహంతో, "అయితే ఈ విషయానికేనా నీవు మమ్మల్ని రప్పించావు" అని ఉడికి పొయ్యాడు. జనసామాన్యంలో తొలిసారిగా ఇస్లామీయ సందేశం బయటపడిన సందర్భం అది. దైవప్రవక్త

తనకు అప్పగించబడిన కార్య భారాన్ని గురించి, తాను ప్రజలకు వినిపించవలసివున్న విషయాలను గురించి బహిరంగంగా విస్పష్టంగా తెలిపివేశారు. ఆయన ప్రతి వ్యక్తినీ ఆహ్వానించబోయే ఆ రాచబాట ఏదో చూపారు. దైవసందేశహరుడు చేసిన ఆ ప్రకటన ద్వారా ఈ క్రింది విషయాలు స్పష్టమయ్యాయి :

"అనంతమయిన సృష్టి రాజ్యానికి కర్త, స్వామి కేవలం అల్లాహ్ ఒక్కడే. మానవుల్ని సయితం ఆయనే సృజించాడు. కనుక ఆయనే మానవునికి ప్రభువు. మానవుడు కేవలం అల్లాహ్‌కే దాసుడు, సేవకుడు. దేవుని విధేయత పాటించడం, ఆయన ఆజ్ఞాపాలన చేయటమే మానవుని పరమావధి. ఆయన్ని కాదని ఇతరుల ఎదుట తల వంచడం, ఆయన దైవత్వంలో ఇతరుల్ని భాగస్వాములుగా ఎంచడం, మానవుని విద్యుక్త ధర్మానికే వ్యతిరేకం. అది ప్రభువు మనిషికి ప్రదానం చేసిన స్థానం, హోదా, పదవీ బాధ్యతలకే కడు విరుద్ధం. వాస్తవానికి కేవలం అల్లాహ్ ఒక్కడే మానవునికి, సకల జగత్తుకు సృష్టికర్త, ఆరాధ్యుడు, సర్వాధికారి. ఆయనకు సొంతమయిన ఈ సృష్టి రాజ్యంలో మనిషి స్వతంత్రుడు, అధికారం కలవాడూ కాడు. ఇతరులెవ్వరికీ దాసుడు కూడా కాడు. మానవుని విధేయతకు, దాస్యానికీ, పూజా, ఉపాసనలకూ అల్లాహ్ తప్ప మరెవ్వరూ అర్హులు కారు. అల్లాహ్ మానవునికి కొన్ని అధికారాలనిచ్చి అనుగ్రహించిన ఈ భూలోక జీవితం, వాస్తవానికి అతని పరీక్షా వ్యవధి. ఈ జీవితానికి తదుపరి తప్పనిసరిగా అతను అల్లాహ్ సన్నిధిలో చేరవలసివుంది. అప్పుడు ఆయన మానవులందరి భూలోక కార్యకలాపాలను పరీక్షించి వీరిలో ఎవరు ఆ పరీక్షలో నెగ్గారో, మరెవరు అపజయం పొందారో నిర్ణయిస్తాడు".

ఇది ఆనాటి ప్రకటనల సారాంశం. అది సాధారణమైన ప్రకటన కాదు. అది ఖురైష్ ప్రజల్లోనూ, చుట్టు ప్రక్కలనున్న ఇతర ప్రజల్లోనూ అలజడిని రేపింది. నలువైపులా దీని ప్రస్తావనే, దీని గురించి గుసగుసలే వినిపించసాగాయి. ఆ తరువాత కొన్ని రోజులకు మహాప్రవక్త, హజ్రత్ అలీని విందు ఏర్పాట్లు చేయమని ఆదేశించారు. ఈ విందులో అబ్దుల్ ముత్తలిబ్ వంశీయులందరినీ ఆహ్వానించారు. ఇందులో హమ్జా, హబూతాలిబ్, అబ్బాస్ ప్రభృతులందరూ పాల్గొన్నారు. విందు ముగిసిన తరువాత మహా ప్రవక్త నిలబడి, "నేను తెచ్చిన సందేశం ఇహపరాలకు సమంగా శ్రేయస్కరమయింది. దీని ప్రచార కార్య భారాన్ని మోయడంలో నాతో సహకరించే వారెవరు?" అని ప్రశ్నించారు. ఇది చాలా అసాధారణ మయిన పరిస్థితి. ఈ కార్యభారాన్ని నిర్వహించడంలో తోడ్పడటమంటే కేవలం వంశీయుల్ని, తెగవారిని, నగరవాసుల్ని మటుకే శత్రువులుగా చేసుకోవడం కాదు, యావత్తు అరేబియాతో పోరును కొనితెచ్చుకోవడమన్నమాట. అయితే దానివల్ల లాభ మేమిటి? కేవలం పరలోకంలో విజయవంతమైన జీవితం, సాఫల్యం లభిస్తాయన్న నమ్మకం; దాసుడు తన స్వామి సన్నిధిలో



దిగ్విజయకాంతితో మెరిసిపోగలడన్న ఆశ. అంతేతప్ప మరే విధమైన ఐహిక ప్రయోజనం అసలే కానరావడం లేదు. అందుకే విందుకు హాజరయిన వారిలో ఒకరు తప్ప నిశ్శబ్దంగా ఒకరి ముఖాలు ఒకరు చూసు కుంటూ ఉండిపొయ్యారు. అయితే లేచి నిలబడింది, ముందుకు వచ్చింది ఎవ్వరు? కంటి నొప్పితో బాధపడుతున్న బాలుడు హజ్రత్ అలీ! "నా కన్నులు నొప్పి పెడుతున్నప్ప టికీ, నా కాళ్ళు సన్నగా బలహీనంగా ఉన్నప్పటికీ, నేనందరిలో చిన్న వాణ్ణయినప్పటికీ మీతో సహకరించడానికి సిద్ధంగా ఉన్నాను" అన్నారాయన లేచి. ఎంత విచిత్రమయింది ఆ సన్నివేశం! పదమూడేండ్ల బాలుడు లేచి వెనకా ముందు ఆలోచించకుండా ఎంతో గొప్ప నిర్ణయం తీసుకున్నాడు!!.

## సందేశానికి వ్యతిరేకత

అప్పటికీ ఇస్లామీయ సంఘంలో 40 మందికి పైగానే అనుయాయులు ప్రవేశిం చారు. ఒక రోజు మహాప్రవక్త కాబా గృహంలో ఏకేశ్వర వాదాన్ని వివరంగా ప్రకటించారు. బహు దైవారాధకులు దీన్ని కాబా పట్ల తీవ్రమయిన అపచారంగా, తీరని అవమానంగా భావించారు. ఈ ప్రకటన జరగగానే గొప్ప కల్లోలం చెలరేగింది. జనులు అన్ని వైపుల నుంచి మహాప్రవక్తపై విరుచుకుపడ్డారు. హజ్రత్ "హారిస్ బిన్ అబీహాల" ఆయన రక్షణ కోసమని ముందుకు వచ్చారు. కాని నాలుగు వైపుల నుంచి దూసుకువచ్చిన కరవాలాలు ఈయన్ని అంత మొందించాయి. ఇస్లామ్ మార్గంలో తొలి షహాదత్ (అమరగతి) పొందినవారు వీరే. దైవానుగ్రహం వల్ల అప్పుడు మహాప్రవక్త (స) సురక్షితంగా ఉన్నారు. ఆ తరువాత ఎలాగో ఆ కల్లోలం అణగారిపోయింది.

## వ్యతిరేకతకు కారణాలు

ఇస్లామీయ సందేశ ప్రకటన అందరికంటే అధికంగా ఖురైష్ వారికే కలవరకారణ మయింది. అందువల్లనే వారు దీన్ని అందరికంటే అధికంగా వ్యతిరేకించారు. ఆ కాలంలో మక్కా నగరానికి ఉన్న గౌరవాదరణలు అసలు 'కాబా' మూలంగానే లభించాయి. ఖురైష్ వంశంలోని వారు కాబా మఠాధిపతులుగా వ్యవహరించేవారు. ఈ కారణంవల్ల ఖురైష్‌కు ఒక విధమైన మతాధిక్యత అరేబియా మొత్తాన ప్రాప్తమయింది. మత సంబంధమైన విషయాల్లో ప్రజలు వాళ్ళ వైపునకే చూసేవారు. ఖురైష్ ఏ మతాన్నైతే సమర్థించి ప్రాతినిధ్యం వహిస్తున్నారో ఆ మతం మీదే ఇస్లామీయ సందేశపు తొలి దెబ్బ పడుతుంది. అయితే పూర్వుల మతం పట్ల మూఢ జాతులకు వుండే అంధ విశ్వాసం మూలంగా దానికి భిన్నమయిన విషయాన్ని, అది ఎంత సమంజసమయినదైనా వారు వినడానికి సిద్ధంకారు. ఈ కారణంగానే జనులు ఈ కొత్త సందేశాన్ని విని అగ్ని జ్వాలల్లా మండిపోయేవారు. అంతేకాక ఖురైష్ "అధిష్ఠాన వర్గం" మరొక విషయాన్ని గమనించింది. ఈ కొత్త సందేశం వృద్ధివికాసాలు పొందితే వారి

ఆధిపత్యమంతా మంటగలసిపోతుంది. వాళ్ళకున్న మతాధిక్యత దానంతట అదే సమసిపోతుంది. కొట్ట వచ్చినట్లు కానవచ్చే ఈ అపాయాన్ని వారు తోసిపుచ్చలేక పొయ్యారు. అందుచేతనే సమాజంలో ఎవరు ఎంత గొప్ప స్థానం, హోదా పొంది వుంటే అంత ఘాటుగా వారు ఇస్లామీయ ఉద్యమాన్ని వ్యతిరేకించడంలో నిమగ్నులయ్యారు. అదీకాక కురైషుల్లో అసంఖ్యాకమయిన దుర్గుణాలు, దురలవాట్లు ప్రబలివున్నాయి. పెద్ద మనుషులనబడే వారే వీటిలో తలమునకలై వున్నారు. ఇలా ఉన్నప్పటికీ వారి కున్న మతాధిపత్యం వారి అంతస్తును జనసామాన్యం దృష్టిలో దిగజార నివ్వలేదు. ఎందువల్లనంటే జనులు వాళ్ళ ఎడల తమకు వున్న పవిత్ర భావాలు, గౌరవ మర్యాదల మూలంగా వాళ్ళ బలహీనతలపైకి దృష్టినే పోనివ్వరు.

మహాప్రవక్త (స) ఒకవైపు విగ్రహాలను, బహుదైవవాదాన్ని ఖండించేవారు; స్వచ్ఛమైన ఏకేశ్వరోపాసన వైపునకు ప్రజల్ని ఆహ్వానించేవారు; పరలోక పరీక్షను గుర్తుచేసేవారు; దేవుని దగ్గర హాజరవడం గురించి భీతిగొలిపేవారు; మరొకవైపున మానవుల్లోని నైతిక రుగ్మతల్ని ఒక్కొక్క దాన్నే విడమర్చి వేలెత్తి చూపించేవారు; వాటి చెడు పరిణామం గురించి హెచ్చరించేవారు; వాటికి దూరంగా మసలుకోవాలని ఉపదేశించేవారు. ఈ విషయాలు పెద్ద మనుషులు అనబడే వారిని ఎంతో కలవరపెట్టేవి. మహాప్రవక్త చెప్పే ఆ విషయాలన్నింటినీ వారు మంచివే అని సమర్థించడమయితే యెలాగూ సాధ్యపడదు. కాని వాళ్ళే స్వయంగా ఆ కీడుల్లో ఆ కుళ్ళులో మునిగి తేలుతూ ఉన్నందువల్ల వాటిని త్యజించే సాహసం వారికి చాలక పోవడం వల్ల ప్రజల ముందు ఈ విషయాలు బట్టబయ లవుతూ వుంటే ప్రజల దృష్టిలో తమ విలువ పడిపోతున్నట్టు ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగా తమ గురించి జనులు వేలెత్తి చూపగలుగుతున్నట్టూ వారికి అనుభూతి కలగసాగింది. వారి కోపాన్ని రెండింతలు చెయ్యడానికి ఈ ఒక్క విషయమే చాలు. దివ్య ఖుర్‌ఆన్‌లో ఇలాంటి దుష్టులు, దుర్మార్గులను గురించి ఆయత్‌లు అవతరిస్తూనే వున్నాయి. వాళ్ళ చేష్టలకు అత్యంత కఠినమయిన యాతన ఎదురు చూస్తోందని హెచ్చరికలు చెయ్యబడుతూనే వున్నాయి. ఈ ఆయత్‌లలో సర్వసామాన్య ధోరణిలోనే ఒకరినంటూ వేలెత్తి చూపకుండా ఈ ప్రస్తావన జరుగుతూ ఉంది. అయినా ఆయత్‌లు జనుల్లో వ్యాప్తి పొందిన కొద్దీ వాటిని విన్న ప్రతి వ్యక్తీ నీరు ఏ డొంకలోకి పోయిపడుతుందో ఇట్టే పసిగట్టగలుగుతున్నాడు.

ఇస్లామీయ ఉద్యమాన్ని వ్యతిరేకించడానికి, దానిపట్ల శత్రుత్వం వహించడానికి ఈ కారణాలు ఎంతో బలమైనవే. సాధ్యపడితే ఈ 'అధిష్టాన వర్గం' వారు ఇస్లామీయ సంఘంలోని కొద్దిమంది సభ్యుల్ని అంతమొందించడానికి కరవాలాలు చేపట్టి నిలబడేవారే; ఇలా ఈ 'అపాయాన్ని' ఒక్కసారిగా తుదముట్టించగలిగే వారే; కాని దైవ నిర్ణయమే వేరు. సర్వకాలాల్లో మానవ మోక్షానికి అల్లాహ్ అనుగ్రహాన్ని లోకాన్నంతటికీ అందజెయ్య డానికి ఏకైక మార్గమైన కార్యం ఈ కొద్ది మంది వ్యక్తుల ద్వారానే పూర్తవ్వాలని నిర్ణయమయిపోయింది. అప్పుడు కురైష్ ప్రజలు ఈ చర్యకి పాల్పడక పోవడానికి కొన్ని కారణాలున్నాయి.



## విరోధులకు అవరోధాలు

కొంతకాలం క్రితమే కురైష్ ప్రజలు అంతర్యుద్ధాల వల్ల దాదాపు సర్వనాశనమయి పొయ్యారు. 'ఫుజ్జార్' పోరాటానికి పిమ్మట ఏదయినా పోరాటం అంటేనే అందోళన పడసాగారు ప్రజలు; జగడాలపట్ల విసుగు, అసహ్యం ఏర్పడ్డాయి. అదీకాక ఇస్లామీయ సంఘంలో చేరిన విశ్వాసులు వివిధ తెగలకు చెందినవారు. వారిని హతమార్చడమంటే అరబ్బులోని విభిన్న తెగలతో కయ్యానికి కాలు దువ్వడమన్నమాట. ఆ కాలంలో ఒక తెగలోని ఏ ఒక్క వ్యక్తిని చంపినా ఆ తెగతో యుద్ధానికి దిగినట్టే భావించేవారు. అందువల్ల మక్కా మొత్తం రణరంగంగా మారిపోతుందేమో అన్న భయమూ కలగసాగింది. కనుకనే ఆ దశలో ఉద్యమాన్ని అణచటానికి అన్యమార్గాలే అవలంబించవలసి వచ్చింది.

సందేశాన్ని, సందేశదాతను పరిహాసాల పాలుచేశారు. అభాండాలు మోపారు. వీధుల్లో, దారుల్లో, దుర్భాషలతో, ఎత్తిపొడుపులతో సత్కరించారు. అనుదినం సరికొత్త విధంగా అనరాని మాటలు అంటూ అబద్ధాలను అంటగట్టి మిథ్యాప్రచారం సాగించారు. ముహమ్మద్ పిచ్చివాడని, మతి చలించిన వాడనీ బిరుదులు ప్రదానం చేశారు. ఊహా గానాలు చేసే కవి అని, మాంత్రికుడనీ ప్రచారం చేశారు. మహాప్రవక్త (స) బోధలు వినకుండా ప్రజలకు అడ్డు రావడం మొదలెట్టారు.

## నిదానమే ప్రధానం

ఆ కాలంలో అవతరించిన దివ్య ఖుర్‌ఆన్ సూరాలలో ఈ పరిస్థితుల్ని ధైర్యంతో ఎదుర్కొనేందుకు ఆదేశాలు అనర్గళంగా వస్తున్నాయి. వ్యతిరేకుల అక్షేపణలకు అభ్యంతరాలకు సమంజసమైన సముచితమైన సమాధానాలు వెలువడుతున్నాయి. ఉదాహరణకు 'అల్ కలమ్' సూరాలో మహాప్రవక్త (స)ను ఓదార్చడానికి ఇలా సెలవీయటం జరిగింది:

"మీపై దేవునికయితే అనంతమయిన ప్రేమాభిమానాలు ఉన్నాయి. మీరు మతి చలించిన వారు ఎంతమాత్రం కారు. 'ఆయన' అంతులేని అనుగ్రహాలు మీపై ఉన్నాయి. మతి చలించినవారు ఎవరో అనతికాలంలోనే అందరికీ తెలిసిపోతుంది. ఎవరు సక్రమమయిన మార్గంలో ఉన్నారో, మార్గవిహీనులయిన వారెవరో మీ ప్రభువుకు బాగా తెలుసు. మీ కర్తవ్యాన్ని మీరు నెరవేర్చండి. ఈ సందేశాన్ని తృణీకరించేవారి మాటను ఎన్నటికీ వినకండి. దాన్ని ఖాతరు చెయ్యకండి. మీరు మీ సందేశాన్ని ఉద్యమకార్యాన్ని కాస్త సడలించారంటే వారున్నూ కాస్త నెమ్మదిగా కూర్చోవాలని చూస్తున్నారు. కాని వారి మనోవాంఛల్ని అనుసరించడం మీకు వాంఛనీయం కాదు. మీరు సమర్పించే దాన్ని తిరస్కరిస్తున్న వారి విషయాన్ని నాకు వదలి వెయ్యండి. వారిని ప్రస్తుతానికి వదలివేస్తున్న దానికి భావమేమిటో అతి త్వరలోనే వారికి తెలిసిపోతుంది. వారిని మీరు ఇలా అడగండి, 'నేను మిమ్మల్ని ఏదైనా అర్థిస్తున్నానా? లేదా, నా స్వార్థం కోసం మీ నుండి ఏదయినా

కాంక్షిస్తున్నానా? లేదా, నా మాటకు విరుద్ధంగా మీరు వ్యవహరించడానికి మీ వద్ద ఏదయినా సమంజసమయిన ఆధారం ఉందా?' ఇలాంటిదేదీ లేదని తెలుస్తూనే ఉంది. గనుక, మీరు కదునిలకడగా, సహనంగా మీ కార్యాన్ని నిర్వర్తిస్తూ ఉండండి. మీరున్నూ, మీ సహచరులున్నూ అత్యంత సహనంతో పరిస్థితుల్ని ఎదుర్కొనండి. పరిస్థితులు, సమయం వచ్చినపుడు అవే మారుతాయి."

ఈ ఉపన్యాసం మచ్చుకు ఇక్కడ పేర్కొన్నాము. ఇలాంటి ఉపన్యాసాలే ఒకదాని వెనుక మరొకటి వరుసగా అవతరించాయి. వీటిద్వారా సందేశాన్ని విడమర్చి తెలుపడంతో పాటు సందేశదాత మతిచలించిన వ్యక్తి కాదని, కవి, జ్యోతిష్కుడు, మాంత్రికుడు కూడా కాదని తేటతెల్లమైంది. కవుల, జ్యోతిష్కుల, మాంత్రికుల, గుణగణాలను కాస్త గమనించాలని, ఈ సందేశ దాతలో ఆ లక్షణాలు ఏవైనా అగుపిస్తున్నాయేమో చూడమని, ఆయన సమర్పించే దివ్యవాణి, ఆయన చేసే ప్రతి కార్యంలో తొణికిసలాడే నైతికత, మీ మధ్య ఆయన గడిపే పరిశుద్ధ జీవితం వీటికీ, కవుల, జ్యోతిష్కుల, మాంత్రికుల మాటలకీ చేష్టలకీ ఏదయినా పొంతన ఉందేమో పరిశీలించమనీ మరీ మరీ జనులను హెచ్చ రించటం జరిగింది.

## సందేశం వైపు ఆకర్షణ

పైన చెప్పినట్లు తప్పుడు ప్రచారాలు చేసి జనుల్ని అడ్డగించే ప్రయత్నాలు మక్కా వాసులు ఎంతగా చేశారో అంతగా సందేశం గురించి తెలుసుకోవాలనే ఉత్సుకత, అభిలాష ప్రజల్లో జనించసాగింది. "ఈయనగారు చెప్పేదేమిటో కాస్త విననైనా విందాం" అన్న కోరిక ప్రబలసాగింది. కనుక హజ్ కాలంలోను ఇతర సమయాల్లోను అరేబియాలోని దూర దేశాల నుంచి వచ్చే జనులు అనేకులు ఎవరికంటా బడకుండా మహాప్రవక్తను సందర్శించే వారు. ఆయనలోని ఉదాత్తతను, ఉన్నత గుణగణాల్ని చూడగానే దైవవాణి లోని సద్వచనాలను వినగానే వారి మనోజగత్తే మారిపోయ్యేది. వారు తమ దేశాలకు తిరిగి వెళ్ళి ఇస్లామ్ ప్రచారకులుగా మారిపొయ్యేవారు.

ఇలా ఈ ప్రస్తావన ఇతర నగరాలకు వ్యాపించగానే కేవలం ఆయన గురించి ఇంకా వివరాలు తెలుసుకునే అభిలాషతో అనేకమంది ప్రజలు దూర దూర ప్రదేశాల నుండి రాసాగారు. ఇలా వచ్చిన వారిలో హజ్రత్ అబూజర్ గిఫారి (రజి అల్లాహు అన్హు) గారి వృత్తాంతం మంచి ఉదాహరణ. గిఫార్ తెగ నివసించే ప్రదేశం గుండానే కురైష్ ప్రజలు సిరియా దేశానికి వర్తకం కోసం వెళ్ళేవారు. అక్కడ కూడా ఈ సందేశం ప్రాకిపోగా హజ్రత్ అబూజర్‌గారి అంతర్యంలోను మహాప్రవక్త (స) దర్శనం పొందే కోరిక అంకురించింది. ఆయన తన సోదరుడైన అనీస్‌ని దైవదౌత్య ప్రకటన చేస్తున్న వ్యక్తి బోధించేది,



ఉపదేశించేదేమిటో తెలుసుకురమ్మని మక్కాకు పంపారు. అనీస్ మక్కాకు వచ్చి మహాప్రవక్త (స)ను గురించి విచారించి సమాచారం సేకరించుకుని తిరిగి వెళ్ళారు. తన సోదరునితో, "ఆ వ్యక్తి ఎంతో సద్గుణ సంపన్నుడు; నీతిని, నిజాయితీని, సద్వర్తనను బోధిస్తాడు; ఒకే దేవుని ఆరాధనకై జనుల్ని ఆహ్వానిస్తాడు; ఆయన సమర్పించే వాణి కవిత్వం మాత్రం కాదు; అవన్నీ వేరే ప్రవచనాలు" అని చెప్పారు.

హజ్రత్ అబూజర్‌కు ఈ మాటలతో తృప్తి కలగలేదు. స్వయంగా ప్రయాణానికి సిద్ధమయ్యారు. మక్కాలో అడుగుపెట్టగానే అక్కడి వాతావరణం భీతి గొలిపింది. భయంవల్ల ఎవరితోనూ మహాప్రవక్త పేరునయినా ప్రస్తావించలేకపొయ్యారు. కాబాలో హజ్రత్ అలీ తటస్థపడ్డారు. మూడు రోజులు ఆయన ఇంట అతిథిగా ఉన్నారు. ఆ తరువాత గాని ఆయనతో తన ప్రయాణానికి కారణం తెలిపే ధైర్యం కలగలేదు. అప్పుడు హజ్రత్ అలీ ఆయన్ని మహాప్రవక్త సన్నిధిలోకి తీసుకువెళ్ళారు. అక్కడ చేరిన తరువాత హజ్రత్ అబూజర్ ఇస్లామ్ స్వీకరించారు. ఆయన్ని తిరిగి వెళ్ళి తన తెగవారిలో ఇస్లామ్ ప్రచారం చెయ్యాలని, తెగవారిని ఇస్లామ్ వైపునకు ఆహ్వానించాలనీ ఆదేశించారు మహాప్రవక్త. కాని ఆయన అక్కణ్ణుంచి బయల్దేరి నేరుగా హరమ్ (కాబా గృహం) లోనికి వెళ్ళి: "అష్‌హదు అన్‌ల్లా ఇలాహ ఇల్లల్లాహు వ అష్‌హదు అన్న ముహమ్మదర్ రసూలుల్లాహ్" (అల్లాహ్ తప్ప మరే ఇతర ఆరాధ్యుడు లేడని నేను సాక్ష్యమిస్తున్నాను, ముహమ్మద్ (స) దైవసందేశహరుడని కూడా సాక్ష్యమిస్తున్నాను) అని తన విశ్వాసాన్ని ప్రకటించారు. ఇది వినగానే జనులు నలువైపుల నుంచి ఎగబడి ఆయన్ని కొట్టసాగారు. ఆ సమయానికే అక్కడికి హజ్రత్ అబ్బాస్ విచ్చేయడం వల్ల మేలు జరిగింది. ఆ కొట్టేవారితో ఆయన, "ఈ వ్యక్తి గిఫార్ తెగకు చెందినవారు. మీ వాణిజ్యమార్గం వాళ్ళ తెగ ఆవాసాలమీదుగా పోతుంది, వాళ్ళు ఒకవేళ మీ మార్గాన్ని అరికట్టినట్లయితే ఏం చేసుకుంటారు?" అని అన్నారు. ఇది వినగానే కురైష్‌లు అబూజర్‌ని వదిలివేశారు.

హజ్రత్ అబూజర్ తన తెగవారిలోకి వెళ్ళి ఇస్లామ్ సందేశాన్ని వినిపించారు. దాదాపు తెగలోని సగం మంది అప్పటికప్పుడే ముస్లిమ్‌లయిపొయ్యారు. గిఫార్‌కు సమీపం లోనే "అస్లమ్" తెగ నివసిస్తూ ఉండేది. గిఫార్ ప్రభావం వల్ల వాళ్ళు కూడా ఇస్లామ్ స్వీకరించారు. ఈ విధంగా ఇస్లామ్ సందేశం విస్తరించసాగింది.

ఈ విషయం వ్యతిరేకుల్ని భరింపరాని బాధకు, తీవ్రమయిన వ్యధకు గురి చేసింది. ఇక గత్యంతరం లేక కొందరు అబూతాలిబ్ గారి వద్దకు ఫిర్యాదు తీసుకెళ్ళారు. ఈ ప్రతినిధి వర్గంలో కురైష్ అధినేతలు అందరూ ఉన్నారు. వారు అబూతాలిబ్‌కు ఇలా చెప్పారు: "మీ అబ్బాయి మా దేవతలను అవమానపరుస్తున్నాడు, మా తాత ముత్తాతలను మార్గభ్రష్టులని నిందిస్తున్నాడు; మమ్మల్ని అందరినీ దుష్టులనీ, అవివేకులనీ అంటాడు. కనుక ఈ సమస్యను పరిష్కరించడానికి మీరయినా మధ్య నుంచి తొలగిపోవాలి లేదా అతనికయినా నచ్చజెప్పాలి." అబూతాలిబ్ ఇక పరిస్థితులు విషమించాయని, తానొక్కడే కురైష్‌లందరినీ ఎదిరించడం

ఇక సాధ్యపడదనీ భావించారు. మహాప్రవక్తను పిలిపించి, "అబ్బాయ్, నేను మోయ శక్యం కాని భారాన్ని నాపైన వెయ్యకు నాయనా" అని చెప్పారు. అబూతాలిబ్ అడుగులు కూడా తడబడుతున్నాయని గ్రహించారు మహాప్రవక్త. అయితే అమితమయిన తృప్తితో నిదానంగా ఇలా సమాధాన మిచ్చారు. "బాబాయి, దేవుని సాక్షిగా చెబుతున్నాను. మీరు నా చేతుల్లో ఒక దానిలో సూర్యుణ్ణి మరొక దానిలో చంద్రుణ్ణి తెచ్చి పెట్టినా నేను నా బాధ్యతను నెరవేర్చడం మానుకోను. దైవమే ఈ సత్కార్యాన్ని పరిపూర్ణం కావించాలి, లేదా నేనైనా స్వయంగా ఈ కార్యసిద్ధికై కృషి చేస్తూ అంతమైపోవాలి, అంతే' మహాప్రవక్త (స) దృఢసంకల్పాన్ని, సాహసవంతమయిన నిర్ణయాన్ని విన్న తరువాత అబూతాలిబ్‌కు కూడా ధైర్యం కలిగింది. "సరే కానియ్, ఎవరూ నీకు అణుమాత్రమయినా హాని చెయ్యలేరు" అని అభయమిచ్చారు.

## విరోధుల పాచికలు

కురైష్ ప్రజలు ఈ విధంగానూ తమ లక్ష్యాన్ని సాధించలేక నిరాశ చెంది చివరికి ఒక నిర్ణయానికి వచ్చారు. బలవంతంగా మహాప్రవక్త (స)ను లొంగదీయలేక పోయాము కాబట్టి, ఇక యుక్తితో ఈ ఉద్యమాన్ని అంతమొందించాలని నిర్ణయించుకున్నారు. 'ఉతబా బిన్ రబీయా'ని ఆయన సన్నిధికి పంపారు. అతను వచ్చి ఇలా అన్నాడు.

"ముహమ్మద్! అసలు నీకేమి కావాలో సరిగ్గా చెప్పు. మక్కా అధిపత్యం కావాలా? ఏదయినా గొప్ప వంశంలో పెళ్ళి చేసుకోవాలని ఉందా లేదా ఐశ్వర్యాలు కావాలా? నీవు ఏది కోరినా మేము దాన్ని తెచ్చి నీకివ్వగలం. అంత మాత్రానికి ఈ ఝంఝాటమంతా దేనికి? రేపే మక్కాను నీ అధీనం చెయ్యటానికి మేము సమ్మతిస్తున్నాము. లేదా నీవు మరేదయినా కోరుకుంటే అలాగే కానివ్వు. కాని నువ్వు ఈ సందేశాన్ని మాత్రం విరమించు కోవాలి."

వ్యతిరేకులు అంతకంటే అధికంగా ఆలోచించలేరు పాపం. ఎవరయినా ఒక సందేశం ప్రచారం చెయ్యడానికి, ఏదయినా ఉద్యమం నడపడానికి పూనుకుంటే, దాని వెనక ఏదో భౌతిక స్వార్థం దాగి ఉండకపోవడమనేది వాళ్ళకు మింగుడుపడని మాట. కేవలం దైవ ప్రసన్నత కొరకు, ఆయన విధేయతను పాటించడానికి మాత్రమే ఏ పనయినా చెయ్యటం సాధ్యమనే మాట వాళ్ళ ఊహకందని విషయం. మనిషి ధనప్రాణాలు త్యాగం చెయ్యడానికి సిద్ధమయ్యాడంటే, కేవలం అధికారం, ఐశ్వర్యాల సముపార్జనకే అలా చెయ్యడం సాధ్యమన్నదే వారి అవగాహన. పరలోకంలోని చిరజీవితంలో సాఫల్యం సాధించటానికి కూడా ఈ త్యాగాలకు జనులు సిద్ధమవుతారనీ వాళ్ళకెలా తెలుస్తుంది? అందుకే ఉతబాకు తన విన్నపం మన్నన పొందుతుందని గట్టి నమ్మకం ఉండింది. కాని మహాప్రవక్త దానికి సమాధానంగా పవిత్ర ఖుర్‌ఆన్‌లోని కొన్ని సద్వచనాలు పఠించారు. వాటిలో ఏకేశ్వర భావాన్ని, మహాప్రవక్త దైవ దౌత్యానికి సంబంధించిన విషయాలను సూచించడం జరిగింది.



ఉతబా దివ్య ఖుర్‌ఆన్ వచనాలు విని ఎంతో ప్రభావితుడయ్యాడు; వెనక్కి మరలి వెళ్ళాడు. అక్కడ ఖురైష్ నాయకులకు తన నివేదికను వినిపిస్తూ " ముహమ్మద్ సమర్పించే వాణి కవిత్వం మాత్రం కాదు, అది ఏదో క్రొత్త ప్రక్రియ, నా సలహా ఏమంటే ఆయన్ని అలా పరిస్థితులకు వదిలి వెయ్యండి. తన ధ్యేయంలో ఆయన నెగ్గితే మొత్తం అరేబియాను వశపరచుకుంటారు. అందులో మీ గౌరవమూ ఇమిడి ఉంది. అలా చెయ్యలేకపోతే అరబ్బులు స్వయంగానే ఆయన్ని తుదముట్టిస్తారు" అని సలహా ఇచ్చారు. అయితే ఈ సలహాను ఎవరూ అంగీకరించలేదు.

ఇక మిగిలింది ఒకే మార్గం. ఈ మార్గాన్నే మిథ్యా శక్తులన్నీ సత్యానికి విరుద్ధంగా నిత్యం అవలంబిస్తూ వచ్చాయి. అంటే శక్తినంతటినీ వినియోగించి హింసాకాండ ద్వారా సత్యాన్ని అణచే ప్రయత్నం చెయ్యడం. కురైషీలు ఇప్పుడు ఆ మార్గాన్ని అవలంబించాలన్న నిర్ణయానికే వచ్చారు. ముస్లిములపై తీవ్రమైన ఒత్తిడి తెచ్చి, వారు తమ నిర్ణయాన్ని మార్చుకునేలా చెయ్యాలని, ఎవరికి ఎక్కడ ఎంత అవకాశం లభించినా దాన్ని వినియో గించుకుని, ముస్లిములను బాధపెట్టాలని, హింసించాలని తీర్మానించుకున్నారు.

# మూడవ దశ

## పరీక్షా సమయం

ఇంతవరకు ఇస్లామీయ ఉద్యమంలో మూడు విధాలుగా పరిణామ ప్రగతులు వెల్లడిఅయ్యాయి.

1. కొందరు సజ్జనులు ఈ సందేశాన్ని స్వీకరించారు. వారు ఏ పరిస్థితుల్లోనయినా సంఘటితంగా ఉద్యమాన్ని ప్రగతి మార్గాన నడపాలనే నిర్ణయించుకున్నారు.
2. చాలా మంది తమ మూర్ఖత్వంవల్లగాని, స్వార్థం వల్లగాని, లేదా తమ పూర్వీకుల మతం పట్ల ఉన్న అంధవిశ్వాసం చేత గాని ఈ ఉద్యమాన్ని వ్యతిరేకించడానికే ఒడిగట్టారు.
3. మక్కా నగరాన్ని, కురైష్ తెగ పొలిమేరలను దాటి ఈ నవ సందేశం ఇంకా విస్తారంగా పరివ్యాప్తి కాసాగింది.

ఇక ఆ తరువాత ఈ కొత్త ఉద్యమం, పాత మూఢత్వాల మధ్య తీవ్రమైన సంఘర్షణ ప్రారంభమయింది. తమ పూర్వపు మతాన్ని అంటి పెట్టుకుని ఉండదలచుకున్న వారు శక్తినంతటినీ వినియోగించి ఇస్లామీయ ఉద్యమాన్ని రూపుమాపాలని కంకణబద్ధు లయ్యారు. ఇస్లామ్ స్వీకరించే వారిపైన ఘోరమైన హింసలు, దౌర్జన్యాలు చేశారు; క్రూరంగా బాధలు పెట్టారు. ఏ విధంగానయినా వారిని లొంగదీసుకోవాలనే పూను కున్నారు. ఈ దశలో

కురైష్ ప్రజలు ముస్లిమ్‌లపై జరిపిన ప్రాణ విదారకమైన హింసాకాండ సంఘటనల నిరుపమానమయిన ఉల్లేఖనాలు శాశ్వతంగా నిలిచిపోయాయి.

అరేబియాలాంటి ఉష్ణ ప్రదేశంలో, మధ్యాహ్నపు మండుటెండల్లో మలమల మాడే ఇసుకపై ముస్లిములను పడవెయ్యడం, వాళ్ళ రొమ్ములపై బరువయిన గుండ్లను ఉంచి కదలకుండా చెయ్యడం, ఇనుప ఊచల్ని కాల్చి దేహంపై వాతలు పెట్టడం, నీళ్ళల్లో మునకలు వేయించడం, నిర్దయగా, క్రూరంగా చేతులతో, కర్రలతో కొట్టడం ఇలా అనేక విధాలుగా ముస్లింలను హింసించసాగారు. ముస్లిములందరి జీవితాలు దుస్సహం చేసివేశారు మక్కా ఖురైషీలు. అలాంటి గాథలన్నీ చరిత్రకెక్కలేదు. అయితే చరిత్ర గ్రంథాల్లోకి దారిచేసుకున్న గాథల్లో కొన్నింటిని ఇక్కడ మచ్చుకు ఉల్లేఖిస్తున్నాము.

హజ్రత్ ఖబ్బాబ్ (రజి అల్లాహు అన్‌హు) 'ఉమ్మే ఇన్మార్'కు బానిస. అప్పటికి ఇంకా ఆరేడుగురు మాత్రమే ఇస్లామ్ స్వీకరించారు. ఈయన కూడా ఇస్లామ్‌ను అశ్రయించిన ధీరుల్లో ఒకరు. ఈ 'అపరాధం' మూలంగానే కురైషీల హింసాకాండకు గురిఅయ్యారు. కురైష్ ప్రజలు ఒకరోజు బొగ్గులు మండించి ఈయన్ని కణకణమండే ఎర్రటి నిప్పు కణికలపైన వెల్లకిలా పడవేశారు. పైనుంచి మరోవ్యక్తి కాలితో కదలకుండా అదిమిపట్టాడు. చివరికి మండే బొగ్గు కూడా వీపు కిందే చల్లారి పోయింది. ఈ సంఘటన జరిగిన ఎన్నో ఏండ్లకు 'హజ్రత్ ఖబ్బాబ్' కాలిన తన వీపును చూపిస్తే వీపుపై "బొల్లి"ని పోలిన తెల్లటి మచ్చలు అగుపించాయి.

హజ్రత్ బిలాల్ (ర) ఆ రోజుల్లో ఉమయ్యా బిన్ ఖలఫ్‌కు బానిస. సరిగ్గా మధ్యాహ్నం వేళ ఈయన్ని ఉమయ్యా మండే ఎడారి ఇసుకపై పడవేసి బరువైన బండను రొమ్ముపై పెట్టాడు. ఇస్లామ్‌ను త్యజించమనీ లేకపోతే ఇలాగే చావవలసి ఉంటుందని చెప్పాడు. కాని అంతులేని బాధకు గురయినప్పటికీ "అహద్, అహద్" (దేవుడు ఒక్కడే, ఒక్కడే) అనే మాటను స్మరించడం మాత్రం బిలాల్ వదలలేదు. ఇక లాభం లేదని, యజమాని ఆయన మెడలో ఒక తాడు [illegible] పిల్లల చేతికి ఇచ్చాడు. వాళ్ళు ఆయన్ని నగరంలో ఒక చివరి నుంచి మరొక చివరి వరకు ఈడ్చుకుంటూ తిరిగారు.

హజ్రత్ అమ్మార్ (ర) ఎమన్ వాస్తవ్యులు. ప్రప్రథమంగా ముస్లిములైన సాహస వంతుల్లో ఒకరు. ఈయన ఇస్లామ్ స్వీకరించిన తొలి రోజుల్లో కురైష్ ప్రజలు ఈయన్ని మండే ఇసుకపై వేసి స్పృహ తప్పే వరకు నిర్దయగా కొట్టేవారు.

హజ్రత్ లుబ్నియా (ర) కూడా బానిసే, హజ్రత్ ఉమర్ ముస్లిమ్ అయ్యే ముందు ఈమెను కొట్టి కొట్టి తానే అలసిపొయ్యేవారు. కాని ఈమె మాత్రం మాటి మాటికీ ఒకే హెచ్చరిక చేస్తూ ఉండేవారు: "నీవు ఇస్లామ్‌ను స్వీకరించకపోతే దేవుడు దీని ప్రతీకారం తీర్చుకుంటాడు, జాగ్రత్త" అని.



హజ్రత్ జుబైరా (ర) కూడా హజ్రత్ ఉమర్ కుటుంబంలోని బానిసే. ఒకసారి అబూజహల్ ఈమెను అతికఠినంగా కొట్టాడు. ఫలితంగా ఈమె కంటిచూపు కోల్పోయారు.

ఇలాంటి వృత్తాంతాలవల్ల బలహీనులూ, నిస్సహాయులూ అయిన అనేకమంది ముస్లిమ్ స్త్రీ పురుషులను రకరకాలుగా పీడించేవారని తెలుస్తుంది. అయితే, నిరపరాధు లయిన ముస్లిములపై ఇంతటి అఘాయిత్యాలు జరుగుతున్నప్పటికీ వారు ఓర్పుతో వాటిని సహించడం మూలాన ఇస్లామ్ పట్ల ఆకర్షణ అధికమయింది. ఈ పరిస్థితులు సహజంగానే ప్రజల్ని కాస్త నిలబడి యోచించేందుకు పురికొలిపేవి. ముస్లిములవుతున్న వారు ఏ లాలూచీవల్ల, ఏ ఆశలకు లోనయి ఇన్ని కష్టాలను భరించి, ఇలా ఇస్లామ్‌ను వదలకుండా అంటిపెట్టుకుని ఉండేందుకు సిద్ధమవు తున్నారు? వారికి ఈ మనో స్థయిర్యాన్ని ఇచ్చే ఆ శక్తి ఏది? అన్న ప్రశ్న వారి అంతర్యాల్ని వేధించసాగింది. ఇస్లామ్ స్వీకరించిన ఈ వ్యక్తులందరు తమ స్వభావ స్వరూపాల్లో తమ ప్రవర్తనల్లో, తమ దైనందిన వ్యవహారాల్లో ఇంకా ఇతర మానవీయ సంబంధాల్లో అందరినీ మించిన శీలవంతులే; అయినా వీరి అపరాధం కూడా ఒకటుంది: మేము సకల లోకాల ప్రభువైన అల్లాహ్ ఒక్కడిని తప్ప మరెవ్వరినీ 'రబ్' (ప్రభువు, స్వామి, ఆరాధ్యుడు)గా నమ్మము, ఆయనకే విధేయులమై ఉంటాము, ఆయన ఆజ్ఞల్నే పాలిస్తాము.★ అని వీరు అంటున్నారు. పీడితులయిన ముస్లిముల సహనాన్ని నిలకడను చాలామంది అర్థం చేసుకోలేకపోయారు. అదొక ప్రశ్నలా

---

*★ స్థూలంగా పరిశీలిస్తే ఈ విషయం మనకు ఎంతో తేలికయినదిగా అగుపిస్తుంది; కేవలం ఇంతటి మాటకే మనుషుల్ని ఇంత కఠినంగా పీడించడం వింతగా తోస్తుంది. అసలు విషయమేమంటే 'రబ్' అనే అరబ్బీ పదానికి సమగ్రమైన అర్థం మన దృష్టిలో లేదు. 'ఇబాదత్' (ఆరాధన అజ్ఞాపాలన) పరిధి ఎంత విస్తృతమయిందో కూడా మనం గమనించటం లేదు. కానీ వాళ్ళకయితే తమ భాషలో ఈ రెండు పదాలకు ఎంత విస్తృతమైన అర్థం ఉందో బాగా తెలుసు. కనుక కేవలం అల్లాహ్ ఒక్కడే మా 'రబ్' అని వాళ్ళంటే, పలికేవారు, వినేవారు, ఉభయులూ దాని భావమేమిటో బాగా అర్థం చేసుకోగలిగారు. పర్యవసానంగా ఉభయులూ తమ వైఖరిని నిర్దిష్టంగా నిర్ణయించుకున్నారు. దానికి ఈ అర్థాలు వస్తాయి.*

1. *అల్లాహ్ తప్ప మరే పోషకుడూ, దాత లేడు; అలాంటప్పుడు మానవుడు అయనకే కృతజ్ఞుడై ఉండాలి, ఆయన్నే అర్థించాలి. ప్రేమాభిమానాలతో, పవిత్రతా భావంతో, విశ్వాసంతో ఆయన ముందే తలవంచాలి, మోకరిల్లాలి. ఆయన తప్ప మరొకరు పూజా పురస్కారాలకు అర్హులు కారు, కాజాలరు.*

2. *మానవులకు అల్లాహ్ తప్ప మరెవ్వరూ స్వామి, యజమాని కాదు, మానవులంతా ఆయనకే దాసులుగా, విధేయులుగా మెలగాలి. మానవుడు తోటి మానవుల సమక్షంలో మాత్రమే స్వేచ్ఛాజీవి, ఎవరికీ దాసుడు కాడు; కాని దైవం ఎదుట తాను సర్వాధికారిననీ, సర్వ స్వతంత్రుడననీ మనిషి భావించకూడదు; అలాగే ఇతరుల్ని సయితం సర్వాధికారులనీ,*

మిగిలిపోయింది. అందువల్ల వారి హృదయాల్లో వీరిపట్ల సానుభూతి జనించేది. వారు ఈ కొత్త ఉద్యమాన్ని సమీపాన్నుండి చూడటానికి, అర్థం చేసుకోటానికి ముందుకు వచ్చేవారు. సత్యవాదులపైన జరిగే అత్యాచారాలు, అఘాయిత్యాలు నిత్యం సత్య విజయానికే సోపానమయ్యాయి. అందువల్లనే అప్పుడు ఒకవైపు హింసాకాండ సాగుతూనే ఉంది. మరోవైపు ఇస్లామీయ ఉద్యమం రోజుకు రోజు విస్తరిస్తూనే ఉంది. మక్కాలో ఒక వ్యక్తి అయినా ఇస్లామ్ స్వీకరించని ఇల్లు ఒక్కటీ మిగలలేదు. ఈ కారణంగానే ఇస్లామ్ వ్యతిరేకులు ఇంకా అధికంగా క్రోధానికి, చీకాకుకు, బిత్తరపాటుకు లోనయ్యారు. స్వయంగా తమ కళ్ళ ఎదుటే ఆత్మీయులయినవారు, సోదరసోదరీలు, కొడుకులు, కూతుళ్ళు, అల్లుళ్ళు, కోడళ్ళు ఇస్లామ్ స్వీకరించడం వాళ్ళు చూస్తూనే ఉన్నారు. వీరు ఇస్లామ్ స్వీకరించడమేకాక, ఇస్లామ్ కోసం అంతా త్యాగం చెయ్యడానికి, చివరికి తమ ఆప్తులయిన వారికి సయితం దూరమవడానికి సిద్ధమవుతున్నారు. ఈ అంతర్ విఘాతం వ్యతిరేకులకు అంతులేని బాధ కలిగించింది. ఆసక్తికరమైన విషయం ఏమిటంటే ఈ కొత్త ఉద్యమంలో ప్రవేశించే వారిలో అధికులు సంఘంలోని శిష్టులయినవారే. వీరి బుద్ధీ వివేకాలు, గుణగణాలు సామాన్య మానవీయ సద్గుణాలు అన్నీ అందరికీ బాగా తెలిసినవే. ఇలాంటి వ్యక్తులు ఇస్లాం స్వీకరించి తమ ఐహిక స్వప్రయోజనాలను వదలుకోవటానికి సంసిద్ధులవటం అంటే మామూలు విషయం కాదు. దాన్ని చూసి ఎవరయినా ఆలోచించకుండా ఉండలేరు. ఈ ఉద్యమంలోనూ ఉద్యమదాతలోనూ ఏదో విశిష్టత వుంది. జనులింతగా త్యాగనిరతులవటానికి బలవత్తరమయిన కారణం లేకుండా వుండదు అన్న మీమాంస సహజంగా ఉత్పన్నమవుతుంది. అంతేకాక ఇస్లామ్‌ను ఆశ్రయించిన పిదప ఈ వ్యక్తులంతా ఇంకా ఇతోధికంగా నిజాయితీపరులు సత్యసంధులు, సంస్కారవంతులు, సద్‌వర్తనాశీలురు, పరిశుద్ధ మనస్కులుగా మారుతున్నారు. ఈ యదార్థాలు కూడా అందరూ చూస్తున్నవే. వీటిని గమనించిన వ్యక్తి, అతను ఇస్లామీయ సందేశాన్ని స్వీకరించినా స్వీకరించకపోయినా, తన అంతర్యంలో మాత్రం ఈ సందేశం ఔన్నత్యాన్ని గుర్తించలేకపోడు.

---

*సర్వస్వతంత్రులనీ ఎంచకూడదు. మానవులందరికీ దైవం తప్ప మరెవ్వరి దాస్యమూ, విధేయతా తగవు.*

*3. అల్లాహ్ తప్ప మరో వ్యక్తి, మరో శక్తి, మనిషికి అధికారి, పాలకుడు కాడు. కనుక విధేయత, ఆజ్ఞాపాలన ఆయనపట్ల మాత్రమే చెయ్యాలి. మానవుడు స్వయంగా తానే ప్రభువై కూర్చోరాదు. దైవం తప్ప ఇతరులెవ్వరి ఆధిపత్యాన్నీ అంగీకరించరాదు.*

*ఆ ప్రకటనలో ఈ భావాలు ఇమిడి ఉండటం మూలానే ఒక వైపు తాత ముత్తాతల నాటినుంచి ఆరాధించబడే ఆరాధ్య దైవాల 'దైవత్వం' అంతమయిపోయిందని, మరొకవైపు ఈ ప్రకటన సమస్త నాయకత్వాలకు, ప్రభు సత్తాక శక్తులకుప్రతికూలంగా తిరుగుబాటు ప్రకటన అని కూడా అందరికీ వెల్లడి అయింది. ఇందువల్లనే మతగురువులు, తెగల నాయకులు ఈ ప్రకటనను సహించలేకపోయారు.*



# అబీసీనియాకు వలస

ఇప్పుడు మహాప్రవక్తకు నబువ్వత్ (దైవదౌత్యం) లభించి దాదాపు 5 ఏండ్లు గడిచాయి. ఇక కురైష్ హింసాకాండకు అంతమంటూ ఉండదని గ్రహించారు మహాప్రవక్త (స). ముస్లిములు ఎంతటి సంక్లిష్ట పరిస్థితుల్లోనయినా, ఎంతటి కష్టాన్నయినా ఎదిరించి తమ విశ్వాసాన్ని, ఇస్లామ్‌ను కాపాడుకుంటారు. కాని కష్టాలు మరీ దుర్భరంగా రూపొందుతున్నాయి. వారి సహనశక్తిని అధిగమిస్తున్నాయి. వారు ఇస్లామ్ విధుల్ని సయితం పాటించడం అసాధ్యమైపోతోంది. అప్పుడు మహాప్రవక్త (స) కొందరు ముస్లిములను అబీసినియాకు హిజ్రత్ (వలస) వెళ్ళడానికి అనుమతించారు. అబీసినియా, ఆఫ్రికా తూర్పుతీరాల్లో వున్న ఒక దేశం (నేటి ఇథియోపియా). ఇక్కడి పాలకుడు చాలా మంచి మనస్సుకలవాడనీ, సత్యప్రియుడయిన క్రైస్తవుడనీ ప్రతీతి. అబీసీనియాకు వలస పోవడం వెనుక, కొందరు ముస్లిములయినా, కనీసం పరిస్థితులు మెరుగుపడేవరకు కురైష్ ప్రజల బారి నుండి తప్పించుకుని జీవించగలరన్న ఉద్దేశ్యంతోపాటు మరొక ముఖ్యమైన ప్రయోజనం కూడా ఉంది. ఆ త్యాగమూర్తులు అక్కడికి హిజ్రత్ చెయ్యడం మూలాన ఇస్లామ్ సందేశం కొన్ని దూర ప్రదేశాల వరకు వ్యాపించే అవకాశం ఉంది.

తొలిసారిగా పదకొండు మంది పురుషులు, నలుగురు స్త్రీలు ఈ వలసకు సిద్ధమయ్యారు. వీరు నబవీ శకం, 5వ సంవత్సరం రజబ్ మాసంలో ప్రయాణమయ్యారు. దైవవశాత్తు వీరు రేవుకు చేరినప్పుడు రెండు వాణిజ్య నౌకలు ప్రయాణానికి సిద్ధంగా ఉన్నాయి. కురైష్ ప్రజలు ఈ సమాచారం తెలియగానే వెంబడించడానికి ప్రయత్నించారు. కాని అప్పటికే నౌక బయలుదేరి వెళ్ళిపోయింది. నావికులు ముస్లిమ్‌లను స్వల్పమయిన ఖర్చుతోనే అబీసీనియాకు చేర్చారు.

అబీసీనియాలో ముస్లిముల జీవితం ప్రశాంతంగానే కొనసాగుతోంది. కాని ఈ వార్తలు కురైష్ ప్రజలకు అందగానే వారికి అంతులేని ఆగ్రహం కలిగింది. అబీసీనియా రాజయిన 'నీగస్' (అరబ్బులు అతన్ని నజాషి అని పిలిచేవారు)వద్దకు వెళ్ళి "వీరు మా దేశానికి చెందిన నేరస్థులు, వీరిని తమరు దేశాన్నుండి బహిష్కరించివేస్తే మేము మాతో తీసుకు వెళతాము"అని చెప్పాలని వారు తమలో తాము సంప్రదించుకున్నారు. ఈ కార్యనిర్వహణకు 'అబ్దుల్లాహ్ బిన్ రబీఅ' 'అమ్రబిన్ అల్ ఆస్' ఎన్నికయ్యారు. వీరిద్దరూ మహావైభవోపేతంగా అబీసీనియాకు బయల్దేరారు. అక్కడ రాజదర్బారుకు వెళ్ళేముందు అక్కడి ఫాదరీలను సందర్శించి వారితో, "ఈ వ్యక్తులు ఒక క్రొత్త మతాన్ని స్థాపించుకున్నారు. మేము బహిష్కరించగా వచ్చి మీ దేశంలో శరణుపొందారు. వీరు మా దేశానికి చెందిన నేరస్థులని, పారిపోయి ఇక్కడికి వచ్చారని మీ రాజుగారితో విన్నవించుకుని, వీరిని

తిరిగి తీసుకు వెళ్ళడానికి వచ్చాము. రాజసభలో మీరూ మాతో సహకరించాలి" అని వేడుకున్నారు.

## నీగస్ రాజసభలో ముస్లిములు

మక్కా వాళ్ళు ఆ విన్నపం నజాషీ రాజు సమక్షంలో చేసినప్పుడు ఆయన ముస్లిములను పిలువనంపి, "మీరు స్థాపించుకున్న కొత్త మతమేది?" అని అడిగాడు. ముస్లిములు నజాషీ సభలో మాట్లాడటానికి హ(జత్ జాఫర్ బిన్ అబూతాలిబ్ (హ(జత్ అలీ సోదరుడు)ని ఎన్నుకున్నారు. ఆ సందర్భంలో సభలో ఆయన చేసిన ఉపన్యాసం చారిత్రక గ్రంథాలలో నమోదయి వుంది; దాని సారాంశం ఇది:

"రాజా! మేము ఎంతో కాలం నుంచి మూఢత్వం, మార్గవిహీనతల అంధకారంలో తట్టాడుకుంటూ ఒకే దేవుణ్ణి విస్మరించి వందలకొద్దీ విగ్రహాలను పూజిస్తూ ఉండేవారము. మృత జంతువుల్ని తినడం, జూదమాడటం, వ్యభిచరించడం, దోపిడీ దొంగతనాలకు పాల్పడటం, పరస్పరం అన్యాయం, అత్యాచారాలకు దిగడం మా దినచర్యలుగా మారాయి. మాలో శక్తిగల ప్రతివ్యక్తీ తనకంటే బలహీనుణ్ణి హతమార్చి గర్వపడేవాడు. మొత్తానికి మా జీవితం పశువులకంటే, క్రూరమృగాల కంటే, నీచంగా తయారయింది. మా పరిస్థితిపై కరుణామయుడయిన దైవానికి జాలి కలిగింది. మాలోని ఒక వ్యక్తిని దేవుడు తన సందేశ హరునిగా ఎన్నుకున్నాడు. మేమాయన వంశాన్ని బాగా ఎరిగిన వాళ్ళమే. ఆయన ఎంతో శ్రేష్టమయిన వంశీయుడు, ఆయన గురించి వివరాలన్నీ మాకు తెలిసినవే. ఆయన సత్య సంధుడు, విశ్వసనీయుడు, పరిశుద్ధ చరితుడు. సద్గుణ సంపన్నుడు, మిత్రులే కాదు శత్రువులు కూడా ఆయన మంచితనాన్ని ఒప్పుకుంటారు. ఆయన మాకు ఇస్లామ్ సందేశాన్ని అందజేశారు. మేము విగ్రహాలను పూజించటం త్యజించాలనీ, అల్లాహ్ ఒక్కణ్ణే మా స్వామిగా, ప్రభువుగా నమ్మాలనీ, ఆయనకే దాసులై మెలగాలనీ బోధించారు. నిత్యం సత్యాన్నే పలకాలనీ, రక్తపాతం, హత్యాకాండ విడనాడాలనీ, అనాథల సొత్తును దిగమ్రింగ కూడదనీ, పొరుగు వారికి సహాయపడాలనీ, వ్యభిచారం తదితర నీచకార్యాల సమీపానికి కూడా పోకూడదని ఉపదేశించారు. నమాజ్ చెయ్యాలని, 'రోజా' వ్రతాన్ని పాటించాలని, దైవమార్గంలో ధనం ఖర్చుపెట్టాలనీ, అనాథల్ని, నిరుపేదల్ని ఆదరించి సహాయం చెయ్యా లనీ ఆదేశించారు. మేము ఆయన్ని విశ్వసించాము. బహుదైవారాధన, విగ్రహారాధనల్ని వదిలిపెట్టాము. చెడ్డ పనులన్నింటికీ విడాకులిచ్చాము, అందుచేతనే మా జాతివారు మా పట్ల విరోధులుగా తయారయ్యారు. మేము తిరిగి వాళ్ళ మతాన్నే ఆశ్రయించాలని మమ్మల్ని బలాత్కరిస్తున్నారు. మేము మరలిపోవాలని వీరు ఇక్కడ మిమ్మల్ని మరీ మరీ అర్థించడం కూడా ఇందుకే."



ఇదంతా విని నీగస్, "అయితే మీ ప్రవక్తకు అవతరించిన దైవవాణి కొంత వినిపించండి" అని కోరాడు. హ(జత్ జాఫర్ "మర్యమ్" సూరాలోని కొన్ని ఆయత్‌లను పఠించారు. అది విని నీగస్ ఎంతో ప్రభావితుడయ్యాడు. అతని కళ్ళ వెంట అశ్రువులు ప్రవహించసాగాయి. "దైవ సాక్షిగా, ఈ వాణీ, బైబిల్ ప్రవచనాలు రెండూ ఒకే పరంజ్యోతి నుండి ఉద్భవించిన కిరణాలు" అని అప్రయత్నంగా ఒప్పుకున్నాడు. ఆ తరువాత ముస్లిములను అప్పచెప్పటానికి వీల్లేదని కురైషీలకు స్పష్టంగా చెప్పివేశాడు.

## నజాషీ ఇస్లాం స్వీకారం

రెండవరోజు కురైషీలు మరొక ఎత్తుగడ వేశారు. రాజసభలోకి వెళ్ళి, హ(జత్ ఈసా (ఏసుక్రీస్తు)ను గురించి ముస్లింల అభిప్రాయమేమిటో విచారించండని రాజును పురికొల్పారు. ముస్లిమ్‌లు, హ(జత్ ఈసాను క్రైస్తవులు విశ్వసించినట్లు అల్లాహ్ కుమారుడని అనకుండా మర్యమ్ పుత్రుడని అంటారని వాళ్ళకు బాగా తెలుసు. నజాషీ సమక్షంలో ఈ విషయం బయటపడగానే అతను ముస్లిమ్‌ల పట్ల తప్పక ఆగ్రహం ప్రకటిస్తాడని వారు భావించారు. నజాషీ ముస్లిములను తిరిగి పిలవనంపాడు. పరిస్థితి తెలుసుకుని ముస్లిమ్‌లు ప్రారంభంలో కాస్త జంకారు. కాని "ఎలాంటి పరిస్థితులు ఎదురయినా మనం సత్యాన్నే పలకాలి" అని హ(జత్ జాఫర్ అనగానే అందరూ అంగీకరించారు.

అప్పుడు హ(జత్ జాఫర్ నిండు సభలో "హ(జత్ ఈసా దేవుని దాసుడని, దైవసందేశహరుడనీ మాకు మా ప్రవక్త (స) తెలిపారు" అని ప్రకటించారు. ఈ మాట వినగానే నీగస్ ఒక గడ్డిపోచ నేలపై నుంచి పైకెత్తాడు, "దైవం సాక్షి, ఏసు నీవన్న దాని కంటే దీని మందం కూడా అధికం కాదు" అని అన్నాడు. ఈ విధంగా కురైష్ ప్రజలు వేసిన ఈ పాచిక కూడా పారలేదు. నీగస్ హ(జత్ జాఫర్‌ని తన బృందం సమేతంగా ఆ దేశంలో గౌరవాదరణలతో ఉండవచ్చని అనుమతినిచ్చాడు. అంతేకాకుండా మహాప్రవక్త(స) దైవదౌత్యాన్ని అంగీకరించి ఇస్లాం స్వీకరించాడు. ఆ నీగస్ పేరు అస్‌హమ. అతను మరణించినప్పుడు మహాప్రవక్త (స) పరోక్షంగా 'జనాజా నమాజ్' చేశారు. ఆ తరువాత క్రమంగా దాదాపు 83 మంది ముస్లిములు అబీసీనియాకు హి(జత్ చేసి వెళ్ళిపొయ్యారు.

## హజ్రత్ హమ్‌జా ధర్మస్వీకారం

మక్కాలో ఒకవైపు కురైష్ దౌర్జన్యాలు సాగుతూ వుంటే మరొకవైపు మహాప్రవక్త(స) ఆయన సహచరుల సహనస్థయిర్యాలు ప్రజలను ఆశ్చర్యపరుస్తున్నాయి. ఈ సంఘర్షణ కాలంలో మక్కాలోని నవనీతమంతా క్రమేణా ఇస్లామ్ పరిధిలోకి చేరసాగింది. మహాప్రవక్త(స) పట్ల ఆయన శత్రువులు అవలంబిస్తున్న నిర్దయవైఖరి అందరినీ బాధ

పెట్టేదిగా వుంది. తన వారయినా పరాయివారయినా చూడశక్యం కానంత తీవ్రస్థాయిలోకి వెళ్ళింది వాళ్ళ వివాదం. హమ్జా మహాప్రవక్తకు బాబాయి. ఇస్లామ్ స్వీకరించ లేదు. ఒక రోజు అబూజహల్ మహాప్రవక్త పట్ల ఎంతో అమర్యాదగా ప్రవర్తించాడు. ఆ సమ యంలో హజ్రత్ హమ్జా వేటకు వెళ్ళి ఉన్నారు. తిరిగి వచ్చిన తరువాత ఆయన పనికత్తె ఆయనకు జరిగిన వృత్తాంతమంతా వివరించింది. హజ్రత్ హమ్జా కోపావేశంతో కంపించ సాగారు. విల్లంబులు చేత పుచ్చుకొని 'హరమ్'లో ప్రవేశించారు. కోపంలో అబూజహల్ ను తిడుతూ 'నేను కూడా ముస్లిమ్‌నయ్యాను. ఏం చెయ్యగలరో చేసుకోండి!' అనేశారు.

మహాప్రవక్తను సమర్థించే ఉద్రేకంలోనయితే ఆ మాట అనటానికి అనేశారు, కాని పూర్వీకుల మతాన్ని విడనాడటానికి ఒక పట్టాన మనస్కరించలేదు. పగలంతా ఆలోచిస్తూ గడిపారు. చివరికి సత్యంలోని శక్తే జయించింది. ఆయన నిజంగానే ఇస్లామ్ స్వీకరించారు. ఈ సంఘటన నబవీ శకం 6వ సంవత్సరం జరిగింది. దీనికి కొన్ని దినాల తరువాతే హజ్రత్ ఉమర్ (ర) ఇస్లాం స్వీకరించారు. ఇస్లామీయ ఉద్యమ చరిత్రలో హజ్రత్ ఉమర్ విశ్వాసం గైకొనడం కూడా ఎంతో ప్రముఖాంశం.

## హజ్రత్ ఉమర్ ఇస్లాం స్వీకారం

ఇస్లామ్ స్వీకరించడానికి ముందు హజ్రత్ ఉమర్ ఇస్లామ్ శత్రువుల్లో ఒకరుగా పరిగణించబడేవారు. ఇస్లామీయ సందేశంపట్ల, దాని సందేశదాత పట్ల ఖురైష్ పెద్ద మనషుల శత్రుత్వం పెచ్చు పెరిగింది. అయితే మహాప్రవక్త (స) పరిస్థితి పూర్తిగా భిన్నంగా వుంది. వాళ్ళపట్ల ఆయన అంతర్యంలో ప్రేమాభిమానాలు, వారికి సన్మార్గం ప్రాప్తమవ్వా లనే తీవ్రమయిన ఆకాంక్ష రోజుకు రోజు మరీ బలపడసాగాయి. 'అబూజహల్' 'ఉమర్' ఇద్దరున్నూ ఇస్లామీయ ఉద్యమం పట్ల శత్రుత్వంలో ఎవరికీ తీసిపోరు. ఆ కాలంలో సందేశ ప్రచారానికిగాను చేసే ప్రయత్నంగా కారుణ్యమూర్తి (స) ఒకసారి విశ్వప్రభువు సన్నిధిలో ఇలా వేడుకున్నారు: "ప్రభూ! అబూజహల్ – ఉమర్ వీరిద్దరిలో నీ ప్రేమపాత్రు లెవరో వారి ద్వారా ఇస్లామ్ ఉద్యమానికి గౌరవోన్నతులు చేకూర్చు". ఈ ప్రార్థన చేసిన కొన్ని దినాలకే హజ్రత్ ఉమర్ మనసులో ఇస్లామ్ స్వీకరించే శుభ సంకల్పం కలిగింది. ఈ సంఘటన వివరాలను ఆ తరువాత, హజ్రత్ ఉమర్ స్వయంగా ఇలా ప్రస్తావించారు:

"ఒకనాటి రేయి నేను మహాప్రవక్తను వేధించాలనే ఆలోచనతో బయలుదేరాను. ఆయన 'మస్జిదుల్ హరామ్'కు వెళుతున్నారు. ఆయన మొదట మస్జిద్‌లో ప్రవేశించి నమాజ్ చేయడం ప్రారంభించారు. నేను ఆయన్ని వెంబడించాను. ఆయన పఠించేది తాపీగా విన్నాను. ఆయన 'అల్ హక్కా' సూరా పారాయణం చెయ్యసాగారు. ఆ సుమధుర సూక్తులు విని నేను సమ్మోహితుడనయ్యాను. ఆ వచనాల్లోని సువ్యవస్థ, కూర్పు, వాటి శైలి, అత్యంత



మనోహరంగా వున్నాయి. నా మనస్సులో ఒక భావన కలిగింది. ఈ వ్యక్తి కవి అవడంలో ఏ మాత్రం సందేహం లేదు అనుకున్నాను. మరుక్షణమే ఆయన,

"ఇది ఒక ఆదరణీయుడయిన దూత ద్వారా అవతరించిన వచనం. ఇది కవి చేసిన కృతి కాదు. కాని, మీరు విశ్వసించడం కద్దు" అనే ఆయత్ పఠించారు.

ఇది వినగానే నేననుకున్నాను, "ఓహ్! ఈయన నా అంతర్యంలోని విషయాన్ని సయితం గ్రహించి వేశాడు, ఈయన తప్పక తాంత్రికుడే."

తక్షణం ఆయన ఈ ఆయత్ పఠించారు: "ఇది తాంత్రికుని వచనాలు కూడా కావు. అయితే మీరు సన్మార్గాన్ని, సదుపదేశాన్ని గ్రహించరు. ఇది మాత్రం సర్వలోకాల ప్రభువు వద్దనుండి అవతరించినదే".

ఇలా ఆయన ఆ సూరా చివరి వరకు పఠించారు. ఇస్లామ్ నా అంతఃకుహరంలో స్థానం ఏర్పరచుకుంటుందనే అనుభూతి నన్ను కలవర పెట్టసాగింది.

అయితే ఆ సందర్భంలో హజ్రత్ ఉమర్‌లో పరిపూర్ణంగా పరివర్తన రాలేదు. స్థిరచిత్తుడు అవడంవల్లనూ, అనుభవశాలి అవడం చేతనూ ఒక్కసారి తన వైఖరిని మార్చుకోలేక తన దారిన తాను నడుస్తూనే ఉన్నారాయన.

ఒకరోజు విరోధ తాపంలో కరవాలం చేత పట్టుకుని (దైవం మన్నించు గాక) మహాప్రవక్త (స)ను అంతమొందించే సంకల్పంతో ఇంటి నుండి బయలుదేరారు. దారిలో సందర్భవశాత్తు 'నయీమ్‌బిన్ అబ్దుల్లాహ్' కలిశారు. "ఎక్కడికి బయల్దేరావు?" అని ఆయన అడిగిన దానికి, "ఈ వేళ ముహమ్మద్ (స) సంగతేమిటో తేల్చివెయ్యాలని పోతున్నాను" అన్నారు ఉమర్. అప్పుడు నయీమ్ "ఓహో, ముందు నీ ఇంటి సంగతేమిటో చూసుకో. స్వయంగా నీ చెల్లెలు, నీ బావగారే ఇస్లాం స్వీకరించారు" అన్నారు.

ఇది వినగానే వెనక్కి మరలి నేరుగా చెల్లెలి ఇంటికి వచ్చారు. ఆమె అప్పుడు దివ్యఖుర్‌ఆన్ పారాయణం చేస్తోంది. ఆయన రాకను గమనించి చెల్లెలు, బావ ఇద్దరూ చదవటం మానుకుని ఖుర్‌ఆన్ పత్రాల్ని దాచివేశారు. కాని లాభం లేకపోయింది. హజ్రత్ ఉమర్ అప్పటికే దాన్ని విన్నారు. "నీవు చదువుతున్న దేమిటో చెప్పు?" అని గద్దించారు. బదులు కోసం ఎదురు చూడకుండానే, "మీరిద్దరూ మన పూర్వీకుల ధర్మాన్నుంచి దూరమై పొయ్యారు" అంటూ బావను కొట్టసాగారు. చెల్లి అడ్డువస్తే ఆమెను సయితం వదల్లేదు. ఇద్దరూ రక్తసిక్తమైన దేహంతో, కాని దృఢ సంకల్పంతో "మేము ఇస్లామ్ స్వీకరించాము. నీవెంత కఠినంగా ప్రవర్తించినా మమ్మల్ని ఈ మార్గం నుంచి మళ్ళించలేవు" అని నిర్మొహమాటంగా అనేసరికి వాళ్ళ ధైర్యస్థయిర్యాల్ని చూసి హజ్రత్ ఉమర్ ప్రభావితు లయ్యారు.

"అయితే సరే, నీవు చదివేదేమిటో నాకూ వినిపించు" అన్నారు.

ఆయన చెల్లి ఫాతిమా ఖుర్‌ఆన్ పత్రాలు తెచ్చి ఆయన ముందుంచింది. అది తాహా సూరా. ఆమె చదవటం మొదలెట్టింది. ఈ ఆయత్ వరకు పఠించింది:

"నిస్సందేహంగా నేను దేవుణ్ణి, నేను తప్ప మరే దేవుడూ లేడు. అందువల్ల దాస్యం నాకే చెయ్యండి, నన్నే ఆరాధించండి, నా సంస్మరణ కొరకు నమాజ్ స్థాపించండి."

హజ్రత్ ఉమర్ తక్షణం కేక వేశారు, "లా ఇలాహ ఇల్లల్లాహ్-అల్లాహ్ తప్ప మరే ఆరాధ్య దైవమూ లేడు!"

నేరుగా మహాప్రవక్త (స) సన్నిధికి బయలుదేరారు. ఆ రోజుల్లో మహా ప్రవక్త అర్కమ్ ఇంట బసచేసేవారు. గడప ఎక్కగానే హజ్రత్ ఉమర్ (ర) చేతిలో కరవాలం ఉండటం వల్ల సహాబా (మహాప్రవక్త సహచరులు) కొంత జంకారు. కాని హజ్రత్ హమ్జా (ర), "రానివ్వండి, మంచి తలంపుతో వస్తే సరి, లేకపోతే అదే కరవాలంతో అతని తల నరికి వేస్తాను." అని అన్నారు.

హజ్రత్ ఉమర్ అడుగుపెట్టగానే మహాప్రవక్త ముందుకు వచ్చి ఆయన పై వస్త్రాన్ని పట్టుకుని "ఉమర్ నిజం చెప్పు, ఏ సంకల్పంతో వచ్చావు" అన్నారు. వినగానే హజ్రత్ ఉమర్‌పై ఒక విధమైన తాపం, భయప్రభావం ఆవరించింది. ఎంతో వినయంగా, "విశ్వాసం స్వీకరించడానికి" అనగలిగారు. మహాప్రవక్త తక్షణం "అల్లాహు అక్బర్" అనేశారు. వెంటనే సహచరులు కూడ తక్బీర్ నినాదం చేశారు.

హజ్రత్ ఉమర్ ఇస్లాం స్వీకరించిన తరువాత ఇస్లామీయ సంఘంలో బలం పెరిగింది. ఇంతవరకు ముస్లిములు తమ ధార్మిక విధుల్ని బాహాటంగా నెరవేర్చడం, కాబా గృహంలో సమిష్టిగా నమాజ్ చెయ్యడం సాధ్యం కాలేక పోయింది. హజ్రత్ ఉమర్ ఇస్లామ్ స్వీకరించిన తరువాత పరిస్థితి మారిపోయింది. ఆయన బాహాటంగా తన ఇస్లామ్ స్వీకారాన్ని ప్రకటించారు. ఈ విషయం పెద్ద రభసకు కారణమైనా చివరికి ముస్లిములు కాబా గృహంలో సామూహికంగా నమాజ్ చేయడం మొదలెట్టారు. ఇప్పుడు ఇస్లామీయ సంఘం ఎంతో శక్తిమంతంగా రూపొందింది. అంతిమ దైవప్రవక్త (స) ప్రార్థన ఎంతో ఘనంగా ఫలించిందని సుస్పష్టమయింది.

హజ్రత్ ఉమర్ ద్వారా అల్లాహ్ ఇస్లామ్‌కు ఉన్నత స్థానాన్ని కలగజేశాడు. అద్వితీయమయిన గౌరవ ఆదరణలు అనుగ్రహించాడు. దీనికి గత 1400 ఏండ్ల చరిత్రే సాక్ష్యం.

## షిఅబే అబీతాలిబ్‌లో బందీలు

ఇస్లామీయ సందేశం పురోగమిస్తున్నరీతిని చూసిన కురైష్ నాయకుల కలవరానికి, తత్తరపాటుకు అంతేలేదు. ఈ ఉద్యమాన్ని అణచడానికి అనుదినం సరికొత్త ఉపాయాలు ఆలోచించేవారు. ఇప్పుడు మరో ఎత్తుగడ వేశారు. మక్కా తెగల వారంతా కలసి ఒక ఒప్పందానికి వచ్చారు. "ముహమ్మద్‌ను హతమార్చడానికి ఆయన వంశీయులయిన బనీహాషిం



వారు స్వయంగా ఆయన్ని మాకు అప్పగించనంతవరకు వారితో ఎవరూ చుట్టరికం పెట్టుకోరాదు; వారితో పెళ్ళి పేరంటాల సంబంధాలు పెట్టుకోరాదు; వారితో వ్యాపార లావాదేవీలు నెరపరాదు; వాళ్ళతో కలసి మెలసి ఉండరాదు; వారికి అన్న పానీయాలు కూడా సరఫరా చెయ్యరాదు." ఈ ఒప్పందం వ్రాసి కాబా ద్వారానికి వేలాడగట్టారు.

ఇప్పుడు ఇక బనీహాషిం వారికి రెండే మార్గాలు మిగిలాయి. మహాప్రవక్త (స)ను తిరస్కారులకు అప్పగించడమైనా చెయ్యాలి, లేదా ఈ ఆర్థిక, సామాజిక బహిష్కరణ మూలంగా వాటిల్లే కష్టాల్ని ఓర్పుతో ఎదుర్కోవడానికి సిద్ధంకావాలి. బనీహాషిం రెండవ మార్గాన్నే ఎన్నుకున్నారు. అబూతాలిబ్ గత్యంతరంలేక తన వంశం వారందరితో కలిసి ఒక కొండ చరియలో నివాసమేర్పరచుకున్నారు.

అది వంశపారంపర్యంగా బనీహాషిం తెగకు వారసత్వంగా వస్తున్న కుగ్రామం. దానికి షిఅబె అబీతాలిబ్ అని పేరు. అక్కడ మహాప్రవక్త వంశం వారు మహాప్రవక్త (స)తో మూడేండ్లపాటు ఎంతో కష్టభూయిష్టమైన జీవితం గడపవలసి వచ్చింది. ఆకులలములు తిని గడపవలసిన సమయాలు అగణ్యంగా ఆసన్నమయ్యాయి. చివరకు ఆకలి బాధకు తట్టుకోలేక వారు ఎండిపోయిన పశుతోలు ముక్కల్ని ఉడకబెట్టుకుని తినవలసి వచ్చింది. పసికందులు ఆకలితో అలమటించి ఆక్రందనలు చేసినప్పుడు కురైష్ కఠినాత్ములు విని ఆనందించేవారు. వారిలో ఎవరికైనా కాస్త కనికరం కలిగితే తినడానికి ఏదైనా రహస్యంగా పంపేవారు.

మూడేండ్ల వరకు బనీహాషీం ఎంతో సహనం, స్థయిర్యం ప్రదర్శించారు. చివరికి దుర్మార్గుల హృదయాలే ఆర్ద్రమయ్యాయి. వారి మధ్యనే ఆ ఒప్పందాన్ని ఉపసంహరించుకోవాలన్న అభిప్రాయం బలపడసాగింది. ఒక్కొక్కరే మెత్తబడసాగారు. 'అబూజహల్' ఇంకా అతనితో ఏకీభవించే కొందరైతే ససేమిరా వీల్లేదన్నారు. కాని వారి మాట ఎంతోకాలం సాగలేదు. నబవీ శకం 10వ ఏట మహాప్రవక్త (స), ఆయన సహచరులు, కుటుంబీకులు అంతా ఆ 'బందిఖానా' నుండి విముక్తి పొందారు.

## సందేశ ప్రగతి

ఇంతకు ముందే సూచించినట్లు మక్కా కాలంలో జరిగిన కృషి సంఘర్షణల వివరాలు చారిత్రక గ్రంథాల్లో చాలా తక్కువగా లభిస్తాయి. కనుక ఈ సామాజిక, ఆర్థిక బహిష్కరణ కాలంలో సందేశ ప్రచారం, ఉద్యమ కార్యకలాపాలు ఎలా జరిగాయో ఆ కృషి ప్రభావాలు ఏ విధంగా ప్రసరించాయో తెలుసుకోవడానికి ఆ వివరాలు మనకు చరిత్ర పుటల్లో దొరకవు, కాని ఖుర్‌ఆన్ అవతరణ నిరంతరాయంగా జరుగుతూ వుండేది. అప్పుడు అవతరించిన సూరాల ప్రధాన విషయాల్ని, బోధనల్ని, ఆదేశాల్ని, నిర్దేశాల్ని పరిశీలిస్తే ఉద్యమం ఆనాడు ఎలాంటి పరిస్థితులకు లోనవవలసి వచ్చిందో అవగతమవు తుంది.

సుదీర్ఘమైన ఆ సంఘర్షణ కాలంలో అల్లాహ్ అవతరింప చేసిన ఉపన్యాసాలు అత్యంత ఉత్తేజజనకంగా ప్రభావవంతంగా వుండేవి. వాటిలో విశ్వాసులు తమ విధులేమిటో తెలుసుకున్నారు. వాటిని ఏకాగ్రతతో అనుసరించాలని బోధించడం జరిగింది. వాళ్ళ వ్యక్తిగత స్వభావ స్వరూపాలు ఇతోధికంగా ఉన్నత ప్రమాణాల్ని అందుకునే మార్గాలు సూచించడం జరిగింది. భయభక్తులతో మెలిగే సుశిక్షణ కలగటానికి కావలసిన ఆచరణా నియమావళిని నిర్ణయించటం జరిగింది. నైతిక ఔన్నత్యం, శీల సముద్ధరణల కోసం నిర్దేశాలు లభించాయి. సాంఘిక చైతన్యం జాగృతం చెయ్యబడింది. సత్యధర్మాన్ని ప్రచారం చేసే విధానాలు చూపడం జరిగింది. కఠినాతి కఠినమైన పరిస్థితుల్లో సహనంతో, నిలకడగా మసలుకోవాలనే హితవు గరపడం జరిగింది. అప్పుడే దిగ్విజయం దాసోహమంటుందనే అభయవాక్కులు, స్వర్గం ప్రాప్తిస్తుందనే శుభ వార్తలు అందచేసి ప్రోత్సహించటం జరిగింది. ధర్మమార్గాన్ని అవలంబించడంలో ఎన్ని కష్టాలు ఎదురయినా స్థయిర్యంతో నిలదొక్కు కోవాలని, ధైర్యంగా అల్లాహ్ మార్గంలో అనవరతం కృషి చెయ్యాలని ఉత్తేజపరచడం జరిగింది. విశ్వాసుల్లో ఆత్మనిగ్రహం, త్యాగనిరతి ప్రజ్వలితమయ్యాయి. తద్వారా ఏ కష్టాలనయినా, ఎలాంటి బాధనయినా అవలీలగా భరించడానికి, ఎంతటి కఠిన కాలం ఎదురయినా సహించడానికి శక్తి, స్థోమతలు వారిలో ఉద్భవించడానికి ఆ ప్రవచనాలు ఉపకరించాయి.

మరొకవైపున వ్యతిరేకుల్ని, దైవప్రసాదితమయిన ధర్మాన్ని తృణీకరించిన వారిని, వారి ఈ ప్రవర్తనవల్ల వారికి కలగబోయే దుష్పరిణామాన్ని తెలిపి హెచ్చరించడం జరిగింది. వీరికంటే ముందు ఉపేక్ష, తిరస్కారాల వైఖరిని అవలంబించి పర్యవసానంగా అంతమయి పోయినవారి, అరబ్బులకు సుపరిచితమైన జాతుల గాథలను వినిపించి గుణపాఠం గరపడమయింది. వారు రేయింబవళ్ళు ప్రయాణాలుచేసే మార్గాల మధ్యన కనిపించే శిథిలమయిపోయిన నగరాల అవశేషాలను కూడా ఎత్తి చూపడం జరిగింది. వారు అనునిత్యం భూమ్యాకాశాల్లో తమ కళ్ళతో వీక్షించే సుస్పష్టమైన సూచనల ద్వారానే దేవుని ఏకత్వం, పరలోక జీవితాలకు సంబంధించిన నిదర్శనాలు, తార్కాణాలు చూప బడ్డాయి. బహుదైవ వాదనలో గల కీడుల్ని విశదీకరించడం జరిగింది. దైవానికి ఎదురుగా తిరుగుబాటు వైఖరిని అవలంబించే వారికి సంభవించబోయే పరిణామాన్ని తెలుపటంతో పాటు పరలోక జీవితాన్ని తిరస్కరించటంవల్ల జీవితంలో ఉత్పన్నమయ్యే దుష్పరిణామాల్ని అవకతవకల విశదీకరణ కూడా జరిగింది. తాత ముత్తాతల గుడ్డి అనుకరణవల్ల మానవాళికి కలిగే నష్టాలు నిర్దుష్టంగా సూచించబడ్డాయి. ఈ విషయాలన్ని ఎంతో మనోజ్ఞమైన నిదర్శనాలతో హృద్యంగమమైన వచనాలుగా వెలువడ్డాయి.

వ్యతిరేకులు, తిరస్కారులు వెలిబుచ్చే అభ్యంతరాలకు, ఆక్షేపణలకు సమంజసం, సహేతుకమయిన సమాధానాలు ముందుకు వచ్చాయి. వారు తెలిపే అనుమానాల్ని, సంశయాలను విశదపరచడం జరిగింది. ఏ చిక్కుల్లో స్వయంగా వారు చిక్కుకుని, ఇతరుల్ని సయితం ఇరికిస్తున్నారో వాటిని విడదీయటం కూడా జరిగింది. కాని ఈ కాలంలోనే వ్యతిరేకత, విరోధం, విద్వేషాలు అధికమయ్యాయి.



## *నాలుగవ దశ*

## మితి మేరలు లేని కష్టాలు

మహాప్రవక్త (స) "షిఅబె అబీతాలిబ్" నుండి విముక్తులై బయటపడినప్పుడు కురైష్ ప్రజల అత్యాచారాలు కొంతకాలం వరకు ఉపశమించాయి. ఆ కొంతకాలం తరువాతే "అబూతాలీబ్" నిర్యాణం జరిగింది. దానికి కొన్ని దినాల తదుపరి హజ్రత్ ఖదీజా (ర) కూడా పరమపదించారు. ఈ సంవత్సరాన్ని మహాప్రవక్త ముహమ్మద్ (స) "దుఃఖ సంవత్సరం" (అముల్ హుజ్న్) అని పేర్కొనేవారు. వీరిద్దరి నిర్యాణానంతరం కురైష్ ప్రజలు తమ విరోధాన్ని, హింసాదౌర్జన్య వైఖరిని తీవ్రతరం చేశారు. ఈ కాలమే ఇస్లామీయ ఉద్యమం ఎడల అతి కఠినమైనదిగా పరిణమించిన కాలం. ఈ కాలంలోనే కురైష్ ప్రముఖులు ముస్లిముల ఎడల స్వయంగా మహాప్రవక్త ఎడల ఎంతో నిర్దయగా, నిరాదరణతో ప్రవర్తించారు.

## మక్కాకు వెలుపల ప్రచారం

మక్కావారిలో మంచి వారుగా పరిగణించబడే వారంతా వేరై ఒక్కొక్కరే ఇస్లామీయ సంఘంలో చేరిపొయ్యారు. అప్పుడు ఇస్లామ్ సందేశ దాత (స) మక్కా వెలుపలకుపోయి దైవ సందేశాన్ని అందజేసే నిర్ణయం గైకొన్నారు. ఈ కార్యక్రమం ప్రకారం ప్రథమంగా ఆయన తాయిఫ్‌కు ప్రయాణమయ్యారు. తాయిఫ్‌లో పెద్ద పెద్ద ప్రముఖులు, సంఘంలో గౌరవ ప్రతిపత్తులుగల వ్యక్తులు ఉన్నారు. మహాప్రవక్త (స) ఇస్లామ్ సందేశాన్ని వాళ్ళకు సయితం వినిపించారు. కాని సామాన్యంగా ధనమూ, అధికారాలూ సత్యస్వీకార మార్గంలో అవరోధాలుగా నిలుస్తాయి. అక్కడ కూడా అదే జరిగింది. ఒక నాయకుడు ఇలా అన్నాడు, "దేవునికి తన ప్రవక్తగా నియమించడానికి నీవు తప్ప ఇంకెవరూ దొరకలేదా?" మరొకతను, "నీతో మాట్లాడం తప్పు. నీవు చెప్పేదే సత్యమైతే నీతో ఇలా మాట్లాడటం సభ్యతకు విరుద్ధం. ఒకవేళ అది అబద్ధమైతే (దైవం మన్నించుగాక) నీలాంటి వాణ్ణి పలకరించడం కూడా తప్పే."

ఇలా తూలనాడి ఆ పెద్దమనుషులు విషయాన్ని తేలికగా త్రోసిపుచ్చారు. అంతేకాదు నగరంలోని అల్లరి మూకను పురికొలిపి, నడిబజారులో మహాప్రవక్త (స) పట్ల అవమాన కరంగా ప్రవర్తించారు. ఆయనపై రాళ్ళు రువ్వారు. అప్పుడు ఆయనకు కలిగిన గాయాల కారణంగా కారిన రక్తం, ఆయన పాదరక్షల్లో నిండిపోయింది. అయినా ఆ దౌర్భాగ్యులు రాళ్ళు రువ్వడం, దూషణలాడటం మానుకోలేదు. చివరికి ఆయన (స) ఒక తోటలోకెళ్ళి శరణు తీసుకోవలసి వచ్చింది.

ఇస్లామీయ ఉద్యమానికి ప్రతికూలమైన పట్టణానికి ఏకాకిగా వెళ్ళి ప్రచార కర్తవ్యాన్ని నిర్వర్తించడం, ప్రాణాలను కరవాలపు అంచుమీద పెట్టి అల్లాహ్ దాసులకు అల్లాహ్ సందేశాన్ని అందజెయ్యడం ఎంత ధైర్యసాహసాలతో కూడుకున్న పని! అల్లాహ్‌పై పూర్ణవిశ్వాసానికి, భారమంతా ఆయనపై మోపే లక్షణానికి ఇది అత్యున్నతమైన తార్కాణం కాదా? భావి ఇస్లామీయ ఉద్యమ కార్యకర్తలకు అనుసరణీయమైన ఆదర్శం కాదా?

"హజ్" కాలంలో దేశం నలువైపుల నుండి మక్కాకు వచ్చే విభిన్న తెగలవారిని కలుసుకోవడం, వారికి ఇస్లామ్ సందేశాన్ని అందజేయటం మహాప్రవక్త (స) అలవాటు. అలాగే అరేబియాలో ఎక్కడెక్కడ సంతలు జరుగుతాయో అక్కడికి పోయి ఆ సమావేశాల్లో ఇస్లామ్ సందేశాన్ని జనుల ముందుంచడానికి కూడా ఆయన ప్రయత్నించేవారు. ఇలాంటి సందర్భాలలో ఖురైష్ నాయకులు (ముఖ్యంగా అబూలహబ్) కూడా మహాప్రవక్తకు తోడయ్యే వారు. మహాప్రవక్త ఏ సమావేశంలో ఉపన్యసిస్తే ఆ సమావేశంలో, "ఇతని మాటలు వినకండి, ఇతను ధర్మభ్రష్టుడైపోయ్యాడు. ఇతను చెప్పేదంతా అబద్ధం" అంటూ జనుల్ని అనుమానాలకు గురిచేసేవాడు. ఇలాంటి సందర్భాల్లో మహాప్రవక్త (స) దివ్య ఖురాన్‌లోని కొన్ని భాగాల్ని వినిపించేవారు. అవి అమోఘంగా పనిచేసేవి. వాటిని విన్నవారి అంతరాల్లో సామాన్యంగా ఇస్లామ్ స్థానం ఏర్పరచుకోసాగింది. మహాప్రవక్త (స) చేసిన ఈ ప్రచార యాత్రలు, వాటి ఫలితాల రీత్యా ప్రభావాల దృష్ట్యా అమితంగా ఫలవంత మయ్యాయి. ఆ తరువాత ఇస్లామ్ సందేశం అరేబియాలోని అన్న ప్రదేశాలలోనూ పరిచితమైపోయింది. సుదూర ప్రాంతాల వరకు ఈ సందేశం పరివ్యాప్తి చెందింది. ఎవరయితే స్థిరచిత్తంతో ఇస్లామీయ ఉద్యమానికి అనుయాయులయ్యారో వారంతా తమ తమ ప్రాంతాల్లో సందేశ ప్రచారం ఉధృతం చేశారు.

## జిన్నుల రేయి

దేవుని అసంఖ్యాకమైన సృష్టిరాశుల్లో జిన్నులు కూడా ఒక సృష్టిరాశి. వీరు కూడా మానవుల్లా తమకు ఇష్టమయిన దాన్ని ఎన్నుకునే స్వాతంత్ర్యం కలిగి ఉన్నారు. అందువల్లనే దైవం తరుపున వచ్చిన మార్గదర్శకత్వాన్ని అనుసరించే బాధ్యత వీరిపై కూడా ఆసన్నమవు తుంది. ఏకేశ్వరవాదం, దైవదౌత్యం, పరలోక జీవితంలాంటి విషయాలను విశ్వసించటం, అల్లాహ్ ఆజ్ఞల్ని పాటించటం వారికీ అనివార్యమే. అందుకే వాళ్ళలోనూ మంచివారూ ఉంటారు, చెడ్డవారూ ఉంటారు.

జిన్నులను గురించి ప్రాచీన కాలంనుంచే జనుల్లో రకరకాల భావాలుండేవి. అరేబియాలో కూడా జిన్నుల ప్రస్తావన విరివిగా జరుగుతూ ఉండేది. వారిని కొందరు పూజించేవారు. వారిని కొందరు సహాయం కొరకు అర్థించేవారు. మాంత్రికులు వారితో తమకు సంబంధాలున్నాయని వాదించేవారు. వారిని గురించి ఎన్నెన్నో పుక్కిటి పురాణాలు



ప్రచారంలో ఉండేవి. మొత్తానికి వేనవేల దైవదూతలను దైవత్వంలో భాగస్వాములుగా భావించినట్లే జిన్నుల్ని సయితం దైవత్వంలో జోక్యం కలవారుగా తలచేవారు. ఇస్లామ్ ఇలాంటి అపనిశ్వాసాలన్నింటిని మూఢవిశ్వాసాలన్నింటిని సంస్కరించింది. జిన్నులు కూడా అల్లాహ్ సృష్టిజాలంలోని వారేనని, వారికి దైవత్వంలో ఎలాంటి జోక్యం, అధికారం లేదనీ, స్వతహాగా వారికి తమ ఇష్టంతో ఇతరులకు లాభం చేకూర్చడమో లేదా నష్టం కలుగజెయ్యటమో సాధ్యపడదనీ, వీరు కూడా అల్లాహ్ దాస్యం చెయ్యవలసిందేనని, వాళ్ళలోనూ దేవుని విధేయులూ, అవిధేయులూ ఉంటారనీ, వాళ్ళూ మానవుల్లా మంచి కార్యాలకు సత్ఫలితాన్ని, చెడ్డపనులకు దుష్ఫలితాన్ని పొందుతారని, దేవుని శక్తి సామర్థ్యాల సమక్షంలో అందరు మానవుని వలెనే అశక్తులనీ ఇస్లామ్ సూచించింది.

అల్లాహ్ మానవులకై ఆమోదించి పంపిన ధర్మం ఇప్పుడు దాని అంతిమరూపంలో మహాప్రవక్త ముహమ్మద్ (స) ద్వారా ప్రపంచానికి అందింది. దాన్ని మానవులు అనుస రించటం ఏ విధంగా అనివార్యమో అదే విధంగా జిన్నులు అనుసరించడం కూడా ఆవశ్యమే.

ఒకసారి మహాప్రవక్త (స) తన ప్రచార యాత్రలో అరేబియాలోని ఎంతో ప్రతీతిగల 'ఉక్కాజ్' సంతకు వెళుతూ ఉండగా మార్గంలో 'నఖ్ల' అనేచోట విశ్రాంతికోసం మకాం చేశారు. అక్కడ అరుణోదయ కాలంలో మహాప్రవక్త (స) కొందరు సహచరులతో కలిసి నమాజ్‌లో నిమగ్నులై వున్నారు. నమాజ్‌లో ఖుర్‌ఆన్ పఠిస్తూఉండగా సందర్భవశాత్తు జిన్నుల బృందం ఒకటి ఆ దారిన వెళ్ళటం తటస్థించింది. వారు దివ్యఖుర్‌ఆన్ విన్నారు. ఈ సమాచారాన్నంతా దివ్యఖుర్‌ఆన్‌లోని 'అల్ అహ్‌కాఫ్' సూరాలో ఈ విధంగా ప్రస్తా వించటం జరిగింది:

"ప్రవక్తా! మేము జిన్నుల ఒక బృందాన్ని ఖుర్‌ఆన్ వినడానికి నీవైపునకు మళ్ళించి నప్పుడు వాళ్ళు ఆవైపుకు వచ్చి పరస్పరం 'నిశ్శబ్దంగా ఉండండి' అని అనుకున్నారు. 'ఖుర్‌ఆన్' పఠనం పూర్తి అయ్యాక వారు వెళ్ళి తమ జాతి వారిని హెచ్చరించారు. "సోదరులారా! మేము ఒక గ్రంథాన్ని విన్నాము. అది మూసా (అలైహిస్సలామ్) తరువాత అవతరించిన గ్రంథం. దీనికంటే ముందు అవతరించిన గ్రంథాలన్నిటినీ అది ధృవపరు స్తుంది. 'పరమ సత్యం' వైపునకు రుజుమార్గాన్ని చూపెడుతుంది. సోదరులారా! అల్లాహ్ వైపునకు ఆహ్వానించే ఆయన మాటను వినండి. ఆయన్ని విశ్వసించండి. అలా చేస్తే అల్లాహ్ మీ పాపాలను క్షమిస్తాడు. బాధాకరమయిన యాతన నుండి రక్షిస్తాడు?"

ఈ సంఘటనను గురించిన వివరాలు మహాప్రవక్తకు వహీ (దైవవాణి) ద్వారా తెలిసివచ్చాయి. అవి 'జిన్' సూరాలో ప్రస్తావించబడ్డాయి.

## మదీనాలో ఇస్లామ్

ఇస్లామ్ పిలుపు అరేబియాలో బహుదూర ప్రదేశాలకు ప్రాకిపోయినట్లే మదీనాకు కూడా చేరింది. మదీనాలో చాలాకాలం నుండి యూదులు వచ్చి నివాసాలు ఏర్పరచుకున్నారు. వారికి మదీనాకు సమీపంలో చిన్న చిన్న దుర్గాలు ఎన్నో ఉన్నాయి.

యమన్ దేశానికి చెందిన అవుస్, ఖజరజ్ అనే ఇద్దరు సోదరులు గతంలో ఎప్పుడో వచ్చి మదీనాలో స్థిరపడ్డారు. వాళ్ళ సంతతి ద్వారానే రెండు పెద్ద వంశాలు "అవుస్" మరియు "ఖజరజ్" అనే పేర్లతో అక్కడ ఏర్పడ్డాయి. వీళ్ళే తరువాత కాలంలో "అన్సార్" అనే బిరుదు పొందారు. వీళ్ళు కూడ మదీనా, దాని చుట్టుపట్ల ప్రదేశాల్లో చిన్న చిన్న దుర్గాలు స్థాపించుకున్నారు. వీళ్ళు విశ్వాసం రీత్యా విగ్రహారాధకులే అయినా యూదులతో కలసి మెలసి నివసించటం మూలాన దైవదౌత్యం, దైవవాణి దైవగ్రంథాలు, పరలోకం ఇత్యాది విషయాలను గురించి వీరికి కాస్తోకూస్తో తెలుసు. స్వయంగా వీరి మతంలో ఇలాంటి మౌలికమయిన విషయాలేవీ లేకపోవడంచేత వీరు యూదులంటే కాస్త లొంగి ఉండేవారు. వారి మాటకు విలువయిచ్చేవారు. యూదు పండితుల నోట ప్రపంచంలో ఇంకా ఒక ప్రవక్త ప్రభవించనున్నారనీ ఆయనకు తోడ్పడ్డవారే సఫలురవు తారనీ, ఆ ప్రవక్తతో సహకరించిన వారే ప్రపంచం మొత్తాన్నీ లొంగదీసుకుంటారనీ విని ఉన్నారు. ఈ కారణాల వల్లనే మహాప్రవక్త (స) వైపునకు, ఆయన సందేశం వైపునకు మదీనా వాసుల దృష్టి మళ్ళింది.

హజ్ కాలంలో మహాప్రవక్త (స) యథాప్రకారం, తెగల నాయకులతో కలిసి వారికి ఇస్లామీయ సందేశాన్ని అందజేసేవారు. నబవీ శకం 10వ ఏట, మహాప్రవక్త (స) "ఖజరజ్" వంశానికి చెందిన కొందరు వ్యక్తులకు "అకబా" అనే చోట ఇస్లామ్ సందేశాన్ని ఇచ్చి దివ్య ఖుర్ఆన్ ఆయత్‌లను కొన్నింటిని వినిపించారు. ఈ వాణి వినగానే ఖజరజ్ నాయకుల అంతర్యంపై దాని ప్రభావం పడసాగింది. యూదులు తరచుగా మరొక దైవసందేశహరుడు రానున్నాడని చెప్పేవారు కదా! ఆ ప్రవక్త ఈయనే అయివుంటా రని వారు గ్రహించారు. మహాప్రవక్త సందేశం విని వీరు పరస్పరం ఒకరి ముఖాలొకరు చూసుకోసాగారు. "యూదులు మీకంటే ముందు ఈ ప్రవక్తను విశ్వసించి, అగ్రగాములవు తారేమో" అని అనుకుని, వారు ఇస్లామ్ స్వీకరించారు. వీరి ద్వారా మదీనా పౌరుల జీవితాల్లో ఇస్లామ్ ప్రవేశించింది. ముమ్ముందు ఇస్లామీయ ఉద్యమానికి కేంద్రం కానున్న నగరంలోకి ఇస్లామ్ కిరణాలు ఈ విధంగా చొచ్చుకుపోయాయి.

## విరోధం తీవ్రమయింది

ఏ ఉద్యమమయినా అది విస్తృతమయినకొద్దీ దానిపట్ల వ్యతిరేకత, దానితో సంఘర్షణలు కూడ పెరుగుతాయి. అయితే ఇస్లామీయ ఉద్యమం పరివ్యాప్తితో పాటు



విజృంభించే వ్యతిరేకత సంఘర్షణల గాలి దుమారం సాధారణమయింది కాదు. అదే ఆ ఉద్యమ అనుయాయులకు సరయిన పరీక్ష. ఇస్లామీయ సందేశం ఎంత వ్యాప్తిచెందిందో, సందేశదాత, ఆయన సహచరులు అంతకంటే అధికంగానే బాధలకు లోనవవలసి వచ్చింది. మహాప్రవక్త (స)ను అష్టకష్టాలకు గురిచేసి ఆయన, ఇక గత్యంతరం లేక సందేశాన్ని విరమించుకునేలా చెయ్యాలన్నది ఖురైష్ నాయకుల తాపత్రయం.

ఖురైష్‌కు చెందిన పెద్ద పెద్ద నాయకులు ఆయనకు ఇరుగుపొరుగులో నివసించేవారు. ఆయనపట్ల అంతులేని విద్వేషం కలవారు కూడా వీరే. వీరు మహాప్రవక్త (స) నడిచే త్రోవలో ముండ్లు పరిచేవారు; నమాజ్ చేసేటప్పుడు పరిహసించేవారు; ఆయన సజ్దా (ప్రార్థనలో తల నేలపై మోపడం)లో ఉన్నప్పుడు వధించిన పశువుల ప్రేవులు తెచ్చి పైన వేసేవారు; కంఠానికి బట్ట చుట్టి నిర్దయగా, మెడపై గుర్తులు పడేలా లాగేవారు. పిల్లవాళ్ళను వెనుక పంపేవారు, వాళ్ళు అశ్లీలాలు పలుకుతూ కూతలు కూస్తూ చప్పట్లు చరుస్తూ అసభ్యంగా, అవమానకరంగా ప్రవర్తించేవారు. ఆయన ఎక్కడయినా ప్రజలకు హితోపదేశం చేయడానికి ఉపక్రమిస్తే మధ్యలో గందరగోళం చేసి 'ఇదంతా అబద్ధం' అని కేకలు వేసేవారు. ఒక్కమాటలో చెప్పాలంటే, మహాప్రవక్తను కష్టపెట్టడానికి, ఆయనను చీకాకుకు గురిచెయ్యడానికి, సాధ్యమయిన అసహ్య విధానాలన్నింటినీ వారు అవలంబించే వారన్నమాట.

ఆ కాలంలో అల్లాహ్ తన ప్రవక్త కొరకు అవతరింపజేసిన వాణిలో అలాంటి పరిస్థితులన్నింటినీ నిబ్బరంగా ఎదుర్కొనడానికి కావలసిన మార్గదర్శక సూచనలు వుండేవి. ఇస్లామీయ ఉద్యమ కార్యకర్తల్ని ఉద్దేశించి ఇలా సెలవీయటం జరిగింది. "ఇప్పుడు 'సత్యం' దీనావస్థ అనుభవిస్తున్నట్టు పైకి కనిపిస్తున్నా అది చిరకాలం వుండేది కాదు. ప్రాపంచిక జీవితంలో ఇలాంటి విపత్తులు వస్తూనే వుంటాయి. సాఫల్యానికి నిజమైన ప్రమాణం ప్రాపంచిక జీవితం కాదు, పరలోక జీవితమే. దైవభీతితో జీవితం గడిపేవారు మాత్రమే పరలోక జీవితంలో సాఫల్యం పొందగలరన్న విషయం తథ్యం."

మహాప్రవక్తను సంబోధించి ఈ విధంగా ఆదేశించటం జరిగింది: "నీపట్ల జరిగేదంతా చాలా బాధాకరమయిందని మాకు తెలియకపోలేదు, తెలుసు కాని, వీరు సత్యాన్ని అబద్ధమంటూ తిరస్కరిస్తున్నారంటే అది నిన్ను కాదు, మమ్మల్ని తిరస్కరించినట్లే. ఇలా చేయటం కూడా ఏ మాత్రం కొత్త విషయం కాదు. లోగడ కూడా దైవసందేశహరుల పట్ల ఇలాంటి వ్యవహారమే జరుగుతూ వచ్చింది. ఆ దైవ సందేశహరులు అలాంటి పరిస్థితుల్ని ఓరిమితో సహించారు. అష్టకష్టాలను భరించారు. చివరికి మా సహాయం వారికి అందింది. నీవు కూడా ఇలాంటి పరిస్థితుల్లోనే ఉన్నావు. ఈ పరిస్థితుల్ని అధిగ మించటం తప్పదు."

విభిన్న ఫక్కీల్లో, పలుసార్లు ఈ విషయాన్ని బోధించటం జరిగింది. "సత్యాసత్యాల సంఘర్షణ పట్ల అల్లాహ్ నిర్ణయించిన నియమం ఒకటి వుంది. దాన్ని మార్చడానికి ఎవరి

తరమూ కాదు. దాని ప్రకారం సత్యప్రియుల్ని సుదీర్ఘకాలం వరకు పరిశీలించడం, వాళ్ళ ఓర్పును, సత్యసంధతను, త్యాగనిరతిని, విశ్వసనీయతను, స్వయం సమర్పణా గుణాన్ని, విశ్వాసంలో పటిష్టతను పరీక్షించడం అనివార్యం. వాళ్ళు, అల్లాహ్‌పై భారం మోపటంలోను, అల్లాహ్ ఎడల విశ్వాసంలోను ఎంతవరకు స్థయిర్యంగా వున్నారో చూడటం కూడా తప్పనిసరి. ఈ సంఘర్షణల వల్లనే వాళ్ళలో ముమ్మందు దైవ ధర్మ ఔన్నత్యానికై కృషిచేసేందుకు దోహదపడే గుణగణాలు జనిస్తాయి. వీరంతా ఈ పరీక్షలో, తాము యోగ్యులమని ఋజువుచేసుకుంటే అల్లాహ్ సహాయం సరయిన సమయాన లభిస్తుంది. అంతకన్నా ముందే ఎవరయినా తేదలిస్తే అలా వచ్చే సహాయం కాదది."

## అకబా ప్రతిజ్ఞ-1

మరుసటి ఏడు (నబవీ శకం : 11) పన్నెండు మంది మదీనా పౌరులు మహాప్రవక్త (స)ను అకబా అనే చోట సందర్శించారు. వారు ఇస్లామ్ స్వీకరించారు. మహాప్రవక్త చేతిమీదుగా, ఇస్లామ్ ఆదేశాలను పాటించగలమని ప్రతిజ్ఞ చేశారు. ఇస్లామ్ ఆదేశాల్ని బోధించటానికి ఎవరినయినా తమతో పంపితే బాగుంటుందని కోరారు. దాని ప్రకారం హజ్రత్ ముస్అబ్ బిన్ ఉమైర్ (ర)ను వారితో మదీనాకు పంపారు మహాప్రవక్త (స). ఈయన మదీనాలో ప్రతి ఇంటికి పోయి దివ్యఖుర్ఆన్ వినిపించేవారు. ఇస్లామ్ ఛాయలోకి ఆహ్వానించేవారు. తత్ఫలితంగా ప్రతిరోజు ఒకరిద్దరు మదీనావాసులు ఇస్లామ్ స్వీకరించ సాగారు. క్రమేణా ఇస్లామ్ మదీనా పొలిమేరలు దాటి బయట కూడా వ్యాపించసాగింది. అవుస్ తెగ నాయకుడు హజ్రత్ సఅద్ బిన్ ముఅజ్ కూడా హజ్రత్ ముస్అబ్ ద్వారానే ఇస్లామ్ స్వీకరించారు. ఆయన ఇస్లామ్ స్వీకరించారంటే అవుస్ తెగ మొత్తం ఇస్లామ్ స్వీకరించినట్టే!

## అకబా ప్రతిజ్ఞ-2

ఆ తరువాతి సంవత్సరం, (నబవీ శకం:12) హజ్ కాలంలో 72 మంది మదీనా వాసులు వచ్చి రహస్యంగా అకబా అనేచోట మహాప్రవక్త (స) ద్వారా ఇస్లామ్ స్వీకరించారు. ఎలాంటి పరిస్థితుల్లోనైనాసరే ఇస్లామీయ ఉద్యమంతో శాయశక్తులా సహకరిస్తామని వాగ్దానం చేశారు. వాళ్ళలో నుంచి 12 మందిని ఎన్నుకుని మహాప్రవక్త వారిని నాయ కులుగా నియమించారు. వీళ్ళలో తొమ్మిది మంది ఖజ్‌రజ్ తెగవారూ ముగ్గురు అవుస్ తెగవారూ ఉన్నారు. మహాప్రవక్త (స) ఆ 72 మందిచేత చేయించిన ప్రతిజ్ఞలోని అంశాలు ఇవి:

★ ఒకే దేవునికి తప్ప మరెవరికీ దాస్యం చెయ్యం.
★ దొంగతనం చెయ్యం.
★ వ్యభిచారం చెయ్యం.



★ సంతాన హత్య చెయ్యం.
★ ఇతరులపై అభాండాలు మోపం.
★ దైవసందేశహరుడు (స) ఏ సత్కార్యం (మారూఫ్) చెయ్యమని ఆదేశించినా దాన్ని కాదనం.

ప్రతిజ్ఞ ముగిసిన తరువాత మహాప్రవక్త (స) వారికి ఇలా చెప్పారు, "మీరు ఈ నిబంధనల్ని పాటించారంటే మీకు స్వర్గం లభించే శుభవార్తనిస్తున్నాను. లేకపోతే మీ వ్యవహారం దైవం చేతుల్లో ఉంది. మిమ్మల్ని మన్నించడమయినా, శిక్షించడమయినా ఇక ఆయన ఇష్టం."

ఈ ప్రతిజ్ఞ జరుగుతూ ఉండగా అసద్ బిన్ జరారహ్ (ర) నిలబడి ఈ విధంగా హెచ్చరించారు, "సోదరులారా! మీరు చేసే ఈ ప్రతిజ్ఞ ఏమిటో బాగా అర్థంచేసుకోండి. వినండి, ఇది మామూలు విషయం కాదు, అరబ్బులకు, అరబ్బేతరులకు వ్యతిరేకంగా యుద్ధప్రకటన, జాగ్రత్త!" దానికి అందరూ ముక్తకంఠంతో పలికారు: "అవును, మేము, అంతా తెలిసే ఈ ప్రతిజ్ఞ చేస్తున్నాం." అప్పుడు బృందంలోనివారు కొందరు చాలా ఉత్తేజపూరితమయిన ప్రసంగాలు చేశారు. ఆ సందర్భంలోనే మదీనా ముస్లిమ్‌లకీ మహాప్రవక్త(స)కీ మధ్య ఒక ఒప్పందం జరిగింది. దాని ప్రకారం మహాప్రవక్త (స) ఎప్పు డయినా మదీనా వేంచేస్తే, మదీనావాసులు ఎట్టి పరిస్థితిలోనూ తమ బొందిలో ప్రాణ మున్నంతవరకు ఆయనతో సహకరిస్తామని ఒప్పుకున్నారు. అప్పుడే హజ్రత్ బరాఅ (ర), "మేము ఖడ్గాల ఛాయల్లో పెరిగాము" అన్న చారిత్రక సూక్తిని పలికారు.



# మహిమలు, మేరాజ్ యాత్ర

ఒక ప్రవక్త చేసే దైవదౌత్య ప్రకటనకు నిరూపణగా అల్లాహ్ తన ప్రవక్త ద్వారా చేయించే ఒకానొక అద్భుత విషయాన్ని ధార్మిక పరిభాషలో మోజిజా (మహిమ) అంటారు. దానికి ఒక షరతు వుంది. అది ప్రకృతి ధర్మానికి అతీతమైనదిగా వుండాలి. ఉదాహరణకు మంటకు కాలే గుణముంది. అయితే, అది కాలకుండా వుండటమే దానికి సంబంధించిన మహిమ; అలాగే నదులు ప్రవహిస్తూ వుంటాయి, వాటి ప్రవాహం ఆగిపోవడం, చలనరహితమైన చెట్లలో చలనం కలగటం, మృత కళేబరం సజీవమవడం, కర్రలు పాములుగా మారడం ఇత్యాది విషయాలు. విశ్వంలో జరిగే కార్యకలాపాలన్నింటికీ కారణ భూతమయినవి, అల్లాహ్ శక్తి సామర్థ్యాలు, సంకల్పాలే కాబట్టి, ఏ విధంగానయితే ఎన్నో పనులు ఆయన ఆదేశాల మేరకు ప్రకృతి సిద్ధాంతాలకు లోబడి జరుగుతాయో అదేవిధంగా అల్లాహ్ శక్తిసామర్థ్యాల కనుగుణంగానే ఆయన ఆదేశాల ప్రకారం కొన్ని పనులు ఈ ప్రకృతి సిద్ధాంతాలకు అతీతంగా, ప్రకృతికి భిన్నమయిన విధంగా జరగడం కూడా సంభవమే. అల్లాహ్ తలచినప్పుడు ఇలా జరుగుతూ వుంటుంది.

తరుచుగా, ప్రవక్తల దైవదౌత్య నిదర్శనంగా వాళ్ళకు దైవం తరఫున మహిమలు ప్రసాదించబడ్డాయి. కాని తిరస్కారులు విశ్వసించేందుకు, ధర్మం స్వీకరించేందుకు ఈ మహిమలు చాలా అరుదుగానే ఉపకరించాయి. మహిమలు ప్రదర్శించబడటమంటే, ఒక విధంగా, సందేశం అందజేసే వాదనను పూర్తిచెయ్యడమన్నమాట. అందువల్లనే మహిమలు చూసిన తరువాత కూడా జనులు ప్రవక్తను తిరస్కరించినప్పుడు వారు దైవాగ్రహానికి గురయ్యారు; దైవశిక్ష వారిపై వచ్చిపడింది; వారిని రూపుమాపటం జరిగింది. ఖురైష్ తిరస్కారులు కూడా మహాప్రవక్త (సల్లల్లాహు అలైహివసల్లమ్)ను మహిమలు చూపమని అర్థించారు. వారి ఈ అభ్యర్థనను చాలాకాలం వరకు దాటవెయ్యటం జరిగింది. అల్లాహ్ అవలంబించే విధానమే ఇది; జనులకు వారి అభ్యర్థనకు సమాధానంగా ఏవయినా విస్పష్టమయిన మహిమలు చూపిస్తే ఇక వాళ్ళకు మిగిలేవి రెండే మార్గాలు, విశ్వాసం, లేకపోతే వినాశం! దైవ సంకల్పంతో ఖురైష్ ప్రజల్ని అప్పుడే అంతమొందించే ఉద్దేశం లేదు





మదీనా - రాత్రివేళ కాంతులు వెదజల్లుతున్న మస్జిదె నబవి



కనుక, వాళ్ళ అభ్యర్థనను ఇంతవరకు మన్నించ లేదు. దైవసందేశం వైపునకు సతతం ఆహ్వానిస్తూ అప్పటికి పది పన్నెండేళ్ళు గడిచిపోయాయి. ప్రజలకు నచ్చచెప్పడానికి కూడా ఒక హద్దు అంటూ ఉంటుంది. అదీ దాటిపోయింది. అప్పుడప్పుడు మహాప్రవక్త(స) లోనూ, ఇతర విశ్వాసుల అంతర్యంలోనూ, "అల్లాహ్ తరపున ఏదయినా సూచన కనబడితే బాగుండేది, దాన్ని చూసయినా జనులు విశ్వాసం గైకొనేవారు, ఇస్లామ్ సత్యాన్ని విశ్వసించే వారు" అనే తలంపు కలుగుతూ ఉండేది. అయితే ఈ కోరికకు సమాధానంగా, అల్లాహ్ ఇలా తెలిపాడు:

"తొందరపాటుతో వ్యవహరించవద్దు, ఏ క్రమం ప్రకారం, ఏ పద్ధతి ప్రకారం సందేశ కార్యాన్ని మేము జరిపిస్తున్నామో దాన్ని అదే పంథాలో ఓర్పుతో నిర్వహించాలి. చమత్కారాలూ, మహిమల ద్వారా పని వెళ్ళబుచ్చాలంటే మేమలా ఎన్నడో చేసేవారము; మేము తలిస్తే ఒక్కొక్క అవిశ్వాసి హృదయాన్ని మెత్తబడేలాచేసేవారము; అతన్ని బలవంతంగా సన్మార్గం వైపునకు నడిపించేవారము; కాని ఇది మా పద్ధతి కాదు. ఈ విధానం వల్ల మానవుని స్వేచ్ఛను, స్వాతంత్ర్యాన్ని పరీక్షించడానికి వీలుపడదు; విజయవంతంగా కొనసాగే సామాజిక వ్యవస్థను రూపొందించగల నైతిక విప్లవమూ రాదు. అయినప్పటికీ, ఒకవేళ జనుల ఉపేక్షాభావం తిరస్కార వైఖరి కారణంగా నీవు పరిస్థితుల్ని సహనంతో సమర్థ నీయంగా ఎదుర్కొనే స్థితిలో లేకపోతే, నీకు చేతనయిన పని చేసుకో, భూమిలో దూరి, లేదా ఆకాశాన్ని అధిరోహించి ఏదైనా మహిమను ప్రకటించు"

(అల్ అన్ ఆమ్ : 35)

అయితే మహాప్రవక్తకు మహిమలు ప్రసాదించబడలేదని దీని భావం కాదు. ఆయన అందజేసిన అత్యంత గొప్ప మహిమగా చెప్పుకోవడానికి దివ్యఖుర్ఆన్ ఒక్కటే చాలు. దాని వివరాలు ముస్ముందు తగిన సమయాన వస్తాయి. ఈ మహిమే కాక ఇంకా అసంఖ్యాకమైన మహిమలు ఆయన అవసరమేర్పడినప్పుడు చూపారు. వాటిలో చంద్రుడు రెండుగా చీలడం (షక్కుల్ కమర్); ఆయన గగనసీమలో సంచరించి రావడం (మేరాజ్) అత్యంత ప్రముఖమయినవి. ఇవేకాక ఇంకా ఎన్నో భవిష్యద్వచనాలు ఆయన పలికారు. ప్రార్థనాఫలితంగా వర్షం కురియటం, ప్రజలు సన్మార్గాన్ని అవలంబించడం, అవసరం కలిగినప్పుడు స్వల్పమయిన పదార్థం అధికమవడం, వ్యాధిగ్రస్తులు స్వస్థత పొందటం, నీరు లేని చోట నీరు ప్రవహించడం లాంటి అసంఖ్యాక మయిన మహిమలు అప్పుడప్పుడు వెల్లడి అయ్యాయి.

## షక్కుల్ కమర్

మక్కా అవిశ్వాసులకు సందేశం అందజేసినట్లు వాదాన్ని పూర్తిచెయ్యడానికి చూపించిన మహిమల్లో చంద్రుడు రెండుగా చీలడం చాలా ముఖ్యమైన మహిమ. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి అల్లాహు అన్హు) ఈ సంఘటనను ఉల్లేఖించారు. ఈ ఉల్లేఖనం 'సహీహ్ బుఖారి', 'ముస్లిమ్' ఇత్యాది హదీసు గ్రంథాల్లో ఉంది. ఆయన ఈ

సంఘటనకు ప్రత్యక్షసాక్షి. తన కళ్ళారా చంద్రుడు రెండుగా చీలడం ఆయన చూశారు. ఆయన ఇలా ఉల్లేఖించారు:

"అప్పుడు మేము మహాప్రవక్త (స)తోపాటు 'మినా' అనే చోట ఉన్నాము. అకస్మాత్తుగా చంద్ర గ్రహం రెండుగా చీలిపోయింది, దాని ఒక భాగం ఒక కొండ వైపునకు జరిగింది. మహాప్రవక్త, 'మీరే సాక్షులు' అని అక్కడున్న వారితో అన్నారు".

ఇంతకు ముందే వ్రాసినట్లు మహిమ చూసిన తరువాత తిరస్కారులు తప్పక విశ్వసిస్తారన్నది సిద్ధాంతం కాదు. తిరస్కారం, ధిక్కారం మంకువైఖరి, ఎవరి అంతర్యాన్ని ఆక్రమించుకుని ఉంటాయో వారే తరచుగా మహిమల్ని కాంక్షిస్తారు. మరోవిధంగా, తమ తిరస్కారానికి సాకులు వెదుకుతూ వుంటారన్నమాట. ఎవరి హృదయాల్లో విశ్వాసం గైకొనే యోగ్యత, అర్హత, ఆ భాగ్యాన్ని పొందే యోగం వుంటుందో, ఎవరయితే అవసరా లకు, స్వార్థ ప్రయోజనాలకు, ఐహిక లాభాలకు దాసులయి వుండరో అలాంటి వారికి దైవసందేశహరుని వ్యక్తిత్వం, ఆయన బోధనలే మహా గొప్ప మహిమలుగా కానవస్తాయి. ఇలాంటి వారు సత్యాన్ని స్వీకరించడంలో అగ్రగాములయి ఉంటారు.

చంద్రభేదనం (షక్కుల్ కమర్) మహిమను చూసిన తరువాత తిరస్కారులు,"ఓహో ఇది గొప్ప ఇంద్రజాలమే, మాయలూ మంత్రాల ద్వారా ఇలాంటి అద్భుతాలు ఎన్నయినా చెయ్యవచ్చు" అని కొట్టిపారేశారు. ఈ విధంగా వాళ్ళకు రుజుమార్గం అవలంబించే మహాభాగ్యమయితే కలగలేదు. కానీ, వాళ్ళ అపరాధాల జాబితాలో మరొక ముఖ్యమయిన అపరాధం చేరిపోయింది. ఇంత ప్రస్ఫుటమయిన సూచనను వీక్షించినప్పటికీ, అల్లాహ్ ప్రవక్తను అసత్యవాది అని తిరస్కరించడం మరి మామూలు అపరాధమా?

## మేరాజ్

'మేరాజ్' అంటే అధిరోహించటం అని అర్థం. మహాప్రవక్త (స) తాను చేసిన గగనప్రయాణాన్ని ప్రస్తావిస్తూ ఈ పదం వాడటం మూలాన అయన చేసిన గగనలోక ప్రయాణానికి "మేరాజ్" అని అంటారు. దానికే "ఇస్రా" అనే మరోపేరు కూడా వుంది. "ఇస్రా" అన్న పదానికి రాత్రికి రాత్రే ప్రయాణం చేయడం అని అర్థం వస్తుంది. మహాప్రవక్త (స) చేసిన ఈ యాత్ర రాత్రికిరాత్రే జరగడంవల్ల దీన్ని "ఇస్రా" అని కూడా పిలుస్తారు. దివ్యఖుర్ఆన్‌లో ఈ పదాన్నే ఉపయోగించడం జరిగింది.

దైవప్రవక్తలకు (అలైహిస్సలామ్), సందేశప్రచారంలో, ధర్మసంస్థాపనంలో, చెయ్యవలసిన మహత్తర కార్యాలకై ఎంతో పటిష్ఠమయిన విశ్వాసశక్తి, తాము ప్రచారం చేసే ధర్మంపట్ల ఎంతో అచంచలమైన నమ్మకం కావలసి వుంటుంది. దానికిగాను, ఏ అగోచర సత్యాలను విశ్వసించవలసిందని వారు ప్రజలను ఆహ్వానిస్తున్నారో వాటిని తమ కన్నులారా చూసుకోవడం అవసరం. ఎందుకంటే ప్రపంచానికి తమ సందేశాన్ని



అందజేసేటప్పుడు వారు దాన్ని దృఢవిశ్వాసంతో ఎలాంటి జంకుగొంకు లేకుండా సమర్పించవలసివుంటుంది. "మీరు కేవలం అనుమానాలు, ఊహాగానాల ఆధారంగా ఒక నిజాన్ని తిరస్కరిస్తున్నారు. అయితే మేము కనులారా చూసిన వాస్తవికతను వివరిస్తున్నాము. మీరు అశ్రయించినది "భ్రమ" మా వద్ద ఉన్నది "జ్ఞానం" అని నొక్కి వక్కాణించవలసి వుంటుంది. అందుకే సామాన్యంగా దైవ ప్రవక్తల ఎదుట దైవదూతలు ప్రత్యక్షమయ్యారు. భూమ్యాకాశాల మహోన్నత పరిపాలనను వారికి వీక్షింపచేశారు; స్వర్గ నరకాలు వారి కనుల ముందు ప్రత్యక్షపరచబడ్డాయి. మరణానంతరం మానవునికి సంభవించే పరిస్థితులు సయితం ఈ జీవితంలోనే వారికి చూపబడ్డాయి. "మేరాజ్" లేక "ఇస్రా" కూడా ఇలాంటి సంఘటనల లోనిదే. ఒక విశ్వాసి తాను స్వయంగా చూడకుండానే మహాప్రవక్త (స)పై విశ్వాసంతో ఆయన చెప్పిన కారణంగా ఏ అగోచర సత్యాలను విశ్వసిస్తాడో అవన్నీ ఆ యాత్రలో మహాప్రవక్త(స)కు చూపడం జరిగింది.

"మేరాజ్" ఏ తేదీన సంభవించిందో సూచించే ఉల్లేఖనాలు భిన్నంగా వున్నాయి. కాని వీటన్నిటినీ పరిశీలించి సమన్వయ పరచి చరిత్రకారులు తేల్చిన దానినిబట్టి ఈ సంఘటన 'హిజ్రత్'కు దాదాపు ఒక సంవత్సరం లేదా ఒకటిన్నర సంవత్సరం ముందు జరిగి వుంటుంది. బుఖారి, ముస్లిమ్ హదీసు గ్రంథాల్లో దీనికి సంబంధించిన ఉల్లేఖనాలు గమనిస్తే మొత్తంమీద వ్యక్తమయ్యే వివరాలు ఇలా వున్నాయి – ఒకనాటి ప్రొద్దున మహాప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు:

"గత రేయి నా ప్రభువు నన్ను ఎంతో ఘనంగా గౌరవించాడు. నేను నిద్రపోతూ ఉండగా "జిబ్రీల్" వచ్చి నన్ను మేల్కొలిపారు. నన్ను కాబా గృహానికి తీసుకు వచ్చారు. ఇక్కడ ఆయన నా రొమ్మును చీల్చారు. దాన్ని "జమ్‌జమ్"★ తో శుభ్రపరిచారు. దాన్ని విశ్వాస శక్తితోను, వివేకం విజ్ఞతలతోను నింపి మూసి వేశారు. ఆ తరువాత నేను స్వారీ చెయ్యడానికి ఒక వాహనాన్ని ఇచ్చారు. అది కంచర గాడిదకన్నా కాస్త చిన్నది; తెల్లనైనది; దాని పేరు బుర్రాక్. అది ఎంతో వేగంతో పయనిస్తుంది. నేను దాన్ని ఎక్కీ ఎక్కడంతోనే మేము 'బైతుల్ మక్దిస్' (జెరుసలేము మస్జిద్)కు చేరాము. అక్కడ 'బుర్రాక్' ని మస్జిద్ ద్వారానికి కట్టివేశాము. నేను మస్జిదే అక్సాలో ప్రవేశించాను. రెండు రకాతుల నమాజ్ చేశాను. తదనంతరం జిబ్రీల్ నా ఎదుట రెండు పాత్రలు వుంచారు. . ఒక దానిలో మధుపానం, రెండో దానిలో పాలున్నాయి. నేను పాలపాత్రను స్వీకరిం చాను. మధుపాత్రను వాపసు

★ కాబా గృహంలో ఒక నిత్య సజీవమైన బావి ఉంది. దాని జలం పవిత్రమయిందని, ఆరోగ్యవంతమయిందనీ గత 4 వేల ఏండ్ల నుండి ప్రాప్తమయిన అనుభవం ద్వారా తెలుస్తోంది.

చేశాను. జిబ్రీల్ ఇది చూచి, "మీరు పాలపాత్రను స్వీకరించి సహజ ధర్మాన్ని ఆశ్రయించారు" అన్నారు.

అటు తరువాత ఆ అంతరిక్షయానం మొదలయింది. మేము తొలి ఆకాశాన్ని (భూమిని ఆవరించి ఉన్న ఆకాశాన్ని) చేరుకున్నప్పుడు అక్కడ ఉన్న రక్షకదూతతో, ద్వారం తెరవమని పురమాయించారు జిబ్రీల్. అతను "మీ వెంట ఉన్నదెవరు?" అని అడగ్గా, "ఈయన ముహమ్మద్ (స)" అని బదులిచ్చారు జిబ్రీల్. "ఈయన్ని ఆహ్వానించడం జరిగిందా?" మళ్ళీ అడిగాడు ద్వారపాలక దూత. "అవును ఆహ్వానించడం జరిగింది" అని సమాధాన మిచ్చారు జిబ్రీల్. "అయితే వీరికి సుస్వాగతం. శుభం, శుభం' అంటూ ద్వారం తెరిచాడా దూత.

మేము లోనికి వెళ్ళగానే హజ్రత్ ఆదమ్ (అలైహిస్సలామ్) ఎదురయ్యారు. "వీరు మీ నాన్నగారు (మానవ జాతికి ఆదిపురుషులు), ఆదమ్ (అ), మీరు వీరికి సలామ్ చెయ్యండి" అని పరిచయం చేశారు జిబ్రీల్.

నేను ఆయనకు సలామ్ చేశాను. ఆయన ప్రతి సలామ్ చేస్తూ, "స్వాగతం! సజ్జనుడవయిన సుపుత్రా! సజ్జనుడవయిన ప్రవక్తా!!" అని స్వాగతం పలికారు.

ఆ తరువాత రెండో ఆకాశానికి చేరుకున్నాము. ఇక్కడ కూడా మొదటి ఆకాశంలా ప్రశ్నోత్తరాలు జరిగాక ప్రవేశం లభించింది. లోనికి ప్రవేశించాక హజ్రత్ యహ్యా (యోహాను), హజ్రత్ ఈసా (యేసుక్రీస్తు) (అలైహిస్సలామ్)లతో భేటీ అయింది. జిబ్రీల్ వారికి పరిచయం చేసి "సలామ్ చెయ్యండి" అన్నారు. నేను సలామ్ చెయ్యగా వారిద్దరూ బదులిస్తూ "స్వాగతం, సత్పురుషుడవయిన సోదరా! సత్ప్రవక్తా!" అని స్వాగతం పలికారు.

ఇలాగే మూడవ ఆకాశాన్ని చేరుకున్నాము. అక్కడ హజ్రత్ యూసుఫ్ (అ) కలిశారు. మునుపటిలాగే సలామ్, ప్రతి సలామ్ జరిగింది. నాల్గవ ఆకాశాన హజ్రత్ ఇద్రీస్(అ)తోను ఐదవ ఆకాశాన హజ్రత్ హారూన్ (అ)తోను భేటీ జరిగింది. ఆరవ ఆకాశాన హజ్రత్ మూసా(అ) కలిశారు. ఏడవ ఆకాశాన హజ్రత్ ఇబ్రాహీమ్ (అ) కలిశారు. ఆయన కూడా సలామ్‌కు బదులిస్తూ "స్వాగతం! ఓ సుపుత్రా! ఓ సజ్జన ప్రవక్తా!" అని స్వాగత వచనాలు పలికారు.

ఆ తరువాత నన్ను "సిదరుతల్ మున్‌తహా" వరకు తీసుకువెళ్ళారు జిబ్రీల్. ఇది ఒక రేగిచెట్టు, (సప్తాకాశాల) అంచున వుంటుంది. దానిపైన అసంఖ్యాకంగా దూతలు మెరుపు పురుగుల్లా నిగనిగలాడుతూ ఉంటారు.

ఇక్కడ మహాప్రవక్త ముహమ్మద్ (స) ఎన్నో అగోచర యదార్థాల్ని వీక్షించారు. అల్లాహ్‌తో ప్రత్యక్షంగా మాట్లాడారు కూడా. అల్లాహ్, మహాప్రవక్త ఉమ్మత్ (అనుచర సంఘం)



కొరకు రేయింబవళ్ళలో యాభై వేళల నమాజ్ విధిగా నియమించారు. మహాప్రవక్త (స) అక్కడి నుంచి తిరిగి వస్తూవుండగా హజ్రత్ మూసా (అ) కలిశారు. ఆయన "దేవుని దివ్యసన్నిధి నుండి తెచ్చిన బహూకరణ ఏమిటో కాస్త చెప్పండి" అని అడిగారు.

"రేయింబవళ్ళలో 50 వేళల నమాజ్" అని సమాధానమిచ్చారు మహాప్రవక్త(స).

"మీ ఉమ్మత్ ఈ బాధ్యతా భారాన్ని మోయజాలదు. తిరిగి వెళ్ళండి, వాటిని తగ్గించండి" అన్నారాయన.

అలాగే మహాప్రవక్త (స) తిరిగి వెళ్ళి తగ్గించేందుకు దైవసన్నిధిలో విన్నవించు కున్నారు. అప్పుడు ఒక వంతు తగ్గించడం జరిగింది. కాని హజ్రత్ మూసా ఆయన్ని మాటిమాటికీ త్రిప్పిపంపి ప్రతి పర్యాయం కొంత తగ్గింపజేశారు. చివరికి ఆ సంఖ్య తగ్గుతూ ఐదింటికి వచ్చింది. అప్పటికీ హజ్రత్ మూసా(అ)కు తృప్తి కలగలేదు. ఇంకా తగ్గించాలని సలహా ఇచ్చారు. అయితే మహాప్రవక్త (స) ఇంకా అక్కడికి వెళ్ళి నోరు తెరవడానికే సిగ్గుగా ఉందని అన్నారు. దానికి అల్లాహ్ తరఫున ఒక వాణి వినిపించింది:

"మేము నమాజ్‌ను యాభై వేళల నుంచి తగ్గించి ఐదువేళలు చేసినప్పటికీ నీ ఉమ్మత్ (అనుచర సంఘం)లో ఎడతప్పకుండా ఎవరయితే ప్రతి దినం ఐదువేళలా నమాజ్ చేస్తారో వాళ్ళకు యాభయి వేళల ప్రతిఫలం లభిస్తుంది".

నమాజ్‌తోపాటు ఈ సందర్భంలో ఇంకా రెండు బహుమానాలు దేవుని దర్బారు నుండి అనుగ్రహించబడ్డాయి. ఒకటి, బఖరా సూరాలోని చివరి ఆయత్‌లు. వీటిలో, ఇస్లామ్ మౌలిక విశ్వాసాలు, విశ్వాసం పరిపూర్ణత చెందే వివరాలు అభివర్ణించ బడ్డాయి. ఇక కష్టకాలం సమాప్తం కావస్తోంది అనే శుభవార్త కూడా ఉంది. రెండవది, ముహమ్మద్ (స) అనుచర సంఘంలో ఎవరయితే బహుదైవారాధనకు దూరంగా ఉంటారో వారిని మన్నించి అనుగ్రహించటం జరుగుతుందనే శుభవార్త.

ఈ యాత్రలో ఆయన (స) స్వర్గ నరకాలను సయితం వీక్షించారు. మరణానంతరం ఆచరణానుసారంగా జనులు ఏయే పరిస్థితులకు గురి అవుతారో ఆ దృశ్యాలను కూడా తిలకించారు.

ఆకాశయానం నుండి తిరిగి "బైతుల్ మఖ్దిస్" వచ్చి చూస్తే అక్కడ ప్రవక్తలందరు సమావేశమయి ఉన్నారు. ఆయన (స) నమాజ్ చేయించారు. అందరూ ఆయన అనుకరణలో నమాజ్ చేశారు. ఆ తరువాత ఆయన (స)తన బసకు తిరిగి చేరుకున్నారు.

## మేరాజ్ ప్రాముఖ్యత

తెల్లవారిన తరువాత ఆయన ఈ సంఘటన గురించి అంతా వినిపిస్తే, ఖురైష్‌లోని విరోధులు ఆయన అబద్ధం పలుకుతున్నాడని తూలనాడారు. (దైవం మన్నించు గాక!) ఎవరికయితే ఆయన సత్యసంధతలోను, నిజాయితీలోనూ దృఢవిశ్వాసం ఉందో వారు

ఒక్కొక్క విషయాన్నీ సత్యమని అంగీకరించారు. మహాప్రవక్త(స) సెలవిచ్చారు కాబట్టి, ఈ వివరాలన్నీ నిజమయినవేనని రూఢీపరిచారు. ఇలా ఈ సంఘటన ఒక విధంగా ముస్లిమ్‌ల విశ్వాసానికి, మహాప్రవక్త(స) దైవదౌత్యంపట్ల నమ్మకానికి పరీక్షగా రూపొం దింది. మరొకవైపున దాని ద్వారా మహాప్రవక్త (స)కు అసంఖ్యాకమయిన నిగూఢ సత్యాలను వీక్షించే అవకాశం కలిగింది. వీటికి తోడుగా ఇస్లామీయ ఉద్యమం భావిలో ఎదుర్కోవలసి ఉన్న వ్యతిరేకతను గురించి అనతికాలంలోనే ప్రజ్వరిల్లనున్న విప్లవాన్ని గురించి సూచన కూడా మేరాజ్ ద్వారా లభించింది. ఈ సూచన వివరాలు దివ్యఖుర్‌ఆన్‌లో బనీ ఇస్రాయీల్ సూరాలో లభిస్తాయి. ఇందులోనే మేరాజ్ వర్ణన కూడా ఉంది. ఈ సూరాలో పేర్కొన్న ప్రస్ఫుటమయిన సూచనలు ఇవి:

## 1. యూదుల తొలగింపు:

బనీ ఇస్రాయీల్ (యూదులు) ఇంతవరకు దైవధర్మానికి వారసులుగా ఉంటూ వచ్చారు. వారికి దైవ సందేశమయిన ఇస్లామ్‌ను లోకానికి పరిచయం చేసే బాధ్యత అప్పగించబడింది. కాని వారు ఈ బాధ్యత నిర్వహణలో విఫలులయ్యారు. అంతేకాక, స్వయంగా వారే అనేక రుగ్మతలకు లోనయ్యారు, కనుక దైవధర్మానికి సేవచేసే యోగ్యత కోల్పోయారు. అందువల్లనే ఇక ఈ బాధ్యత బనీ ఇస్మాయీల్ (ఖురైష్)లకు అప్పగించే నిర్ణయమయింది. అందువల్లనే మహాప్రవక్త (స)ను ఈ వంశంలో ప్రభవింపచేయడం జరిగింది. ఆనాటి వరకూ దివ్య ఖుర్‌ఆన్‌లో బనీ ఇస్రాయీల్‌ని ప్రత్యక్షంగా సంబోధించటం జరగలేదు. ఇప్పుడు బనీ ఇస్రాయీల్ సూరాలో వాళ్ళకు నిక్కచ్చిగా ఇలా చెప్పివెయ్యటం జరిగింది:

"ఇంతవరకు మీరు తప్పులే చేస్తూ వచ్చారు. జరిగిపోయిందేదో జరిగిపోయింది. ఇంతకు ముందు రెండుసార్లు మిమ్మల్ని పరీక్షించటం జరిగింది. మీ పరిస్థితులేమీ మెరుగుపడలేదు. ఇక ఈ ప్రవక్త (స) ప్రభవన తరువాత మీకు మరొక అవకాశం లభిస్తోంది. ఈయన్ని అనుసరించారంటే మీరు తిరిగి ప్రగతిమార్గాన ముందంజ వెయ్య గలుగుతారు"

ఆనాడు మక్కాలో అత్యంత దుర్భరమయిన పరిస్థితుల్లో, ముస్లిములకు నిలువ నీడ కూడా లేని ఆ అవస్థలో ఈ సూచన ఎంతో వింతయిన శుభవార్త! ఎంతో గొప్ప మాట!! తరువాతి కాలంలో ఈ సూచన పూర్తిగా నిజమయిందనడానికి చరిత్రే సాక్ష్యం.

## 2. మక్కా తిరస్కారులకు హెచ్చరిక:

మక్కా తిరస్కారుల దురాగతాలు, మంకుతనాలు బాగా ముదిరాయి. "ఈయన గారు అల్లాహ్ సందేశహరులే అయితే మా తిరస్కారానికి పర్యవసానంగా ఈయన హెచ్చరించే ఆ దైవాగ్రహం, శిక్ష మాపై వచ్చి పడదేమిటీ?" అని వాళ్ళు మాటిమాటికీ దెప్పిపొడిచేవారు. దీనికి సమాధానంగా వారిని ఈ విధంగా హెచ్చరించటం జరిగింది:



"అల్లాహ్ పద్ధతి ఏమంటే, ఒక జాతి వద్దకు అల్లాహ్ సందేశహరుడు రానంతవరకు దానిపై ఎలాంటి శిక్ష, ఆపద వచ్చిపడవు. దైవప్రవక్త వచ్చేసిన మీదట ఆ జాతిలోని శ్రీమంతులు, ఉన్నత వర్గానికి చెందిన వారు ఆ సత్య సందేశాన్ని సమూలంగా తుడిచి పెట్టాలని చూస్తారు. కొందరు సత్యాభిలాషులు ముందుకు వచ్చి సత్యాన్ని మనసారా స్వీకరించేవారు మినహాయించి సామాన్యులందరూ సర్వసాధారణంగా ఆ ఉన్నత వర్గం వారికి తోడ్పడటానికి సిద్ధమవుతారు.

అప్పుడు ఆ రెండు వర్గాల మధ్య సంఘర్షణ మొదలవుతుంది. దాని మీదట దైవవిశ్వాసులకు దైవసహాయం లభిస్తుంది. ఈ సహాయం అందడానికి ఒక గడువు అంటూ నిర్ణయమై ఉంటుంది. కాని మనిషి సహజంగా తొందరపాటు కలవాడవటంచేత, వాస్తవంగా తనకు ఉపకరించని పదార్థాన్ని శ్రేయస్కరమయిందని భావించి దాన్నే కోరుకుంటాడు. కాని అసలు అది అతనికి హానికరమైనదయివుంటుంది. ఇలా కాంక్షించేటప్పుడు, అల్లాహ్ కార్య కలాపాలన్నింటికీ సరయిన సమయాలు నిర్ణయమయి ఉన్నాయన్న విషయాన్ని అతను విస్మరిస్తాడు. రేయింబవళ్ళనే చూడండి. ఇవి అల్లాహ్ సృష్టికి చిహ్నాలు, ఒక నిర్దుష్టమయిన వ్యవస్థలో ఒకదాని తరువాత ఒకటి క్రమం తప్పకుండా వస్తూపోతూ వుంటాయి. గతించిన చరిత్రనే పరిశీలించండి: నూహ్(అ) నుండి నేటి వరకు ఎన్ని జాతులు అంతం చెయ్యబడ్డాయో గమనించండి. అల్లాహ్‌కు తన దాసుల పరిస్థితులన్నీ పూర్తిగా తెలుసు ఆయన వారికి వారి యోగ్యతల ప్రకారం ప్రతిఫలాన్ని ప్రదానం చేస్తాడు. కనుక మక్కా తిరస్కారులు కూడా సావధానంగా ఈ విషయాన్ని అర్థం చేసుకోవాలి. ఇప్పుడు దైవప్రవక్త అందజేసే సందేశం పట్ల వారు అవలంబించే వైఖరిని బట్టే వారితో వ్యవహరించటం జరుగుతుంది. నిర్ణయాత్మకమయిన సమయం అనతి కాలంలోనే రానున్నది".

## 3. ఇస్లామీయ సమాజానికి ప్రాతిపదికలు:

ఇస్లామ్ అణిగి మణిగి వుండే కాలం సమాప్తం కావస్తోంది; ఇస్లామీయ సిద్ధాంతాల ఆధారంగా నిర్మాణం కానున్న సమాజం రూపొందబోతోంది. కాబట్టి ఇస్లామీయ జీవన వ్యవస్థకు ప్రాతిపదికలయిన సిద్ధాంతాల్ని బహూకరించడం సయితం ఈ మేరాజ్‌లోనే జరిగింది. ఈ మౌలిక సూత్రాలే ఆ తరువాత ఇస్లామీయ జీవన వ్యవస్థకు, ఇస్లామీయ రాజ్యానికి, నిర్దేశిక సూత్రాలుగా ఉపకరించాయి.

### ఆ సూత్రాలు ఇవి:

1. అల్లాహ్‌కు సాటిగా మరే ఇతర శక్తినీ ఆరాధ్య శక్తిగా ఎంచకూడదు. ఆయన ఆరాధన, ఆయన దాస్యం, ఆయనకు విధేయత, ఆయనకు గల పాలనా అధికారాల్లో ఇతరులెవ్వరినీ ఆయనకు సహవర్తులుగా భావించకూడదు.

2. తల్లిదండ్రుల ఎడల గౌరవం, విధేయతాభావాలు కలిగి ఉండాలి. అయితే దేవుని విధేయతకు ప్రతిముఖంగా తల్లిదండ్రుల విధేయత ఎదురయితే అలాంటప్పుడు తల్లిదండ్రుల విధేయత పాటించనవసరం లేదు.

3. బంధువులు, బాటసారులు, అనాథల పట్ల తారసిల్లే బాధ్యతల్ని నిర్వర్తించాలి. సంఘంలో ఒక మనిషి ఎడల మరొక మనిషికి గల విధ్యుక్త ధర్మం పట్ల ఉపేక్ష చూపకూడదు. వీటిని సరిగ్గా నిర్వహించాలి. లేకపోతే నాగరికత పునాదులే సవ్యంగా కుదరవు.

4. ధనం వ్యర్థంగా ఖర్చు చెయ్యకూడదు. దైవం ప్రసాదించిన అనుగ్రహాల్ని తప్పుడు మార్గాన వ్యయపరచడం షైతాను కార్యం. ఏ సమాజంలోనయితే జనులు కళ్ళు మూసుకుని వ్యయపరుస్తారో లేదా చేతులు కట్టుకుని "నిధిసర్పం" లా ధనంపై చుట్టచుట్టుకుని కూర్చుంటారో అలాంటి సమాజం ఎన్నటికీ సుభిక్షం, సుఖశ్రేయాలతో కళకళలాడుతూ మనజాలదు. ధనం వెచ్చించడంలోను, వ్యయాన్ని అదుపులో ఉంచుకోవడంలోనూ మధ్యస్త మార్గాన్ని అవలంబించాలి.

5. బీదరికం దాపురిస్తుందన్న భీతితో సంతాన హత్యకు ఒడికట్టకండి. ఉపాధిని చేకూర్చటం దేవుని బాధ్యత, అయనే దాని ఏర్పాటు చేస్తాడు. "రేపటికి వీళ్ళేం తింటారు?" అన్న సంశయంచేత సంతానాన్ని హతమార్చకూడదు. ఇది మహా పాతకం. సామాజిక ఆత్మహత్యా సదృశం.

6. వ్యభిచారం దాపుక్కూడా పోకూడదు. ఇది ఒక అభిశాపం లాంటిది, ఈ మహా పాపం నుండి దూరంగా ఉండటమే కాక దానికై పురికొలిపే ప్రేరక సాధనాలన్నింటినీ, ప్రేరణల్ని రూపుమాపాలి. ఏ సమాజమయితే ఈ అభిశాపా న్నుండి దూరంగా వుండదో అది తనంటత తానే అంతమవుతుంది.

7. నిష్కారణంగా ఎవరినీ హత్య చెయ్యకూడదు. ప్రజల ప్రాణాలు సురక్షితంగాలేని సమాజం ప్రగతిని సాధించలేదు. ప్రశాంత వాతావరణం లేకుండా ఏ సంస్కృతీ వికాసమొందజాలదు. కనుక అన్నిటికంటే ముందు జనుల ధన ప్రాణాల రక్షణ అత్యవసరం.

8. అనాథల ఎడల మంచిగా మసలుకోవాలి. అధమస్థితికి లోనైనవారు, తమ హక్కుల పరిరక్షణ చేసుకోలేని వారు సహాయానికి అర్హులు. ఇలాంటి దళిత వర్గాలకు రక్షణ లేని సమాజం సర్వతోముఖమైన ప్రగతిని సాధించజాలదు.

9. చేసిన వాగ్దానాలను నెరవేర్చాలి. వాగ్దానాలను గురించి ప్రశ్నించడం తథ్యం. వాగ్దానం అంటే జనులు పరస్పరం చేసుకునే వాగ్దానాలు, ఒప్పందాలు అనీ, ఒక విశ్వాసి తాను విశ్వసించినప్పుడు తన ప్రభువుతో చేసే ప్రమాణం అని కూడా భావం.



10. కొలతల్లో, తూకంలో, కొలమానాల్ని, తూనికల్ని నికార్సుగా ఉంచాలి. ఇచ్చి పుచ్చుకోవడాల్లో వ్యవహారాల సవ్యత, పరస్పర హక్కుల పరిరక్షణ సమాజ వికాసానికి, సమాజంలో శాంతి భద్రతల సుస్థాపనకు ఎంతో దోహదపడతాయి. జనుల్లో పరస్పర విశ్వాసమే శూన్యమయినచోట, ఇతరుల హక్కుల్ని కాజేసే ప్రవృత్తి ప్రబలి ఉన్న చోట - అన్యోన్య ప్రేమాభిమానాలు, విశ్వసనీయత, తృప్తికర మైన వాతావరణం ఎన్నటికీ నెలకొనజాలవు.

11. మనిషి తనకు తెలియని విషయంలో అనవసరంగా తల దూర్చకూడదు. ఏమీ తెలియని పరిస్థితిలో అలాంటి విషయాల్లో గుచ్చి గుచ్చి తెలుసుకునే ప్రయత్నం చెయ్యడం మూలాన కారణరహితంగా అనుమానాలు పుట్టే ఆస్కారం వుంది. ఊహల ఆధారంగా ఒక అభిప్రాయం కుదుర్చు కోవడంవల్ల వ్యవహారాలు పెడదారిన పడతాయి. మంచి సమాజం అన్న తరువాత అది ఈ కీడు నుండి సురక్షితంగా ఉండాలి. తన కళ్ళు, చెవులు, మనస్సు అన్నింటినీ ప్రశ్నించటం జరుగుతుందనే స్పృహతో మానవుడు మెలగాలి.

12. ధరణిపై గర్విష్టిగా నడవకూడదు. గర్వం, అహంభావం, మనిషిని అతినీచమైన లక్షణాల్ని అలవరుచుకునేందుకు పురికొలుపుతాయి. ఈ దుర్గుణం వల్ల మనిషి సమాజానికి చీడపురుగులా పరిణమిస్తాడు. పరస్పర అనుబంధాలు సక్రమంగా సంతోషదాయకంగా ఉండాలంటే మనుషులు ఇతరుల్ని తమకన్నా నీచులుగా, అధములుగా భావించ కూడదు, వారితో అమానుషంగా ప్రవర్తించకూడదు.

### 4. హిజ్రత్ సూచనలు:

ఒక జాతిలోకి అల్లాహ్ తన సందేశహరుణ్ణి పంపినట్లయితే, ప్రజలు ఆ ప్రవక్త సందేశాన్ని విని అర్థం చేసుకుని, దాన్ని స్వీకరించడానికి వారికి ఆయన చాలాకాలం వరకు అవకాశం ఇస్తాడు. ఇది అల్లాహ్ విధానం. ఈ సందేశాన్ని కొందరు స్వీకరిస్తారు; కాని అధిక సంఖ్యలో జనం, ఐహిక లాభాల ఊబిలోనుండి, పూర్వుల అంధానుసరణ, మనోకాంక్షల వ్యూహంలో నుండి బయటపడ జాలక సందేశాన్ని తిరస్కరిస్తారు, దాన్ని వ్యతిరేకిస్తారు. చివరికి ఆ జాతిలో సందేశాన్ని స్వీకరించే అర్హత, యోగం కలవారంతా దాన్ని స్వీకరించారనీ, ఇక మిగిలిన వారు దీన్ని పెడచెవిన పెట్టేవారే తప్ప సావధానంగా ఆలోచించేవారు కారనీ తీర్పుజరిగే సమయం ఆసన్నమవుతుంది.

ఈ దశ ఆ జాతి ప్రజలు ప్రవక్తను మహిమలు చూపమని అర్థిస్తారు. అలాగే మహిమలు కూడా చూపబడతాయి. మహాప్రవక్త (స)ను సయితం ఈ దశలో ఖురైష్ ప్రజలు

మహిమలు చూపెట్టమని అర్థించారు. వాటిని మహాప్రవక్త (స) చూపగా వారు చూశారు కూడా. అయితే ఇదంతా జరిగినప్పటికీ తిరస్కారులు తమ తిరస్కారాన్ని వదలక పొయ్యేసరికి, ఇక ఈ ప్రవక్త ఈ జనసముదాయం నుంచి వేరుపడవలసిందే అని దైవం వద్ద నిర్ణయమయింది. - అప్పుడే ఈ జాతివారిని కఠినంగా శిక్షించడానికి వీలవుతుంది. ఈ శిక్షకూడా రకరకాలుగా అవతరించవచ్చు. ఒక్కొక్కప్పుడు భూమ్యాకాశాలు ప్రకృతి శక్తుల ద్వారా ప్రకృతి వైపరీత్యాల రూపంలో అసన్నమవుతుంది. ఉదాహరణకు భూకంపం, వరదలు తుఫానుల ద్వారా, మరొకప్పుడు విశ్వాసుల చేతులతో ఈ శిక్షను ఇప్పించడం జరుగుతుంది. కనుక బనీ ఇస్రాయీల్ సూరాలో అల్లాహ్ తన పద్ధతిని విశదీకరించాడు. "తమ హృదయ కాఠిన్యత మూలంగా ఈ జనులు, మీరు ఈ నగరాన్ని (మక్కాను) వదిలివెళ్ళడం తప్ప గత్యంతరం లేని పరిస్థితులు కల్పిస్తారు. అలాంటప్పుడు వీరూ ప్రశాంతంగా ఇక్కడ ఉండజాలరు. మీకంటే ముందు మేము ఎంతమంది ప్రవక్తల్ని పంపామో వారందరిపట్లా ఈ రీతినే అనుసరించటం జరిగింది. ఇప్పుడు కూడా మా ఈ పద్ధతిలో ఎలాంటి మార్పూ జరగబోదు."

## 5. తహజ్జుద్ ప్రార్థన, దాని ప్రాముఖ్యత

దీనికి తోడు ఈ పరిస్థితులన్నింటిని ఎదుర్కొవటానికిగాను నమాజ్‌ను, అందునా ముఖ్యంగా 'తహజ్జుద్' (రాత్రివేళ) నమాజ్‌ను పాటించవలసిందని ఆదేశించటం జరిగింది. అలాగే హిజ్రత్ (వలస) కొరకు ప్రార్థించవలసిందని కూడా ఉద్బోధించడం జరిగింది. ప్రవక్తా! నీ ప్రభువును ఇలా వేడుకో : "ప్రభూ! నన్ను మంచి ప్రదేశానికి చేర్చు, ఇక్కణ్ణుంచి నన్ను మేలయిన విధంగా వెలికితియ్యి. నీ కటాక్షం వల్ల శత్రువులపై నాకు విజయాన్ని కలగజెయ్యి".

తరువాత "సత్యమే విజయాన్ని పొందుతుందని, మిథ్య నామరూపాల్లేకుండా సమసిపోతుందని, సత్యం రంగంలో ఉంటే మిథ్య సమసిపోవడం తథ్యం" అని శుభవార్తను తెలుపడం జరిగింది.

ఆ తరువాత మక్కా తిరస్కారుల వితండవాదాలు, ఆక్షేపణలు అన్నింటికీ సమాధానాలివ్వబడ్డాయి. ఈ విధంగా అన్నివిధాలా సందేశం వారికి అందజెయ్యబడిందనే వాదాన్ని పూర్తి చెయ్యడం జరిగింది. చివరిలో వారికి గుణపాఠం గరపాలని హజ్రత్ మూసా (అ) గాథలను కూడా ప్రస్తావించటం జరిగింది.

## ఆ కాలంలో సందేశం

ఆ కాలంలో అవతరించిన ఖుర్‌ఆన్ భాగాలు పరిస్థితుల దృష్ట్యా కొన్ని ప్రత్యేకతలు కలిగిఉన్నాయి.



### 1. అల్లాహ్‌పై భారం మోపడం, ఓర్పు వహించడం

ఒక పనికై మానవుడు కృషి చేసినప్పుడు ప్రతిఫలం అతను ఆశించిన దానికిభిన్నంగా ప్రాప్తమయితే నిరాశా నిస్పృహలకు లోనవుతాడు. ఇది మానవ నైజం. సత్య సందేశ ప్రచారమే లక్ష్యంగా జీవిస్తున్నవారు అలాంటి సందర్భంలోనే అతిజాగ్రత్తగా వ్యవహరించ వలసి ఉంటుంది. ఒకవేళ, వారు నిరాశకు గురిఅయ్యారంటే ఇది వారికి, వారి సందేశానికీ గొడ్డలిపెట్టు. ఇలాంటి పరిస్థితుల్లోనే నిలకడగా ఉండడానికి, ఫలితాన్ని దేవునిపై వదిలివేసి నిరంతరం కృషి చేస్తూ ఉండటానికి ఎంతో దృఢమయిన విశ్వాసం అవసరం. ఈ దశలో ఇలాంటి శిక్షణాత్మకమయిన విషయాలకు సంబంధించిన అల్లాహ్ ఆదేశాలు విశేషంగా అవతరించాయి. దాదాపు 12 సంవత్సరాలు ఎడతెగని కృషి పర్యవసానంగా లభించిన ప్రతిఫలం ఒక సామాన్య దృష్టికలవాడినైతే నిరుత్సాహపరుస్తుంది. ఇంత సుదీర్ఘ కాలం గడిచినప్పటికీ ఎదురవుతున్న అగచాట్లు కూడా ఏమాత్రం తక్కువగా లేవు. అందువల్ల విశ్వాసుల అంతర్యాల్ని ధైర్యస్థయిర్యాలతో శక్తిమంతం చెయ్యడానికి ఈ కాలంలో విశేష శ్రద్ధ తీసుకోబడింది.

ఈ సందర్భంగా "అన్‌కబూత్" సూరాలోని విషయాలు ఉదహరించ తగ్గవి. ఈ సూరాలో విశ్వాసులతో విస్పష్టంగా చెప్పడం జరిగింది.

"మీరు అనుసరించడానికి నిర్ణయించుకున్న ఈ మార్గంలో పరీక్షా ఘడియలు, ఆపదలు అనివార్యమయిన ఘట్టాలు. ఇది ఒక గీటురాయి, దీనిపైన పరీక్షించిన తరువాతే తమ విశ్వాసవాదనలో సత్యవంతులెవరో అసత్యవంతులెవరో విచక్షణ చెయ్యడం సాధ్యపడుతుంది. అయితే విశ్వాసులను ఇలా పరీక్షకు గురిచెయ్యడమంటే, వారికి వాస్తవంగా విజయం లభిస్తుందన్న భావం మాత్రం కాదు. వారు కూడా బాగా తెలుసు కోవాలి. దేవునికి ప్రతికూలంగా వారు విజయం సాధించలేరు. ఎట్టకేలకు సత్యమే ఉన్నతమవటం తథ్యం - అయితే సత్యాన్ని ఆశ్రయించిన వారు తమ సహన స్థయిర్యాల ద్వారా తాము దైవసహాయానికి అర్హులమని రుజువు చేసుకోవాలి. ఈ మార్గంలో విభిన్నమైన అవాంతరాలు ఎన్నో ఎదురవుతాయి. కాని వాటివల్ల ఎవరూ నిరాశా నిస్పృహలకు గురికారాదు. వీరికంటే ముందు ఇస్లామీయ సందేశ పతాకాన్ని చేపట్టిన అల్లాహ్ దాసులందరూ ఇలాంటి పరిస్థితులకే లోనవవలసి వచ్చింది."

హజ్రత్ నూహ్(అ) గాథను ప్రస్తావించి, ఆయన ఏ విధంగా తొమ్మిదిన్నర వందల సంవత్సరాల వరకు ఓర్పు, నిలకడలతో తన జాతి వారి విరోధాన్ని వ్యతిరేకతను ఎదుర్కొన్నారో వినిపించటం జరిగింది; అలాగే హజ్రత్ ఇబ్రాహీమ్ (అ), హజ్రత్ లూత్(అ), హజ్రత్ షుఐబ్(అ), హజ్రత్ సాలిహ్ (అ), హజ్రత్ మూసా (అ) కూడా ఇలాంటి పరిస్థితులకే గురికావలసి వచ్చింది; కాని చివరికి సత్యమే జయించింది; మిథ్యావాదనలు రంగం నుంచి పలాయనమయ్యాయి అని తెలుపడం జరిగింది.

## 2. ఖుర్ఆన్ - ఒక మహిమ

ఇంతకు ముందు వివరించినట్లు తిరస్కారులు మహిమ చూపమని కోరినప్పుడు, స్వయంగా మహాప్రవక్త (స)కు, విశ్వసించినవారికీ, 'ఏదైనా ఒక మహిమ చూపగలిగితే బాగుండేది, దాన్ని చూసి అయినా ఈ వ్యక్తులు ఇస్లామ్‌ను స్వీకరిస్తారేమో!' అన్న కోరిక కలిగేది. ఈ కోరికలకు సమాధానంగా అల్లాహ్ ఇచ్చిన ఆదేశాలు ఇంతకు ముందే వివరించాము. అయితే ఈ సందర్భంలో అల్లాహ్ తన అంతిమ సందేశహరుని అద్వితీయమైన మహిమను విస్పష్టంగా సూచించాడు. మహిమలు అర్థించే జనుల్ని ఉద్దేశించి మీరు మహిమలనయితే కోరుతున్నారు. కాని మీ కళ్ళముందు కనబడే ఈ మహత్తరమైన మహిమను గమనించలేకపోతున్నారు. దీన్ని కాస్త గమనించండి. ఇది, ప్రపంచం మనగలిగి నంతవరకు మానవాళి విస్మరించలేని గొప్ప మహిమ. ఇది బుద్ధీ వివేకాలున్న మనుషు లందరికీ మార్గదర్శకం. ఈ మహిమ దివ్య ఖుర్ఆన్. వాస్తవం ఏమిటంటే మహాప్రవక్త (స)కు అనుగ్రహించబడ్డ మహిమలన్నింటికంటే మహత్తరమయిన, గొప్పదయిన మహిమ ఈ ఖుర్ఆన్ గ్రంథమే.

ఈ కాలంలోనే అవతరించిన 'అన్‌కబూత్' సూరాలో శ్రోతలను సంబోధించి ఈ విధంగా సెలవీయబడింది.

"దైవదౌత్య నియామకానికి ముందు మహాప్రవక్త (స) ఎలాంటి గ్రంథవిద్యను అభ్యసించలేదని, ఆయనకు చదవను, వ్రాయను కూడా రాదని తెలియని వారు వీరిలో ఎవరున్నారు? అయితే ఆయన ఇప్పుడు అందచేస్తున్న ప్రవచనాలు ఎంత ఉన్నతమయినవి, ఎంత భావగర్భితమయినవి, ఎంతగా మర్మ హేతువుతో నిండినవి?? వీరిలోని మహా గొప్ప విద్వాంసుడు, పండితుడు కూడా ఇలాంటి మధురవాణిని సమర్పించలేకపోతున్నాడు. అంతటి మహత్తరవాణి ఒక నిరక్షరాస్యుని నోట వెలువరించబడుతుండగా, ఇంకా ఏదో మహిమ కావాలని కోరుతున్నారు వీరు, వీరితో చెప్పి వెయ్యండి. మహిమ ప్రదర్శించ బడటం, లేక ప్రదర్శించబడకపోవడం అంతా నా ప్రభు ఆజ్ఞ మేరకే జరుగుతుంది. నేను రాబోయే పరిణామాన్ని గురించి సూచించి మిమ్మల్ని హెచ్చరించేవాణ్ణి మాత్రమే. అయితే నా దైవ దౌత్యానికి నిదర్శనంగా నేను వినిపించే దైవ ప్రవచనాలు మీరు నమ్మడానికి చాలవా అన్న విషయం మాత్రం మీరు ఆలోచించాలి. మీరు యోచిస్తే మీకే బోధపడు తుంది. ఈ ప్రవచనాలు పరిపూర్ణంగా కారుణ్య స్వరూపాలు, సుబోధకమైన ఉపదేశాలు. అయితే ఎవరి ఆంతర్యాల్లో విశ్వాస భాగ్యం పొందడానికి తగిన యోగ్యతలు ఉన్నాయో వారే వీటి ద్వారా లాభం పొందగలరు".

దివ్యఖుర్ఆన్‌ని స్వయంగా మహాప్రవక్త (స)కూడా మహోన్నతమయిన మహిమగా పేర్కొన్నారు. "ప్రవక్తల్లో ప్రతివారికీ అల్లాహ్ అనేక మహిమలు ప్రసాదించాడు. వాటిని చూసి జనులు వారిని విశ్వసించారు. నా కొరకు అల్లాహ్ అవతరింపజేసిన వాణి (దివ్య



ఖుర్ఆన్)యే నాకు అల్లాహ్ ప్రసాదించిన మహోజ్వలమైన మహిమ. అందుచేత తీర్పుదినం నాడు నా అనుయాయుల సంఖ్య అందరినీ మించి వుంటుందని ఆశిస్తున్నాను".

దివ్య ఖుర్ఆన్ చిరకాలం మనగలిగే మహిమ. ఇతర మహిమలు తాత్కాలికమైనవి, అవి అంతమైపోతాయి. కాని ఈ మహిమ ప్రళయదినం వరకు చిరస్థాయిగా వుంటుంది. జనుల్ని తనవైపు ఆకర్షించుకుంటూ వుంటుంది. పవిత్ర ఖుర్ఆన్‌లో కానవచ్చే విషయ క్రమం. దాని ఇతివృత్తంలోని సువ్యవస్థ, దాని భావగర్భితమైన ఉత్తమ శైలి, దాని భాషాపరమైన స్వచ్ఛత, వినేవారి హృదయాల్ని ఇట్టే చూరగొనే దాని మనోజ్ఞమైన శిష్ట అరబీ భాష మానవ మస్తిష్కానికి అందని విషయాల్ని సయితం అవలీలగా బోధపరిచే దాని మనోజ్ఞమైన భావ ప్రకటనా విధానం, అత్యంత విజ్ఞత, వివేకాలతో నిండిన దాని బోధనలు, మానవ జీవితానికి, మానవ నైజానికి హత్తుకునే సముచితమైన దాని ఆదేశాలు, ఉపదేశాలు అన్నీ దివ్యఖుర్ఆన్ ప్రత్యేకతల్లో కొన్ని మాత్రమే. అలాంటి సర్వతోముఖమైన సమగ్ర జీవనవ్యవస్థను మరొకదాన్ని ప్రపంచం నేటి వరకూ కానలేకపోయింది. దానిలో ప్రస్తావించబడ్డ విషయాల్లో ఇంత వైవిధ్యం ఉన్నప్పటికీ వాటిలో ఎలాంటి వైరుధ్యానికి తావులేకపోవడం - అన్నింటికీ మించి, ఇంతటి మహత్తరమయిన వాణిని అందజేసిందెవరు? అది సామాన్య పరిభాషలో "నిరక్షరాస్యుడయిన" వ్యక్తి. ఇవన్నీ దివ్య ఖుర్ఆన్ ఒక మహాగొప్ప మహిమే అనటానికి ఎదురులేని నిదర్శనాలు. ఈ నిదర్శనాలను, తార్కాణాలను సావధానంగా పరిశీలించినట్టయితే నేడయినాసరే ముహమ్మద్ (స) దైవదౌత్యంపట్ల మనస్సుకు తృప్తి లభించగలదు; లభిస్తోంది కూడా.

## 3. నిర్ణయాత్మకమయిన మాట

ఈ దశలో అవతరించిన వాణిలోని విశేషమేమంటే ఇప్పుడు, ధర్మ తిరస్కారుల్ని నిష్కర్షగా ఎలాంటి మొహమాటం లేకుండా సంబోధించటం జరిగింది. ఆ సంబోధనా ధోరణి ఎలా ఉండేదంటే, ఇంతవరకు మిమ్మల్ని బోధపరచడానికి, నచ్చచెప్పడానికి, చేసిన ప్రయత్నాలు చాలు. స్వీకరించాలని వుంటే ఇప్పటికీ పోయిందేమీ లేదు; అవకాశ ముంది. స్వీకరించండి, లేదా మీ తిరస్కారానికి, మొండితనానికి ప్రతిఫలం అనుభవించ డానికి సిద్ధంగా వుండండి.

ఇంకా ఈ విధంగా చెప్పబడింది. "నేను అవలంబించిన విధానానికి నా ప్రభువు తరఫున వచ్చిన ఒక ప్రస్ఫుటమయిన ప్రమాణమే ఆధారం. కాని మీరు దాన్ని తిరస్కరిస్తు న్నారు. ఇంకా ఈ తిరస్కృతికి పర్యవసానంగా రానున్న శిక్ష రావాలని కాంక్షిస్తున్నారు. అయితే ఒకటి మాత్రం మీతో స్పష్టంగా చెప్పివేస్తున్నాను, మీరు త్వరపడుతున్న ఆ విషయం నా అధీనంలో లేదు. దాని నిర్ణయం అల్లాహ్ హస్తగతమైవుంది. నా చేతులలో ఉంటే వ్యవహారాన్ని ఎప్పుడో ముగించేవాణ్ణి. దేవుడే సర్వ పరిజ్ఞాని, ఆయనకే అగోచర విషయాల

జ్ఞానముంది. ఏ కార్యానికి ఏ సమయం సముచితమయిందో ఆయనకు తెలుసు. మీపై తాను తలచినప్పుడు ఆ శిక్ష పడేలా చేయగలిగే శక్తి సామర్థ్యాలు ఆయన కున్నాయి".

ఇంకా కాస్త ముందుకు వెళ్ళి ఈ సందర్భంలో ఈ విధంగా బోధించటం జరిగింది; "ఎవరైతే ధర్మ సంబంధమైన విషయాన్ని చెలగాటంగా భావిస్తున్నారో, ఐహిక జీవితంలోనే మత్తుగొని ఉన్నారో వారిని వారి పరిస్థితికే వదలివేయండి. కాని ఈ ఖుర్‌ఆన్‌ని నిరంతరం వినిపిస్తూ ఉండండి. అప్పటికీ వినకపోతే వారితో చెప్పివేయండి, "జనులారా! మీకు ఇష్టమైన విధంగా మీరు ఆచరిస్తూ ఉండండి. నేనూ నా స్థానాన ఆచరిస్తూ ఉంటాను. పరిణామం మీ ముందు ప్రత్యక్షమవుతుంది. అప్పుడు సన్మార్గంపైన ఉన్నదెవరో తెలుసు కుంటారు". (అల్ అన్ ఆమ్ సూరా: 60-70; 134, 135 ఆధారంగా)

ఆనాటి ప్రవచనాలకు ఇదొక ఉదాహరణ. ఇదికాక అప్పుడు అవతరించిన దైవవాణిలో సామాన్యంగా ఈ ధోరణి ప్రస్ఫుటంగా గోచరించేది. వ్యవహారం ఒక నిర్ణ యాత్మకమైన ఘడియలో ప్రవేశించనున్నదని ఇదొక ప్రకటన అన్నమాట.

## 4. హిజ్రత్ కొరకు సంసిద్ధత

ఇంతేకాక హిజ్రత్ (వలస) కొరకు విస్పష్టమయిన సూచనలు సయితం తరచుగా ఈ దశలో అవతరించిన ప్రవచనాల్లో గోచరిస్తాయి. అన్‌కబూత్ సూరాలో ఈ విధంగా సెలవీయబడింది:

"నా దాసులారా! దాస్యభావం నాయెడల మాత్రమే కలిగి ఉండండి. నా దాస్యం వల్ల మీస్వదేశం మీకై ఇరుకైనా దాన్ని లెక్కచెయ్యకండి, నా భూమి చాలా విశాలమయింది. అంటే ఇల్లూ వాకిలీ విడిపోయినా నా దాస్య బంధం విడిపోరాదు. ఒక ప్రాణానికి అత్యంత అపాయకరమయిన విషయమేముంది? అది ప్రాణాపాయమే కదా! అయితే ఒకటి మాత్రం బాగా తెలుసుకోవాలి. పుట్టినవాడు గిట్టడం తథ్యం. మరణించిన పిదప నా వద్దకు రావటమూ ఖాయమే. అలాంటప్పుడు నా మార్గంలోనే మృత్యువు ఎదురయితే చింత దేనికి? ఎవరైతే విశ్వాసమూ, సదాచారాల నిధి తెస్తారో వారికొరకు ఉద్యానవనాల్లో సుఖదాయకమైన బస ఏర్పాటు చెయ్యబడుతుంది. వాటిలో సెలయేళ్ళు ప్రవహిస్తూ ఉంటాయి. వారక్కడే శాశ్వతంగా ఉంటారు. సదాచారపరాయణులయిన వారికి ఎంత మంచి ప్రతిఫలం! వీరు కఠినాతి కఠిన పరిస్థితుల్లోనూ అల్లాహ్ ధర్మమార్గాన నిలకడగా ఉన్నారు. తాము పడే ప్రతి శ్రమకూ తమ ప్రభువుపైనే భారం మోపారు."

ఇంకా కొన్ని విషయాలు తెలుపబడ్డాయి. దైవ మార్గాన ఇల్లూ వాకిలీ వదలడంలో కలిగే మరొక సంశయం ఆర్థిక దురవస్థకి సంబంధించినది. ఈ సందర్భంలో ఉపాధికి సంబంధించిన వ్యవహారమంతా దైవం హస్తగతమై వుందనే విశ్వాసం నొక్కిచెప్పబడింది. "భూమిపై సంచరించే ఎన్నో ప్రాణులున్నాయి. అవి తమ తమ ఆహారం తమ వెంట మోసుకువెళ్ళవు. కాని అల్లాహ్ వాటి ఉపాధిని సమకూర్చి ఇస్తాడు. వాటి ఆహారం ఏర్పాటు



చేస్తాడు. అయితే మీరే ఆయన దాతృత్వం పట్ల సందేహంతో, ఉపాధి కల్పించడని నిరాశ చెందడం దేనికి?"

ఇంకా ఈ దశలో అవతరించిన ఒక సూరా 'బనీ ఇస్రాయీల్'లో హిజ్రత్ కొరకు ప్రార్థించవలసిందిగా ఉపదేశించబడింది. ఈ విధంగా అర్థించాలని ప్రార్థన కూడా నేర్ప బడింది:

"ప్రభువా! ఉత్తమమైన ప్రదేశానికి నేను వెళ్ళే అవకాశం నాకు కల్పించు, (మక్కా నగరం నుండి) సవ్యమైన రీతిలో బయటికి చేర్చు, శత్రువుల పట్ల నీ తరపున నాకు విజయాన్ని, సహాయాన్ని చేకూర్చు".

"ఇంకా ప్రవక్తా! ఎలుగెత్తి చాటండి. సత్యం ప్రత్యక్షమయింది, మిథ్య సమసి పోయింది, మిథ్యకు సమసిపోవటమే గతి."

ఇవి, ఇటువంటి అనేక సూచనలు అప్పుడు అవతరించిన ప్రవచనాల్లో గోచ రిస్తాయి. వీటిలో ఒకవైపున రానున్న విప్లవాన్ని గురించి సూచనలు చెయ్యబడ్డాయి. రెండోవైపున ఈ గడ్డు పరిస్థితుల్ని ఎదుర్కొనేందుకు అవశ్యమయిన తయారీ గురించి పదే పదే హెచ్చరించడం జరిగింది. మరణానంతర జీవితానికి సంబంధించిన సజీవమైన, దృఢవిశ్వాసం; ఐహిక సుఖసంపదల కాంక్షల్ని అంతర్యాన్నుండి వెలికితీయడం; స్వచ్ఛమైన ఏకేశ్వరభావాన్ని, అది కోరే బాధ్యతల్ని మనోజ్ఞంగా బోధపరచడం, అల్లాహ్ తప్ప మరే ఇతర ఆధారానికి హృదయంలో తావునివ్వకపోవడం; కేవలం ఆయనపైనే పరిపూర్ణంగా భారం మోపడం; అల్లాహ్ వైపు నుంచి అవతరిస్తున్న ఆదేశాలను హెచ్చుతగ్గులు లేకుండా జనులకు అందజేస్తూ ఉండటం; ఈ కార్యాలన్నింటినీ సాధించటానికి నమాజ్ వ్యవస్థ స్థాపన ద్వారా, దాన్ని దీక్షా ఏకాగ్రతలతో పాటించడంద్వారా శక్తిని పొందటం, ఇత్యాది ప్రాతిపదికలపై ముస్లిముల శిక్షణ జరుగుతూ ఉంది. దీనికి తోడుగా ఆ విషమ పరిస్థితుల్లోనూ ధర్మప్రచారానికి అవసరమైన నిర్దేశాలు ఇవ్వబడుతూ ఉండేవి.



# హిజ్రత్

ఇస్లామీయ పరిభాషలో కేవలం అల్లాహ్‌కి సమ్మతమైన ధర్మాన్ని పరిరక్షించడానికి స్వదేశాన్ని వదలి, ధర్మపరమైన బాధ్యతలు నెరవేరే ఇతర ప్రదేశానికి వలసపోవడం 'హిజ్రత్' అనబడుతుంది. వ్యాపార వ్యవహారాల కోసమో, ఆస్తిపాస్తుల కోసమో, బంధు మిత్రుల కోసమో, ఇస్లామీయ జీవితం గడపటానికి సాధ్యంకాని చోట, ధర్మసందేశాన్ని అందజేసేందుకు స్వేచ్ఛలేనిచోట నివాసం ఏర్పరచుకుని ఉండిపోవడం ముస్లిములకు ధర్మసమ్మతం కాదు.

ఇక్కడ ఒక విషయం క్షుణ్ణంగా అర్థం చేసుకోవడం సమంజసం. అల్లాహ్‌కి సమ్మతమయిన ధర్మాన్ని స్వీకరించిన వ్యక్తి ఇస్లామ్ తిరస్కృతి పునాదిగా స్థాపించబడ్డ మిథ్యా వ్యవస్థలో జీవితం గడపటం రెండు పరిస్థితుల్లో మాత్రమే ధర్మసమ్మతమవుతుంది. ఒకటి, ఆ భూభాగంలో ఇస్లామ్ ఉన్నతి కోసం పాటుపడటం కోసం, తిరస్కార వ్యవస్థను ఇస్లామీయ వ్యవస్థగా మార్చడానికి అవిరళ కృషిచేయడం కోసం – ఇంతవరకు ముస్లిములు మక్కాలో ఉంటూ, ఈ మార్గంలో ఎనలేని బాధల్ని భరిస్తూ వచ్చిన విధంగా – జీవితం గడపటం. రెండవది, అక్కణ్ణుంచి బయటపడటానికి అతనికి దారి కానరాకపోవటం వల్ల లేదా ఇస్లామీయ జీవితం గడపటానికి, ఇస్లామ్ వ్యవస్థను స్థాపించేందుకు కృషి చేయడానికి అవకాశమున్న ప్రదేశం అతనికి లభించకపోవటం వల్ల అక్కణ్ణుంచి వెళ్ళలేక పోవడం. * కానీ, ధర్మం కోరే షరతులు నెరవేరడానికి వీలున్న చోటు ప్రాప్తించే సూచనలు కనపడగానే అక్కడికి వలసపోవాలి –మదీనాలో ఇప్పుడు అలాంటి అవకాశాలు గోచరిస్తున్న విధంగా అవకాశాలున్నట్లయితే. అలాంటి పరిస్థితుల్లో కేవలం మరీ అసమర్థులు, బలహీనులు, వ్యాధివల్లనో, ధనాభావంవల్లనో ప్రయాణానికి శక్తిలేని వారు మాత్రమే మన్నించబడతారు.

---

★ *హిజ్రత్ చెయ్యడం కోసం దారుల్ ఇస్లామ్ ('ఇస్లామీయ రాజ్యం') ఉండాలన్న నిర్బంధం మాత్రం లేదు. ముస్లిములు తిరస్కారపరమైన ఆజ్ఞల్ని పాలించడాన్ని తప్పుకోవా లంటే మరే మార్గం లేకపోతే వారు ఏదైనా అడవిలోనో, కొండలోనో పోయి బస చేయడమే చాలు. ముస్లిం దృష్టిలో "విశ్వాసాన్ని" పరిరక్షించడమే అన్నింటికన్నా ప్రధానం.*



## మదీనాకు ముస్లిముల వలస

మదీనాలో ఇస్లామ్ ప్రచారం కొంతవరకు జరిగిన మీదట, మక్కాలో అవిశ్వాసుల చేత బాధలకు గురవుతున్న సామాన్య ముస్లిములను మదీనాకు వలసపోవడానికి అనుమతించారు మహాప్రవక్త (సల్లల్లాహు అలైహివసల్లమ్). ఇది చూసిన తిరస్కారులు, ముస్లిములను మరీ అధికంగా బాధించసాగారు. తమ బారి నుండి వీరు తప్పించుకు పోకుండా సర్వ విధాలా ప్రయత్నించసాగారు. కాని తమ ధన ప్రాణ సంతానాలను అపాయాలకు గురిచేసి అల్లాహ్ ధర్మానికై స్వస్థలాన్ని వదలటానికే ఇష్టపడ్డారు విశ్వాసులు. ఎలాంటి ప్రలోభం, ఎలాంటి ఒత్తిడి వారి సంకల్పాలను నిలువరించలేక పోయ్యాయి. క్రమంగా అనేకమంది సహాబా (మహాప్రవక్త సహచరులు) మదీనా వెళ్ళిపొయ్యారు. చివరలో మహాప్రవక్త, హజ్రత్ అబూబక్ర్, హజ్రత్ అలీ మాత్రమే మిగిలారు. ఇంకా కొందరు నిరుపేదలైన ముస్లిములు ధనాభావం చేత ప్రయాణానికి సిద్ధం కాలేకపోయారు.

## హత్య కుట్ర

దైవదౌత్యపు పదమూడవ సంవత్సరం ప్రారంభం అయినప్పటికే చాలా మంది సహాబా (సహచరులు) మదీనాకు వలసపొయ్యారు. మదీనాకు వెళ్ళి ముస్లిములు శక్తిని పుంజుకోవడం వారి ద్వారా ఇస్లామ్ పరివ్యాప్తి చెందటం మక్కా ఖురైష్‌లు సహించలేక పొయ్యారు, వారు ఎంతో వ్యాకులపడ్డారు. ఇక ఇస్లామ్‌ను తుదముట్టించవలసిందే అన్న నిర్ణయానికి వచ్చి మార్గాలు అన్వేషించసాగారు.

మక్కా సామూహిక సమస్యల్ని చర్చించుకునే "దారున్నద్వ" అనే ప్రదేశం ఉండేది. అక్కడ అన్ని తెగల నాయకులు గుమికూడి ఈ ఉద్యమాన్ని అణచివేయడానికి సమాలోచనలు జరిపారు. కొందరు, మహాప్రవక్తను సంకెళ్ళతో బంధించి ఎక్కడయినా బందీగా పడ వెయ్యాలని ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదన స్వీకరించబడలేదు. ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లమ్) అనుయాయులు ఆయన్ని విడిపించుకునిపోయే ఆస్కార ముందనీ, వారిని ఎదిరించి తాము ఓడిపోతామేమోననీ సంశయం వెలిబుచ్చారు కొందరు. మరొక ప్రతిపాదన, ఆయన్ని దేశ బహిష్కరణ చేయాలని వచ్చింది. దీన్ని కూడా ఎవరూ అంగీకరించలేదు. ముహమ్మద్ (స) ఎక్కడికి వెళ్ళినా అక్కడే ఆయన అనుయాయులు ఉద్భవిస్తారు. తత్కారణంగా ఈ ఉద్యమం అభివృద్ధిచెందే అవకాశాలు అధికమవుతాయని వారి భయం.

చివరికి అబూజహల్ ఒక ప్రతిపాదన ముందుంచాడు: ప్రతి తెగలో నుంచి ఒక్కొక్క యువకుణ్ణి ఎన్నుకోవాలి. వారంతా చేరి ముహమ్మద్ (స) పై ఒక్కసారిగా దాడిచేయాలి. ఈ విధంగా ఆయన్ని హతమార్చాలి. ఆ హత్యానేరం అన్ని తెగలపై పడుతుంది. అలాంటప్పుడు హాషిమ్ వంశంవారికి తెగలన్నింటితో ఒంటరిగా తగవుకు ఒడికట్టడం సాధ్యపడదు. ఈ ప్రతిపాదనను అందరూ ఒప్పుకున్నారు. ఒకనాటి రేయి ఈ కార్యం జరగాలని తీర్మానించుకున్నారు. ఆ రాత్రి యువకులందరూ ఆయన ఉంటున్న ఇంటిని చుట్టుముట్టాలని, ప్రాతః

కాలన్నే ఆయన బయటికి వచ్చినప్పుడు తమ పని ముగించుకోవాలని నిర్ణయించుకున్నారు. (అరబ్బులు రాత్రివేళ రహస్యంగా మరొకరి ఇంట చొరపడటం ఇష్టపడరు!)

దైవవశాత్తు శత్రువుల ఈ రహస్య కుతంత్రాలన్నీ మహాప్రవక్త (స)కు తెలుస్తూనే ఉన్నాయి. ఆయనక్కూడా మక్కా వదలి మదీనాకు వలస వెళ్ళాలని దైవవాణి ద్వారా ఆదేశం లభించింది. తదనుగుణంగా ఆయన హజ్రత్ అబూబక్ర్ (రజి అల్లాహు అన్హు)తో సంప్రదించి తనతోబాటు ఆయన కూడా ప్రయాణంలో తోడు ఉండాలని నిర్ణయించు కున్నారు. ప్రయాణానికి ఒంటెలు సయితం ఎన్నుకున్నారు. కొంత ప్రయాణసామాగ్రి కూడా సిద్ధపరచుకున్నారు.

## మక్కానుంచి ప్రయాణం

ఖురైష్ తిరస్కారులు మహాప్రవక్త (స)ను హత్య చేయడానికి నిర్ణయించుకున్న రాత్రి ఆయన హజ్రత్ అలీని పిలిచి, "హిజ్రత్ చేయాలని (వలసపోవాలని) నాకు ఆదేశం లభించింది. ఈ రాత్రి నేను మదీనాకు వెళ్ళిపోతున్నాను. నా వద్ద ఎందరో అమానతులు (అప్పగింతలు) పొందుపరచారు. వీటిని రేపు పొద్దున నీవే వారికి తిరిగి అప్పగించి వెయ్యి, ఈ రాత్రికి నా పడక మీద నీవు పడుకో, చూసే వారికి నేను ఇంట్లోనే ఉన్నాననే భ్రమ కలిగేలా" అని చెప్పారు.

ఖురైష్ తిరస్కారులు ఒక వైపున ఆయన రక్తపిపాసులైనా, మరొకవైపున ఆయన విశ్వసనీయత, నిజాయితీతత్పరతల్ని కాదనలేకపోయేవారు. తమ ధనాన్ని, వస్తు సామాగ్రిని ఆయన వద్ద అప్పగింతగా భద్రపరచుకునేవారు.

రాత్రివేళ అవిశ్వాసులు మహాప్రవక్త(స) ఇంటిని చుట్టుముట్టారు. బాగా చీకటిపడిన తరువాత ఆయన ప్రశాంతంగా ఇంటినుంచి బయలుదేరారు. అప్పుడు ఆయన యాసీన్ సూరా ఆయత్‌లను పారాయణం చేస్తూ ముందుకు నడిచారు. గుప్పెడు మన్ను తీసుకుని దాన్ని "షాహతిల్ వుజూహ్" (రూపాలు చెడిపోవుగాక) అంటూ అవిశ్వాసులవైపు విసిరారు. అలాగే వాళ్ళ మధ్య నుండి వెళ్ళిపోయ్యారు. అప్పుడు అల్లాహ్ మహిమవల్ల చుట్టుముట్టిన వాళ్ళు ఏమరుపాటుకు లోనై మహాప్రవక్త (స) వారి మధ్య నుండే పోతున్నా చూడలేక పోయారు. ఆ తరువాత ఆయన హజ్రత్ అబూబక్ర్ ఇంటికిపోయి, అక్కణ్ణుంచి ఆయన వెంట మక్కా వెలుపల ఉన్న "సౌర్" గుహలోకిపోయి తలదాచుకున్నారు.

## సౌర్ గుహలో రక్షణ

హజ్రత్ అబూబక్ర్ కుమారుడు హజ్రత్ అబ్దుల్లా అప్పుడు చిన్నప్రాయంలో ఉన్నారు. ఆయన రాత్రిళ్ళు ఈ మహనీయుల వద్ద గడిపి తెల్లవారు జామున మక్కా వచ్చేవారు. అక్కడ తిరస్కారులు చేస్తున్న సమాలోచనలను గురించి తెలుసుకుని, తిరిగివెళ్ళి దాన్ని



వారిద్దరికీ తెలిపేవారు, కొంత చీకటిపడిన తరువాత హజ్రత్ అబూబక్ర్ సేవకుడు పాలు తెచ్చి ఇచ్చేవాడు. ఇంటి నుండి భోజనం వచ్చేది. ఈ విధంగా మూడు రాత్రులు ఆ ఇద్దరు మహనీయులు అక్కడే బసచేశారు.

మక్కా నుండి బయలుదేరిననాడు తెల్లవారిన తరువాత మహాప్రవక్త మక్కా నుండి వెళ్ళిపొయ్యారని తెలుసుకున్న తిరస్కారులు అయోమయంలో పడ్డారు. ఆయన్ని వెదుకుతూ నలుప్రక్కలా గాలించసాగారు. ఒకసారి వెదుకుతూ వెదుకుతూ సరిగ్గా మహాప్రవక్త(స), హజ్రత్ అబూబక్ర్‌తో కలిసి దాగివున్న గుహ వద్దకు వచ్చేశారు. వాళ్ల కాళ్ళ చప్పుడు విని కాస్త కంగారుపడ్డారు హజ్రత్ అబూబక్ర్ ఆయనకు తన ప్రాణభీతి ఏ మాత్రం లేదు, కాని అల్లాహ్ సందేశహరునికి ఏదయినా హాని వాటిల్లుతుందేమో అని ఆయన భయం! మహాప్రవక్త (స) ఆయన ఆందోళన చూసి ఎంతో ప్రశాంతంగా ఆయన్ని ఓదార్చారు. "లాతహజన్ ఇన్నల్లాహ మఅనా" "భయపడకు, అల్లాహ్ మనకు తోడుగా ఉన్నాడు" అని ఓదార్చారు.

అలాగే జరిగింది. దైవ మహిమతో అక్కడ ఏర్పడిన సూచనల వల్ల★ చూసిన వారు గుహలో ఎవరూ ప్రవేశించలేదనే భావించారు.

ఈ ప్రయత్నాలకు తోడుగా, ఎవరయినా ముహమ్మద్ (స)ను సజీవంగా బంధించి కానీ, ఆయన కళేబరాన్ని కానీ తెస్తే వారికి వంద ఒంటెల బహుమానం ప్రకటించారు మక్కా నాయకులు. ఈ ప్రకటన విని ఎందరో దురాశాపరులు ఆయన్ని వెదకటానికి బయలుదేరారు.

## మదీనా వరకు

నాలుగవ రోజున మహాప్రవక్త (స) గుహ నుంచి వెలుపలికి వచ్చారు. ఒక దినం మరొకరాత్రి ఎలాంటి అంతరాయం లేకుండా ప్రయాణించారు. ప్రయాణంలో హజ్రత్ అబూబక్ర్ సిద్ధపరచిన రెండు ఉన్నత జాతి ఒంటెలు దారి చూపటానికి నియమించుకున్న వ్యక్తి తోడు ఉన్నారు. రెండవ రోజు మధ్యాహ్నం వేళ ఎండ బాగా ముదరటం వల్ల ఒక కొండశిల నీడలో కొంతసేపు విశ్రాంతి తీసుకున్నారు. దగ్గరలోనే గొర్రెల కాపరి ఒకడు కన్పించాడు. అతని మేకల పాలు తాగి అక్కణ్ణుంచి తిరిగి ప్రయాణం సాగించారు. బయలుదేరుతుండగా ఒక వ్యక్తి, "సురాకా బిన్ జాషిమ్" అనే వాడు మహాప్రవక్తను గుర్తు పట్టాడు. ఇతను బహుమానం లభిస్తుందన్న లాలసతో ఆయన్ని వెదుక్కుంటూ బయలుదేరిన వ్యక్తి. ఆయన్ని చూసిన వెంటనే తన గుర్రాన్ని దౌడు తీయిం చాడు. కానీ కాలుకు ఏదో

---

★ *అప్పటికప్పుడు, గుహ ద్వారాన ఒక సాలె పురుగు గూడు నేయగా ఒక పావురం కూడా గూడు కట్టుకున్నట్లు కథనాలున్నాయి. వీటిని చూసి చాలాకాలంగా ఇందులో ఎవరూ అడుగు పెట్టలేదనే భావమే కలుగుతుంది.*

అడ్డు తగిలి గుర్రం పడిపోయింది. అతను సంభాళించుకుని, తిరిగి పట్టుకోడానికి ప్రయత్నించాడు. ఇప్పుడు దైవవశాత్తు అతని గుర్రం కాళ్ళు మోకాళ్ళ వరకు నేలలో దిగబడిపొయ్యాయి. సురాకా భయంతో గజగజలాడ సాగాడు. ముహమ్మద్ (స)ను హతమార్చడం తన వల్లకాని పని అని తెలుసుకుని, మహాప్రవక్త శరణుజొచ్చాడు. మహాప్రవక్త అతన్ని మన్నించి శరణమిచ్చారు. ఇది కూడా మహాప్రవక్త మహిమల్లో ఒక మహిమే.

## మదీనాకు ఆగమనం

మహాప్రవక్త (స) మదీనాకు విచ్చేస్తున్నారన్న సమాచారం నగరంలో ముందే అందింది. నగరం మొత్తం ఆయన రాకకై ఎదురుచూస్తోంది. పెద్దలూ, పిల్లలూ అంతా ప్రాతఃకాలాన్నే ఊరి వెలుపలికి పోయి మధ్యాహ్నం వరకు నిరీక్షించి తిరిగి వచ్చేవారు. చివరికి ఒక రోజున వారు నిరీక్షిస్తున్న ఆ శుభఘడియ ఆసన్నమయింది; దూరం నుండే ఆయన వస్తున్నట్లు సూచనలు గమనించారు. నగరమంతా తక్బీర్ నినాదాలతో మారుమోగింది. ఎదురుచూస్తున్న ప్రతి హృదయ కమలం వికసించింది. మదీనాకు మూడు మైళ్ళ దూరాన 'కబా' అనే ప్రదేశం ఉంది. అక్కడ 'అన్సార్' (సహాయకు)ల చాలా కుటుంబాలు నివసిస్తూ వుండేవి. వాటిలో 'అమ్ర్ బిన్ ఔఫ్' వంశానికి ఒక విశిష్టత వుంది; దానికి నాయకుడు "కుల్సూమ్ బిన్ అల్‌హదమ్" అందరికంటే ముందు ఆయన ఆతిథ్యాన్నే స్వీకరించారు మహాప్రవక్త (స). ఆ ఘనత ఆయనకే దక్కింది. ఆయన ఇంట్లోనే మహాప్రవక్త బస కూడా చేశారు. మహాప్రవక్తకు మూడు దినాల తరువాత బయలుదేరిన హజ్రత్ అలీ కూడా ఆ లోపల ఆయన్ని కలుసుకున్నారు; ఆయన కూడా అక్కడే బస చేశారు; 'కబా' చేరిన తేది - నబువ్వత్ పదమూడవ ఏట, రబీవుల్ అవ్వల్ మాసం ఎనిమిదవ తారీఖు (క్రీ.శ. 622, సెప్టెంబర్, 22వ తేది). కబాలో ఉన్నప్పుడు ఆయన చేసిన మొదటి కార్యం ఒక మస్జిద్ నిర్మాణం. ఆయన తన స్వహస్తాలతో దాని పునాదిరాయి వేశారు. ఇంకా, ఇతర సహాబా (సహచరుల)తో కలిసి దాన్ని నిర్మించారు, కొన్ని రోజులు కబాలో బస చేసి ఆయన తిరిగి మదీనా నగరం వైపునకు వెళ్ళారు. ఆనాడు శుక్రవారం. త్రోవలో బనీసాలమ్ వీధి వద్ద జుహర్ (మధ్యాహ్నం) నమాజ్ వేళ అయింది. అప్పుడాయన తొలిసారిగా శుక్రవారం ప్రసంగం (జుమా ఖుత్బా) చేశారు. అప్పుడే తొలిసారిగా జుమా నమాజ్ కూడా చేశారు. మదీనాలో ప్రవేశించిన తరువాత ఆయనకై తమ ప్రాణాలనయినా అర్పించడానికి సిద్ధంగా ఉన్నవారు, ఆయన తమ ఆతిథ్యం స్వీకరించాలని తహతహలాడసాగారు. ప్రతి తెగవారూ వచ్చి "హుజూర్! ఇదో ఇల్లు, ఇక్కడ బసచెయ్యండి" అంటూ తమ ఇండ్లు చూపుతూ విన్నవించుకోసాగారు. జనుల ఆనందోత్సాహాలకు అంతులేదు. ప్రతి హృదయం ఆయన శుభ పాదాల ధూళిగా మారడానికి ఉవ్విళ్ళూరుతోంది. ప్రతి అంతర్యం ఆయనకై ఆత్మ సమర్పణకు ఉరకలు వేస్తోంది. మహిళలు, బాలికలు ఇండ్లపైకెక్కి పాడుతున్నారు:



పూర్ణచంద్రుడుదయించాడు,
'విదా' పర్వత శిఖరాల మధ్య,
అభివందనాలు, దైవానికి ధన్యవాదాలు;
ప్రార్థనలు చేసే వారు ప్రార్థించగా
అభినందనాలు చెల్లించడం మా ధర్మం.

అమాయక బాలికలు చిన్న డప్పు వాయిస్తూ గానం చేస్తున్నారు:

నజ్జార్ వంశ బాలికలం మేము
ఎంత మంచి పొరుగు దొరికింది మాకు
ఆయనే ముహమ్మద్
సల్లల్లాహు అలైహి వసల్లమ్-

ఆయన ఈ బాలికలతో "నేనంటే మీకు అభిమానమా?" అని లాలనగా అడిగారు. "అవును" బదులిచ్చారు అమాయకంగా ఆ బాలికలు, "అయితే నేనూ మిమ్మల్ని అభి మానిస్తున్నాను" అన్నారాయన ప్రేమతో!

## మదీనాలో బస

మదీనా చేరిన తరువాత ఎవరి ఆతిథ్యం స్వీకరించాలి? అన్న ప్రశ్న ఉత్పన్న మయింది. ఇది నిర్ణయించడం సులువుకాదు. తన ఒంటె ఏ గృహం ముందు నిలిస్తే వాళ్ళకే ఈ సేవ దక్కుతుందని మహాప్రవక్త (స) సెలవిచ్చారు. తదనుగుణంగా ఈ ఘనత హజ్రత్ అబూ అయ్యూబ్ అన్సారీకి లభించింది. ప్రస్తుతం ప్రవక్త మస్జిద్ ఉన్న ప్రదేశానికి సమీపంలోనే అప్పుడు ఆయన ఇల్లు వుండేది. అప్పుడు అది రెండు అంతస్తుల భవనం. అన్సారీ (ర), ఆయన కొరకు పై అంతస్తును కేటాయించారు. కాని జనుల రాకపోకలకు అనువుగా క్రింది అంతస్తునే ఎన్నుకున్నారు మహాప్రవక్త (స). హజ్రత్ అబూ అయ్యూబ్ (ర) ఆయన సతీమణి పై అంతస్తులో ఉండేవారు.

మహాప్రవక్త (స) ఏడు మాసాలు అయ్యూబ్ ఇంటనే బసచేశారు. ప్రవక్త మస్జిద్ వద్ద ఆయన బస కోసం గదులు నిర్మించబడిన తరువాత, అక్కడికి మకామ్ మార్చారు. కొన్ని దినాల్లోనే ఆయన కుటుంబ సభ్యులు కూడా మదీనాకు వచ్చేశారు.

## ప్రవక్త మస్జిద్ నిర్మాణం

మదీనాలో నివాసమేర్పరచుకున్న తరువాత అన్నిటికంటే ముఖ్యమైన మొట్టమొదటి కార్యం ఒక మస్జిద్ నిర్మాణం. ఆయన బసచేస్తున్న ప్రదేశానికి సమీపంలోనే కొంత భూమి నిరుపయుక్తంగా పడి వుండేది. అది ఇద్దరు అనాధలకు సంబంధించింది. వాళ్ళకు దాని వెల ఇచ్చి ఆ స్థలం సేకరించటం జరిగింది. దానిపై 'మస్జిదున్నబవీ' (ప్రవక్త మస్జిద్) కట్టడం ప్రారంభించారు. ఈ సందర్భంలోనూ, ఒక సామాన్య కూలివానిలా ఆయన అందరితో

కలిసి పనిచేశారు. రాళ్ళు కూడా మోసేవారు. ఈ మస్జిద్ చాలా నిరాడంబరంగా, అతి సాధారణంగా నిర్మించబడింది. పచ్చి ఇటుకల గోడలు, ఖర్జూరపు మట్టల కప్పు, ఖర్జూరపు మొద్దుల స్తంభాలు, ఈ మస్జిద్ 'కిబ్లా' (నమాజ్ చేసేదిశ) బైతుల్ మఖ్దిస్ (జెరుసలేమ్) దిశగా ఉండేది. ఎందుకంటే, అంతవరకు జెరుసలేమే ముస్లిమ్‌ల 'కిబ్లా'గా ఉండేది. తరువాత 'కిబ్లా' కాబా గృహం వైపునకు మార్చినప్పుడు మస్జిద్‌ను సయితం తదనుగుణంగా మరమ్మత్తు చెయ్యటం జరిగింది. మస్జిద్ నేల మట్టి. వర్షం కురిస్తే నేల అంతా బురద అయ్యేది, కొంతకాలానికి రాళ్ళు పరచారు. మస్జిద్‌కు ఒక ప్రక్కగా ఒక అరుగు ఉండేది. దాన్ని 'సుప్ఫా' అనేవారు. ఇల్లూ వాకిలీ లేని అనాథల విడిది అది.

మస్జిద్ నిర్మించబడిన తరువాత దాని సమీపంలోనే మహాప్రవక్త (స) సతీమణుల కొరకు గదులు కూడా నిర్మించబడ్డాయి. ఇవి కూడా పచ్చి ఇటుకలతో ఖర్జూరపు తడికలతో నిర్మించబడ్డాయి. ఈ గదులు దాదాపు 10 అడుగుల వెడల్పు, 15 అడుగుల పొడవు కలిగి ఉండేవి. వాటి కప్పును లోపలి నుండి చేయి చాచి అందుకోవచ్చు. ద్వారాలపై కంభలి తెరలు వుండేవి.

మహాప్రవక్త (స) గృహానికి పరిసరాల్లో ఉన్న ధనికులయిన అన్సార్ (సహాయకులు) సహచరులు ఆయన కొరకు కొద్దిగా పాలు పంపేవారు. అప్పుడప్పుడు ఏదయినా కూర పంపేవారు. అంతే, వాటి మీదే ఆధారపడి జీవితం ఎంతో కష్టంతో గడిచేది.

## సహోదరీకరణ

తమ ఇల్లూ, వాకిలీ వదలి మక్కా నుండి మదీనాకు వచ్చిన ముస్లిములు సామాన్యంగా అందరూ నిరాధారులే. వాళ్ళలో ధనికులయిన వారు కూడా తమ సంపదల్ని, వస్తు సామగ్రిని మక్కా నుండి తేలేకపొయ్యారు. ఉన్నదంతా వదలివేసి వట్టి చేతులతో రావలసి వచ్చింది. వీళ్ళను ముహాజిర్లు (వలస వచ్చిన వారు) అంటారు. ఈ ముహా జిర్లంతా అన్సార్లు (సహాయకులు) అనబడే మదీనా ముస్లిములకు అతిథులే అయినప్పటికీ వారి సుస్థిర నివాసానికిగాను ఏదయినా ఏర్పాట్లు చేయవలసిన అవసరం కలిగింది. వారంతా తమ కష్టార్జితంతోనే జీవితం గడపాలని భావించారు. అందువల్ల 'ప్రవక్త మస్జిద్' నిర్మాణం పూర్తవగానే మహాప్రవక్త (స) ఒక రోజు అన్సారుల్ని పిలిచి, "ఈ ముహాజిర్లు మీ సోదరులు" అని సెలవిచ్చారు. ఒక అన్సారీని, మరొక ముహాజిర్‌ని పిలిచి "నేటి నుండి మీరిద్దరూ పరస్పరం సోదరులు" అని సోదరబంధం కుదిర్చారు. ఇలాగే ముహాజిర్లనందరినీ అన్సార్ల సోదరులుగా చేసివేశారు. అంతే, చిత్తశుద్ధిగల అల్లాహ్ దాసులు నిజమయిన సోదరులుగానే వ్యవహరించారు - సోదరులకంటే అధిక అన్యోన్యతతో మెలిగేవారుగా, కష్టసుఖాల్లో ఆదుకునేవారుగామారారు. అన్సారులంతా, ముహాజిర్లను తమ తమ ఇండ్లకు తీసుకు



వెళ్ళారు. తమకున్న ఆస్తిపాస్తులు లెక్కంతా చూపి ఇందులో సగం మీది, సగం మాది అని పంచిపెట్టారు. తోటల రాబడిని, పొలాల పంటను, ఇంటి సామగ్రిని, ఇల్లు, ఆస్తిపాస్తులు, ఒకటేమిటి ప్రతి దానినీ సొంత సోదరుల్లా పంచుకున్నారు. ఇల్లూ వాకిలీలేని ఈ ముహాజిరులంతా తృప్తిగా, సుఖంగా జీవితం గడపసాగారు, వారిలో చాలా మంది ముహాజిర్లు వ్యాపారం కూడా ప్రారంభించారు. అంగళ్ళు తెరిచారు. ఇంకా ఇతర పనుల్లో నిమగ్నులయ్యారు. ఈ విధంగా ముహాజిర్ల పునరావాస కార్యక్రమం పూర్తయింది. కొంత వరకు ఈ ముహాజిర్లను గురించి స్థిమితం లభించింది.



# కొత్త దశలో ఇస్లామీయ సందేశం

## ఉద్యమం

హిజ్రత్‌కు ముందు ఇస్లామ్ సందేశం మక్కా బహుదైవారాధకులకు అందజెయ్యబడేది. వారికి ఇస్లామ్ సందేశం ఒక కొత్త విషయమే. అయితే హిజ్రత్ తరువాత మదీనాలో యూదులు తటస్థపడ్డారు. వీరు ఏకేశ్వరవాదం, దైవ దౌత్యం, మరణానంతర జీవితం, దైవదూతలు, దైవవాణి–వీటన్నింటినీ ఎరిగినవారు, వీటిని నమ్మేవారు కూడా. ఇంకా దైవప్రవక్త అయిన హజ్రత్ మూసా (అలైహిస్సలామ్) అనుయాయులైన కారణంచేత తాము దైవం పంపిన ఒక షరీఅత్‌ను (శాసనాన్ని) అనుసరించే వాళ్ళం అని కూడా చాటుకునేవారు. సూత్రప్రాయంగా వారి అసలు ధర్మం మహాప్రవక్త (సల్లల్లాహు అలైహి వసల్లమ్) ఆహ్వానిస్తున్న ఇస్లామ్ ధర్మమే. అయితే శతాబ్దాల తరబడి వారు దానిపట్ల చూపిన ఉపేక్షవల్ల వాళ్ళలో ప్రబలిపోయిన కీడులు ఇన్నీ అన్నీ కావు. వారి జీవితం నిజమయిన దైవిక శాసనాలకు, వాటి నియమాలకు బహుదూరమయి పోయింది. వాళ్ళలో వందలకొద్ది వక్రభావాలు, కొత్త ఆచారాలు, విభిన్న సంప్రదాయాలు జనించాయి. 'తౌరాత్' (Torah) వాళ్ళ వద్ద ఉన్న మాట నిజమే, కాని అందులో వారు అధిక భాగం మానవకల్పిత వచనాల్ని ప్రక్షిప్తం చేశారు. మిగిలిపోయిన దైవిక ఆజ్ఞలకి యధేచ్ఛగా అర్థాలు తీస్తూ, వ్యాఖ్యానాలు చేస్తూ, తమ మనోవాంఛలకు అనువయినా రూపాలనిస్తూ వాటి నిజరూపాలనే మార్చి వేశారు. దైవ ధర్మంతో వారి సంబంధం ఎంతో బలహీనమైపోయింది. సాముహికంగా వారిలో లెక్కకు మిక్కిలిగా కీడులు పొడసూపాయి. తత్కారణంగా వారిలో ఎవరైనా సన్మార్గం చూపే సజ్జనుడు ప్రభవించినా, వారతని మాటను ససేమిరా వినలేదు. పైగా అతన్ని తమ పరమ శత్రువుగా భావించారు. అన్ని విధాలా అతని మాటను అణచడానికి ప్రయత్నించారు. వీరు వాస్తవానికి మౌలికంగా "ముస్లిము"లే అయినా, ఇప్పుడు తమ వాస్తవికతనే విస్మరించారు. వీరిలో ఉత్పన్నమైన మార్గవిహీనత ఫలితంగా వారి అసలు ధర్మమేదో వారికే గుర్తులేకుండా పోయింది.



ఈ పరిస్థితుల దృష్ట్యా ఆనాడు ఇస్లామీయ ఉద్యమం కేవలం ధర్మ సూత్రాల్ని, మౌలిక సిద్ధాంతాల్ని సామాన్య ప్రజలకు బోధించడమే కాక ఒక విధంగా దారి తప్పిన 'ముస్లిమ్'లను ధార్మికంగా సంస్కరించడం, వారిలో పునరుజ్జీవన వాంఛను ప్రజ్వరిల్ల జేయటం కూడా అవసరమయింది. ముస్లిమ్‌లు ఇప్పుడు నలుదిక్కుల నుండి వచ్చి మదీనాలో ప్రోగవుతున్నారు. ఈ వలస వచ్చినవారూ, అన్సారుల కలయికతో ఒక చిన్న ఇస్లామీయ రాజ్యానికి అంకురార్పణ జరిగింది. ఇంతవరకైతే ఉద్యమం కేవలం సైద్ధాంతికంగా సందేశాన్ని అందజేస్తూ, విశ్వాసాలను సముద్ధరిస్తూ కొన్ని నైతిక బోధనలు చేస్తూ ఉండటం వరకే పరిమితమయింది. కాని ఇప్పుడు ఇంకా ముందుకు పురోగమించ వలసి ఉంది. మనిషి దైనందిన వ్యవహారాలకు, గృహస్థ విషయాలు మొదలుకుని సామాజిక సమస్యలకు, మనుషుల మధ్య పరస్పర సంబంధ అనుబంధాల సముద్ధరణకు సంబంధించిన అసంఖ్యాకమయిన నియమాలు అవసరం. అందుచేత ఈ దశలో ఈ అంశాల మీద కూడా శ్రద్ధచూపడం జరిగింది.

ఈ దశలో మరొక గొప్ప పరిణామం సంభవించింది. ఇంతవరకు ఇస్లామ్ సందేశం కుఫ్ర్ (తిరస్కార) వాతావరణంలో ఇవ్వబడింది. అక్కడ ముస్లిములు తిరస్కారుల అత్యాచారాల్ని, దౌర్జన్యాల్ని భరిస్తూ, సహిస్తూ వచ్చారు. ఇప్పుడు వారిదంటూ ఒక చిన్న స్వతంత్ర రాజ్యం ఏర్పడింది. దాని నలువైపులా తిరస్కార వాదానికి బలిష్టమైన కోట ల్లాంటివి ఉన్నాయి. ఇప్పుడు కేవలం వ్యక్తిగతంగా కష్టపెట్టడమే కాదు, ఇప్పుడిప్పుడే మెరుగులు దిద్దుకుంటున్న ఈ చిన్న సమాజాన్ని వీలయినంత త్వరలో తుదముట్టించాలని అరేబియా మొత్తమే నడుం బిగించింది. ఒకవేళ ఇస్లామ్ ఈ కొత్త కేంద్రంలో నిలదొక్కుకుని శక్తిని పుంజుకుంటే, తమకి నిలువనీడే కరువయ్యే ప్రమాదం సమీపంలోనే ఉందనే భయం వారికి పట్టుకుంది. ఈ కారణాల వల్ల ప్రారంభస్థాయిలో ఉన్న ఆ సమాజం మనుగడకు, దాని ఉద్యమ సంరక్షణకు అది వృద్ధీ వికాసాలు చెందటానికి దాని అనుయా యులు నిరంతరం కృషి చెయ్యాలి ఇంకా...

- పరిపూర్ణ ఉత్సాహం, ఉద్రేకాలతో తాము అనుసరిస్తున్న మార్గాన్ని ఇతరులకు పరిచయం చెయ్యాలి. అది పరమ సత్యమయినదని నిదర్శనాలతో ప్రమాణాలతో నిరూపించాలి. దానితో జనబాహుళ్యం ఏకీభవించేటట్లు కృషి చేయాలి.
- వ్యతిరేకుల విశ్వాసాలను ఆధారాలతో, నిదర్శనాలతో తప్పయినవిగా రుజువు చెయ్యాలి. ఇలా చేయడం వల్ల సహేతుకంగా విషయాన్ని అర్థం చేసుకోదలచిన వారికి పరమసత్యానికి చేరడంలో ఎలాంటి అవరోధం ఉండదు.
- ఇల్లూ వాకిలి వదలి ఉపాధి సముపార్జనా కార్యకలాపాలను, వ్యాపార వ్యవహారాలను త్యజించి ఈ క్రొత్త రాజ్య పరిధిలోకి వచ్చి శరణుపొందిన వారికి పునరావాసం

కల్పించడమే కాక వారి నైతిక, విశ్వాసాత్మక సుశిక్షణ కొరకు ఏర్పాట్లు చెయ్యడం కూడా ఎంతో అవసరం. అప్పుడే వారు పేదరికంలోనూ, ఆకలి బాధల్లోను, నిలకడ తప్పే తరుణంలోనూ పూర్తి సహనంతో పరిస్థితుల్ని ఎదుర్కోగలరు. అత్యంత దుర్భరమయిన పరిస్థితులలో కూడా వారి అడుగులు తడబడవు.

- ముస్లిములను రూపుమాపడానికి శత్రుగణం వారిపై దాడి చేసినప్పుడు ముస్లిములు శక్తిమంతులు కానప్పటికీ, సరయిన ఆయుధబలం వారికి లేకపోయినప్పటికీ, శత్రువుల్ని ధైర్యస్థయిర్యాలతో ఎదుర్కోడానికి ముస్లిములను సమాయత్తపరచాలి. వీరికి, తాము ఆశ్రయించిన ధర్మం, సిద్ధాంతం సత్యమయినదన్న విషయం పట్ల అచంచలమయిన విశ్వాసం, తమ ప్రభువు ఎడల దృఢమయిన నమ్మకం, ఆయనపై పూర్తి భరోసా జనించేలా తర్ఫీదు యివ్వాలి. వారు ఎట్టి పరిస్థితుల్లోనూ రణరంగంలో వెన్నుచూపకుండా, వారిలో క్రమశిక్షణనను, బాధ్యతా భావాన్ని ఉత్తేజితం చెయ్యాలి.
- ఉద్యమ అనుయాయులు, ఎంత బోధపరచినా, ఇస్లామ్ కోరే జీవన వ్యవస్థ సంస్థాపనా కార్యంలో అవరోధాలు కల్పించే వ్యక్తుల్ని తమ శక్తిని ఉపయోగించి, రంగంలో నుంచి తొలగించేటంతటి ధైర్యసాహసాలను అనుయాయుల్లో ఉద్భ వింపజెయ్యాలి.

అందుచేతనే, ప్రవక్త మస్జిద్ ఇంకా అవసరమయిన ఇతర నిర్మాణాలు, ముహాజిర్ల పునరావాసానికి సంబంధించిన ఏర్పాట్లు ముగియగానే మహాప్రవక్త (స) పైన పేర్కొన్న కార్యాల పట్ల శ్రద్ధ వహించారు. బకర సూరా అధికభాగం ఈ కాలంలోనే అవతరించింది. ఇందులో ఈ విషయాలకే ప్రాధాన్యత నివ్వటం జరిగింది.

## యూదులతో ఒడంబడిక

మదీనాకు నలువైపులా యూదుల నివాస స్థలాలున్నాయి, వీరిలో ఇస్లామ్ సందేశం ప్రచారం చెయ్యడంతోపాటు, వీరితో రాజకీయ సంబంధాల రూపురేఖల్ని సయితం నిశ్చయించుకోవటం ఎంతో అవసరం. ఎందుచేతనంటే మక్కా నుండి ముస్లిములు తరలిపోయిన తరువాత కురైష్ ప్రజలు స్థిమితంగా కూర్చోలేదు. ముస్లిములు మదీనాలో సంఘటితమవడాన్ని చూసి ఈ ఇస్లామ్ కేంద్రాన్ని బలప్రయోగంతో రూపుమాపాలని పథకాలు వెయ్యసాగారు. అందుచేతనే మదీనా చుట్టుపట్ల బస్తీల్లో ఉండే యూదులతో పెంపొందించుకొనవలసిన రాజకీయ సంబంధాలను స్పష్టంగా నిర్దిష్టపరచుకోవడం, ముస్లిములకు అత్యావశ్యకమయిపోయింది. లేకపోతే మక్కా బహుదైవారాధకులు దాడిచేసిన పక్షంలో యూదుల శక్తి ఏ వైపున మొగ్గి ఉంటుందో అంచనావేయడం సాధ్యపడదు. అందువల్లనే మదీనా నుండి ఎర్రసముద్రం తీరాల వరకు వ్యాపించి వున్న తెగలతో సంప్రతింపులు ప్రారంభించారు మహాప్రవక్త (స). వారిలో కొందరిచేత అలీన విధానం



అవలంబించగలమని ప్రమాణం చేయించుకున్నారు. అయితే మదీనా ముస్లిమ్‌లపై మక్కా కురైషీలు లేదా మరెవరైనా దాడి చేస్తే వీరు ఇటు ముస్లిములతోనూ సహకరించరు, అటు ముస్లిముల విరోధులతోనూ సహకరించరన్న మాట. మరి కొందరితో చేసుకున్న ఒప్పందం ప్రకారం ఒకవేళ ముస్లిమ్‌లపై దాడి జరిగితే, వారు ముస్లిములతో సహకరిస్తారు.

## మునాఫిక్‌లు (కపటులు)

ఆ మారిన పరిస్థితుల్లో మదీనాలో ఇస్లామీయ ఉద్యమానికి మునాఫిక్‌ల సమస్య ఒకటి ప్రముఖంగా ఎదురయింది. ఉద్యమం, మక్కా దశ చివరి రోజుల్లో ఉండగా ఇస్లామీయ సంఘంలో చేరిన కొందరు వ్యక్తులు ఇస్లామ్ సందేశాన్ని పరమసత్యమైనదిగా విశ్వసించినా తమ అంతర్గత బలహీనత కారణంగా, ఇస్లామ్ కొరకు తమ ప్రాపంచిక సంబంధ బాంధవ్యాల్ని తెంపుకోలేకపోయారు. వ్యవసాయం, వ్యాపారాలు లేదా చుట్టరికపు బంధనాలు ఇస్లామ్ కోరే బాధ్యతల నిర్వహణలో వారికి తరచుగా అడ్డువచ్చేవి. కాని ఇప్పుడు మదీనాలో ఇస్లామీయ సంఘంలో చొరబడిన కపటులు వాస్తవానికి ఇస్లామ్ పట్ల పూర్తిగా తిరస్కారభావం కలవారే. కేవలం ముస్లిముల్లో కలతల్ని ప్రేరేపించడానికి వారు ముస్లిముల్లో చేరిపోయారు. ఇంకా కొందరు గత్యంతరంలేక ముస్లిములమని చాటుకునేవారున్నారు. వారి అంతర్యాల్లో ఇస్లామ్ ఎడల ఎలాంటి తృప్తిలేకపోయినప్పటికీ తమ తెగ లేక ఆ వంశం వారు అధికులు ముస్లిములవడం మూలాన, అయిష్టంగానే ముస్లిముల్లో చేరిపోయారు. వీరికి తోడుగా కొందరు స్వార్థపరులు అవకాశవాదులు సయితం ఇస్లామీయ సంఘంలో వచ్చి చేరారు. ఒకవైపున ముస్లిముల్లో చేరి తమ ప్రాపంచిక లాభాల సముపార్జన కోసం ప్రయత్నాలు సాగించేవారు. మరొకవైపున తిరస్కా రులతోనూ సంబంధాలు పెంపొందించుకుంటూ ఉండేవారు. ఇస్లామ్, తిరస్కారాల మధ్య జరిగే సంఘర్షణలో, ఇస్లామ్ విజయవంతమయితే వారికి ఇస్లామ్ పరిధిలో శాంతి శ్రేయాలు ప్రాప్తిస్తాయి. లేదా ఒకవేళ కుఫ్ర్- మిథ్యావాదం- జయించినా వారి స్వలాభాలు మాత్రం దెబ్బతినవు. ఇదీ వీరి ఆలోచనా విధానం.

ఇస్లామీయ ఉద్యమానికి ఈ "ఇంటి దొంగలు" భరించరాని కష్టాలకు కారకులయ్యారు. వారిని ఎదుర్కోవటం అంత సులభమయిన పనికాదు; మదీనా జీవితం మొత్తంలో వీరు లేపిన ఉపద్రవాలను మహాప్రవక్త (స)ఎలా ఎదుర్కొన్నారో ఆయా సందర్భాల్లో వస్తుంది. ఆ పరిస్థితుల్లో ఇలాంటి కపటులు (మునాఫిక్‌లు), ఇస్లామ్ మార్గాన్ని మనస్ఫూర్తితో అనుసరించే నిజమైన విశ్వాసులు వేర్వేరుగా ప్రస్ఫుటంగా సూచించబడ్డారు, ఎందుకంటే ఈ ఘట్టంలోనే, అంటే ఇస్లామీయ ఉద్యమం ఎదుర్కొంటున్న ఈ గడ్డుపరిస్థితి ల్లోనే, ఇంకా పురాతన దురభిమానాలకు, ఇస్లామేతర భావాలకు దాసులుగానే ఉంటున్న వారినీ, లేదా తమ విశ్వాసంలో ఏదో ఒక విధంగా లోపం ఉన్నవారినీ వేరుచేసి చూపడం ఎంతయినా అవసరం.

## కిబ్లా పరివర్తన

ఇంతవరకు 'బైతుల్ మక్దిస్' (జెరూసలేం)ను ముస్లిమ్‌లు కిబ్లాగా పరిగణించటం జరిగేది. ముస్లిములు దాని వైపునకే తిరిగి నమాజ్ చేసేవారు. బైతుల్ మక్దిస్‌కు యూదులతో అతిసన్నిహిత సంబంధం ఉంది; యూదులు కూడా దాని వైపునకే తిరిగి ప్రార్థన చేసే వారు. హి.శ.2వ సంవత్సరం షాబాన్ నెలలో మహాప్రవక్త (స)జుహర్ నమాజ్ చేస్తూ ఉండగా కిబ్లాను మార్చవలసిందని దైవాజ్ఞ అవతరించింది. దాని ప్రకారం బైతుల్ మక్దిస్‌కు బదులుగా 'కాబా'ను ముస్లిముల 'కిబ్లా'గా నిర్ణయించటం జరిగింది. తదనుగుణంగా మహాప్రవక్త (స) నమాజ్ చేస్తూనే బైతుల్ మక్దిస్ వైపు నుంచి కాబా వైపునకు తిరిగారు. ఈ సంఘటన ఇస్లామీయ ఉద్యమ చరిత్రలో ఎంతో ప్రముఖమయింది. దీని ప్రాముఖ్య తను స్వయంగా అల్లాహ్ ఈ విధంగా వివరించారు : "మేము కాబాను మీ కిబ్లాగా చేశాము. ప్రవక్తను ఎట్టి పరిస్థితిలోనూ అనుసరించే వారెవరో, వెనక్కి తిరిగిపొయ్యే వారెవరో స్పష్టంగా తెలియాలనే ఇలా చేశాము." దానికి తోడుగా తెలుపబడిన మరో విషయమేమంటే, యూదులు తమ విధుల్ని చక్కగా నిర్వహించలేకపోయిన కారణంగా, వారు ఆ అనుగ్రహం విలువను గుర్తించలేకపోయిన కారణంగాను ఇంతవరకు యూదులకు అప్పగించిన ప్రపంచ నైతిక, ఆధ్యాత్మిక సుశిక్షణ బాధ్యతల్ని వారికిచ్చిన మార్గదర్శక స్థానాన్ని వారి నుంచి తొలగించటం జరిగింది. వారికి బదులుగా ఈ సేవ చేసే బాధ్యత ముస్లిమ్ సమాజానికి అప్పగించబడిందనీ, ముస్లిములే ఈ బాధ్యతను నిర్వహించవలసి వుంటుందనీ ప్రకటన కూడా చెయ్యబడింది.

ఈ సంఘటన వల్ల జరిగిన పరిణామాలలో ఒకటి, ఎవరి హృదయాల్లో విశ్వాసం, స్థానం ఏర్పరచుకోలేదో వారి అంతరంగం బయటపడింది. వారి రహస్యం పటాపంచ లయ్యింది. వారు దైవసందేశహరుని ఈ చర్యను నిశితంగా విమర్శించారు. దీనివల్ల ఇస్లామీయ సంఘంలో వీరి నిజస్థానమేదో బాగా తేటతెల్లమైంది. ఈ విధంగా ద్వంద్వ చిత్తులైన కపట ముస్లిములు ఇస్లామీయ సంఘం నుండి వేరుపడ్డారు. సంఘం ఇలాంటి పనికిమాలిన వ్యక్తుల బారి నుండి చాలావరకు పరిశుద్ధమయింది.





# ఇస్లామీయ ఉద్యమం- దాని పరిరక్షణ ★

మక్కాలో అకబా అనే చోట మదీనావాసులు మహాప్రవక్త (సల్లల్లాహు అలైహి వసల్లమ్) చేతి మీదుగా ప్రతిజ్ఞ చేసి మహాప్రవక్తను ఆయన సహచరులను మదీనాకు రావలసిందిగా ఆహ్వానించినపుడే అది ఏ విధంగా పరిణమించగలదో కానరాసాగింది. ఈ ప్రతిజ్ఞ, ఈ ఆహ్వానాలు వాస్తవంగా మదీనా పౌరుల తరఫున అరేబియా అంతటికీ ఒక సవాలుగా పరిణమించగలవన్న సూచన విస్పష్టంగా గోచరించింది. ప్రతిజ్ఞ చేసిన వారిలో హజ్రత్ 'అబ్బాస్ బిన్ ఉబాదా' అనే ఒక సత్పురుషుడు తన మిత్రుల్ని ఉద్దేశించి పలికిన మాటలు నేటికీ చరిత్ర గ్రంథాల్లో సురక్షితంగా వున్నాయి. 'ఈయన గారి యెదుట మీరు ఏమని ప్రతిజ్ఞ చేస్తున్నారో తెలుసా? ఈయన చేతిమీద ప్రతిజ్ఞ చేసి మీరు మొత్తం ప్రపంచంతో పోరాటం కొనితెచ్చుకుంటున్నారు. అయితే మీ ధనం నాశనమయ్యే, మీలోని ఉత్తములు హతమయ్యే ప్రమాదం వచ్చిపడినప్పుడు ఈయన్ని శత్రువులకు అప్పగించే అభిప్రాయమే మీకు ఉంటే, నేడే ఈయన్ని వదలివేయడం శ్రేయస్కరం. ఎందుకంటే, దైవం సాక్షిగా చెబుతున్నాను, అలా చేయడం ఇహపరాలలో వినాశనానికి దారితీస్తుంది. పోతే, నేడు మీరు చేసే ప్రతిజ్ఞను, మీ ధనం నాశనమయినప్పటికీ మీలోని ఉత్తములు అంతమైపోయి నప్పటికీ కాపాడుకుపోగలమనే సంకల్పమే మీకు వుంటే, తప్పక ఈయన్ని ఆశ్రయించండి; దైవం సాక్షిగా, ఇలా చేయడంలోనే ఇహపరాల సాఫల్యం వుంది.' దీనికి సమాధానంగా ప్రతినిధి వర్గంలోని వారంతా ముక్తకంఠంతో "మేము ఈయన్ని ఆహ్వానించి, మా ధన వినాశనాన్ని, మా ఉత్తముల ఆహుతిని సహించేందుకు సిద్ధంగా వున్నాము" అని అన్నారు. ఆనాడు వారు ఇచ్చిన ఆ మాటను నిలబెట్టుకునే సమయం నేడు ఆసన్నమయింది.

---

★ *ఇక్కడ ఒక సందేహ నివృత్తి అవసరం. ఇస్లామీయ రాజనీతి ప్రకారం కేవలం రక్షణ కొరకే యుద్ధం చెయ్యబడుతుందని అపోహపడితే అది నిజం కాదు. ధర్మానికి అవసరం ఏర్పడితే మిథ్యాశక్తుల బలాన్ని త్రుంచడానికి ఒక్కోసారి సత్యం స్వయంగా ముందడుగు వేయవలసి వస్తోంది. తరువాతి కాలంలో ఇస్లామీయ ఉద్యమానికి ఇలాంటి యుద్ధాల అవసరం కలిగింది.*

## ఉపద్రవంలో కురైష్ ప్రజలు

మహాప్రవక్త (స), ముస్లిములూ మదీనాకు చేరిపొయ్యారంటే, ఇస్లామ్‌కు ఒక కేంద్రం సంప్రాప్తమయిందని భావం. తమ సత్యసంధత, సహనం, స్థయిర్యం పరీక్షలో పలుమార్లు నెగ్గుకు వచ్చిన ముస్లిములు ఇప్పుడు ఒక సంఘటిత సమాజంగా రూపొందారు. కురైషీలకై ఇదొక పెద్ద అపాయం. ఇస్లామీయ సంఘం ఇలా సంఘటితమవడం వాస్తవంగా తమ పురాతన అజ్ఞానపు వ్యవస్థకు మరణవార్త అని స్పష్టంగా, తమ చర్మచక్షువులతో చూడగలుగుతున్నారు. దీనికి తోడుగా మరింత అపాయకరమయిన మరొక విషయం వారిని అధికంగా కలవరపరచింది. మక్కావాసుల జీవనోపాధి ఆర్థికంగా యమన్, సిరియా దేశాల్లో జరిగే వారి వ్యాపారంపైన ఆధారపడి ఉంది. ఎర్రసముద్రపు తీరాలగుండా సిరియా దేశానికి పోయే వాణిజ్య మార్గాన మదీనా వుంది. మదీనాలో ముస్లిమ్‌లు శక్తిని పుంజుకుంటున్నారంటే ఇక సిరియా దేశంతో తమ వ్యాపారం కొనసాగడానికి రెండే మార్గాలు మిగిలాయి. ఒకటి, ముస్లిమ్‌లతో సద్భావన ఏర్పరచుకుని సత్సంబంధాలు పెంపొందించు కోవాలి. రెండవది, మదీనాలో ముస్లిమ్‌ల బలాన్ని చివరిసారిగా తుదముట్టించాలి. మరొక మార్గం లేదు. ఈ కారణం వల్లనే మదీనాలో ముస్లిమ్‌లు ప్రోగవకుండా హిజ్రత్‌కు ముందు శాయశక్తులా ప్రయత్నించారు కురైష్ ప్రజలు. ఆ ప్రయత్నాలు ఫలించకపోయేసరికి ఇప్పుడు ఏ విధంగానయినా తలెత్తుతున్న ఈ ఉపద్రవాన్ని శాశ్వతంగా అణచివేయాలని తీర్మానించుకున్నారు.

## కురైషీల కుతంత్రం

అబ్దుల్లా బిన్ ఉబయ్ మదీనా నాయకుల్లో అగ్రగణ్యుడు. హిజ్రత్‌కు ముందు మదీనా వారు అతన్ని తమ రాజుగా ఎన్నుకుని లాంఛనపూర్వకంగా పట్టంకట్టే సన్నాహాలు చేసుకున్నారు. కాని మదీనా ప్రజలు ఇస్లామ్ స్వీకరించిన తరువాత మక్కానుండి ముస్లిములు, మహాప్రవక్త (స) మదీనాకు రావడం మూలాన ఈ పథకం తలక్రిందు లయింది. అబ్దుల్లా బిన్ ఉబయ్ ఆశలన్నీ అడియాసలయ్యాయి. ఈ పరిస్థితుల్లో మక్కా వాసుల తరఫున అతనికి ఒక లేఖ అందింది. “మీరు మాలోని ఒక మనిషికి ఆశ్రయ మిచ్చారు. మేము దైవం సాక్షిగా చెబుతున్నాము. మీరయినా అతనితో పోరాడి అతన్ని అక్కణ్ణుంచి తరిమి వెయ్యండి లేదా మేమయినా మీపై దాడిచేసి మీ పురుషుల్ని హతమారుస్తాం, మీ స్త్రీలను బానిసలుగా చేసుకుంటాం.”

ఈ లేఖ చల్లారిపోయిన అతని ఆశల్లో కొత్త జీవం పోసింది. కాని మహాప్రవక్త (స)అతని వల్ల కలుగనున్న కీడుకు సమయానికి విరుగుడు ఆలోచించి, “స్వంత కొడుకులతో, సోదరులతో ఘర్షణ పడతావా?” అని నచ్చజెప్పారు. అన్సార్లు అవుస్, ఖజరజ్ తెగల వారు అధికంగా ముస్లిములవడం మూలాన మార్గాంతరం లేక అబ్దుల్లా బిన్ ఉబయ్ తాత్కాలికంగా తన సంకల్పాన్ని విరమించుకున్నాడు.



ఆ రోజుల్లోనే మదీనా శ్రీమంతుల్లో ఒకరయినా సఅద్ బిన్ ముఅజ్ ‘ఉమ్‌రా’★ కొరకు మక్కా వెళ్ళారు. కాబా గృహద్వారం వద్ద అబూజహల్ కలిశాడు. “మీరేమో మా ధర్మభ్రష్టులకు (ముస్లిములకు) ఆశ్రయం ఇవ్వండి, మేమేమో మిమ్మల్ని మక్కాలో ప్రదక్షిణకు అనుమతిస్తూ ఉంటాం” అని ఎత్తి పొడిచాడు. అతను ఇంకా, “నీవు ఉమైయా బిన్ ఖలఫ్ అతిథివి కాకపోతే ఇక్కణ్ణుంచి బతికి బయటపడే వాడివి కావు” అని బెదిరించాడు.

అది విని ఆయన సమాధానం పలికాడు, “దేవునిపై ఒట్టు! మీరు నాకు ఈ విషయంలో అడ్డుపడ్డారంటే నేను మీకు అంతకంటే ముఖ్యమైన విషయంలో, అంటే మదీనాగుండా పోయే మీ వాణిజ్య మార్గంలో అవరోధాలు కల్పిస్తాను.” అంటే కురైషీలు ఏదయినా హాని తలపెడితే ఇది వారికొక హెచ్చరికలాంటిది. మదీనా మీదుగా పోయే వాళ్ళ వాణిజ్యమార్గం ఇకపై తెరువడం జరగదని వారు తెలుసుకోవాలన్న మాట.

## కురైషీలపై ఒత్తిడి

అప్పుడు కురైష్ ప్రజలు ముస్లిములను, ఇస్లామీయ ఉద్యమాన్ని సర్వనాశనం చేయడానికి వేస్తున్న ఎత్తుగడల దృష్ట్యా వాళ్ళను అపజయంపాలు చేయడానికి, వారు వేసే పన్నాగాలు మానుకునేటట్లు వారిపై ఒత్తిడి తీసుకురావడానికి, ముస్లిములు ఆ వర్తక మార్గాన్ని మూసివేసి, సిరియాతో వాళ్ళు జరిపే వ్యాపారాన్ని నిలిపివేయడం కన్నా గత్యంతరం లేకపోయింది. ఈ ఒక్క ఒత్తిడికి తప్ప ఇంక దేనికీ వారు లొంగరన్నది కూడా నిజమే. అందువల్ల ఇంతకుముందే వివరించినట్లు మహాప్రవక్త (స) ఆ మార్గానికి పరిసరాల్లో నివసిస్తున్న యూదుల తెగలతో వివిధ ఒడంబడికలు చేసుకున్నారు. ఆ విషయంలో కాస్త స్థిమితం లభించింది. అయినా జాగ్రత్తకోసం మక్కాకు చెందిన వాణిజ్య బృందాలను హెచ్చరించటానికి అప్పుడప్పుడు ముస్లిమ్‌ల చిన్న చిన్న దళాలను అక్కడికి పంపేవారు. ఈ దళాలు అక్కడ ఏనాడూ రక్తపాతం చేయడం కానీ నష్టం కలిగించడం కానీ చేయలేదు. కురైషీలు సావధానంగా మెలగాలనీ; వాళ్ళు వేసే ప్రతి అడుగూ ఆలోచించి, పరిస్థితుల్ని అర్థంచేసుకుని మరీ వెయ్యాలని, వారు ముస్లిములను బాధపెట్టా రంటే తమ వర్తకాన్ని వదలుకోవలసివుంటుందని స్పష్టంగా తెలుసుకోవాలని మాత్రమే ఇలా చేసేవారు.

## హజ్రమీ హత్య

ఇదిలా వుండగా కురైషీలు పన్నే యుక్తుల్ని తెలుసుకోవడానికి పరిస్థితులు ఎలా రూపొందుతున్నాయో మహాప్రవక్త (స) సమాచారం సేకరిస్తూనే వున్నారు. రజబ్ నెల

★ ఉమ్‌రా = 'హజ్' యాత్రాకాలం కాని సమయాల్లో చేసే 'హజ్' లాంఛనాలు.

హిజ్రీ శకం 2వ సంవత్సరం అబ్దుల్లాహ్ బిన్ జహష్‌ను పన్నెండు మంది యోధులతో నఖలా అనే చోటికి పంపారు మహాప్రవక్త (స). ఈ ప్రదేశం మక్కా - తాయిఫ్‌ల మధ్య వుంది. మహాప్రవక్త (స) అబ్దుల్లాహ్ బిన్ జహష్‌కు ఒక లేఖ ఇచ్చి పంపారు. ఆ లేఖ రెండు రోజుల తరువాత తెరవాలని సెలవిచ్చారు. తదనుగుణంగా ఆయన దాన్ని తెరచి చూశారు. "నఖలాలో బస చేయాలి, ఖురైషీలను గురించి భోగట్టా సేకరించి నాకు తెలపాలి" అని అందులో వుంది. సందర్భవశాత్తు సిరియా నుండి కొందరు ఖురైష్ వ్యక్తులు వర్తక సామాగ్రి తీసుకుని వస్తున్నారు. హజ్రత్ అబ్దుల్లాహ్ వారిపై దాడి చేశారు. అందులో 'ఉమర్ బిన్ హజ్రమి' అనే ఖురైష్ వ్యక్తి హతమయ్యాడు. ఇద్దరు వ్యక్తులు బందీలయ్యారు. కొంత ధనం యుద్ధఫలంగా చేజిక్కింది. హజ్రత్ అబ్దుల్లాహ్ మదీనాకు వచ్చి విషయాన్ని విశదీకరించారు. యుద్ధఫలం మహాప్రవక్త (స)కు సమర్పించారు. మహాప్రవక్త (స) "నేను ఈ విధంగా చేయటానికి నిన్ను అనుమతించలేదు" అంటూ తన అప్రసన్నతను వ్యక్తం చేశారు. యుద్ధ ఫలాన్ని కూడా స్వీకరించలేదు.





# బద్ర్ యుద్ధం

ఈ పరిస్థితుల్లో హి.శ. 2వ సంవత్సరం షాబాన్ మాసం, క్రీ.శ. 623 ఫిబ్రవరి లేక మార్చిలో ఖురైషీ వ్యాపార బృందం ఒకటి సిరియా నుండి తిరుగు ప్రయాణంలో, ముస్లిమ్‌ల అధీనంలో ఉన్న ప్రదేశానికి దరిదాపుల్లోకి వచ్చింది. బృందం వద్ద దాదాపు 50 వేల సవరాల విలువ చేసే సరుకు వుంది. రక్షణకు ముప్పయి నలభయి మంది కన్నా అధికంగా లేరు. మదీనాకు సమీపాన వున్న ప్రదేశానికి చేరినప్పుడు ముస్లిములు దాడి చేస్తారని వారికి భయం పట్టుకుంది. బృందానికి నాయకుడు అబూ సుఫ్యాన్. అతను ప్రమాదాన్ని ఊహించుకుని మద్దతు కోసమని మక్కాకు ఒక వ్యక్తిని ముందే పంపాడు. ఆ వ్యక్తి మక్కాకు పోయి బృందాన్ని ముస్లిమ్‌లు కొల్లగొడుతున్నారని, సహాయానికి పరుగెత్తండని ప్రకటించాడు. బృందంతో వచ్చే సరుకు చాలా మందికి చెందినదవడం వల్ల అదొక జాతీయ సమస్యగా పరిణమించింది. కనుక ఆ వార్త వినగానే మక్కా యువకులంతా పోరాటంలో పాల్గొనటానికి సిద్ధమయ్యారు. ఇంచుమించు ఒక వేయిమంది ఆవేశపరులయిన నవయువకుల దళం తయారయింది. ఈ దళం అత్యంత ఆవేశంతో, ప్రతాపంతో, ముస్లిమ్‌లను ఒకేసారి అంతమొందించాలన్న సంకల్పంతో మక్కా నుండి బయలుదేరింది, అప్పుడే అనుదినం ఎదురయ్యే ఈ ఝంఝాటం నుండి విముక్తి కలుగుతుందని ఆశించారు మక్కావాసులు. తమ సరుకును దక్కించుకోవాలన్న కోరిక ఒకవైపు, పూర్వపు విరోధం, విద్వేషాల ఉద్రేకం మరొకవైపు - వెర్రెక్కిన వారిలా మదీనాపైకి దాడి చేయటానికి బయలుదేరారు.

## ఖురైషీలపై దాడి

ఇటు మహాప్రవక్త(సల్లల్లాహు అలైహివసల్లమ్)కు సమాచారం అందుతూనే వుంది. ఒకవేళ ఖురైష్ ప్రజలు తమ ధ్యేయంలో కృతకృత్యులయ్యారంటే, ముస్లిముల ఈ నవసమాజానికి హాని కలిగించగలిగారంటే, ఇస్లామీయ ఉద్యమం మనగలగటమే దుర్లభమవుతుంది అనీ, ఇస్లామ్ పేరు శాశ్వతంగా సమసిపోయే ప్రమాదం కూడా వుందనీ, చాలా గడ్డు

సమయం ఆసన్నమయిందని, మహాప్రవక్త (స) గ్రహించారు. ఆయన మదీనా వచ్చి ఇంకా రెండేళ్ళయినా కాలేదు, ముహాజిర్‌లు తమ సర్వస్వాన్ని మక్కాలోనే వదిలేసి వట్టి చేతులతోనే వచ్చేశారు. అన్సార్‌లకు యుద్ధరంగంలో అంత అనుభవం లేదు, యూదుల తెగలు సయితం ప్రతికూలతకు ఒడిగట్టాయి. స్వయంగా మదీనాలోనే వున్న కపటులు, బహుదైవారాధకులు పెద్ద సమస్యగా రూపొందారు. ఈ పరిస్థితిలో మక్కావాసులు మదీనాపై దండెత్తారంటే ముస్లిముల అల్పసంఖ్యాక సమాజం అంతమయ్యే ప్రమాదం ఉంది. వాళ్ళు దాడి చేయకుండా బలాన్ని ఉపయోగించి తమ వర్తక బృందాన్ని సురక్షితంగా తీసుకువెళ్ళినా, ముస్లిమ్‌లు ఇకపై నిలద్రొక్కుకోవడం కష్టం. ఆ తరువాత చుట్టుపట్లనున్న తెగల వాళ్ళు ముస్లిమ్‌లను లొంగదీసుకోవడానికి వెనుకాడరు, వాళ్ళు కురైషీల కనుసైగలపై ముస్లిమ్‌లను వేధించటం ప్రారంభిస్తారు. ఇటు మదీనా యూదులు, కపటులు, బహుదైవారాధకులు కూడా విజృంభిస్తారు. ముస్లిమ్‌ల బ్రతుకు దుర్భరమవుతుంది. ఈ పరిస్థితుల్ని పురస్కరించుకుని, మహాప్రవక్త (స) ప్రస్తుతం లభ్యమైన బలాన్ని తీసుకుని రంగంలోకి దిగాలని, గౌరవంగా జీవించి వుండే హక్కు ఎవరికి వుందో, మరెవరు జీవించడానికి అర్హులు కారో నిర్ణయమై పోవాలని, ఒక నిశ్చితాభిప్రాయానికి వచ్చారు.

## ముస్లిముల సన్నాహాలు

ఈ నిశ్చయానికి వచ్చిన మీదట మహాప్రవక్త (స) ముహాజిర్లను, అన్సార్లను సమావేశ పరిచారు, పరిస్థితుల్ని సమగ్రంగా, స్పష్టంగా వారికి విశదపరిచారు. ఒకవైపున మదీనా ఉత్తర దిశలో వర్తకబృందం, రెండోవైపున దక్షిణాన కురైష్ సైన్యం ఉన్నాయి. ఈ రెంటిలో ఏదయినా ఒక దానిపై మీకు విజయం ప్రాప్తమవుతుందని అల్లాహ్ వాగ్దానం చేశాడు: ఇక చెప్పండి, మీరు దేనితో పోరాడదలచుకున్నారో!"

దీనికి సమాధానంగా సహాబాలో అనేకమంది, వర్తకబృందాన్ని ముట్టడించాలని అభిలషించారు. కాని దైవసందేశహరుని దృష్టిలో ఉన్నది వేరే కార్యక్రమం. అందుచేత ఆయన (స) తన ప్రశ్నను తిరిగి అడిగారు. దానికి ఒక ముహాజిర్ సహాబి మిక్‌దాద్ బిన్ అమ్ర్ లేచి, "దైవప్రవక్తా! మీ ప్రభువు నిర్దేశిస్తున్న వైపునకు పదండి, మేమంతా మీకు తోడుగా వున్నాము. మేము బనీ ఇస్రాయీల్ ప్రజల్లా "నీవూ, నీ దైవమూ పోయి పోరాడండి. మేమిక్కిడే ఉంటామని★ చెప్పేవాళ్ళం కాము" అన్నారు. కాని ఈ విషయంలో తుది నిర్ణయానికి రావడానికి అన్సార్ అభిప్రాయాన్ని తెలుసుకోవడం ఎంతో అవసరం. అందువల్ల మహాప్రవక్త (స)వారిని నేరుగా సంబోధించి తన ప్రశ్నను తిరిగి అడిగారు, అప్పుడు హజ్రత్

★ ఈ మాట యూదులు తమ ప్రవక్త హజ్రత్ మూసాతో అన్నారు.



'సఅద్ బిన్ ముఆజ్' లేచి "దైవప్రవక్తా! మేము మిమ్మల్ని విశ్వసించాము. మీ దౌత్యాన్ని ధ్రువపరిచాము. మీరు అందజేసినదంతా సత్యమని సాక్ష్యమిచ్చాము. మిమ్మల్ని అనుసరించే దృఢసంకల్పం చేసుకున్నాము. కనుక, ప్రవక్తా! మీరు సంకల్పించిన కార్యాన్నే కానివ్వండి. మీకు 'సత్యం' ప్రసాదించి పంపిన శక్తి సాక్ష్యంగా చెబుతున్నాను, మీరు మమ్మల్ని తీసుకుని సముద్రంలో దూకినా మేము పోరాటంలో స్థయిర్యంగా ఉంటాము, శత్రువుల్ని సాహసంతో ఎదుర్కొని మా శౌర్యాన్ని ప్రదర్శిస్తాము. మీ కళ్ళు ఆనందంతో చల్లబడే దృశ్యాలు మా ద్వారా అల్లాహ్ మీకు చూపిస్తాడనటం పట్ల మాకు ఎలాంటి అనుమానం లేదు. కనుక దైవానుగ్రహంపై భారం మోపి మమ్మల్ని తీసుకుని బయల్దేరండి."

ఈ ఉపన్యాసాల తరువాత వర్తక బృందాన్ని వదలి సైనిక దళాన్ని ఎదిరించేందుకు పోవాలని నిర్ణయించడం జరిగింది. కాని ఈ నిర్ణయం సాధారణ నిర్ణయం కాదు. ముస్లిముల దళం కురైష్ దళం ముందు చాలా బలహీనమయింది. పోరాడగల వ్యక్తులు దాదాపు మూడు వందల మంది మాత్రమే వున్నారు. వీరిలో ఏ ఇద్దరి వద్దో గుర్రా లున్నాయి. ఒంటెలు కూడా డెబ్బయికి మించి లేవు. యుద్ధ సామగ్రి కూడా చాలినంతగా లేదు. కేవలం అరవయి మంది వద్ద కవచాలున్నాయి. అందువల్లే ముస్లిముల్లో కొద్ది మందిని మినహాయించి అందరూ లోలోపల భయపడుతూనే వున్నారు. చూస్తూ చూస్తూ మృత్యుముఖంలో పడినట్లు అనుభూతి కలుగుతోంది వారికి. 'అన్‌ఫాల్' సూరాలోని ఈ ఆయత్‌లు వారి మానసిక స్థితిని చక్కగా చిత్రించాయి:

> "ఏ విధంగానయితే ఓ ప్రవక్తా! నీ ప్రభువు నీ ఇంటినుంచి నిన్ను సత్యం ఆధారంగా వెలుపలికి తీసుకువచ్చాడో అది విశ్వాసుల్లో ఒక వర్గానికి ఎంతో అయిష్ట మయింది. ఈ సత్యాన్ని గురించి వారు నీతో వాదోపవాదాలకు దిగారు. వాస్త వానికి అది వారికి ప్రస్ఫుటంగా వ్యక్తమైపోయింది. వారి పరిస్థితి ఎలా పరిణ మించిందంటే, చూస్తూ చూస్తూ వారిని మృత్యువు వైపునకు లాక్కుపోయినట్లు వారు భావించారు.
>
> "మీకు ఆ రెండు వర్గాల్లో ఒకటి లభిస్తుందని అల్లాహ్ మీకు వాగ్దానం చేసిన ఆ సందర్భాన్ని జ్ఞాపకం చేసుకోండి. బలహీనమైన వర్గం మీకు లభించాలని మీరు కాంక్షించారు, కాని తన సద్వచనం ద్వారా సత్యాన్ని రూఢీపరచాలని, కాఫిర్లను నిర్మూలించాలని, తద్వారా 'సత్యం' సత్యం కాగలగాలని 'మిథ్య' మిథ్యగానే మిగిలిపోవాలని, అల్లాహ్ ఉద్దేశించాడు. ఈ విషయం అపరాధులకు ఎంత అయిష్టమయినదైనా సరే!" (అన్‌ఫాల్ : 8)

## రణరంగం దిశగా....

సరయిన ఆయుధబలం లేకపోయినప్పటికీ, చాలినంత సైనికబలం లేనప్పటికీ హి.శ. 2వ సంవత్సరం రమజాన్ మాసం 12వ తేదీన మహాప్రవక్త (స) దేవునిపై భారం మోపి కేవలం 313 మంది ముస్లిములను తోడుగా తీసుకుని మదీనా నుండి బయల్దేరారు.

నేరుగా దక్షిణ దిశ వైపునకు పయనమయ్యారు. అటువైపు నుంచే కురైష్ సైన్యం వస్తోంది. రమజాన్ 16వ తేదీన 'బద్ర్' సమీపాన చేరారు. బద్ర్ ఒక పల్లె వాసం. ఇది మదీనా నగరానికి నైరుతి (South West) దిశలో దాదాపు 80 మైళ్ళ దూరంలో వుంది. ఇక్కడికి చేరుకోగానే కురైష్ సైన్యం లోయకు అవలి వైపునకు వచ్చి చేరినట్లు వార్తలు అందాయి. కనుక మహాప్రవక్త (స) ఆదేశానుసారం అక్కడే గుడారాలు వేశారు.

ఇటు కురైష్ పరిస్థితి గమనించతగ్గదిగా ఉంది. వారంతా మరీ అట్టహాసంగా గొప్ప యుద్ధసామగ్రితో బయల్దేరారు. అందులో వేయి మందికి అధికంగా సైనికులు. ఇంచుమించు 100 మంది తెగల నాయకులు ఉన్నారు. రవాణా కోసం రాకపోకల కోసం మంచి ఏర్పాట్లున్నాయి. ఉతబా బిన్ రబీయా సైన్యాధిపతిగా వచ్చాడు.

బద్ర్‌కు సమీపాన వచ్చేటప్పటికి ఇరాక్ నుండి వస్తున్న వాళ్ళ వర్తక బృందం ఇంకా ముస్లిమ్‌ల సరిహద్దుకు దూరంగానే ఉందని కురైషీ సైన్యానికి తెలిసిపోయింది. అప్పుడు జహరా, అదీ తెగల నాయకులు "ఇక యుద్ధం అనవసరం" అని అభిప్రాయ పడ్డారు. కాని అబూజహల్ ఒప్పుకోలేదు. జహరా, అదీ తెగల వాళ్ళు తిరోన్ముఖులయ్యారు. మిగతా సైన్యం ముందుకు సాగింది.

## రణరంగం

రణరంగంలో కురైషీలు ఆక్రమించుకున్న భూభాగం దాని స్వరూప స్వభావాల రీత్యా చాలా అనువయింది. అది గట్టినేల, కాని ముస్లిములు గుడారాలు వేసిన చోటు ఇసుకతో నిండింది, సైనికుల కాళ్ళు నేలలో దిగబడుతున్నాయి. రాత్రి సిపాయిలంతా విశ్రాంతి తీసుకున్నారు. కాని మహాప్రవక్త (స) రాత్రంతా ప్రార్థనలు చేసుకుంటూ జాగరణ చేశారు. రమజాన్ 17న ఫజ్ర్ నమాజ్ (ప్రాతఃకాలపు నమాజ్) తరువాత జిహాద్‌ను గురించి ఉపదేశ ప్రసంగం చేశారు. యుద్ధ నియమాల ప్రకారం సైనికుల పంక్తుల్ని సక్రమంగా తీర్చిదిద్దారు. రోజా (ఉపవాస) వ్రతం ఆ సంవత్సరమే విధిగా నిర్ణయమయింది. విచిత్రమయిన పరీక్షకు లోనయ్యారు ముస్లిములు. రోజా విధించబడ్డ తొలి రమజాన్‌లోనే తమకు మూడు రెట్లు అధికమైన సైన్యంతో యుద్ధానికి దిగవలసి వచ్చింది. ఆ రాత్రే అల్లాహ్ విశేష అనుగ్రహాన్ని వ్యక్తం చేసే రెండు సంఘటనలు జరిగాయి. ఒకటి, ముస్లిమ్‌లు ఆ రాత్రి సంతృప్తితో, స్థిమితంగా నిద్రపొయ్యారు. ప్రొద్దున్న ప్రఫుల్ల హృదయంతో, వికసిత మనసుతో లేచారు. రెండవది, ఆ రాత్రి వర్షం కురిసింది. వర్షం వల్ల ఇసుక నేల గట్టిపడింది. ముస్లిములకు మైదానం అనుకూలంగా తయా రయింది. దానికి విరుద్ధంగా ఆ వర్షం మూలంగానే కురైషీ గుడారాలు వేసిన చోట బురద అయింది, వారి కాళ్ళు దిగబడసాగాయి, ఇంకా ఆ వర్షం వల్ల ముస్లిములకు సమీపంలో ఉన్న గుంటలు, చెరువులు నిండిపొయ్యాయి. దానివల్ల స్నానాలకు, 'వుజూ' చెయ్యడానికి సౌకర్యం కలిగింది. హృదయాలను ఆవరించిన



భయాందోళనలు మటు మాయమయ్యాయి. ఇప్పుడు ముస్లిములు పూర్తి సంతృప్తితో పోరాటానికి సమాయత్త మయ్యారు.

## ప్రారంభం

ఈ రెండు సైన్యాలు ముఖాముఖిగా మూర్కొన్న సందర్భంలో కనిపించేది ఎంతో విచిత్రమైన చిత్రం! ఒకవైపున అల్లాహ్‌ను విశ్వసించి ఆయన తప్ప ఇతర శక్తి సమక్షంలో తలవంచని 313 మంది ముస్లిములు. వీరి వద్ద సరయిన యుద్ధ సామగ్రి కూడా లేదు. రెండవ వైపున సర్వసన్నాహాలు చేసుకున్న వేయిమందికి మించిన తిరస్కారుల సైన్యం; వారు ఏకేశ్వర వాదపు ఆ ధ్వనిని శాశ్వతంగా మూగబోజేస్తేగాని నిద్రపోమని నిర్ణయించుకుని వచ్చిన దైవధిక్కారులు. అప్పుడు మహాప్రవక్త (స) దైవం ఎదుట చేతులు చాచి అత్యంత దీనంగా, ఆర్ద్ర నేత్రాలతో ఇలా విన్నవించుకున్నారు:

"అల్లాహ్! అహంభావం చేత మైమరచిన ఈ కురైష్ నాయకులు నీ ప్రవక్తను అసత్యవాది అని నిరూపించడానికి వచ్చారు. ప్రభూ! ఇక నీవు నాతో వాగ్దానం చేసిన ఆ సహాయం రావాలి. దేవా! నేడీ గుప్పెడు మంది హతమయ్యారంటే మహిలో నీ ఆరాధన ఎక్కడా జరుగబోదు!"

ఈ యుద్ధంలో ముహాజిర్లకే సంక్లిష్టమయిన పరీక్ష ఎదురయింది. శత్రువుల్లో వారి సోదరులు, కొడుకులు, బంధువులు ఎదురయ్యారు. ఒకరి తండ్రి, మరొకరి పుత్రుడు, ఇంకొకరి బాబాయి, మామ, ఇంకా కొందరి తమ్ముడు వారి కరవాలాలకు ఆహుతి అయ్యే సమయం వచ్చింది. తమ ఆత్మీయుల్ని తమ చేతులారా ముక్కలుగా ఖండించే క్లిష్టపరిస్థితి ఏర్పడింది. ఈ కఠిన పరీక్షలో నెగ్గగలవారు, అల్లాహ్ ఏర్పరచమని ఉపదేశించిన బాంధవ్యాలనే దృఢపరుస్తామని, ఆయన ఏ సంబంధాలను త్రుంచి వెయ్యాలని ఆదేశించాడో వాటిని అవి తమకు ఎంత ప్రియమయినవయినా త్రుంచి వేస్తామని, త్రికరణశుద్ధితో అల్లాహ్ సన్నిధిలో వాగ్దానం చేసిన వారు మాత్రమే. అయితే అన్సార్‌లకు ఎదురయిన పరీక్ష కూడా తేలికయింది కాదు. ఇంతవరకు అరేబియాలోని దైవతిరస్కారుల, మక్కా బహుదైవారాధకుల దృష్టిలో అన్సార్ల నేరం, కేవలం తమ శత్రువులయిన ముస్లిములకు ఆశ్రయమివ్వడమే. కాని ఇప్పుడయితే వారు బాహాటంగా ఇస్లామీయ ఉద్యమంతో సహకరిస్తూ దాన్ని విశ్వసించని వారితో ఘర్షణకు బయల్దేరి వచ్చారు. అంటే, వారు, అరేబియా మొత్తాన్ని తమ నగరానికి (మదీనాకు) శత్రువులుగా చేసుకున్నారు. వాస్తవంగా మదీనా జనాభా మొత్తం ఒక వేయికి మించిలేదు. అయితే ఈ సాహసోపేత కార్యం చేయగలిగే వారు కేవలం అంగబలంపై నమ్మకమున్న వారు మాత్రం కాదు. వారు అల్లాహ్ పట్ల, దైవ సందేశహరుని పట్ల ప్రేమాభిమానాలు, ఆఖిరత్ (మరణానంతర జీవితం) పట్ల అచంచల విశ్వాసం కలిగి వున్న వారు తప్ప మరొకరు కాజాలరు. లేకపోతే ఈ విధంగా తమ ధన ప్రాణాలను, భార్యా పిల్లల్ని కష్టాలకు గురి చేసుకునేదెవరు?

## ఘోర పరాజయం

విశ్వాసం అంత ఉన్నత స్థాయికి చేరుకున్నప్పుడే దైవసహాయం అందుతుంది. తప్పనిసరిగా అందుతుంది. కనుక బద్ర్ మైదానంలో అల్లాహ్ ఆ 313 మంది బలహీను లయిన ముస్లిమ్‌లకు సహాయపడి, వారికి ప్రతికూలంగా వెయ్యి మందికి మించి ఉన్న తిరస్కార సైన్యాన్ని పరాజితులుగా చెయ్యడం వల్ల కురైషీల శక్తి మొత్తం అణగారిపోయింది. ఈ యుద్ధంలో కురైషీ సైనికులు 70 మంది హతమయ్యారు. 70 మంది ఖైదీలయ్యారు. హతమయిన వారిలో వాళ్ళ గొప్ప గొప్ప నాయకులంతా ఉన్నారు. వాళ్ళలో ఉతబా, షీబా, అబూజహల్, సమ్‌ఆ, ఆస్, ఉమయ్యా ప్రభృతులు ముఖ్యమయిన వారు. వారి మరణం వల్ల కురైషీల వెన్ను విరిగింది. ముస్లిమ్‌లలో ఆరుగురు ముహాజిర్లు, ఎనమండుగురు అన్సార్లు అమరగతులయ్యారు.

యుద్ధఖైదీలను సహాబా (సహచరు)ల్లో ఒక్కొక్కరికి ఇద్దరిని, నలుగురిని పంచివేశారు. వారి ఎడల సత్‌ప్రవర్తనతో మెలగాలని ఆదేశించారు. తదనుగుణంగా సహాబా ఖైదీలను సుఖంగానే ఉంచారు. ఎన్నో పర్యాయాలు తామే స్వయంగా కష్టాల్ని సహించి వారికి కష్టం కలగనివ్వలేదు. ఈ సదోపచారం వల్ల వారి హృదయాలు ఇస్లామ్ పట్ల కాస్త మెత్తపడ్డాయి. ఉద్యమం సాధించిన గొప్ప విజయం ఇదే. ఆ తరువాత ఖైదీలలో చాలా మందిని పరిహారం తీసుకుని వదిలి వేశారు. ఇంకా కొంత మంది నిరుపేదలు, చదవడం, వ్రాయడం తెలిసిన వారు, చెరో పది మంది పిల్లలకు చదువు చెప్పి విడుదల అయ్యారు.

## బద్ర్ యుద్ధ పరిణామాలు, ప్రభావాలు

బద్ర్ యుద్ధం, దాని పరిణామాలు, ప్రభావాల దృష్ట్యా ఎంతో ముఖ్యమైంది. ఇది, వాస్తవంగా ఇస్లామ్‌ను తిరస్కరించిన కారణాన మక్కా ధిక్కారులకు దైవం వ్రాసి పెట్టన శిక్షకు మొదటి వంతు. ఈ పోరాటం వల్ల తెలిసివచ్చిన మరొక సత్యమేమంటే ఇస్లామ్, కుఫ్ర్‌లలో జీవించే హక్కు దేనికి వుందో, రాబోయే పరిస్థితులు ఏ విధంగా రూపుదాలుస్తాయో తేలిపోతుంది. ఈ విధంగా ఇస్లామీయ చరిత్రలో జరిగిన ఈ తొలి పోరాటం ఎంతో గొప్ప సంగ్రామంగా ఎంచబడుతుంది. అన్ఫాల్ సూరాలో ఈ యదార్థాన్ని చాలా వివరంగా సమీక్షించటం జరిగింది. కానీ ఈ సమీక్షకు ఓ ప్రత్యేకత వుంది. అది రాజులు లేక సేనాపతులు ఏదైనా యుద్ధభూమిని గెలుచుకుని సాధారణంగా చేసే సమీక్ష లన్నింటికి పూర్తిగా భిన్నమయింది. ఈ సమీక్ష ప్రత్యేకతలను కాస్త విశదంగా పరిశీలించడం సమంజసం. ఎందుచేతనంటే దీనివల్ల ఇస్లామీయ ఉద్యమం, దాని నైజం, ముస్లిమ్‌ల సుశిక్షణా కార్యక్రమం ముందుకువస్తాయి.



## బద్ర్ యుద్ధంపై సమీక్ష

1. ఇంతకు ముందే వివరించినట్లు ఇస్లామ్ ఆవిర్భావానికి పూర్వం యుద్ధమంటే అరబ్బులకు ఆరో ప్రాణం. యుద్ధంలో చేజిక్కే సొత్తు (యుద్ధఫలం) అంటే వారికి ఎంతో మక్కువ. కేవలం ఈ యుద్ధఫలం పొందే ఆశే యుద్ధానికి కారణమైన సందర్భాలెన్నో ఉన్నాయి. కాని ఇస్లామ్ దృష్టిలో యుద్ధానికి లక్ష్యమే వేరు. ఇక్కడ ధన సామగ్రికి విలువేలేదు. ఇస్లామ్‌ను స్వీకరించిన అరబ్బులకు ఆ లక్ష్యాన్ని మనోగతమయ్యేలా బోధపరచడం అత్యవసరం. ఇస్లామీయ యుద్ధనీతి, యుద్ధ నియమాలు ముస్లిములకు పూర్తిగా బోధపడ్డాయా లేక ఇస్లామేతర దృక్పథాలు, భావాలు, యుద్ధ నియమాలు ఇంకా వారి ఆంతర్యాల్లో ఏ మూలలోనయినా మిగిలి ఉన్నాయా అనే విషయాన్ని తెలుసు కోవడం కూడా అవసరమే. ఈ పరిశీలన కోసం వచ్చిన తొలి అవకాశమే ఈ బద్ర్ యుద్ధం.

బద్ర్ యుద్ధంలో, మక్కా తిరస్కారుల సొత్తు ఎవరికి చేజిక్కింది వారు, తమ పురాతన ఆచారం ప్రకారం, తమ సొత్తుగా భావించసాగారు. అయితే ఎవరయితే తిరస్కారుల్ని వెంబడించారో లేదా మహాప్రవక్త (స) రక్షణకై నియమించబడి ఉన్నారో వారికి ఏమీ దొరకలేదు. ఈ విధంగా ముస్లిముల్లో మనస్పర్థలు ఏర్పడే సూచనలు గోచరించాయి. ఈ సందర్భంలోనే ఇస్లామీయ ఉద్యమ అనుయాయులకు సముచితమైన శిక్షణ గరపడానికి తగిన అవకాశం లభించింది. కనుక వారికి స్పష్టంగా ఈ విషయాలు విశదపరచబడ్డాయి:

"యుద్ధంలో చేజిక్కినదంతా వాస్తవంగా యుద్ధానికి ప్రతిఫలం కాదు, అది 'అన్ఫాల్' అని గ్రహించాలి. అంటే ప్రభువు తరఫున అసలు ప్రతిఫలం కంటే హెచ్చుగా ఇవ్వబడే బహూకరణ. అల్లాహ్ మార్గంలో యుద్ధం చెయ్యడం వల్ల ఇవ్వబడే అసలు ప్రతిఫలాన్ని అల్లాహ్ మరణానంతర జీవితంలో అనుగ్రహిస్తాడు. ఇక్కడ లభించేదానిపై ఎవరికీ హక్కులేదు. అది అల్లాహ్ బహూకరణ కనుక, దానిపై ఒకరి అధికారమంటూ ఉండడానికి ఆస్కారం లేదు. ఇదంతా అల్లాహ్, ఆయన సందేశహరుని సొత్తే. ఆయన దాన్ని ఏ విధంగానైనా విభజిస్తాడు."

ఆ తరువాత దాని విభజనకు సంబంధించిన నియమం కూడా సూచించబడింది. తద్వారా యుద్ధానికి సంబంధించిన భావనల్లో, దృక్పథాల్లో గొప్ప నైతిక సంస్కరణ చేయటం జరిగింది. ఒక ముస్లిమ్ కేవలం ప్రాపంచిక లాభాలకై ఎన్నటికీ కరవాలం ఎత్తకూడదనీ, ప్రపంచాన్ని పట్టి పీడించే నైతిక రుగ్మతల్ని రూపుమాపడానికీ, అల్లాహ్ దాసులైన మానవుల్ని దైవేతర శక్తుల బానిసత్వం నుండి విమోచనం కలిగించడానికీ, విరోధి శక్తులు తమ ప్రభు మాటను అణచివేసేందుకు శక్తిని వినియోగించినప్పుడు, సందేశ ప్రచారం ద్వారా ప్రజా సంస్కరణను సత్యతిరస్కారులు దుస్సాధ్యం చేసినప్పుడు కూడా మార్గాంతరం లేకనే శక్తిని వినియోగించాలని, ముస్లిమ్‌లకు బోధపరచడం జరిగింది. ఇంకా, పై సూచనల దృష్ట్యా

ముస్లిములకు నిత్యం తమ నిజధ్యేయమైన సంస్కరణ, సముద్ధరణల మీదే ధ్యాస ఉండాలనీ, ఈ లక్ష్య సాధనకై చేసే కృషిలో ఏవైనా ఐహిక ప్రయోజనాలు ప్రాప్తమైతే వాటి వైపు దృష్టిని మళ్ళించకూడదని హితవు గరపడం జరిగింది.

2. ఇస్లామీయ వ్యవస్థలో 'ఆజ్ఞాపాలన'కు ఉన్న ప్రాధాన్యత, శరీరంలో ఆత్మకు ఉన్న ప్రాధాన్యతలాంటిదే. విధేయత అన్నది ఇస్లామీయ జీవనానికి ఊపిరి లాంటిది. అందువల్లనే, దైవానికి దైవప్రవక్తకు ఎదురుపలక్కుండా విధేయత పాటించేలా ముస్లిముల ఆంతర్యాలను మలచడానికి పలుమార్లు ప్రయత్నించటం జరిగింది. కనుక ఈ యుద్ధం సందర్భంలోనూ 'యుద్ధఫలం' గురించి చెబుతూ మొదట దైవానికి, దైవప్రవక్తకు సంపూర్ణ విధేయతనే బోధించడమైనది, "ఇదంతా దైవం, ఆయన ప్రవక్తదే. కాబట్టి దాన్ని గురించి వారు చేసిన నిర్ణయాన్ని అందరూ సంతోషంగా స్వీకరించాలి" అని ఉపదేశించటం జరిగింది.

3. సామాన్యంగా ప్రాపంచిక ఉద్యమాల్లో, వాటి అనుయాయుల్ని, కార్యకర్తల్ని ప్రోత్సహించడానికి వారు నెరవేర్చిన కార్యాలను ప్రస్తావించి, ఖ్యాతి, పేరు ప్రతిష్ఠలు పొందే వాంఛను జనింపజేసి, వాటి ద్వారా త్యాగానికి పురికొల్పటం జరుగుతుంది. కనుకనే వారు గొప్ప గొప్ప కార్యక్రమాలు నిర్వహించిన తరువాత, ఏవైనా ముఖ్యమయిన కార్యాలు చేసిన మీదట తమ యోధుల్ని, కార్యకర్తల్ని బిరుదులతో, పారితోషికాలతో సత్కరిస్తారు, బహుమానాలు పంచుతారు. రకరకాలుగా తమ కార్యకర్తల ఉన్నతి కోసం ఏవేవో ఏర్పాట్లు చేస్తారు. దీనివల్ల వారు ఒకవైపున తాము చేసిన ఘనకార్యానికి ప్రతిఫలం పొంది తృప్తిచెందాలని, మున్ముందు ఇంకా ఇతోధికంగా త్యాగనిరతితో కృషి చేయాలని, మరొకవైపున ఇతరుల్లోనూ వారిలాగే ఉన్నత స్థానాన్ని ఆక్రమించే ఆశ జనించాలని ఇలా చేస్తారు.

ఇస్లామీయ ఉద్యమం దీనికి పూర్తిగా భిన్నమయింది. ముస్లిమ్‌ల 313 సిపాయిలు, వేయి మందికి మించిన శత్రు సైనికుల్ని తరిమి వేసినప్పటికీ, సరయిన ఆయుధబలం లేకపోయినా తమకంటే ఎన్నో రెట్లు అధికమయిన శక్తిని అంతమొందించి నప్పటికీ, వారు ఈ విషయాన్ని తమ శూరత్వంగా, ఘనకార్యంగా ఎంచకూడదని, అది కేవలం దైవకృప వల్ల జరిగిందని భావించాలని వారిని ఉపదేశించటం జరిగింది. కేవలం దైవానుగ్రహం, ఆయన కటాక్షం వల్లనే వారు శత్రువుల్ని తరమగలిగారు. వారు ఏ పరిస్థితిలోనూ కేవలం తమ వనరులపై, సాధన సామగ్రిపై, శక్తి సామర్థ్యాలపై భరోసా ఉంచుకోకూడదు. అసలు నిజమైన శక్తి అల్లాహ్‌పై భారం మోపటం ద్వారానే ప్రాప్తమవు తుంది. నిత్యం ఆయన కరుణాకటాక్షాల్ని అర్థించియే రంగంలోకి దిగాలి. సరిగ్గా యుద్ధం జరుగుతున్నప్పుడు మహాప్రవక్త (స) పిడికెడు ఇసుక తీసుకుని 'షాహతిల్ వుజూహ్' (వారి స్వరూపాలు చెడిపోవు గాక!) అంటూ తిరస్కారుల వైపునకు విసిరారు. దాని మీదటే ముస్లిమ్‌లు తిరస్కారులపై విరుచుకుపడగా వారు స్థయిర్యాన్ని కోల్పోయారు. ఈ సంఘటన ఎంతో అద్భుతమయింది.



ఇతరులైతే దీన్ని తమ మహత్యంగా ప్రకటించి ఎంతయినా గర్వించేవారు. ఒకవేళ వారే స్వయంగా అలా ప్రకటించకపోయినా వాళ్ళ అనుచరులు దీని ఆధారంగా ఎన్నెన్నో కథలు అల్లేవారు! కాని అల్లాహ్ స్వయంగానే ఈ విషయాన్ని దివ్యఖుర్ఆన్‌లో ఈ విధంగా వ్యక్తంచేసాడు.

"వారిని హతమార్చింది మీరు కాదు. అల్లాహ్ వారిని హతమార్చాడు."

మహాప్రవక్త (స)ను సంబోధించి ఇలా సెలవీయటం జరిగింది: "(ఇసుకను) నీవు విసరలేదు, అల్లాహ్ విసిరాడు."

ఇంకా "ఇలా ఎందుకు చెయ్యటం జరిగిదంటే, ఒక గొప్ప పరీక్ష గుండా విశ్వసించిన వారిని జయప్రదంగా దాటనివ్వాలని అల్లాహ్ అలా చేశాడు." (అన్‌ఫాల్ : 7)

ఇలా విశదపరచడం వల్ల ముస్లిములకు స్పష్టంగా తెలిసివచ్చిన విషయం ఏమంటే, వాస్తవానికి పనులు జరిగే ఏర్పాట్లన్నీ అల్లాహ్ హస్తగతమై ఉన్నాయి; జరిగేదంతా ఆయన ఆజ్ఞ ప్రకారం, ఆయన సంకల్పం రీత్యా మాత్రమే జరుగుతుంది. అల్లాహ్‌ను పరిపూర్ణంగా విశ్వసించి ఆయనపై భారం మోపడం, సర్వావస్థల్లో దైవం, ఆయన ప్రవక్తల విధేయతను పూర్తిగా పాటించడం మాత్రమే ఒక విశ్వాసి కర్తవ్యం. ఇదే అతని పరీక్ష.

4. ఇస్లామీయ ఉద్యమ కార్యంలో 'జిహాద్' అంతిమ పరీక్ష. ఇందులోనే ఉద్యమ అనుయాయుల్ని సంపూర్ణంగా పరీక్షించడం జరుగుతుంది. తిరస్కారం, ఇస్లామ్‌ల మధ్య ఘర్షణ అత్యున్నత స్థాయినందుకున్న తరుణంలో సందేశ ప్రచారం సాగనివ్వడానికి గత్యంతరం లేక విశ్వసించిన వారు రంగంలో దిగవలసి వస్తే, ఆ సమయంలో రంగం నుండి వెనుతిరగడం సాధ్యపడదు. అల్లాహ్ మార్గంలో పోరు సలుపుతూ రంగం నుండి విరమించుకున్నారంటే భావమేమిటీ?

1. ముస్లిమ్ దృష్టిలో, ఏ లక్ష్యం కొరకు ఆ పోరాటం జరుగుతుందో దానికన్నా అతని ప్రాణమే ప్రియతమమైందన్న మాట. లేదా,
2. జీవనమృత్యువులు అల్లాహ్ హస్తగతమై ఉన్నాయనే, ఆయన ఆజ్ఞ లేనిదే మృత్యువు సయితం మనిషి దరిచేరదనే, ఇంకా ఆయన ఆజ్ఞ అయిన తర్వాత మృత్యువు ఏ మాత్రం తొలగదనే విశ్వాసం విశ్వసించిన వ్యక్తిలో సన్నగిల్లింది అన్న మాట. లేదా,
3. అతని అంతర్యంలో దైవ ప్రసన్నత బడయటం, ఆఖిరత్ (పరలోక జీవితం)లో సాఫల్యం పొందటం కాక వేరే కొన్ని కోరికలు పెంపొందుతున్నాయని, వాస్తవంగా అతను దైవధర్మ సంస్థాపన కొరకు ఇంకా తనను తాను ఏకదీక్షతో అంకితం చేసుకోలేదని అర్థం.

ఒక విశ్వాసి అంతర్యంలో ఈ మూడు విషయాల్లో ఏది చోటు చేసుకున్నా అతని విశ్వాసాన్ని పరిపూర్ణ విశ్వాసం అనడానికి వీల్లేదు. అందుచేతనే తొలి యుద్ధం సందర్భాన

యుద్ధానికి వెనుకంజ వేయడం ఒక నిజమయిన ముస్లిం చెయ్యవలసిన పని కాదని ముస్లిములకు విస్పష్టంగా తెలుపడమయింది. మహాప్రవక్త (స) ఒకసారి ఇలా అన్నారు, 'మూడు అపరాధాలున్నాయి. వాటిని చేసిన వాడు మరే సత్కార్యం చేసినా అది అతనికి ఉపకరించదు. ఒకటి, షిర్క్, బహుదైవారాధన (అల్లాహ్ దైవత్వంలో ఇతరుల్ని భాగస్వాములుగా ఎంచటం); రెండు, తల్లిదండ్రుల పట్ల బాధ్యతలను సరిగ్గా నిర్వర్తించలేక పోవడం; మూడు, దైవ మార్గంలో జరిగే పోరాటం నుండి వెనక్కి మరలి పారిపోవడం.

5. అల్లాహ్ మార్గంలో ముందంజవేయడానికి మనిషి మరొక కారణం వల్ల కూడా సంకోచిస్తాడు – ప్రాపంచిక సంబంధాల ఎడల అతని ఆసక్తి ధర్మసమ్మతమైన అవధుల్ని దాటినప్పుడు! సంతానం, సంపదలు అతని మార్గానికి గొప్ప అవరోధాలుగా రూపొందుతాయి. అందువల్ల ఈ సందర్భంలో అల్లాహ్ ప్రసాదించే ధనాన్ని గురించి, సంతానాన్ని గురించి వాటి నిజస్థానాన్ని గురించి ముస్లిములకు తెలుపటం జరిగింది:

> "బాగా తెలుసుకోండి, మీ ధనం, మీ సంతానం వాస్తవంగా మీ పరీక్షా సామగ్రి. అయితే మీకు ప్రతిఫలమివ్వటానికి అల్లాహ్ వద్ద ఇంకా ఎంతో ఉంది."
> (అన్ఫాల్ : 28)

సంతానం, ఐశ్వర్యం ప్రసాదించి అల్లాహ్ విశ్వాసిని పరీక్షిస్తాడు – అతను దాన్ని సరయిన ఉద్దేశ్యం కొరకు వినియోగిస్తాడా? లేదా అని. ఇంకా ధన ప్రేమ అతనిలో అధికమై దైవమార్గంలో ధన త్యాగం చేయవలసి వచ్చినప్పుడు సంకుచిత హృదయంతో వ్యవహరిస్తాడా అని, ఇంకా ధన సముపార్జనలో పడటం వల్ల అతడు సత్యధర్మ పరివ్యాప్తి కొరకు చేసే కృషి సన్నగిల్లుతుందా అని. అలాగే సంతానం కూడా దైవం మనిషిని పరీక్షించే రెండవ పరీక్షా పత్రం. ఒకవైపు వారి ధర్మసమ్మతమైన హక్కుల్ని నెరవేరుస్తూ వారు అల్లాహ్ దాస్యపథంలో, ఆయన విధేయతా మార్గంలో నడుచుకునేలా వారిని తీర్చిదిద్దాలి. దాని కొరకు సర్వవిధాలా ప్రయత్నించాలి. మరోవైపు, వారి పట్ల దైవం సహజంగా సృజించిన వాత్సల్యం ప్రేమాభిమానాలు అవధులు దాటి తన హృదయాన్నే ఆక్రమించుకుని తాను దైవమార్గాన నడవటంలో అంతరాయం కల్పించకుండా గమనిస్తూ ఉండాలి. ధనం, సంతానాలకు సంబంధించిన ఈ ద్విముఖ పరీక్షకే ప్రతి విశ్వాసి సదా సిద్ధంగా ఉండవలసి ఉంటుంది.

6. సహనం ప్రతి ఉద్యమానికి ప్రాణం లాంటిది. ఈ గుణానికీ ఇస్లామీయ ఉద్యమానికి గల సంబంధం ఆత్మకు శరీరానికి గల సంబంధం లాంటిదే. మక్కాలో ముస్లిములు ఎదుర్కొన్న పరిస్థితుల దృష్ట్యా ఈ గుణాన్ని ఇతోధికంగా పెంపొందించడం పట్ల అక్కడ ఎక్కువగా శ్రద్ధ కనబరచబడింది. కాని అక్కడి పరిస్థితి ఏమంటే, జులుంను, దౌర్జన్యాన్ని, అత్యాచారాన్ని కేవలం సహించడం తప్ప ముస్లిములు చెయ్యగలిగిందేమీ



లేకపోయింది. ఇప్పుడయితే ఉద్యమం పురోగమించి మరొక దశలో అడుగుపెట్టింది. ఇప్పుడు ముస్లిముల చేతనే మరొకరికి కష్టం కలిగే ప్రమాదం ఉంది, అందువల్లనే మారిన ఈ పరిస్థితుల్లోను ఈ గుణాన్ని పటిష్టం చెయ్యటం, దాన్ని పెంపొందించడం పట్ల తాకీదు చెయ్యబడింది:

> "విశ్వసించిన వారలారా! ఏదయినా వర్గాన్ని మీరు మార్కొన్నప్పుడు స్థిరచిత్తంతో నిలబడండి. అల్లాహ్ ధ్యానం అధికంగా చెయ్యండి. అప్పుడే మీకు విజయం సంప్రాప్తమవుతుందని ఆశించవచ్చు. అల్లాహ్, ఆయన ప్రవక్తల, విధేయతను పాటించండి. పరస్పరం విభేదించుకోకండి. దీనివల్ల మీలో బలహీనత పొడసూపు తుంది. మీరు స్థయిర్యం కోల్పోతారు, సహనంతో మెలగండి, నిస్సందేహంగా, అల్లాహ్ సహనశీలురకు తోడుగా ఉంటాడు." (అన్ఫాల్:45,46)

ఇక్కడ సహనం అనే పదంలో ఈ క్రింది భావాలు అంతర్లీనమై ఉన్నాయి:

1. తమ భావోద్రేకాల పట్ల, మనోవాంఛల పట్ల నిగ్రహం పాటించాలి.
2. తొందరపాటుకు, ఆందోళనకు, భీతికి లోనవకూడదు.
3. ఎలాంటి ప్రలోభాన్ని, లాలసను, అనుచితమైన ఆవేశాన్ని దరిచేరనివ్వరాదు. ప్రతి పనిని ప్రశాంత హృదయంతో బాగా ఆలోచించి చేసిన నిర్ణయాల ప్రకారం పూర్తిచెయ్యాలి.
4. అపాయాలు, ఆపదలు ఆసన్నమైనపుడు అడుగులు తడబడకూడదు.
5. కోపతాపాలకు, ఆగ్రహావేశాలకు లోనయి ఎలాంటి అనుచిత కార్యమూ చెయ్య కూడదు.
6. కష్టాలు వచ్చిపడి పరిస్థితులు మన ఆశలకు భిన్నంగా తారుమారు అయినట్లు కనిపిస్తే కంగారు వల్ల ఆందోళన పడి స్థిమితాన్ని కోల్పోకూడదు.
7. లక్ష్యాన్ని సాధించే ఆసక్తి అవధులు దాటగా తొందరపాటులో లోపభూయిష్ట మయిన విధానాన్ని అవలంబించకూడదు.
8. ప్రాపంచిక లాభాలు, ప్రలోభాలు మనస్సును లోబరచుకోవడం వల్ల వాటి సమక్షంలో బలహీనత కనబరచి వాటికి లొంగిపోకూడదు. మారిన ఈ పరిస్థితుల్లో విశ్వసించిన వారిని, వారి సహనాన్ని ఈ విధంగా కూడా పరీక్షించవలసి ఉంటుంది.

7. ఒక్కొక్కసారి లక్ష్యాన్ని సాధించే ధ్యాసలో, దాని ప్రేమలోపడి మనిషి న్యాయాన్ని సత్యాన్ని పూర్తిగా విస్మరిస్తాడు. పైగా లక్ష్యం మంచిదయినప్పుడు, దాన్ని సాధించేందుకు ఇలా చెయ్యడంలో తప్పేమీ లేదని కూడా భావించుకుంటాడు. కాని ఇస్లామీయ ఉద్యమం

సంపూర్ణంగా 'సత్యం' పునాదిగానే ప్రారంభమవుతుంది. అలాగే పురోగమిస్తుంది. అది, దాని అనుయాయుల్ని, ఎలాంటి పరిస్థితుల్లోనూ సత్యాన్ని, న్యాయాన్ని వదలి ఒక్క అడుగయినా వెయ్యనివ్వదు. కనుక తిరస్కారం, ఇస్లామ్‌ల మధ్య జరుగుతున్న ఈ ప్రముఖ ఘర్షణలో అనుసరించవలసిన ఇతరేతర నైతిక నిర్దేశాలు, ఆదేశాలకు తోడుగా, విరోధులతో ముస్లిమ్‌లు చేసుకునే రాజకీయ ఒప్పందాలను గురించి సయితం వారికి ఇవ్వబడిన ఆదేశాలు న్యాయం, సత్యాలకు ప్రతీకలు. ఆ ఆదేశాల సారాంశమేమంటే, ముస్లిములు ఎలాంటి పరిస్థితుల్లోనూ జయాపజయాలను, భౌతిక లాభాలను ప్రమాణంగా తీసుకుని ఒప్పందాలను ఉల్లంఘించడం కాని, వాటిని భంగపరచడం కాని చెయ్యకూడదు. అల్లాహ్‌పై భారం మోపి విశ్వసనీయంగా ఒప్పందాలను పాటించాలి. ఇలా న్యాయాన్ని అవలంబించిన కారణంగా వారు పరదేశాల్లో ఉండే తమ తోటి ముస్లిమ్ సోదరులకు సహకారం అందజెయ్యలేకపోయినా ఫరవాలేదు.

బద్ర్ యుద్ధానంతరం దివ్యఖుర్‌ఆన్‌లో, ఈ నిర్ణయాత్మకమైన యుద్ధాన్ని గురించి చెయ్యబడిన సమీక్షలోని ముఖ్యాంశాలివి. వీటిని సావధానంగా పరిశీలిస్తే ఇస్లామీయ ఉద్యమానికీ ప్రపంచంలోని ఇతర ఉద్యమాలతో పోల్చినపుడు ఏ విధమయిన ప్రత్యేకత లున్నాయో, అది దాని అనుయాయులకు ఏ విధమైన శిక్షణ ఇవ్వాలని అభిలషిస్తుందో బోధపడుతుంది.





# ఉహుద్ యుద్ధం

## కారణాలు

బద్ర్ యుద్ధంలో ముస్లిములకు విజయం ప్రాప్తించినా ఈ యుద్ధం వల్ల ఒక విధంగా తేనె తుట్టెపై రాళ్ళు రువ్వినంత పని జరిగింది. బద్ర్ యుద్ధం తొలి యుద్ధం. ఇందులో ముస్లిమ్‌లు తిరస్కారుల్ని ఘాటుగా ప్రతిఘటించారు. తిరస్కారులు పరాజయం పొంది పారిపోవలసి వచ్చింది. ఈ సంఘటన మూలంగా అరేబియా మొత్తం ముస్లిములకు ప్రతికూలంగా విజృంభించింది. ఈ కొత్త ఉద్యమానికి బద్ధ విరోధులైన వారు ఈ సంఘటన జరిగిన తరువాత ఇంకా మండిపడ్డారు. ఇంకా, బద్ర్ రణభూమిలో హతమయిన మక్కా నాయకుల ప్రతీకారం కొరకు అనేక హృదయాలు తహతహలాడాయి. అరేబియాలో ఏ ఒక్కని హత్య అయినా తరతరాల వరకు ఘర్షణ కారణమై నిలుస్తుంది. అలాంటప్పుడు బద్ర్‌లో వందలాది పోరాటాలకు కారణం కాగల పెద్ద పెద్ద వ్యక్తుల ప్రాణాలెన్నో హతమయ్యాయి. ఈ కారణాల వల్ల ఎటు చూసినా పెద్ద సంక్షోభ సూచనలే కానవస్తు న్నాయి.

ఇంతకు ముందు ఒడంబడికలు చేసుకున్న యూదుల తెగలు సయితం ఆ ఒడంబడికలను ఖాతరు చెయ్యటం లేదు. వారు, దైవం, దైవ దౌత్యం, మరణానంతర జీవితం, దైవగ్రంథం పట్ల విశ్వాసం కలవారవటం చేత ముస్లిములకు సన్నిహితం కావలసిందిపోయి వారు తమ విశ్వాస పాత్రతను, ఆదరాభిమానాలను ఖురైష్ బహుదైవా రాధకులకు అంకితం చేసుకున్నారు. వారు ముస్లిములకు ఎదురొడ్డి యుద్ధం చెయ్యమని బహుదైవారాధకుల్ని బాహాటంగా పురికొల్పసాగారు. ముఖ్యంగా 'బనూ నజీర్' తెగ నాయకుడైన 'కఅబ్ బిన్ అష్రఫ్' అనేవాడు ఈ సందర్భంగా అత్యంత నీచత్వానికి, అంధశత్రుత్వానికి దిగజారాడు. ఈ విధంగా యూదులు పొరుగు వారైనప్పటికీ ఎలాంటి సహాయం చెయ్యరని, ఇంకా, మహాప్రవక్త (సల్లల్లాహు అలైహివసల్లమ్)తో వారు చేసిన ఒప్పందాలనే ఏ విధంగానైనా దాటవేసే ప్రయత్నాలు చేస్తున్నారని తెలిసిపోయింది.

ఈ పరిస్థితుల్లో ఆ చిన్న నగరం మదీనా, నలువైపుల నుండీ ప్రమాదంలో చిక్కుకున్నది. అంతర్గతంగానూ ముస్లింల పరిస్థితి అంతమెరుగ్గా లేదు. వారి ఆర్థిక పరిస్థితి ముందే బలహీనంగా ఉండేది. ఇప్పుడు యుద్ధానంతరం ఇంకా బాగా దెబ్బతిన్నది.

మక్కా బహుదైవారాధకుల హృదయాలలో ముస్లింలపై ప్రతీకారం తీర్చుకునే కోరిక ముందే మసలుతూ ఉండేది. వాళ్ళ నాయకులు అనేకులు పగ తీర్చుకునే శపథం కూడా చేసుకున్నారు. ప్రతి తెగలోని వారూ కోపావేశాలతో తపించిపోతున్నారు. దానికి తోడుగా యూదుల తరఫున లభించిన ప్రోత్సాహం అగ్గిమీద గుగ్గిలంగా పనిచేసింది. ఇంకా బద్ర్ యుద్ధం జరిగి ఏడాది కూడా గడవకముందే మక్కా బహుదైవారాధకులు గొప్ప సైనిక దళం తీసుకుని మదీనాపైకి దండెత్తడానికి సిద్ధమవుతున్నారని మదీనాకు సమాచారాలు అందసాగాయి.

## కురైషీల పురోగమనం

హి.శ.3, షవ్వాల్ నెల మొదటి వారంలో మహాప్రవక్త (స) ఇద్దరు వ్యక్తుల్ని సరయిన సమాచారం సేకరించడానికి పంపారు. వారు తిరిగి వచ్చి కురైషీ దళాలు మదీనా దరిదాపుల్లోకి వచ్చి చేరాయని, వాళ్ళ గుర్రాలు మదీనా పచ్చిక మైదానం ఒకటి ఖాళీ చేశాయని తెలిపారు. మహాప్రవక్త (స) శత్రువుల్ని నగరంలో ఉండి ఎదుర్కోవడమా లేక బయటికి వెళ్ళి సంహరించడమా? అన్న విషయంపై సహాబా వద్ద సలహా కోరారు. కొందరు సహాబా మదీనాలోనే ఉండి ఎదుర్కోవాలని అభిప్రాయం వెలిబుచ్చారు. కాని కొందరు నవయువకులు 'షహాదత్' (అమరగతి) పొందే ఉత్కంఠతో ఉవ్విళ్ళూరుతున్న వారు, బద్ర్ యుద్ధంలో పాల్గొనలేకపోయిన వారు - బయట రంగంలోకి దిగి పోరాడాలనే పట్టుబట్టారు. వీరి పట్టుదల చూసి మహాప్రవక్త (స) ఆఖరికి బయటికి వెళ్ళి యుద్ధం చేయాలనే నిర్ణయించారు.

## కపటుల ద్రోహం

కురైష్ సైన్యం మదీనాకు సమీపంలో ఉహుద్ గుట్టపై మకాం వేసింది. మహాప్రవక్త (స) దానికి ఒక దినం తరువాత జుమా నమాజ్ చేసి వెయ్యి మంది సహాబాతో నగరం నుండి బయల్దేరారు. వీరిలో 'అబ్దుల్లా బిన్ ఉబయ్' కూడా ఉన్నాడు. బాహ్యంలో ముస్లిమయినట్లు వ్యవహరించినా లోలోపల అతను ముస్లింల పరమశత్రువు. చివరి వరకు మునాఫిక్ (కపటుడు)గానే జీవించాడు. కొంత దూరం వెళ్ళాక అబ్దుల్లా బిన్ ఉబయ్ 300 మందిని తన పక్షాన మరల్చుకుని తతిమ్మా సహాబాతో వేరయ్యాడు. ఇక మిగిలిన వారు 700 మాత్రమే. ఇలాంటి సంక్లిష్ట పరిస్థితిలో ఇతని ఈ చేష్ట విశ్వసించిన వారిని తీవ్రమైన మానసిక సంక్షోభానికి గురిచేయగల చర్య. కాని ఏ ముస్లింల అంతర్యంలోనైతే అల్లాహ్‌పై



విశ్వాసం, పరలోకం పట్ల గట్టి నమ్మకం, సత్య మార్గంలో అమరగతి పొందే ఉద్రేకం పొంగిపొరలుతుందో వారిపై ఈ సంఘటన వల్ల ఎలాంటి అవాంఛనీయమైన ప్రభావం కలగజాలదు. మిగిలిన ఈ ముస్లిములే యుద్ధంలో అల్లాహ్‌పై భారం వేసి ముందంజ వేశారు.

## నవయువకుల ఉత్తేజం

ఈ సందర్భాన మహాప్రవక్త (స) సైనికులైన తన సహచరులందరిపై పునఃపరిశీలన జరిపారు. చిన్న వయస్సుగల వారిని వెనక్కి పంపివేశారు. వీరిలో 'రాఫే' 'సమర' అనే ఇద్దరు నవ యువకులు కూడా వున్నారు. వయస్సులో చిన్న వారిని వేరు చేస్తూ ఉండగా, కాస్త ఎత్తుగా కనబడాలని రాఫె తన కాలి వ్రేళ్ళపై నిలబడ్డాడు. ఈ ఉపాయం పారింది. కాని 'సమర'కు అనుజ్ఞ లభించలేదు. అందుకు ఆయన "రాఫె"ని తీసుకున్నట్లయితే నన్ను కూడా తీసుకోవలసిందే, నేను అతన్ని కుస్తీలో చిత్తు చేయగలను" అని తన ఆక్షేపణ వెలిబుచ్చారు. దాన్ని రూఢీపరచేందుకు కుస్తీ జరపబడింది. ఆయన 'రాఫె'ను కుస్తీలో చిత్తు చేసిన అనంతరం 'సమర'కు సయితం సైన్యంలో ప్రవేశం లభించింది.

ఇది ఒక చిన్న సంఘటన. కాని దీనివల్ల ముస్లిములలో అల్లాహ్ మార్గాన జిహాద్ చెయ్యాలన్న కోరిక ఎంత ప్రబలమయిందో, వారిలో ఎంత తీవ్రమైన అంతర్ ప్రేరణలు ఉండేవో తెలుస్తుంది.

## దళాల నియామకం

ఉహుద్ కొండ మదీనా నుండి దాదాపు నాలుగు మైళ్ళ దూరంలో ఉంది. తన సైన్యాన్ని మహాప్రవక్త (స) ఏ విధంగా నియమించారంటే వెనుకవైపు కొండ వుంది, ముందు కురైషీల సైన్యం, వెనుక వైపు వున్న ఒక కనుమ ద్వారా దాడి జరిగే ప్రమాదం ఉండటం వల్ల ఆయన అక్కడ అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ నాయకత్వాన యాభైమంది విలుకాండ్రను నియమించారు. "ఎవరినీ ఈ కనుమ గుండా దాటనివ్వకూడదు. ఇక్కణ్ణుంచి ఎలాంటి పరిస్థితుల్లోనూ కదలకూడదు. పక్షులు మా శరీరాన్ని భక్షిస్తూ ఉన్నట్లు చూసినా మీరు మీ స్థానాన్ని విడవకూడదు" అని మరీ మరీ హెచ్చరించారు.

## కురైషీల సన్నాహాలు

కురైషీలు ఈసారి మరింత భారీ సాధనసామగ్రితో వచ్చారు. ఇంచుమించు మూడువేల మంది సైనికులు, వారికి తోడు పుష్కలంగా యుద్ధ సామగ్రి. స్త్రీలు పాల్గొన్న యుద్ధాల్లో అరబ్బులు ప్రాణాలకు తెగించి పోరాడతారు. యుద్ధంలో పరాజయం కలిగితే స్త్రీల పరాభావం జరుగుతుందనే ఆలోచనతో ఇలా ప్రాణాలకు తెగించేవారు. ఈ పోరాటంలో కూడా ఎంతో మంది స్త్రీలు తోడుగా ఉన్నారు. వీరిలో చాలా మంది స్త్రీల కొడుకులు,

చుట్టాలు బద్ర్ రణరంగంలో సంహరింపబడ్డారు. హంతకుల రక్తం తాగనంతవరకు ఓపిగ్గా కూర్చోమని ఒట్లు వేసుకున్నారు వీరు.

## ప్రారంభం

కురైషీలు తమ సైన్యానికి మంచి శిక్షణ ఇచ్చారు. పోరాటం ప్రారంభమయ్యే ముందు, సైనికుల్లో బద్ర్‌లో నిహతులైన వారి పట్ల విషాదం ఉత్తేజం కావాలని, తద్వారా ప్రతీకారం తీర్చుకునే ఆవేశం ఉవ్వెత్తున లేవాలని కురైష్ స్త్రీలు దప్పు వాయిస్తూ ఉత్తేజం, ఆవేశం, పౌరుషం జనింపజేసే కావ్యాలు గానం చేశారు. తరువాత యుద్ధం ప్రారంభ మయింది. ప్రథమంలో ముస్లింలే పైచేయిగా అగుపించారు. కురైషీ సైన్యంలో చాలా మంది సంహరించబడ్డారు. సైన్యంలో కలకలం బయలుదేరింది. అది చూసి ముస్లింలు విజయం సాధించామనుకున్నారు. అందువల్ల ఈ తొలి విజయాన్ని పురస్కరించుకుని రణరంగాన్ని మొత్తం స్వాధీనం చేసుకోవడం వదిలేసి 'యుద్ధ ఫలం' సేకరించడంలో నిమగ్నులయ్యారు. ఇటు కొండ కనుమవద్ద రక్షణకు నియుక్తులైనవారు, ముస్లిం సిపాయిలు యుద్ధఫలం సేకరించడం, శత్రువులు చెల్లాచెదరవడం గమనించి యుద్ధం ముగిసిందని విజయం ఇస్లామీయ యోధుల హస్తగతమైందని భావించారు. వీరు కూడా 'యుద్ధఫలం' సేకరించేందుకు తమ స్థానాన్ని వదలి పరుగుతీసారు. నాయకుడు అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ ఎంతగా వారిని వారించినా, మహాప్రవక్త (స) ఆదేశాన్ని గుర్తుచేసినా కొందరు వినా ఎవరూ నిలువలేదు.

## వెనుకనుంచి దాడి

'ఖాలిద్ బిన్ వలీద్' అప్పుడు తిరస్కారుల సైన్యంలో ఒక దళానికి సేనాపతిగా ఉన్నారు. ఈ సందర్భాన్ని వినియోగపరచుకున్నారు. కొండను చుట్టి వచ్చి వెనుక నుండి ముస్లింలపై దాడి చేశారు. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ కనుమ రక్షణకు మిగిలిపోయిన సిపాయిలతో ఎదిరించారు కూడా. కాని వారు తిరస్కారుల ఈ దెబ్బకు తట్టుకోలేకపొయ్యారు, అమరగతు లయ్యారు. శత్రువులు ముస్లింలపై అకస్మాత్తుగా విరుచుకుపడ్డారు. అటు చెల్లాచెదురై పారిపోతున్న కురైషీ సైన్యం కూడా ఇది చూసి తిరగబడింది. ఇప్పుడు ముస్లింలపై రెండు వైపుల నుండి దాడి జరిగింది. ముస్లింలు బిత్తరపోయారు. రణరంగం రూపురేఖలే మారిపోయాయి. ముస్లింలు స్థయిర్యాన్ని కోల్పోయారు. చెల్లాచెదురై పారిపోవడానికి ఉపక్రమించారు. ఇంకా కంగారులో ముస్లింలు స్వయంగా ముస్లింల చేతనే అమర గతులయ్యారు. ఈ గందర గోళంలోనే మహాప్రవక్త (స) సయితం అమరగతులయ్యారన్న వదంతి వ్యాపించింది. ఇక సహచరులలో మిగిలి వున్న వివేకం కాస్తా పటాపంచలయింది. ఎంతో మంది సాహసం కోల్పోయారు.



## అల్లాహ్ సహాయంతో విజయం

అప్పుడు దైవప్రవక్త (స)ను పది పన్నెండు మంది సహాబా (సహచరులు) తమ రక్షణలో తీసుకున్నారు. ఆయన కేవలం గాయపడ్డారు, సహాబా ఆయన్ని తీసుకుని ఒక గుట్ట వైపునకు వచ్చేశారు. సమయానికి దైవప్రవక్త (స) సురక్షితంగా ఉన్నారని ముస్లిములు తెలుసుకున్నారు. తక్షణం వారంతా సమావేశమై ఆయన వున్న స్థలానికి చేరుకున్నారు. ఆ సందర్భంలో ఏం జరిగిందో ఏమోకాని, తిరస్కారులు పోరాటాన్ని విరమించుకున్నారు. తమ విజయాన్ని సంపూర్ణం చేసుకోకుండానే రణరంగాన్ని వదలి వెనుతిరిగారు.

ఎన్నో ఆమడల దూరం పోయిన తరువాత తిరస్కారులు వాస్తవలోకంలోకి వచ్చి "అరె, ఇలా జరిగిందేమిటీ! ముస్లిముల శక్తిని పూర్తిగా నిర్మూలించేందుకు చేజిక్కిన తరుణాన్ని ఇలా వదిలేసి తిరిగి వచ్చామేమిటీ?" అని విస్తుపొయ్యారు. ఒకచోట మజిలీచేసి మదీనాపై మరొకసారి దాడి చెయ్యాలని సమాలోచనలు జరిపారు. కాని ధైర్యం చాల్లేదు. మక్కా వైపునకు తిరోన్ముఖులయ్యారు. ఇటు దైవప్రవక్త (స) కూడా శత్రువులు తిరిగి వస్తా రనే ఆలోచనతో ముస్లిములను సమావేశపరచి తిరస్కారుల్ని వెంబడించాలని ఆదేశించారు. అప్పటికే అందరూ అలసిపొయ్యారు. ఎంతో చిక్కుతో కూడుకున్న సమయం వచ్చింది. కాని నిజమయిన ముస్లిములు అల్లాహ్‌పై భారం మోపి ప్రాణాలు సయితం త్యాగం చేయడానికి సంసిద్ధులయ్యారు. అప్పుడు మహాప్రవక్త (స) హుమరల్ అసర్ అనే ప్రదేశం వరకు శత్రువుల్ని వెంబడించారు. ఈ ప్రదేశం మదీనాకు 8 మైళ్ళ దూరంలో వుంది. కాని కురైషీలు మక్కా తిరిగి వెళ్ళారని తెలియగానే దైవప్రవక్త, ఆయన సహచరులు మదీనాకు తిరుగు ప్రయాణం కట్టారు.

ఉహుద్ సంగ్రామంలో 70 మంది సహాబా (అనుచరులు) అమరగతులయ్యారు. వీరిలో చాలా మంది అన్సార్లకు చెందినవారే. మదీనాలో ఇంటింటా శోకాక్రందనలు ప్రారంభమయ్యాయి. ఈ సందర్భంలో దైవప్రవక్త (స) ముస్లింలను ఉద్దేశించి, నిర్యాణం పొందిన వారి గురించి రోదన చేయడం, శోకాలాపంతో విలపించడం ముస్లిమ్ అయిన వ్యక్తికి ఏ విధంగానూ తగదని ఉపదేశించారు.

## ప్రారంభంలో పరాజయం

ఉహుద్ సంగ్రామంలో ముస్లిములకు తొలుత కలిగిన అపజయానికి మునాఫిక్‌లు (కపటులు) చేసిన ద్రోహం కొంతవరకు కారణమైనా స్వయంగా ముస్లిములు అవలంబించిన లోపభూయిష్టమయిన వైఖరి కూడా ఇందుకు చాలా వరకు కారణమయింది. ఈ లోపానికి కారణమేమంటే, ఇస్లామీయ ఉద్యమం తన అనుయాయుల్ని ఏ విధమయిన నైజం కలవారుగా తయారు చెయ్యాలని, వారికి ఎలాంటి శిక్షణ ఇవ్వాలని కోరుతుందో దానికి గాను ఇంకా తగినంత అవకాశం దొరకలేదు. దైవ మార్గంలో ప్రాణాలకు తెగించి పోరాడవలసి వచ్చిన

అవకాశం ఇది రెండోదే. ఈ సందర్భంలో కొన్ని లోటుపాట్లు, బలహీనతలు వ్యక్తమయ్యాయి. ఉదాహరణకు ధన ప్రీతి వల్ల అప్పగించబడిన బాధ్యతను వదిలివేయడం, తమ నాయకుని ఆజ్ఞల్ని ఉల్లంఘించడం, అవిధేయత చూపడం, శత్రుబలాన్ని పూర్తిగా అణచివెయ్యక ముందే 'యుద్ధఫలం' వైపు దృష్టిని మళ్ళించడం లాంటివి. అందువల్ల ఈ యుద్ధం తరువాత కూడా అల్లాహ్ యుద్ధ పరిస్థితుల్ని సమీక్షించాడు. ఇందులో, ఇస్లామీయ దృక్పథం రీత్యా ముస్లిముల్లో ఉండిపోయిన లోటుపాట్లను ఒక్కొక్కదాన్నే వేలెత్తి చూపడం జరిగింది. దాన్ని గురించి అత్యవసరమయిన ఆదేశాలు ఇవ్వబడ్డాయి. ఈ ఆదేశాలు 'ఆలి ఇమ్రాన్' సూరా చివరి భాగంలో ఉన్నాయి. వాటిలో కొన్నింటిని ఇక్కడ ప్రస్తావిస్తున్నాము. తద్వారా ఇస్లామీయ ఉద్యమంలో యుద్ధానికి ఉన్న స్థానమేదో, ఇస్లామీయ దృక్పథం ప్రకారం యుద్ధం వివరాల్ని, అప్పుడు ఏర్పడిన పరిస్థితుల్ని ఏ విధంగా పరిశీలించాలో మరొకసారి విశదమవుతుంది.

## దైవంపైనే భారం

ముస్లిమ్‌లు పోరాటానికి బయల్దేరినప్పుడు వాళ్ళు ఇంచుమించుగా వెయ్యిమంది ఉన్నారు. అయితే శత్రు సైనికులు మూడు వేలమంది. పైగా కొంత దూరం వెళ్ళాక మూడు వందల మునాఫిక్‌లు ఒక్కసారిగా వేరుపడి వెనుతిరిగారు. ఇక ముస్లింలు కేవలం 700 మంది మిగిలారు. అసలే యుద్ధ సామగ్రి కొరవడి ఉన్న పరిస్థితిలో గోరుచుట్టుపై రోకటిపోటులా మూడవ వంతు సైనికులు తగ్గడంతో అతి సున్నితమయిన ఆ సమయంలో చాలా మంది నిస్పృహ చెందారు. అప్పుడు కేవలం అల్లాహ్ పట్ల గల విశ్వాసం, ఆయన సహాయం మీదగల నమ్మకమే ముస్లింలను శత్రువులతో పోరాటానికి తీసుకెళ్ళింది. ప్రవక్త శ్రేష్ఠులు (స) అప్పుడు ముస్లిములను ఓదార్చిన విషయాన్ని అల్లాహ్ ఈ విధంగా ప్రస్తావించాడు:

"జ్ఞాపకం చేసుకోండి, మీలో రెండు వర్గాలు పిరికితనం కనబరచిన వైనాన్ని. వాస్తవంగానయితే అల్లాహ్ వారి సహాయానికి సిద్ధంగానే ఉన్నాడు, విశ్వసించిన వారు యదార్థానికి అల్లాహ్‌పైనే భారం మోపాలి. ఇంతకు ముందు బద్ర్ యుద్ధంలో అల్లాహ్ మీకు తోడ్పడ్డాడు. అప్పుడు వాస్తవానికి మీరు ఎంతో బలహీనులు. కనుక, అల్లాహ్ పట్ల కృతఘ్నులుగా మారకండి. ఇకనయినా మీరు కృతజ్ఞులవుతారని ఆశించబడుతోంది. మరొకసారి జ్ఞాపకం చేసుకో, ఓ ప్రవక్తా, నీవు విశ్వసించిన వారితో, "అల్లాహ్ మూడు వేల మంది దైవదూతల్ని అవతరింపజేసి మీకు సహాయం చేస్తే అది మీకు చాలదా?" అని చెప్పిన విషయాన్ని, నిస్సందేహంగా (అలాగే జరుగుతుంది), మీరు సహనం వహిస్తే, దైవానికి భయపడి వ్యవహరిస్తే, మీపై శత్రువు దాడి చేసినప్పుడు మీ ప్రభువు 5 వేల మంది దూతలతో మీకు తోడ్పడుతాడు. మీరు సంతోషపడాలని మీ హృదయాలు తృప్తి చెందాలని అల్లాహ్ ఈ విషయాలు తెలియపరిచాడు. విజయం, సహకారం, ఏదయినా అల్లాహ్ తరఫుననే



లభిస్తాయి. ఆయన అమిత శక్తిమంతుడు, పరమ వివేచనాపరుడు, గొప్ప దూరదృష్టి కలవాడు."
(ఆలి ఇమ్రాన్: 122-126)

అసలు భౌతిక శక్తిపై భరోసా కలిగి ఉండటం ముస్లిముల పని కాదని, అల్లాహ్‌పై గల విశ్వాసం ఆయన సహాయం మీద భరోసాయే వారి శక్తినంతటికీ ఆధారం కాగలగాలని ముస్లింలకు చివరిసారిగా తెలుపటం జరిగింది.

## ధన ప్రీతి

ఉహుద్‌లో పరాజయం కలగడానికి ఒక ప్రధాన కారణమేమంటే ముస్లిములు సరిగ్గా యుద్ధంలో కీలక సమయం ఆసన్నమయినప్పుడు ధనప్రీతికి లోనయ్యారు. శత్రువుల్ని పూర్తిగా తరిమి వేయడానికి ముందే ధనం వైపునకు మళ్ళారు. చివరికి కనుమపై నియుక్తులైన సిపాయిలు సయితం ఈ విషయంలో పెద్ద పొరపాటు చేశారు. తత్కారణంగా పోరాటం తీరుతెన్నులే మారిపోయాయి. కనుక అల్లాహ్ ముస్లిముల అంతర్యాల నుండి ధనప్రీతిని దూరం చెయ్యడానికి, ఆ సందర్భంలోనే, ధనప్రీతిని సృజించే ఒక పెద్ద మూలకారణాన్ని అంతమొందించాడు. వడ్డీని 'హరాం' అధర్మమైనదిగా నిర్ణయించాడు. వడ్డీ వ్యాపారం చేసేవారి మనస్సుల్లో ధనప్రీతి తిష్టవేసుకుంటుంది. వారు ఏ ఉన్నత కార్యాన్నీ తలపెట్టే పరిస్థితిలో ఉండరు. దీనివల్లనే సమాజంలో ఒక వర్గం ధన పిపాస, లోభం, పిసినిగొట్టుతనం, స్వార్థపరత్వం, ధనప్రీతికి బానిసగా మారితే మరొక వర్గంలో ఆ వర్గం పట్ల ద్వేషం, క్రోధం, ఏహ్యభావం, ఈర్ష్య జనిస్తాయి. ఎన్నో కీడులకు మూల మయిన వడ్డీని హరామ్‌గా నిర్ణయించడం వల్ల 'ధనం' పట్ల ప్రజల దృక్పథం మారే అవకాశం కలిగింది.

## విజయం అనివార్యం

ఒకవేళ ధైర్య సాహసాల్ని ఉన్నతంగా ఉంచే ప్రేరక శక్తి అంటూ ఏదీ లేకపోతే ధైర్యసాహసాల్లో కొరత ఏర్పడటం తప్పదు. ఉహుద్‌లో ముస్లింలు అపజయం పొందారు. దాని కారణంగా కొందరు నిస్పృహ చెందడం సహజమే. ఈ పరిస్థితిలో ముస్లింలతో:

"మీరు అధైర్యపడవద్దు, ఖేదపడనక్కర లేదు. విజయం మిమ్మల్నే ఆశ్రయిస్తుంది, మీరు నిజమయిన విశ్వాసులే అయితే, విశ్వాసంపై నిలకడ కలిగి, అదికోరే అవసరాలను నెరవేర్చాలి, మీ బాధ్యత అంతే. ఆ తరువాత మిమ్మల్ని ఉన్నతం చెయ్యడం, చింత నుండి ఖేదం నుండి విముక్తి కలిగించడం అల్లాహ్ బాధ్యత. ఇకపోతే ఈ తాత్కాలికమయిన కొన్ని కష్టాలు, అపజయాలు- అయితే మీ ఎదుటి వర్గానికి కూడ ఇలాంటి ఆపదలే వచ్చాయి. వారు మిథ్యావాదాన్ని ఆశ్రయించిన వారైనప్పటికీ ధైర్యాన్ని వీడకుండా ఉన్నప్పుడు మీరు సత్యాన్ని స్వీకరించిన వారయినప్పటికీ చింతించడం దేనికి? మీరయితే స్వర్గాన్ని అభిలషించే వారు కదా! అయితే ఊరకనే స్వర్గంలో ప్రవేశిద్దామనుకున్నారా? వాస్తవంగా మీలో ఆయన

మార్గాన ప్రాణాలొడ్డి కృషిచేసే వారెవరో, అసంతృప్తికరమైన పరిస్థితుల్లో ఓర్పుగా ఉండే వారెవరో అల్లాహ్ ఇంతవరకు పరీక్షించనేలేదే!"

## ఇస్లామీయ ఉద్యమం- ప్రేరకశక్తి

సాధారణంగా ప్రతి ఉద్యమంలోనూ ఏదో ఒక కేంద్రీయ వ్యక్తిత్వం ఆ ఉద్యమానికి జీవమయి ఉంటుంది. కాని సైద్ధాంతిక ఉద్యమాల మనుగడ, వాటి వృద్ధీవికాసాలు ఎప్పుడూ వ్యక్తులపై ఆధారపడి ఉండవు. ఏ సిద్ధాంతాన్ని అయితే ఆ ఉద్యమం ప్రచారం చెయ్యాలని సంకల్పించిందో ఆ సిద్ధాంతంలోని శక్తి, దాని సత్యతపై అవి ఆధారపడి ఉంటాయి. ఇస్లామీయ ఉద్యమాల్లో దైవ సందేశహరుల వ్యక్తిత్వం ఎంత ముఖ్యమయిందో ఊహించడం కష్టంకాదు. కాని ఈ ఉద్యమం ఒక సైద్ధాంతిక ఉద్యమం అవడంచేత ఇంకా దీని ఉనికి, పురోగమనాలు ఇస్లామ్ ప్రబోధించే సిద్ధాంతాల శక్తిపై ఆధారపడి వుండటం మూలాన, ఈ సందర్భంలో ఒక విషయాన్ని విశదం చెయ్యడం అత్యవసరం. అంటే, ప్రవక్త (స) పవిత్ర వ్యక్తిత్వం వున్నంతకాలం ఆయన అనుయాయులు దైవధర్మ పతాకాన్ని చేతబూని సాగినా ఆ శుభప్రదుడైన వ్యక్తి (స) ప్రత్యక్ష మార్గదర్శకత్వం లభ్యం కాకపోతే ఆ మార్గాన్ని వదలి మరోమార్గాన్ని అవలంబించాలని అనుకుంటారేమో. అలాంటి ఆలోచన కూడా వారి మస్తిష్కాల్లో ఏ మూలలోనయినా అంకురిస్తుందేమో అన్న సంశయంతో వారిని హెచ్చరించవలసి వుంది. ఉహుద్ రణరంగంలో దైవప్రవక్త (స) అమరగతు లయ్యారనే వదంతి తప్పుగా ప్రచారయినప్పుడు కొందరు ముస్లిములు నిరాశా నిస్పృహలకు గురయ్యారు. దైవసందేశహరుని చల్లని నీడే మనకు లేకపోతే ఇక పోరాడి ఫలమేమి? అని భావించారు. ఇది ఇస్లామ్ సిద్ధాంతాలతో పొసగని భావం. ఈ భావ సంస్కరణ కొరకు ఈ సందర్భాన ఈ విధంగా బోధించటం జరిగింది.

"ముహమ్మద్ (స) కేవలం ఒక దైవసందేశహరుడు మాత్రమే. ఇంతకు ముందు కూడా ఇంకా ఎందరో దైవసందేశహరులు గతించారు. అయితే ఈయన నిష్క్రమిస్తే లేక హత్య చెయ్యబడితే మీరు వెనక్కి తిరిగిపోతారా? బాగా గుర్తుంచుకోండి. ఎవరయితే వెనక్కి తిరిగి పోతారో వారు దైవానికి ఎలాంటి నష్టాన్ని చేకూర్చలేరు! కాని ఎవరయితే దైవానికి కృతజ్ఞులయి మెలుగుతారో వారికి అల్లాహ్ సత్ఫలితాన్ని ప్రసాదిస్తాడు."

(ఆలి ఇమ్రాన్: 114)

మీరు ఏ ధర్మాన్ని బాగా ఆలోచించి, చైతన్యవంతంగా స్వీకరించారో దానిపై స్థిరంగా నిలబడటానికి, దాన్ని సుస్థాపితం చెయ్యడానికి, అల్లాహ్ ప్రవక్త నిత్యం మీతోపాటు వుండే అవసరంలేదు. ఇది మీ మంగళశ్రేయాల బేరం. మీరు దీనిపై నిలకడతో వున్నారా స్వయంగా మీరే లాభం పొందుతారు. ఈ ధర్మానికి నిజశక్తి ఇది అందజేసే సత్యమే. దీని ఉన్నతి



ప్రగతులు మీ శక్తి సామర్థ్యాలపై కాని, లేక ఒకరి వ్యక్తిత్వంపై గాని ఆధారపడి లేవు. మీరు దీన్ని బాగా అర్థం చేసుకోవాలి.

## బలహీనతకు మూలం

మనిషి బలహీనతలన్నింటికీ మూలకారణం మరణ భీతి. ఈ సందర్భంలో మహాప్రవక్త (స) సహచరులతో మరణానికి భయపడి పరుగులు తీయటం వ్యర్థమని మరణ ఘడియ రానిదే ఏ ప్రాణి కూడా మరణించదని, అల్లాహ్ నిర్ణయించిన సమయానికి ముందు ఎవరూ మరణించలేరని, మరెవరూ దాని తరువాత ఒక్క క్షణమయినా జీవించలేరని కనుక మీరు మృత్యువు నుండి తప్పించుకునే ఆలోచనలు చేసే అవసరం లేదని తెలుపటం జరిగింది. ఆలోచించవలసిన విషయం ఏమంటే దొరికిన జీవనవ్యవధి ఎందులో వ్యయమవుతోంది? ప్రపంచ వ్యామోహంలోనా పరలోక విజయ ప్రాప్తికొరకా? ప్రపంచ ప్రేమలో తన శక్తినంతా ధారపోసిన వ్యక్తికి దొరికేదంతా ఇహలోకంలోనే ప్రాప్తమవుతుంది. కాని పరలోక సాఫల్యం కొరకు కృషి చేసే వ్యక్తికి అల్లాహ్ ఆ లోకపు సఫలతనీ అనుగ్రహిస్తాడు. ఎవరైతే దైవ ధర్మాన్ని స్వీకరించి దానిపై స్థిరంగా నిలిచే, దాన్ని స్థాపించేందుకు కృషి చేసే భాగ్యాన్ని పొందుతారో వారు ఈ అత్యంత విలువయిన భాగ్యాన్ని గౌరవించాలి. దానికొరకు తమ సర్వస్వాన్ని ధారపోయాలి. దాని ఫలితం ఎంతో ఉత్తమంగా పరిణమిస్తుంది, పరలోక శాశ్వత సౌఖ్యం వారికి ప్రాప్తిస్తుంది. ఈ మహాభాగ్యాన్ని గౌరవించి దానిపట్ల దైవానికి కృతజ్ఞతలు తెలిపే వారిని అల్లాహ్ అత్యంత శ్రేష్టమైన తన వరాలతో సత్కరిస్తాడు.

# పరాజయం తరువాత

ఒకటీ, రెండు తెగలు వినా అరేబియాలోని తెగలన్నీ క్రొత్తగా వృద్ధిలోకి వస్తున్న ఇస్లామీయ ఉద్యమానికి వ్యతిరేకమయినవే. ఈ ఉద్యమం వారి పురాతన మతాన్ని, ఆచారాలను ఖండిస్తుంది. అది, మనిషి నైతికంగా ఉన్నతిని సాధించాలని, అరబ్బులలో సర్వసాధారణంగా ప్రబలి ఉన్న మద్యపానం, జూదం, వ్యభిచారం, దోపిడీల్లాంటి కీడుల నుండి దూరంగా ఉండాలని కోరుతుంది. బద్ర్ యుద్ధానికి ముందు ఈ తెగలు, ఈ కొత్త ఉద్యమాన్ని ఏ విధంగానయినాసరే అంతమొందించాలని యోచించేవారు. కాని బద్ర్‌లో కురైష్ పరాజయం తరువాత వారికిక ధైర్యం చాల్లేదు. ఈ పరిస్థితుల్లో ఏం చెయ్యాలి? అన్న మీమాంసలో వారంతా పడిపొయ్యారు. అయితే ఉహుద్ యుద్ధానికి పిదప పరిస్థితి మారిపోయింది. అరేబియాలోని ఎన్నో తెగలు ఇస్లాంకు వ్యతిరేకంగా తలెత్తసాగాయి. అలాంటి తెగల్లో కొన్ని తెగలు ఉద్యమం పట్ల అవలంబించిన వైఖరిని ఇక్కడ పేర్కొంటున్నాము.

## తెగల విశ్వాస ఘాతుకం

1. హి.శ. 4 ముహరమ్ మాసంలో 'కతన్' అనే ప్రదేశానికి చెందిన 'ఔథిద్' అనే ఒక తెగ మదీనాపై దండెత్తే యత్నం చేసింది. దైవప్రవక్త (సల్లల్లాహు అలైహివసల్లమ్) హజ్రత్ అబూ సల్మాకు చిన్నదళం ఇచ్చి వాళ్ళను ఎదుర్కొనడానికి పంపారు. దాడి చెయ్యదలచినవారు పలాయనమయ్యారు.

2. దాని తరువాత అదే నెలలో 'అరనా' కొండల్లోని 'లహియాన్' అనబడే తెగ ఒకటి మదీనాను ముట్టడించే సంకల్పం చేసింది. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఆనీస్ దాన్ని ఎదురించటానికి పంపబడ్డారు. అప్పుడు శత్రువుల నాయకుడు 'సుఫ్యాన్' హతమయ్యాడు, అది చూసి అంతా తిరుగుముఖం పట్టారు.

3. హి.శ. 4 సఫర్ మాసంలో కలాబ్ తెగ నాయకుడు అబూ బరాఅ మహాప్రవక్త (స) వద్దకు వచ్చి "కొందరిని నాతో పంపండి, నా తెగవాళ్ళు ఇస్లాం సందేశాన్ని వినదలచుకున్నార"ని విన్నవించుకున్నాడు. మహాప్రవక్త (స) 70 మంది సహాబాను అతనికి



తోడుగా పంపారు. వారిలో చాలామంది సుప్ఫా★ సజ్జనులున్నారు. వారందరినీ ఆమిర్ బిన్ తుఫైల్ అనే ఈ తెగ శ్రీమంతుడొకడు చుట్టుముట్టి సంహరించాడు. ఈ సంఘటనవల్ల మహాప్రవక్త(స)కు అంతులేని మనోవ్యధ కలిగింది. ఒక నెల వరకు 'ఫజ్ర్' (అరుణోదయ) ప్రార్థనలో ఆయన ఆ దుర్మార్గుల్ని శపిస్తూ ఉన్నారు. ఆ డెబ్బయి మంది సహచరుల్లో కేవలం ఒక సహాబీ హజ్రత్ 'అమ్ర్ బిన్ ఉమయ్యా'నూ ఆమిర్ వదలి వేశాడు. కారణం, "నా తల్లి ఒక బానిసను విడుదల చేయించే మొక్కుబడి చేసుకుంది. నిన్ను ఆ మొక్కుబడి తీర్చడానికి వదలివేస్తున్నాను" అని తెలిపాడు. హజ్రత్ అమ్ర్ బిన్ ఉమయ్యా తిరిగి వచ్చేటప్పుడు త్రోవలో ఆమిర్ తెగకు చెందిన ఇద్దరు వ్యక్తులు తటస్థపడ్డారు. ఆయన వారిని హతమార్చారు, 'ఆమిర్' చేసిన విశ్వాసఘాతుకానికి కొంతయినా ప్రతీకారం తీర్చుకున్నానని భావించారు హజ్రత్ అమ్ర్. మహాప్రవక్త(స)కు ఈ విషయం తెలిసినప్పుడు ఈ వైఖరిని తీవ్రంగా నిరసించారు. ఎంగుకంటే ఆయన ఆ తెగలోని వ్యక్తులకు క్రితంలో అభయమిచ్చి వున్నారు. ఇలా చేయడం ఆ ఒప్పందానికి విరుద్ధమయింది. అందువల్ల ఆయన ఆ ఇద్దరు వ్యక్తుల ర[illegible]రిహారం చెల్లిస్తామని ప్రకటన చేశారు. ఇలాగే, ఇంకా రెండు తెగలు ఇదే విధంగా ప్ర[illegible]చాయి. వాళ్ళు కోరడం వల్ల మహాప్రవక్త (స) పది మంది సహాబాను వారికి తోడుగా [illegible]ర్మిక శిక్షణ కొరకు పంపారు. కాని ఆ దుర్మార్గులు విశ్వాస ఘాతుకం తలపెట్టారు. సహాబా[illegible]తో పోరాడారు. ఏడుగురు అమరగతు లయ్యారు, ముగ్గురు బంధింపబడ్డారు. వారిలో హజ్ర[illegible]బైబ్, హజ్రత్ జైద్ (రజి అల్లాహు అన్‌హు) కూడా ఉన్నారు. శత్రువులు వీరిని మక్కా[illegible]కెళ్ళి అమ్మివేశారు. హజ్రత్ ఖుబైబ్ (ర) ఉహుద్ పోరాటంలో హారిస్ బిన్ ఆమిర్ అనే [illegible]క్తిని సంహరించారు. హారిస్ కుమారులు ఆయన్ని తన తండ్రికి బదులుగా హతమార్చి ప్రతీకారం తీర్చు కునేందుకు కొన్నారు. తమ కోరిక ప్రకారం కొన్ని రోజుల తరువాత వాళ్ళు ఆయన్ని హతమార్చారు. ఇలాగే హజ్రత్ జైద్‌ను సుఫ్వాన్ బిన్ ఉమయ్య హత్య చేయడానికి కొన్నాడు. తదనుగుణంగా హత్యచేశాడు కూడా.

ఈ విధంగా ఒక వైపున అరేబియా తెగలతో నిరంతరం ఇలాంటి రగడలు జరుగుతూనే వున్నాయి. వీటిలో విరోధుల తరఫున అత్యాచారం జరుగుతూ వచ్చింది. ముస్లిమ్‌లు వీరి అత్యాచారాన్ని భరిస్తూ వచ్చారు. దీనికి తోడుగా యూదులతోనూ ఇటువంటి కొన్ని వ్యవహారాలు జరిగాయి. అవి ముస్లిముల కొరకు ఎంతో బాధాకరంగానూ ఆందోళనకరంగానూ పరిణమించాయి.

---

*★ 'సుప్ఫా' అంటే అరబీలో అరుగు అని అర్థం. ప్రవక్త మస్జిద్‌లో ఒక అరుగు ఉండేది. దానిపై కొందరు ఇల్లూ వాకిలి లేని సహాబా ఉంటూ ఉండేవారు. కట్టెలు కొట్టి తెచ్చుకొని తద్వారా జీవిక గడుపుకొనేవారు. ఇతర సహాబా కూడ సహాయపడేవారు, విశేషంగా వారు చేసే పనులు ధార్మిక విద్య అభ్యసించడం, తెలియని వారికి ధార్మిక విద్య గరపడం, దైవారాధన చేసుకోవడం మాత్రమే.*

## యూదు విద్వాంసుల వైఖరి

మహాప్రవక్త (స) మదీనా అరుదెంచిన తరువాత యూదుల తెగలతో వివిధ ఒప్పందాలు చేసుకున్నప్పటికీ వారి ధన ప్రాణాలకు ఎలాంటి ముప్పు వాటిల్లనివ్వమని అభయమిచ్చినా, వారికి సర్వ విధాలుగా మత స్వాతంత్ర్యం వుంటుందని ప్రకటించినా, విశేషంగా యూదు విద్వాంసులు, మతాచార్యులు ఇస్లామీయ ఉద్యమం సాధించిన పరిణామ ప్రగతుల పట్ల చాలా చింతించేవారు. ఇది అకారణంగా కాదు. దీనికి కొన్ని కారణాలున్నాయి:

1. ఇంత వరకు మతపరంగా యూదులకు ఒక విధమైన ఆధిక్యత వుంది. జనులు వారిని, వారు కనబరిచే దైవభక్తి, ధార్మిక నిష్ఠ కారణంగా గౌరవించేవారు. అయితే ఇస్లామీయ ఉద్యమం మూలంగా వారి దోషపూరితమయిన ధార్మికత, వృత్తిపరమయిన దైవభక్తి బండారం బయటపడింది. మహాప్రవక్త (స) బోధనలు విని వాస్తవమయిన ధార్మికత ఏమిటో జనులు తెలుసుకుంటున్నారు. యదార్థమయిన దైవభక్తి అంటే ఏమిటో ప్రజలకు అర్థమవుతూ వుంది. ఈ విధంగా ఆ విద్వాంసుల, మతాచార్యుల వ్యవహారం, మత వ్యాపారం మందగించసాగింది.

2. దివ్యఖుర్ఆన్‌లో యూదుల, ముఖ్యంగా వారి విద్వాంసుల, ధర్మపరులయిన మతాచార్యుల ప్రవర్తనను, స్వరూప స్వభావాలను, వారి వ్యవహారాలను విస్పష్టంగా విమర్శించడం జరుగుతోంది. ఉదాహరణకు:

"వారు అసత్యమైన పలుకులు వినేవారు. అధర్మమయిన సొత్తును ఆరగించేవారు." (మాయిదా: 42)

"వారిలో చాలామందిని పాపపు పనుల వైపునకు, అత్యాచారం వైపునకు అతి శీఘ్రంగా పరుగిడేవారిగా చూస్తావు నీవు." (మాయిదా: 62)

"వారు వడ్డీ తినేవారు, వాస్తవంగా వారిని వడ్డీ తినరాదని వారించటం జరిగింది, వారు జనుల సొత్తును స్వాహా చేసివేస్తారు." (నిసా: 161)

ఇలాంటి ఎన్నో విమర్శలు, బకరా, మాయిదా, ఆలి ఇమ్రాన్ ఇత్యాది సూరాలలో కూడా ఉన్నాయి. వీటినంతా విని యూదుల్లోని సజ్జనులయినవారు కొందరు తప్ప అధికులు మండిపడేవారు, కల్లుతాగిన కోతిలా గంతులు వేసేవారు. గుడ్డిగా ఇస్లామీయ ఉద్యమాన్ని వ్యతిరేకించేందుకు ఉపక్రమించేవారు.

3. ఇస్లామ్ ఆధిక్యత ప్రబలి వ్యాపించడం చూసి ఒకానొక దినం దాని ముందు తలవంచక తప్పదనే విషయం వారికి ప్రస్ఫుటంగా గోచరిస్తోంది.



## బనీకైనుకా యుద్ధం

ఈ కారణాల వల్లనే యూదులు ఇస్లామీయ ఉద్యమానికి పరమ శత్రువులుగా పరిణమించారు.

బద్ర్ విజయానికి తరువాత ప్రప్రథమంగా యూదులు కళ్ళు తెరిచారు. ఇస్లామ్ ఒక ఎదురులేని శక్తిగా విజృంభిస్తోందనే భయం వారికి కలగసాగింది. కనుక ఉహుద్ యుద్ధానికి తదుపరి కొన్ని దినాల్లోపలే హి.శ. 2 షవ్వాల్ నెలలో ఒక యూదుల తెగ అయిన బనీకైనుకా ప్రజలు, ముస్లిములకు వ్యతిరేకంగా యుద్ధం ప్రకటించారు. ఇలా మహాప్రవక్త(స)తో చేసిన ఒడంబడికను భంగపరిచారు. ఈ యుద్ధానికి ముందు ఏర్పడిన మూలకారణమేమంటే, ఒక యూదుడు ఒక ముస్లిమ్ మహిళను మానభంగం చేశాడు. ఆమె భర్త మనోవ్యథకు తాళలేక ఒక యూదుణ్ణి చంపివేశాడు. అప్పుడు యూదులు ఆ ముస్లిమ్ వ్యక్తిని హతమార్చారు. మహాప్రవక్త (స) ఈ వ్యవహారాన్ని సర్దడానికి ప్రయత్నం చేశారు. కాని యూదులు "మేము బద్ర్‌లో వెన్నుచూపిన ఖురైష్‌లాంటి వాళ్ళం కాము, యుద్ధమంటే ఏమిటో మమ్మల్ని ఎదుర్కొనప్పుడు చూపిస్తాం" అని ప్రగల్భాలు పలికారు. యూదులు ఇలా ఒడంబడికను ఖాతరు చెయ్యక యుద్ధ ప్రకటన చెయ్యడం చూసి మహాప్రవక్త (స) యుద్ధ సన్నాహాలు చేశారు. యూదులు తమ కోటలోకి పోయి ఆశ్రయం తీసుకున్నారు. పదిహేను రోజుల దిగ్బంధం తరువాత యూదుల్ని దేశ బహిష్కరణ చేయాలని నిర్ణయించారు మహాప్రవక్త (స). తన సహచరులతో సంప్రదించి తదనుగుణంగా ఏడువందల మంది యూదుల్ని దేశ బహిష్కరణ చేయటం జరిగింది.

## కఅబ్ బిన్ అష్రఫ్ హత్య

యూదుల్లో కఅబ్ బిన్ అష్రఫ్ ఖ్యాతిగల కవి. అతను బద్ర్ తరువాత వ్రాసిన పద్యాల కారణంగా మక్కాలో ముస్లిములకు వ్యతిరేకంగా ముష్రిక్‌ల హృదయాల్లో అగ్ని జ్వాలలు ప్రజ్వరిల్లాయి. ఆ కాలంలో కవుల మాటకు పలుకుబడి, విలువ అధికం. అతను, బద్ర్ పోరాటంలో హతులయిన ఖురైషి ప్రజల్ని ప్రస్తావించి వ్రాసిన అత్యంత ఆవేదనాభరిత మయిన విషాద గేయాలు మక్కాలో వినిపించాడు. విన్నవారంతా తలబాదుకున్నారు, రోదించారు. మదీనాలోను మహాప్రవక్తను అవహేళన చేస్తూ గేయాలు వ్రాశాడు. ప్రజల్ని ఆయనకు వ్యతిరేకంగా వివిధ రూపాల్లో పురికొల్పాడు. ఒకసారి విందుచేసి మహాప్రవక్త (స)ను ఆహ్వానించాడు. ఆ సాకుతో ఆయన్ని హతమార్చే ఎత్తుగడ వేశాడు. ఆనాటి పరిస్థితుల దృష్ట్యా దైవప్రవక్త (స) సహాబాతో సంప్రదించారు. అందరూ కలిసి తీసుకున్న నిర్ణయం ప్రకారం, దైవప్రవక్త (స) సమ్మతించిన తరువాత, కఅబ్ బిన్ అష్రఫ్‌ను హజ్రత్ ముహమ్మద్ బిన్ ముస్లిమ హి.శ. 3వ సంవత్సరం రబీఉల్ అవ్వల్ నెలలో పరిమార్చివేశారు.

## బనూ నజీర్ బహిష్కరణ

బనూ నజీర్ యూదులు ఎన్నో విషయాల్లో ఒప్పందాన్ని భంగపరిచారు. వారు ఎన్నోసార్లు దైవప్రవక్త(స)ను హత్య చేసే ఉద్దేశ్యంతో రహస్య కుట్రలు పన్నారు. ఈ లక్ష్యానికిగాను కురైషీలు కూడ వారిని పురికొల్పారు. వారి ప్రవర్తన మితిమీరడంతో దైవప్రవక్త (స) వారిని కోటలో దిగ్బంధం చేసి 15 రోజుల తరువాత గత్యంతరం కాన రాక బనూ నజీర్ తెగ వాళ్ళు ఒంటెలపై తీసుకుపోగల సామగ్రితో ఇండ్లను వదలి వెళ్ళిపోవాలనే షరతుపెట్టి వదిలేశారు. ఈ ఒడంబడికకు అనుగుణంగా వారి నాయకులు ఎందరో ఖైబర్‌కు వెళ్ళిపోయారు. వస్తుసామగ్రి కూడా చాలావరకు తీసుకుపోయారు. కేవలం మోసుకుపోవడానికి వీల్లేని సామగ్రినే వదిలివేశారు.

ఆ తరువాత ముస్లిమ్‌ల ఇద్దరు శత్రువులు- అంటే అరేబియా బహు దైవా రాధకులు, ముఖ్యంగా మక్కాలోని కురైష్ ప్రజలు, యూదులు కలిసి ముస్లిము లను అంతమొందించే మార్గాలు ఆలోచించసాగారు. తెగలన్నీ కలిసి ఉమ్మడిగా మదీనాను ముట్టడించే సన్నాహాలు చెయ్యసాగాయి. ప్రారంభంలో అనేక తెగల వాళ్ళు మదీనాపై దండెత్తే ప్రయత్నాలు చేస్తున్నారని దైవప్రవక్త (స)కు తెలిసింది. ఆ సమాచారాన్ని పురస్కరించుకుని, ముస్లిమ్‌ల దళాన్ని తీసుకుని ఎదిరించేందుకు బయల్దేరారు. అయితే శత్రువులు పోరాడకుండా వెనుతిరిగి పారిపొయ్యారు. ఒకసారి హిజ్రీ శకం 5 ముహర్రం నెలలో 'జాతుర్రికా' వరకు వెళ్ళారు; మరొకసారి 5వ సంవత్సరం రబీ ఉల్ అవ్వల్ నెల, దూమతుల్ జందల్ అనే ప్రాంతం వరకు పోయారు.





# అహ్జాబ్ యుద్ధం★

బనూ నజీర్ మదీనా నుండి పోయి ఖైబర్ చేరారు. అక్కడి నుంచి ఇస్లామ్‌కు వ్యతిరేకంగా గొప్ప కుట్రలు పన్నసాగారు. చుట్టుపట్ల వుండే తెగల్ని ముస్లిమ్‌లకు ప్రతి కూలంగా ప్రేరేపించారు. మక్కా వెళ్ళి కురైషీలను ముస్లిములతో పోరాటానికి సిద్ధం చేశారు. అందరూ కలసి దాడి చేస్తే ఈ కొత్త ఉద్యమాన్ని సమూలంగా తుడిచిపెట్టడం సాధ్యమవుతుందని వారికి నచ్చజెప్పారు. కురైషీలు ముందుగానే ఈ ఘనకార్యానికై సిద్ధంగా వున్నారు. కనుక, యుదుల మాటల్ని ఒప్పుకున్నారు. యూదుల అనేక తెగలు, మక్కా ప్రజలు కలిసి గొప్ప సైన్యాన్ని సిద్ధం చేశారు. ఇంచుమించు పదివేలమంది సైనికులు ఆ దాడిలో పాల్గొన్నట్లు చారిత్రక ఆధారాలున్నాయి.

ఇంత భారీ ఎత్తున మదీనాపై దండెత్తే సన్నాహాలు మహాప్రవక్త(స)కు తెలిసినప్పుడు ఆయన సహాబాలతో సమాలోచనలు జరిపారు. అప్పుడు హజ్రత్ సల్మాన్ ఫార్సీ (రజి అల్లాహు అన్‌హు) "ఇంత పెద్ద సైన్యంతో రణరంగంలో ముఖాముఖీగా పోరాడడం శ్రేయస్కరం కాదు, మన సైన్యం సురక్షితమైన ప్రదేశంలో వుండి, ఆ ప్రదేశం చుట్టూ కందకం త్రవ్వినట్లయితే శత్రువులు నేరుగా దాడి చెయ్యలేరు" అని సలహా ఇచ్చారు. ఈ అభిప్రాయంతో అందరూ ఏకీభవించారు. కందకం త్రవ్వే సన్నాహాలు చేయసాగారు.

## కందకం

మదీనా మూడు వైపులా ఇండ్లు, ఒయాసిస్సులు వున్నాయి. ఒకేవైపున మైదానంగా వుంది. మహాప్రవక్త (సల్లల్లాహు అలైహివసల్లమ్) మూడు వేల సహాబాను తీసుకుని ఆ మైదానం వున్న వైపునే కందకం త్రవ్వే ఆదేశమిచ్చారు. ఈ కార్యం హి.శ. 5వ సంవత్సరం

*★ఈ యుద్ధాన్ని కందకం యుద్ధమని కూడా అంటారు. ఇందులో కందకం త్రవ్వి నగర రక్షణ చెయ్యడం జరిగింది కనుక. అహ్జాబ్ అంటే అరబీలో దళాలు అని అర్థం. ఇందులో తిరస్కారుల సైన్యాలు అనేకం మూకుమ్మడిగా దాడి చెయ్యటం మూలాన ఈ సంగ్రామానికి అహ్జాబ్ సంగ్రామమని పేరు వచ్చింది.*

జుల్ కఅదా నెల 8వ తేదీన ప్రారంభమయింది. మహాప్రవక్త (స) స్వయంగా కందకం త్రవ్వడం ప్రారంభిం చారు. పదేసి గజాల భూమి పదేసి మందికి అప్పగించారు. కందకం 5 గజాల లోతు త్రవ్వాలి. 20 రోజుల లోపున 3వేల ముస్లిములు ఈ కందకం తయారు చేశారు. త్రవ్వకం జరిగేటప్పుడు మహాప్రవక్త (స) స్వయంగా ప్రజలందరితో పాటు పనిలో పాల్గొన్నారు. సందర్భవశాత్తు ఒకచోట పెద్ద శిల అడ్డువచ్చింది. అది ఏ విధంగానూ తెగలేదు. మహాప్రవక్త(స) వచ్చి గునపంతో ఒక్క వేటు వేశారు, శిల ముక్కలు ముక్కలుగా పగిలిపోయింది. ఈ సంఘటన సయితం విశ్వనాయకుని మహిమల్లో ఒక మహిమే.

## తిరస్కారుల ముట్టడి

తిరస్కారులు తమ సైన్యాన్ని మూడు భాగాలుగా విభజించి మదీనాపై మూడు వైపుల నుంచి దాడిచేశారు. ఈ దాడి ఎంతో తీవ్రంగా జరిగింది. దాన్ని పవిత్ర ఖుర్ఆన్‌లో ఈ విధంగా చిత్రించటం జరిగింది.

> "శత్రువులు పై నుంచి (తూర్పు నుంచి) పల్లం నుంచి (పడమర నుంచి) మీపై విరుచుకు పడినప్పుడు మీ కళ్ళు తెరుచుకునే వుండిపోయాయి. మీ గుండెలు పైకెగసి నోటి దాకా వచ్చినప్పుడు, మీరు దైవాన్ని గురించి తరహాతరహాగా అనుమానాలకు గురయినప్పుడు, ముస్లిమ్‌ల పరీక్షా సమయం ఆసన్నమయింది. వారిని అతి తీవ్రంగా విదిలించి వెయ్యటం జరిగింది." (అహ్జాబ్:10-11)

అది గొప్ప పరీక్షా సమయం; తీవ్రమయిన చలి; అన్నపానీయాల కొరత; పస్తులు; రాత్రుల్లో నిద్రలేమి, పగల్లో విశ్రాంతి లేమి; అనునిత్యం ప్రాణాపాయం; ధన సంతానం అంతా శత్రువుల హస్తగతమయ్యే ప్రమాదం; ప్రాణాంతకమైన ఊహలున్న అనంతమైన శత్రు సైన్యం. ఈ విషయాలన్నీ మనిషికి రుజుమార్గం నుండి తప్పించడానికి చాలవా! ఈ పరిస్థితుల్లో దృఢమైన నిజ విశ్వాసశక్తి గలవారే నిలకడతో నిలబడగలరు. బలహీనమైన విశ్వాసం గలవారు, కపటులు ఈ పరిస్థితుల్ని ఎదుర్కోజాలరు. కనుక ముస్లిమ్‌ల సైన్యంలో చొరబడివున్న కపటులు ఈ సమయంలో బయటపడిపోయ్యారు. వారి మాటల్ని అల్లాహ్ దివ్య ఖుర్ఆన్‌లో ప్రస్తావించాడు, "మాతో సహాయం, విజయం లభిస్తాయని అల్లాహ్, ఆయన సందేశహరుడు చేసిన వాగ్దానాలన్నీ వట్టి మోసం." (అహ్జాబ్:12)

వీరంతా తమ ప్రాణ రక్షణ కోసం రకరకాలుగా సాకులు చెప్పసాగారు. "ఎస్రిబ్★ వాసులారా! వెనక్కి పదండి. ఈ వేళ మీకు ఎక్కడా నిలువ నీడలేదు" అని రెచ్చగొట్టేవారు. మహాప్రవక్త (స) వద్దకు వచ్చి - "మాకయితే అనుజ్ఞ నివ్వండి మేము ఇండ్ల వద్దనే వుండి, ఇండ్లను రక్షించుకుంటాము, మా ఇండ్లు బొత్తిగా ఎలాంటి రక్షణా లేకుండా పొయ్యాయి." (అహ్జాబ్:14)

★ ఎస్రిబ్ అన్నది మదీనా నగరానికి పూర్వపు పేరు.



కాని అంతర్యంలో దృఢవిశ్వాసం ఉన్నవారు, తమ విశ్వాస ప్రకటనలో సత్యవంతులయినవారు అలా కాదు. వీరి పరిస్థితి పూర్తిగా భిన్నంగా వుంది, తిరస్కారుల సైన్యాన్ని చూడగానే, "అల్లాహ్, ఆయన ప్రవక్త చేసిన వాగ్దానం ఇదే!" అంటూ సంబరపడ్డారు. ఆ సందర్భంలో వారి విశ్వాస శక్తి తేజోవంతమయింది, విధేయతాభావం, ఆజ్ఞాపాలనా వైఖరి మరింత అధికమయ్యాయి. ఈ సంక్లిష్టమైన పరిస్థితులు వారిలో ఎలాంటి చెడు ప్రవర్తనకు తావివ్వలేదు." (అహ్జాబ్: 22,23)

శత్రువులు దాదాపు ఒక నెల వరకు దిగ్బంధం చేశారు. దాని కారణంగా ముస్లిములు ఒక్క పూట కూడా ఆహారానికి నోచుకోని సమయాలు ఎన్నో ఆసన్నమయ్యాయి. దిగ్బంధం ఇంకా తీవ్రతరమయింది,ప్రమాదకరమయింది. శత్రువులు కందకాన్ని దాటలేక పోవడం చేత ఆవలి ఒడ్డున తిష్టవేశారు. మహాప్రవక్త (స) ఇస్లామీయ సైన్యాన్ని కందకం చుట్టూత పలుచోట్ల నియమించారు. తిరస్కారులు వెలుపలి నుండే రాళ్ళూ, బాణాలు విసరసాగారు. ఇటు నుండి కూడా దానికి తగిన సమాధానం ఇవ్వబడేది. అప్పుడప్పుడు తిరస్కారులు దాడి చెయ్యటానికి ప్రయత్నం చేశారు. కాని ముస్లిములు ప్రతిసారి వారిని తిరగ్గొట్టారు. ఒక్కొక్కసారి తిరస్కారుల ఒత్తిడి హెచ్చవడంతో వారిని కందకానికి ఆవలే ఆపడానికి ఎంతో చాకచక్యంతో వ్యవహరిస్తూ పోరాడవలసివచ్చేది. కొన్నిసార్లు నమాజ్ వేళలు కూడా తప్పిపోయ్యాయి.

## దైవ సహాయం

దిగ్బంధం చాలా కాలం వరకు జరగడంవల్ల ముట్టడించిన వారికి, ఇంకా ఇలా కొనసాగడానికి సాహసం చాలటం లేదు. పదివేల మందికి అన్నపానీయాల ఏర్పాట్లు చెయ్యటం సాధారణ విషయం కాదు. అందునా వణుకు పుట్టించే చలి. ఒకసారి అతి తీవ్రమయిన గాలి దుమారం వీచింది. తిరస్కారుల గుడారాలన్నీ లేచిపొయ్యాయి. సైన్యంలో అల్లకల్లోలం చెలరేగింది. అది గాలి కాదు దైవ శిక్ష. వాస్తవంగా తుఫాను ముస్లిముల కొరకు కరుణానుగ్రహంగాను తిరస్కారులకు శిక్షగానే పంపాడు అల్లాహ్. ఈ సంఘటనను అల్లాహ్ తన ఉపకారంగా అభివర్ణించాడు.

> "విశ్వసించిన ప్రజలారా! దైవం చేసిన ఉపకారాన్ని కాస్త గుర్తు చేసుకోండి. సైన్యాలు మీపై విరుచుకు పడినప్పుడు మేము వారిపైకి తుఫాను, గాలి దుమారం పంపాము, ఇంకా మీరు చూడలేని దేవదూతల సైన్యాన్ని పంపాము." (అహ్జాబ్: 9)

ఈ విధంగా తిరస్కారులు ఈ పరిస్థితిని తట్టుకోలేకపొయ్యారు. వారి శక్తి దెబ్బ తిన్నది. ముందు యూదులు తప్పించుకుని బయటపడ్డారు. తరువాత ఒంటరిగా మిగిలిపోయిన ఖురైష్ నాయకులకు సయితం మరలిపోవడం కన్నా మార్గాంతరం గోచరించలేదు. ఈ విధంగా కేవలం అల్లాహ్ కటాక్షం, ఆయన అజ్ఞాత సహాయం వల్ల మదీనాపై ఆవ

రించిన కారుమేఘాలు పటాపంచలయ్యాయి. ఈ యుద్ధం వివరాలు దివ్యఖుర్ఆన్‌లో వివరించబడ్డతీరును, అందులో ముస్లిముల కొరకు విశదం చెయ్యబడ్డ శిక్షణాత్మక అంశాలు కొన్నింటిని పేర్కొంటున్నాము:

## దైవానుగ్రహంపై భరోసా

విశ్వసించిన వారి నమ్మకమేమంటే అసలు శక్తి అల్లాహ్ వద్దనే ఉంది. జరిగేదంతా ఆయన సంకల్పం, ఆయన అనుజ్ఞ ప్రకారమే జరుగుతుంది. విశ్వసించినవారు తమకు లభించిన ఏ విజయమైనా తమ యుక్తి ఉపాయాలవల్ల, తమ శక్తిసామర్థ్యాలవల్ల లభించిందని భావించరాదు. ఇది వాస్తవంగా కేవలం దైవానుగ్రహం వల్లనే ప్రాప్తమయింది కాబట్టి దాన్ని అలాగే భావించాలి. అహ్జాబ్ యుద్ధంలో పది పన్నెండు వేల మంది సైనికులు మూడు వేల ముస్లిములను ఏమీ చెయ్యలేకపోయారు. వారు దారీ తెన్నూ కానరాక మరలిపోవలసిన పరిస్థితి ఏర్పడింది. ఈ సందర్భంలో ముస్లిములు ఇదంతా తమ యుక్తి (అంటే కందకం త్రవ్వటం) వల్ల లభించిన ఫలమని భావించటానికి ఆస్కారముంది. తమ ఈ యుక్తిపై గర్వపడేందుకు ఇది మంచి అవకాశం కూడా. తద్వారా వారిలో అహంభావం జనించే ఆస్కారం కూడా వుంది. కాని సమయానికి అల్లాహ్, ముస్లిముల్లో ఈ చెడు భావాలు రాకుండా రక్షించడానికి ఇలా బోధించాడు: "విశ్వసించిన ప్రజల్లారా! దైవం చేసిన ఉపకారాన్ని కాస్త గుర్తు చేసుకోండి. మీపై సైన్యాలు విరుచుకు పడినప్పుడు మేము తుఫాను, గాలి దుమారాలు లేపాము, మీకు కనిపించని సైన్యాన్ని పంపాము." (అహ్జాబ్: 9)

ఇస్లామీయ ఉద్యమ అనుయాయుల ఆంతర్యం పరిశుద్ధమవడానికి ఇలాంటి శిక్షణ ఎంతయినా అవసరం. వారి నమ్మకమంతా దైవానుగ్రహంపైనే ఉండాలి. వారు దైవాన్నే సర్వశక్తి సంపన్నుడయిన ప్రభువుగా భావిస్తూ సత్యధర్మ సంస్థాపనార్థం జరిపే కృషిలో ముందడుగు వేస్తూపోవాలి. ఎదురయ్యే శక్తుల బలాధిక్యత ఎంత అధికంగా కనిపించినా వెనుకంజ వెయ్యరాదు.

## ఈమాన్ ప్రకటనకు పరీక్ష

కష్టకాలంలో మనిషి విశ్వాసం పరీక్షించబడుతుంది. అతని నిజస్థితి ఏమిటో అతనికి స్వయంగానూ బోధపడుతుంది, మరి ఇతరులు కూడా ఈ మార్గంలో ఎవరు ఎంతవరకు స్థయిర్యంగా నిలబడగలరో అంచనా వేసుకోగలుగుతారు. సాధారణ పరిస్థితులున్నంతకాలం అందరూ ఉద్యమమే తమ పంచప్రాణాలన్నట్టు కనిపిస్తారు. అప్పుడు ఎవరు తమ లక్ష్యం ప్రేమలో తమ జీవితాన్ని సయితం ధారపోసే సంకల్పం కలిగిఉన్నారో అంచనా వేయడం సాధ్యపడదు. తరచుగా కార్యకర్త సయితం స్వయంగా తనను గురించి అపోహలకు గురయి ఉంటాడు. కాని కష్టకాలం వచ్చినప్పుడే నికరమైన దేదో కల్తీ ఏదో తేటతెల్లమవుతుంది.



అహ్జాబ్ యుద్ధంలో ఇదే సంభవించింది. మదీనాలో ముస్లిమ్‌లతోపాటు కపటులు, విశ్వాస స్థిరత్వం లేని ముస్లిములు కూడా చాలామంది కలసిపొయ్యారు. వారందరిని గురించి సరయిన అవగాహన సాధారణ ముస్లిమ్‌లకు ఉండటం ఎంతో అవసరం. కనుక ఈ పరీక్షాసమయం రాగానే అంతా బయటపడింది. నిరంతరం కందకం త్రవ్వటం, నిద్రాహారాల్ని ఖాతరు చెయ్యకుండా అహర్నిశలు కష్ట పడటం, అంత పెద్ద సైన్యాన్ని ఎదుర్కొనేందుకు ప్రాణాల్ని అరచేతుల్లో పెట్టుకుని పోరా టానికి సిద్ధమవటం, ఇంకా దాదాపు మూడు వారాల కాలంపాటు నిత్యం భయోత్పాత వాతావరణంలో నిద్రాహారాలుమాని దినదినగండం నూరేళ్ళాయుష్షుగా రేయింబవళ్ళు గడపటం– సాధారణ విషయం కాదు. మనస్సులో నిజవిశ్వాసం లేనివారు ఈ క్లిష్ట పరిస్థితులకు తట్టుకోలేకపోయారు. వారిలో చాలామంది దెప్పి పొడిచారు: "మీ ప్రవక్తగారు ఫరవాలేదు. సహాయం, విజయాల వాగ్దానం బాగానే చేశారు. ఇప్పుడు పాచికలు ప్రతి కూలంగా పడినట్టుంది. అంతా తెలిసిపోయింది, అల్లాహ్, ఆయన ప్రవక్త మాతో చేసిన వాగ్దానం వట్టి బూటకం." (అహ్జాబ్: 12)

ఇంకా కొందరయితే సాకులు చెప్పసాగారు. వాళ్ళు ఇండ్ల రక్షణ నెపంతో రంగం నుంచి తప్పుకున్నారు.

దీనికి పూర్తి భిన్నంగా, ఆంతర్యాల్లో నిజమైన విశ్వాసం ఉన్న దైవదాసులు, ఈ పరిస్థితుల ద్వారా మరొక విధమయిన అనుభూతిని పొందారు. వారు సైన్యాలు పొంగి రావడం చూసి– "అదిగో అల్లాహ్, ఆయన ప్రవక్త మనకు ముందే తెలిపిన వార్త నిజం కావస్తోంది. ఇదేగా, అల్లాహ్, ఆయన ప్రవక్త చేసిన వాగ్దానం! అల్లాహ్, ఆయన సందేశ హరుడు చెప్పింది అంతా నిజమే!!" అని ఎలుగెత్తి చాటారు. ఈ గడ్డు పరిస్థితులు వారి విశ్వాసశక్తిని ఇంకా అధికం చేశాయి. వారు విధేయత పాటించడానికి, ఆజ్ఞాపాలన చేయడానికి ఇంకా ఇతోధికంగా సమాయత్తం కాసాగారు." (అహ్జాబ్:22)

## బలహీనతకు మూలం

ధనప్రాణాలు కోల్పోయే భయమే మానవుడి నిజమయిన బలహీనత, వాస్తవంగా ఇదే అన్ని బలహీనతలకు మూలం కూడా. ఇస్లామ్, అల్లాహ్ ఉనికిని ఆయన గుణవిశేషాలను ఏ ఏ వివరాలతో విశ్వసించాలని కోరుతోందో, వాటిలో జీవన మరణాలు కేవలం అల్లాహ్ హస్తగతమై ఉన్నాయనే విశ్వాసం మౌలికమయింది. ఇంకా లాభనష్టాలన్నీ ఆయన వల్లనే కలుగుతాయనీ, ఆయన మృత్యువును నిర్ణయిస్తే దాన్ని తప్పించేవాడు, లాభాన్ని నష్టంగానూ, నష్టాన్ని లాభంగాను మార్చే శక్తిగలవాడు మరొకడు లేడు అనే విశ్వాసం కూడా వుంది. ఈ విశ్వాసబలం, ఈ ఈమాన్ శక్తియే ముస్లిం శక్తి సామర్థ్యాలకు పునాది. ఈ పునాది ఎంత బలహీనంగా వుంటే అంతే బలహీనత ముస్లిమ్ చేసే ప్రతికార్యంలోనూ కొట్టవచ్చినట్టు కానవస్తుంది. కనుక బలహీనతను దూరం చెయ్యడానికి విస్పష్టంగా ఇలా తెలుపటం జరిగింది:

"ప్రవక్తా! వీరికి చెప్పి వేయండి, "మీరు ఒకవేళ మృత్యువుకు లేక హత్యకు భయపడి పారిపోతే, ఇలా పారిపోవడం మీకు ఏ విధంగానూ ఉపకరించదు. ఇంకా ఇలా కూడా చెప్పండి, వారు కాస్త ఆలోచించాలి, ఒకవేళ అల్లాహ్ వారికి ఏదైనా నష్టం కలగాలని నిర్ణయిస్తే వారిని అల్లాహ్ నిర్ణయం నుండి కాపాడే వారెవరున్నారు? లేదా అల్లాహ్ వీరికి ఏదయినా లాభం చేకూర్చాలని నిర్ణయిస్తే దాన్ని నిరోధించగల వారెవరు న్నారు? వారు బాగా గుర్తుంచుకోవాలి, అల్లాహ్ తప్ప మరెవరినీ తమకు అండగా, సహాయకునిగా, మద్దత్తుదారుగా వారు పొందలేరు." (అహ్జాబ్:17)

ఈ నమ్మకమే ఒక హృదయంలో ఏర్పడి వుంటే వెనుతిరగడం దేనికీ? మనిషి, గడ్డుకాలం దాపురించినపుడల్లా తన విశ్వాసాన్ని పరీక్షించుకోవాలి. సాధారణంగా మనిషి తనను గురించి ఒక విధమయిన అపోహకులోనయి వుంటాడు. పరీక్ష ఘడియలు ఎదురయి నప్పుడే అతనికి తనను గురించి సరయిన అంచనా వేసుకోవడం సాధ్యమవుతుంది.

## ధైవ సందేశహరుని ఆదర్శ జీవితం

ఈ యుద్ధ ప్రస్తావనలోనే ముస్లిములకు ఇలా ఉపదేశించటం జరిగింది: "మీ కొరకు ప్రవక్త జీవితంలో అనుసరణీయమయిన ఆదర్శం వుంది. దాని ద్వారా ప్రయోజనం పొందడానికి అల్లాహ్‌ను సందర్శించే అభిలాష కలవారు, పరలోకంలో ప్రాప్తమయ్యే బహూకరణలపట్ల ఆసక్తి కలవారు, అల్లాహ్‌ను సతతం స్మరించేవారే అర్హులు." ఈ సందర్భంగా ఇస్లామ్ అనుయాయుల సాహసాన్ని సమున్నతం చెయ్యడానికి, అత్యంత కఠినమయిన సమయాల్లో వారి హృదయాలకు బలం చేకూర్చడానికి, నిలకడతో దైవాను గ్రహంపై భారంమోపి ఉండేలా తర్ఫీదు చెయ్యడానికి దైవసందేశహరుడు (స) చేసిన కృషి అనన్యమయింది. ఆయన కనబరచిన దృఢ సంకల్పం, ఆయన దైవంపై భారంమోపి ముందడుగు వేసిన తీరు, ఆయన చూపిన సహనం లాంటి గుణాలు ఆదర్శవంతమయినవి. ప్రళయకాలం వరకు, సత్యధర్మ సంస్థాపన కొరకు పాటుపడే దైవదాసులకు అనుసరణీయ మయిన ఆదర్శం అది. ఈ ఆదర్శాన్ని వారు జీవితపు ప్రతి మలుపులో దృష్టిలో ఉంచుకోవలసి వుంటుంది. ఇదే వారికి మార్గదీపం.

## బనూ కురైజా అంతం

మహాప్రవక్త (స) మదీనా విచ్చేయగానే యూదులతో ఒప్పందం చేసుకున్నారని ముందే తెలుసుకున్నాము. కొంతకాలం వరకు యూదులు ఒప్పందాలను పాటించారు. తరువాత వారు క్రమంగా వాటిని ఉల్లంఘించటం మొదలెట్టారు. ఈ కారణంగానే బనూ నజీర్‌ని దేశబహిష్కరణ చేయుటం జరిగింది. కాని బనూ కురైజా ప్రజలు తిరిగి ఒప్పందం కుదుర్చుకున్నారు. మహాప్రవక్త (స) వారిని తమ కోటల్లో శాంతితో ఉండడానికి అనుమతించారు.



అహ్జాబ్ యుద్ధంలో యూదుల తెగలు బనూ కురైజాను ముస్లిములకు ప్రతి కూలంగా ప్రేరేపించారు. దానిప్రకారం, బనూ కురైజా కూడా అహ్జాబ్ యుద్ధంలో ముస్లిములకు వ్యతిరేకంగా పాల్గొన్నారు. మహాప్రవక్త(స)తో చేసిన ఒప్పందాలను ఖాతరు చేయలేదు. అహ్జాబ్ కారుచీకట్లు దూరమవగానే మహాప్రవక్త (స) ప్రప్రథమంగా బనూ కురైజా సమస్యను పరిష్కరించడానికి పూనుకున్నారు. వారు చేసిన విశ్వాస ఘాతుకానికి తగిన శాస్తి చెయ్యాలని నిర్ణయించారు. వారు మోసం చేసిన సందర్భం చాలా సున్నిత మయింది. అప్పుడు ముస్లిమ్‌లపైకి అరేబియా మొత్తమే పెల్లుబికి వచ్చింది. స్థూలంగా చూస్తే ముస్లిములు బ్రతికి బయటపడే అవకాశాలు ఏవీ కనిపించడం లేదు. బనూ కురైజా తెగ తన ప్రవర్తన ద్వారా, అది ముస్లిములను బహిరంగంగా వ్యతిరేకించే శత్రువు కంటే ఎక్కువ ప్రమాదకరంగా తయారయిందని నిరూపించుకుంది. వారు ఒకవైపున ముస్లిములతో ఒప్పందం చేసుకుని వారిని సంతృప్తపరిచారు. మరొకవైపున సహాయం కావలసినప్పుడు పూర్తిగా విముఖులయ్యారు. ముస్లిములను రూపుమాపే ప్రయత్నంలో ఇతరులతో చేతులు కలిపారు. ఈ కారణాలవల్ల మహాప్రవక్త (స) వారికి గుణపాఠం నేర్పే ఉద్దేశ్యంతో వారిని కోటల్లో దిగ్బంధం చేశారు. దిగ్బంధం నెలరోజులపాటు సాగింది. చివరికి మార్గాంతరం లేక బనూ కురైజా వీరులు ఆయుధాలు పడవేశారు. ఆ సందర్భంలో సాక్షాత్తు తౌరాత్ (యూదుల మత గ్రంథం) ప్రకారం వారి విషయంలో తీర్పు చేయటం జరిగింది. వారిలో యుద్ధానికి యోగ్యులైనవారిని హతమార్చాలని, వారి వస్తుసామగ్రిని జప్తు చేసుకోవాలని, తక్కినవారిని బంధించాలని నిర్ణయించడం జరిగింది. ఈ సందర్భంలో దాదాపు నాలుగు వందల మంది హతమార్చబడ్డారు. వారిలో ఒక స్త్రీ కూడా వుంది. ఆమె హత్యానేరం చెయ్యడం మూలాన మరణించవలసి వచ్చింది. ఆమె కోట గోడపై నుంచి పెద్ద రాయిని దొర్లించి ఒక ముస్లిమ్ యోధుడిని చంపివేసింది.

# హుదైబియా ఒప్పందం

'కాబా గృహం' ఇస్లామ్ కేంద్ర స్థానం. దాన్ని హజరత్ ఇబ్రాహీమ్ (అలైహి స్సలామ్), ఆయన కుమారుడు హజరత్ ఇస్మాయీల్ (అలైహిస్సలామ్) ఇద్దరూ కలిసి అల్లాహ్ ఆజ్ఞానుసారం నిర్మించారు. ముస్లిమ్‌లు ఈ ఇస్లామ్ కేంద్రం నుంచి దూరమై ఇప్పటికి ఆరేళ్లు గడిచాయి. అదీకాక ఇస్లామ్ మూలాంశాల్లో 'హజ్' ఒక ముఖ్యాంశం. అందువల్లనే ముస్లిములలో కాబా గృహానికి హజ్ కొరకు యాత్ర చేయాలని తీవ్రమయిన కాంక్ష కలిగింది.

## కాబా గృహ సందర్శనం

సాధారణంగా అరబ్బులు సంవత్సరం పొడుగునా పోట్లాడుకుంటూనే ఉండేవారు. కాని హజ్ కొరకు నాలుగు నెలల కాలంపాటు పోరాటాలు మానేసేవారు. ప్రజలు కాబా యాత్ర చెయ్యడానికి సానుకూల వాతావరణం లభించాలని, అందరూ ప్రశాంతంగా కాబా సందర్శనం చేసుకోగలగాలని ఇలా చేసేవారు. హి.శ. 6వ సంవత్సరం జుల్‌కఅదా నెలలో మహాప్రవక్త (సల్లల్లాహు అలైహివసల్లమ్) కాబా యాత్ర కొరకు బయల్దేరారు. అన్సార్, ముహాజిర్లు చాలా మంది కాబా సందర్శనం చేసే ఈ శుభసమయం కొరకు ఆతృతతో ఎదురు చూస్తూ ఉన్నారు. కనుక 1400 మంది ముస్లిములు మహాప్రవక్త(స)కు తోడుగా ప్రయాణానికి సిద్ధమయ్యారు. జుల్ హలీఫా చేరిన మీదట కుర్బాని చేసేందుకు అవసరమయిన ప్రాథమిక లాంఛనాలు పూర్తి చేశారు. ఈ విధంగా ముస్లింలు కేవలం కాబా గృహాన్ని సందర్శించే సంకల్పంతోనే బయలుదేరారని స్పష్టంగా తేలిపోయింది. పోరాడాలన్నది, దాడి చెయ్యాలన్నది వారి సంకల్పం ఎంత మాత్రం కాదు. ఎందుకైనా మంచిదని మహాప్రవక్త (స) ఒక మనిషిని, కురైషీల ఆలోచనల, వ్యూహాల సమాచారం సేకరించడానికి మక్కాకు పంపారు. ఆయన తెచ్చిన సమాచారాన్నిబట్టి, కురైష్ తెగలన్నీ సమావేశమయి ముహమ్మద్ (స) మక్కాలో ప్రవేశించకూడదనే నిర్ణయం తీసుకొన్నాయని, ఆయన్ని ప్రవేశించకుండా ఆపడానికి సర్వసన్నద్ధంగా ఉన్నారని, మక్కాకు వెలుపల ఒకచోట తమ సైన్యాన్ని మోహరిస్తున్నారని, ముస్లింలతో ఘర్షణకు సిద్ధమవుతున్నారనీ తెలిసింది.



## కురైషీలతో సంప్రదింపులు

ఈ వార్త అందిన మీదట కూడా మహాప్రవక్త (స) ప్రయాణాన్ని ఆపలేదు. హుదైబియా అనేచోట మకాం వేశారు. మక్కాకు ఒక ఆమడ దూరంలో హుదైబియా అనే బావి ఉంది. అదే పేరు ఆ పల్లెకు కూడా స్థిరపడిపోయింది. ఇక్కడ 'ఖుజాఅ' తెగ నాయకులు మహాప్రవక్తను సందర్శించి "కురైష్ ప్రజలు పోరాటానికి సిద్ధమయి ఉన్నారు, వారు మిమ్మల్ని మక్కాలో ప్రవేశించనివ్వరు" అని తెలిపారు. మహాప్రవక్త (స) వారితో, "మేము కేవలం ఉమరా చేసే ఉద్దేశ్యంతో వచ్చాం, పోరాడటం మా ఉద్దేశ్యం కాదు. మాకు కాబా గృహ సందర్శనానికి, దాని ప్రదక్షిణకు మాత్రం అవకాశం ఇస్తే చాలని వారితో చెప్పండి" అని అన్నారు. మహాప్రవక్త (స) పంపిన ఈ సందేశం కురైషీలకు అందగానే వారిలోని కొందరు, ముహమ్మద్ (స) పంపిన సందేశాన్ని వినడం అనవసరం అని అనుకున్నారు. వినమ్రుడయిన ఉరవా అనే వ్యక్తి "అలా కాదు, మీరు నన్ను నమ్మండి. నేను వెళ్ళి ముహమ్మద్ (స)తో మాట్లాడతాను" అని సమాధానపరిచాడు. తదనుగుణంగా ఉరవా మహాప్రవక్తను సందర్శించాడు. కాని ఏ విషయం నిర్దిష్టంగా తేలలేదు. ఈ లోపుగా కురైష్ నాయకులు ఒక దళాన్ని ముస్లిములపై దాడి చేయటానికి సయితం పంపారు. వారిని ముస్లిములు బంధించివేశారు. కాని మహాప్రవక్త (స) తన కరుణా స్వభావంచేత వారిని మన్నించి విడుదల చేయించారు. సంధి సంప్రదింపులకు గాను హజరత్ ఉస్మాన్ (రజి అల్లాహు అన్‌హు)ను మక్కాకు పంపాలని నిర్ణయించుకున్నారు ముస్లిములు. హజరత్ ఉస్మాన్ మక్కాకు వెళ్ళారు. కాని కురైషీలు ఏ విధంగానూ రాజీపడలేదు. ముస్లిములు కాబా సందర్శనానికి మక్కా రావడాన్ని సమ్మతించలేదు సరికదా హజరత్ ఉస్మాన్‌ని కూడా వదల్లేదు.

## బయతుర్రిజ్వాన్

మక్కాలో హజరత్ ఉస్మాన్‌ను హత్య చేసినట్లు వదంతి వ్యాపించింది. ఈ వార్తవిని ముస్లిములు వ్యాకులపడ్డారు. మహాప్రవక్త (స) ఈ వార్త విని "ఇక ఉస్మాన్ హత్యకు ప్రతీకారం తీర్చుకోవడం అనివార్యమైపోయింది" అన్నారు. తరువాత ఆయన ఒక తుమ్మ చెట్టు క్రింద ఉపవిష్టులయ్యారు. అక్కడ తన సహచరులందరిచేత ఒక శపథం చేయించారు మహాప్రవక్త(స). "మేము ప్రాణత్యాగానికయినా సిద్ధమేకాని పోరాడటానికి వెనుదీయము, కురైషీల పట్ల హజరత్ ఉస్మాన్ హత్యకు ప్రతీకారం తీర్చుకుంటాము" అని సహచరులందరు ప్రతిజ్ఞ చేశారు. ఈ ప్రతిజ్ఞ ముస్లిములలో చిత్రమైన ఉత్తేజాన్ని సృజించింది. వారిలో ప్రతి వ్యక్తి అమరగతి పొందే అభిలాషతో తిరస్కారులతో ప్రతీకారం తీర్చుకునేందుకు తాపత్రయ పడసాగారు. ఈ శపథానికే బయతుర్రిజ్వాన్ (రిజ్వాన్ శపథం) అని పేరు. దీన్ని దివ్య ఖుర్ఆన్‌లో ప్రస్తావించడం జరిగింది. ఇంకా ఈ సదవకాశాన మహాప్రవక్త హస్తంపైన శపథం బూనిన వారిపట్ల అల్లాహ్ తన హర్షాన్ని ప్రకటించాడు.

## సంధి

ముస్లిమ్‌ల ఈ ఆవేశోద్రేకాల వృత్తాంతం కురైషీలకు అందింది. ఇటు ముస్లిములు కూడా హజరత్ ఉస్మాన్ హత్యావార్త అసత్యమైనదే అని తెలుసుకున్నారు. సంధి సంప్రదింపులకుగాను సుహైల్ బిన్ అమ్రోను తమ రాయబారిగా పంపారు కురైష్ నాయకులు. ఆయనతో చాలాసేపు రాజీ సమాలోచనలు జరిగాయి. చివరికి సంధి నిబంధనలు నిర్ణయమయ్యాయి. సంధి పత్రం వ్రాయడానికి హజరత్ అలీని నియమించారు. సంధి పత్రంలో "ఇది ముహమ్మద్ దైవ సందేశహరుని (స) తరపున వ్రాయబడిన ....." అని వ్రాయగానే కురైషీల ప్రతినిధి సుహైల్ ఆక్షేపణ వెలిబుచ్చాడు. "దైవ సందేశహరుడు" అనే మాట వ్రాయకూడదని, ఆ ఒక్క విషయంలోనే కదా మాకు మీతో భేదాభిప్రాయం వుంది? (ముహమ్మద్ దైవ సందేశహరునిగా మేము అంగీకరిస్తే ఇదంతా దేనికి?) అన్నాడు సుహైల్, ఆయన మాట ప్రకారం మహాప్రవక్త (స) తన స్వహస్తాలతో 'దైవ సందేశహరుడు' అనే పదాన్ని కొట్టి వేశారు. "నీవు అంగీకరించకపోయినా సరే (వాస్తవం మారిపోతుందా?) దైవసాక్షిగా నేను దైవసందేశహరుణ్ణే" అన్నారు.

## సంధి నిబంధనలు

1. ముస్లిములు మక్కాలో ప్రవేశించకుండా ఈ సంవత్సరం వెనక్కి మరలిపోవాలి.
2. మరుసటి సంవత్సరం కాబా సందర్శనానికి రావచ్చు. అయితే కేవలం మూడు దినాలు మాత్రమే బస చేసి తిరిగి వెళ్ళి పోవాలి.
3. ఎలాంటి ఆయుధం వెంట తీసుకురాకూడదు. కేవలం సాధారణ కరవాలం తెచ్చుకోవచ్చు. అయితే అది ఒరలోనే ఉండాలి. బయటికి తీయకూడదు.
4. మక్కాలో ఉన్న ముస్లిములను ఎవరినీ తమతో మదీనా తీసుకు వెళ్ళకూడదు, అయితే మదీనాలో ఉన్న ముస్లిములెవరయినా మక్కాకు తిరిగి వెళ్ళాలని తలిస్తే అలాంటి వారిని ఆపకూడదు.
5. విశ్వసించని వారు లేక ముస్లిములలోని వారు ఎవరైనా మక్కా నుండి మదీనాకు వెళ్ళిపోతే వారిని మక్కాకు తిరిగి పంపివేయాలి. కాని మదీనా ముస్లిం ఎవరైనా మక్కాకు వెళ్ళినట్లయితే అతన్ని తిరిగి పంపటం జరగదు.
6. అరబ్బు తెగలకు ముస్లిములతోనైనా అవిశ్వాసులతోనయినా స్వేచ్ఛగా ఒడంబడికలు చేసుకోవడానికి అధికారముంటుంది.
7. ఈ ఒప్పందం పదేళ్ళవరకు అమలులో వుంటుంది.

ఈ నిబంధనలన్నీ స్థూలంగా ముస్లింలకు ప్రతికూలంగానే ఉన్నాయి. వీటి వల్ల ముస్లింలు అణిగిమణిగి సంధి చేసుకున్నట్లు స్పష్టంగా కనబడుతూనే ఉంది.



## హజరత్ అబూ జందల్

సందర్భవశాత్తు ఇంకా హుదైబియా సంధి పత్రాన్ని లిఖిస్తున్నప్పుడే, సుహైల్ కుమారుడు హజరత్ అబూజందల్ (రజి అల్లాహు అన్‌హు) మక్కా నుండి ఎలాగో తప్పించుకుని హుదైబియా చేరుకున్నారు. కాళ్ళకు బేడీలతోనే ముస్లింల ఎదుట వచ్చి పడ్డారు. అందరికీ తన గాథను వినిపించారు. కేవలం ఇస్లాం స్వీకరించిన నేరానికి ఆయన ఎలాంటి కఠిన శిక్షకు గురికావలసి వచ్చిందో విన్నవించుకున్నారు. మహాప్రవక్త (స)కు "ప్రభూ! నన్ను తిరస్కారుల బారి నుండి రక్షించి మీతో తీసుకెళ్ళండి" అని మొరపెట్టు కున్నారాయన. సుహైల్ ఇది విని తక్షణం, "ఒప్పందం అమలు జరగటానికి ఇది తొలి అవకాశం, ఒప్పందం ప్రకారం మీరు అబూ జందల్‌ని తీసుకువెళ్ళలేరు" అని ఆటంక పరిచాడు. ఇది ముస్లింలకు పరీక్షాసమయం. ఒక వైపేమో ఒప్పందం అమలు జరపాలి. మరోవైపు బాధలకు గురిఅవుతున్న, పీడితుడైన ముస్లిం. అతనిపై జరుగుతున్న అత్యాచారానికి, దౌర్జన్యానికి కారణం కేవలం అతను ఇస్లాం స్వీకరించడమే. అలాంటి వ్యక్తి "ముస్లిం సోదరులారా! నన్ను తిరిగి తిరస్కారుల చేతుల్లో పడవేస్తారా?" అని దీనంగా వేడుకుంటున్నాడు. ముస్లింలందరూ ఈ పరిస్థితి చూసి చలించిపోయారు. తీవ్రమైన ఆవేదనకు లోనయ్యారు. హజరత్ ఉమర్ (ర) అయితే మహాప్రవక్త (స)తో "మీరు దైవప్రవక్త అయి కూడా మనం ఈ హీనస్థితిని సహించడం దేనికి?" అనేశారు. కానీ మహాప్రవక్త (స) "నేను దైవప్రవక్తను కావడం వల్లనే ఆయన ఆజ్ఞోల్లంఘన చెయ్యలేను. ఆయనే నాకు తోడ్పడగలవాడు" అని సమాధానమిచ్చారు. ఎట్టకేలకు సంధి పత్రంపై సంతకాలయ్యాయి. దాని నిబంధన ప్రకారం హజరత్ అబూజందల్‌ను తిరిగి పంపి వేశారు. త్యాగధనులైన సహాబా (సహచరులు) ప్రవక్త విధేయతకు సంబంధించిన ఒక కఠిన పరీక్షలో నెగ్గగలిగారు. ఒక వైపున ఇస్లామ్‌కు పరాభవం జరిగినట్లే కనిపిస్తోంది. హజరత్ అబూజందల్ దీనావస్థ కూడా హృదయాలను ద్రవింపజేస్తోంది. అయితే మరొకవైపున ఎదురు పలక్కుండా దైవప్రవక్త ఆజ్ఞాపాలన చెయ్యడం కూడా ధర్మమే.

మహాప్రవక్త (స) అబూజందల్‌కు బోధించారు. "అబూజందల్! ఓర్పును, స్థిర చిత్తాన్నీ విడువకు, దైవం నీవంటి ఇతర బాధితుల కొరకు కూడా ఒక మార్గాన్ని సూచించడం తథ్యం. ఇప్పుడయితే ఒప్పందం అయిపోయింది. మేము ఇచ్చిన మాటను కాదనలేము" అని ఓదార్చారు.

హజరత్ అబూజందల్ అలాగే బేడీలతోనే మరలి మక్కాకు వెళ్ళిపోయారు.

## హుదైబియా పరిణామాలు

ఒప్పందం పూర్తవగానే అక్కడే కుర్బానీ చెయ్యాలని మహాప్రవక్త (స) ముస్లింలను ఆదేశించారు. తొలుత మహాప్రవక్త స్వయంగా కుర్బానీ చేశారు. కేశ ముండనం చేశారు.

ఆ తరువాత సహాబా ఆయన ఆదేశాన్ని పాలించారు. ఒప్పందం తరువాత మూడు రోజులపాటు మహాప్రవక్త (స) హుదైబియాలో బస చేశారు. తిరిగి వస్తుండగా 'అల్‌ఫతహ్' సూరా అవతరించింది. అందులో ఈ ఒప్పందాన్ని సూచనప్రాయంగా ప్రస్తావించి దాన్ని ప్రస్ఫుటమైన విజయంగా పేర్కొనటం జరిగింది. స్థూలంగా చూస్తే ఇది విచిత్రంగా తోస్తుంది. ఏ ఒప్పందంలోనయితే ముస్లింలు అణగి మణిగి రాజీపడినట్లు స్వయంగా గోచరిస్తుందో, దాన్ని ఘనవిజయంగా పేర్కొనడం మరీ విచిత్రమే కాని తరువాత ఏర్పడిన పరిస్థితులు, హుదైబియా ఒప్పందం వాస్తవంగా ఇస్లామీయ ఉద్యమ చరిత్రలో గొప్ప జయప్రదమైన మలుపుగా పరిణమించిందని స్పష్టపరిచాయి. వాటి వివరాలు ఇవి:

ఇంతవరకు ముస్లిమ్‌లూ, అవిశ్వాసుల మధ్య ఘర్షణావస్థ, సంగ్రామస్థితి ప్రబలి ఉండేది. ప్రత్యర్థులకు రణరంగంలో తప్ప పరస్పరం కలుసుకునే అవకాశమే లభించలేదు. ఈ ఒప్పందం వల్ల ఈ పరిస్థితి పూర్తిగా మారిపోయింది. ఇప్పుడు ముస్లింలు ముస్లిమేతరులు కలుసుకునే అవకాశాలు లభించసాగాయి. ఇంకా పరస్పర కుటుంబ సంబంధాలు, వాణిజ్య సంబంధాలు మొదలయ్యాయి. ముస్లిమేతరులు జంకు గొంకు లేకుండా మదీనాకు రావడం అక్కడ నెలల తరబడి ఉండి ముస్లింలతో స్వేచ్ఛగా కలవడం జరుగుతోంది. ఈ క్రొత్త ఇస్లామీయ సమాజాన్ని సమీపాన్నుండి చూసే అవకాశం వారికి లభించింది.

మక్కా నుండి మదీనాకు వచ్చేవారు విచిత్రమయిన అనుభూతిని పొందేవారు. ఎవరిపట్లనయితే తమ ఆంతర్యంలో ద్వేషం క్రోధావేశాలు నిండి ఉన్నాయో, వారు నైతిక విషయాల రీత్యా, 'దైనందిన వ్యవహారాల దృష్ట్యా', స్వరూపస్వభావాల రీత్యా, తమకంటే ఎన్నోరెట్లు ఉన్నతంగా గోచరించారు ముస్లిమేతరులకు. ఏ వ్యక్తులతో తాము ఘర్షణ కొని తెచ్చుకొన్నారో వారి ఆంతర్యంలో తమపట్ల ఎలాంటి ద్వేషం, శత్రుత్వం లేదు. వారికున్న వ్యతిరేకత అంతా కేవలం తమ మిథ్యా విశ్వాసాల పట్లా, దురాచారాల పట్లా మాత్రమే. ముస్లింలు చెప్పే ప్రతి మాటలో సానుభూతి, మానవీయ ప్రేమ, హృదయ ఆర్ద్రత ప్రతిబింబిస్తూ ఉండేవి. ఇంతగా ఘర్షణలు జరిగినా తమ పట్ల వారు అవలంబించే వైఖరిలో, వారి సత్‌ప్రవర్తనలో ఏ మాత్రం మార్పురాలేదు. అంతేగాక ఇలా కలయిక జరగటం వల్ల ముస్లిమేతరులకు ఇస్లామ్ పట్ల ఉన్న సందేహాలు, అభ్యంతరాలు దూరం కావడానికి, ముస్లిములతో ఇస్లామ్‌ను గురించి చర్చించుకోడానికి అవకాశాలు కూడా ఎన్నో లభించాయి. ఇస్లామ్‌ను గురించి వారికి ఉన్నవన్నీ ఆధారంలేని అపోహలే అని కూడా ముస్లిమేతరులకు తెలిసి వచ్చేది.

మొత్తానికి ఈ పరిస్థితుల్లో కలిగిన పరిణామాల వల్ల ముస్లిమేతరుల హృదయాలు తామై ఇస్లామ్ వైపునకు ఆకర్షించబడ్డాయి. వారి మనోకుహరాలపై వారి నాయకులు కప్పివేసిన అపోహల తెరలు ఒక్కొక్కటే తొలగిపోసాగాయి. తత్ఫలితంగా ఈ ఒప్పందం జరిగిన తరువాత



కేవలం రెండు సంవత్సరాల లోపునే అనేకమంది ఇస్లామ్‌ను స్వీకరించారు. ఇంతమంది ఇంత స్వల్ప వ్యవధిలో ఇంతకు ముందెన్నడూ ఇస్లామ్ స్వీకరించలేదు. ఈ కాలంలోనే కురైష్ నాయకుల్లో ప్రముఖులు, పేరు మోసిన వారు చాలా మంది ఇస్లామ్ బోధనలతో ప్రభావితులయ్యారు. ముస్లిమేతరులతో విడిపోయి, ముస్లింలతో కలసి పొయ్యారు. హజరత్ ఖాలిద్ బిన్ వలీద్, హజరత్ అమ్ర్ బిన్ ఆస్ ఈ కాలంలోనే ఇస్లామ్ స్వీకరించారు. ఇస్లామ్ ఎంతో ప్రభావవంతమయిన అఖండనీయమయిన శక్తిగా దూరదూర ప్రదేశాల వరకు అన్ని వర్గాల్లో విస్తరించింది. ఇక అనతి కాలంలోనే పురాతన మూఢత్వం మృత్యువాతన పడబోతోందని ప్రస్ఫుటంగా కానరాసాగింది. తిరస్కారుల నాయకులు ఈ పరిణామాన్ని గమనించి బిత్తరపొయ్యారు. ఇక ఇస్లామ్ సమక్షంలో పరాజయం పొందటం గురించి ఎలాంటి సందేహం లేదని విస్పష్టంగా గోచరించింది. కురైష్ ప్రజలకు వీలయినంత త్వరగా ఒప్పందాన్ని భగ్నం చెయ్యడంకన్నా మార్గాంతరం కానరాలేదు. అప్పుడే ఇస్లామీయ ఉద్యమానికి విరోధశక్తుల్ని మోహరింపచేసి పోరాడ గలమని, ఈ ఉప్పొంగుతున్న వరదను అరికట్టగలమని భావించారు. ఒప్పందాన్ని వారేవిధంగా అతిక్రమించారో చూద్దాం.



# చక్రవర్తులకు సందేశం

హుదైబియా ఒప్పందంవల్ల కాస్త స్థిమితం, శాంతి లభించగా మహాప్రవక్త (సల్లల్లాహు అలైహివసల్లమ్) తన దృష్టినంతా సందేశ ప్రచారం మీదే కేంద్రీకరించారు. ఒకరోజు ఆయన సహాబాను సంబోధించి, “జనులారా! అల్లాహ్ నన్ను యావత్ ప్రపంచానికిగాను కారుణ్య స్వరూపునిగా ప్రభవింపజేసాడు (నా సందేశం సర్వలోకానికి వర్తిస్తుంది. ఇది అందరికీ చెందిన కారుణ్య సందేశం) చూడండి, ఏసు (అలైహిస్సలామ్) శిష్యుల్లా విభేదాలు లేవదీయకండి. ఇక బయలు దేరండి, నా తరఫున సత్యసందేశాన్ని అందరికీ అందజేయండి” అని సెలవిచ్చారు.

ఆ కాలంలో అంటే హి.శ. 6వ సంవత్సరాన లేక హి.శ. 7వ సంవత్సర ప్రారంభంలో ఆయన ఆనాటి గొప్ప గొప్ప చక్రవర్తులకు సందేశలేఖలు వ్రాయించారు. వాటిని తీసుకుని అనేకమంది సహాబా వివిధ దేశాలకు పొయ్యారు. చరిత్ర గ్రంథాల్లో వివరాలు లభిస్తున్న సందేశ పత్రాలలో కొన్నింటిని పేర్కొంటున్నాము.★

★ రోము చక్రవర్తి **హిరక్ల్** (Heraclius) పేరిట సందేశ పత్రాన్ని హజరత్ **దిహియా కల్బీ** తీసుకువెళ్ళారు.

★ ఈరాన్ రాజు **ఖుస్రో పర్వేజ్** (Chosroes) పేరిట పత్రాన్ని తీసుకువెళ్ళిన వారు **హజరత్ అబ్దుల్లా బిన్ ఖుజాఫా సహ్మీ.**

★ ఈజిప్ట్ చక్రవర్తికి హజరత్ **హాతిబ్ బిన్ అబీ బలకా** సందేశ పత్రం తీసుకువెళ్ళారు.

★ అబిసీనియా రాజు **నీగస్** పేరిట పత్రం తీసుకువెళ్ళిన వారు హజరత్ **అమ్ర్‌బిన్ ఉమ్మయ్యా.**

---

*★ మాకు లభ్యమయిన కొన్ని పత్రాల ఛాయాచిత్రాలను ఈ పుస్తకంలో మరో చోట పొందుపరిచాము. వాటి అనువాదాలు పుస్తకం చివరన అనుబంధంగా ప్రచురించాము. పాఠకులు గమనించగలరు. (ప్రకాశకులు)*





ఈజిప్టు పాలకుడు ముఖౌకిస్‌కు పంపిన పత్రం



## రోము చక్రవర్తికి

హెరక్లియస్ పేరిట పంపిన సందేశ పత్రం ఇది:

"దయాసాగరుడు ప్రేమమయుడైన అల్లాహ్‌పేరుతో. దేవుని దాసుడు, ఆయన సందేశహరుడైన ముహమ్మద్ తరఫున రోము చక్రవర్తి హిరక్ల్ పేరిట.....

"సన్మార్గ దర్శనాన్ని అనుసరించే వారికి శాంతి శ్రేయాలు కలుగుగాకు. నిన్ను ఇస్లాం సందేశం వైపునకు ఆహ్వానిస్తున్నాను. ప్రభువైన అల్లాహ్ ఆజ్ఞాపాలనను, ఆయన విధేయతను స్వీకరించావంటే నీవు శాంతి శ్రేయాలతో మనగలుగుతావు. అల్లాహ్ నీకు ద్వివిధ ప్రతిఫలాలను ప్రసాదిస్తాడు. కాని నీవు అల్లాహ్ విధేయతను నిరాకరిస్తే నీ దేశ ప్రజల పాపం కూడా నీ మీదే పడుతుంది. (ఎందుకంటే నీ నిరాకరణ వల్ల ఇస్లామీయ సందేశం వారికి చేరబోదు) "ఓ గ్రంథం కలవారలారా! మీకూ, మాకూ మధ్య సమంగా వర్తించే ఒక సమిష్టి విషయం వైపునకు రండి, అంటే మనం అల్లాహ్ తప్ప మరెవరి పట్లనూ దాస్యభావన కలిగి ఉండరాదు. ఆయనకు మరెవరినీ సహవర్తులుగా భావించరాదు. మనలో ఎవరైనాసరే అల్లాహ్ తప్ప ఇతరుల్ని తమ ప్రభువుగా, పోషకుడుగా భావించరాదు. కాని మీరు ఈ మాటను కాదన్నారంటే (మేము ఇప్పుడే స్పష్టపరుస్తున్నాము) మీరే సాక్షులుగా ఉండాలి. మేమయితే ముస్లిమ్‌లమే (అంటే కేవలం ఒకే దేవునికి విధేయులం, ఆయన ఆజ్ఞాపాలన చేసేవారమే.)"

## అబూ సుఫ్యాన్ నిర్ధారణ

హజరత్ దిహియా కల్బీ ఆ పత్రాన్ని తీసుకువెళ్ళి హారిస్ గస్సానీకి ఇచ్చారు. అతను అప్పుడు రోము చక్రవర్తి ప్రతినిధిగా 'సిరియా'ను పాలిస్తున్నాడు. అతను పత్రాన్ని హెరక్లియస్‌కు పంపాడు. హెరక్లియస్ పత్రం అందగానే అరబ్బు వ్యక్తి ఎవరయినా అగుపిస్తే తన వద్దకు పంపమని ఆదేశాలిచ్చాడు. ఆ కాలంలోనే అబూ సుఫ్యాన్ (అప్పటికి ఇంకా ఇస్లామ్ స్వీకరించలేదు) వ్యాపారం రీత్యా ఆ ప్రాంతాలకు వెళ్ళి వున్నారు. ఆయన్ని సీజర్ దర్బారులో హాజరుపరిచారు.

అప్పుడు జరిగిన సంభాషణ ఇది:

హిరక్ల్ : దైవదౌత్య వాదన చేసే ఆ వ్యక్తి వంశం ఎలాంటిది?
అబూ సుఫ్యాన్ : ఆయన ఎంతో ఉన్నత వంశానికి చెందినవారు.
హి : ఆ వంశంలో మరెవరైనా దైవదౌత్యం ప్రకటించారా?
అ సు : లేదు.
హి : ఆ వంశంలో ఎవడయినా రాజయ్యాడా?
అ సు : అలా ఎప్పుడూ జరగలేదు.

హి : ఈ ధర్మాన్ని ఆశ్రయించిన వారు బీదవర్గానికి చెందిన వారా? లేక ధనిక వర్గానికి చెందినవారా?

అ సు : బీదవర్గానికి చెందినవారే అధికం.

హి : ఆయన అనుయాయులు అధికమవుతున్నారా? లేక తగ్గుతున్నారా?

అ సు : అధికమే అవుతున్నారు.

హి : ఎప్పుడయినా ఆయన అబద్ధమాడగా విన్నారా?

అ సు : ఎప్పుడూ అలా సంభవించలేదు.

హి : ఆయన ఆడిన మాటను తప్పడం కూడా జరుగుతుందా?

అ సు : ఇంతవరకు అయితే ఇచ్చిన మాటను ఎన్నడూ అతిక్రమించలేదు. ఇప్పుడు ఒక కొత్త ఒప్పందం (హుదైబియా ఒప్పందం) జరిగింది. దానిపైన నిలకడగా ఉంటాడా లేదా అన్న విషయం ఇకపైనే గమనించాలి.

హి : మీరెప్పుడయినా ఆయనతో యుద్ధం చేశారా?

అ సు : ఆ! చేశాము.

హి : యుద్ధానికి పర్యవసానమేమిటి?

అ సు : ఒకప్పుడు ఆయన గెలిస్తే మరొకప్పుడు మేము విజయం పొందాము.

హి : ఆయన బోధనలేమిటి?

అ సు : ఆయన చెప్పేదంతా ఏకేశ్వరోపాసన చెయ్యాలని, మరెవరికీ దైవత్వంలో భాగస్వామ్యం కల్పించకూడదనీ, ప్రార్థన చేయాలనీ, సౌశీల్యంగా జీవించాలనీ, సత్యం పలకాలనీ, పరస్పరం ప్రేమాభిమానాలతో, దయాదాక్షిణ్యాలతో మెలగాలని మాత్రమే.

ఈ సంభాషణ జరిగిన తరువాత హిరక్ల్ ఈ విధంగా తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. "దైవసందేశహరులు నిత్యం మంచి వంశాల్లోనే జన్మిస్తారు. ఆయన వంశంలో ఇంకా ఎవరయినా దైవదౌత్య ప్రకటన చేసి ఉన్నట్లయితే ఈ ప్రకటనను వంశ ప్రభావం అని చెప్పవచ్చు. ఆయన వంశంలో ఎవరయినా రాజయి ఉంటే అధికార పిపాసవల్ల ఇదంతా చేస్తున్నాడనవచ్చు. ఆయన మానవుల విషయంలోనే అసత్యం పలికినట్టు రుజువు లేనప్పుడు, (దేవుడు తనను ప్రవక్తగా నియమించాడని) దైవం పట్ల ఇంత గొప్ప అబద్ధాన్ని కల్పించాడని ఎట్లా నమ్మగలం? ప్రవక్తల తొలి అనుచరులు సదా బీదవారే అన్నమాట కూడా యదార్థమే. సత్య ధర్మం ఎప్పుడూ ప్రగతిశీలమయినదే అన్న విషయం కూడా నిజమే. ఇంకా, ప్రవక్తలు ఎప్పుడయినా ఎవరినయినా మోసం చెయ్యరనేమాట సయితం యదార్థమే. అదీగాక, ప్రార్థన, సౌశీల్యం, దైవ భయభక్తులను ఉపదేశిస్తారని కూడా మీరే



అంటున్నారు. ఇదంతా సత్యమయితే ఏదో ఒక రోజున నా ప్రభుత్వం కూడా ఆయన హస్తగతమయిపోతుంది. ఒక దైవ ప్రవక్త రానున్నాడని నాకూ తెలిసిన విషయమే. కానీ ఆయన అరబ్బుల్లో ప్రభవిస్తాడని మాత్రం నేను ఊహించలేదు. నేనక్కడికి వెళ్ళగలిగి నట్లయితే స్వయంగా నేనే అతని పాదప్రక్షాళనం చేసేవాణ్ణి."

హిరక్ల్ అభిప్రాయాలు విని అతని ఆస్థాన ఫాదరీలు, ఆచార్యులూ ఉగ్రులయిపొయ్యారు. తనకు వ్యతిరేకంగా తిరుగుబాటు ప్రారంభమవుతుందేమో అన్న సందేహం కలిగింది హిరక్ల్‌కు. ఈ సందేహంతోనే హిరక్ల్ ఆంతర్యంలో ఆవిర్భవించిన కాంతికిరణం మటుమాయమయింది. సత్యస్వీకార మార్గంలో ధనం, అధికారాలే అన్నిటినీ మించిన అవరోధాలు.

## ఈరాన్ రాజుకు

ఈరాన్ రాజు ఖుస్రొ పర్వేజ్ పేరిట పంపిన పత్రంలో ఇలా వ్రాశారు: "కృపాకరుడు కరుణాశీలుడైన అల్లాహ్ పేరుతో. అల్లాహ్ సందేశహరుడైన ముహమ్మద్, పర్షియా అధినేత కిస్రాకు వ్రాసేది. దైవశిక్షణోపదేశాలను అనుసరించే వానిపై, దైవాన్నీ ఆయన ప్రవక్తనూ విశ్వసించే వ్యక్తిపై, అల్లాహ్ తప్ప మరే దైవం లేదని, సర్వమానవాళికి, ప్రతి జీవికి, అల్లాహ్ అవిధేయత, ఆజ్ఞోల్లంఘనల వల్ల కలిగే పర్యవసానాన్ని గురించిన దైవభీతి కలిగించడానికి నేను దైవం పంపిన సందేశహరుణ్ణి అని విశ్వసించే వ్యక్తిపై శాంతిశ్రేయాలు కలుగుగాక! నీవు అల్లాహ్ ఆజ్ఞాపాలన విధేయతల్ని స్వీకరించు, నీవు శ్రేయలాభాలతో మనగలుగుతావు లేకపోతే మజూసీల (ఈరాన్ ప్రజలు) ఉసురు నిన్ను చుట్టుకుంటుంది."

ఖుస్రొ పర్వేజ్ గొప్ప అట్టహాసం, దర్పం, ఠీవిగల రాజు. అతనికి సందేశ పత్రం వ్రాసే ఈ తీరే తీరని బాధాకరంగా తోచింది. అందునా ముందు దేవుని పేరు, తరువాత పత్రం వ్రాసే వ్యక్తిపేరు, ఆ తరువాతగాని రాజు పేరు వ్రాయలేదు. అదీగాక అతిసాధారణ శైలిలో వ్రాయబడింది, అందులో పేరుకు వెనుకాముందు బిరుదులు ప్రశంసలతో కూడుకున్న సంబోధనా లాంఛనాలు లాంటివి ఏవీలేవు. ఆ ధోరణి కూడా అతను అలవాటు పడ్డ రీతిలో, దర్బారులో ఉన్న రివాజుకు విరుద్ధమైంది. ఖుస్రొ పర్వేజ్ ఆ పత్రాన్ని చూచి చిర్రుమన్నాడు. నా బానిసైవుండి నాకు ఇలా వ్రాస్తాడా! అని మండిపడ్డాడు. తక్షణం ఆ పత్రాన్ని చింపివేశాడు. ఈ విధంగా దైవదౌత్య ప్రకటనచేసే వ్యక్తిని బంధించి తన సమక్షంలో హాజరు చెయ్యమంటూ యమన్ గవర్నరుకు ఆదేశం పంపాడు. యమన్ గవర్నరు ఇద్దరు భటుల్ని మహాప్రవక్త సన్నిధిలో పంపాడు ఆయన్ని పిలుచుకుని రావడానికి. ఆ సమయానికే ఈరాన్‌లో ఖుస్రొ పర్వేజ్‌ను సంహరించి అతని కొడుకు సింహాసనాన్ని ఆక్రమించుకున్నాడు. గవర్నర్ పంపిన వ్యక్తులు మహాప్రవక్త (స) సన్నిధికి చేరినప్పుడు వారికి తమ చక్రవర్తి

హత్యా సమాచారం తెలియదు. మహాప్రవక్త (స)కు ఈ విషయం అల్లాహ్ వాణిద్వారా తెలిసిపోయింది. తదనుగుణంగా మహాప్రవక్త (స) ఆ ఇద్దరు భటులకు ఆ సంఘటన గురించి తెలిపి, తిరిగి వెళ్ళి మీ గవర్నరుతో ఇస్లామీయ రాజ్య పరిధి ఖుస్రౌ పరిపాలన వరకు వ్యాపిస్తుందని చెప్పండి" అని సెలవిచ్చారు. ఆ భటులు యమన్‌కు తిరిగి వచ్చినప్పుడు ఖుస్రౌ పర్వేజ్ హత్యా సమాచారం వాస్తవమే అని రూఢి అయింది.

## నీగస్, ఈజిప్ట్ పాలకులకు

ఇంచుమించు అదే విషయాన్ని అబిసీనియా రాజగు 'నజాషి'కి వ్రాసిన పత్రంలో పేర్కొన్నారు మహాప్రవక్త (స). దానికి సమాధానంగా ఆయన "నేను సాక్ష్యమిస్తున్నాను, మీరు దేవుని నిజ సందేశహరులే" అని వ్రాశాడు. ఆయన అంతకుముందే అబిసీనియాకు వలస వెళ్ళి ఉన్న 'హజరత్ జాఫర్ తయ్యార్' చేతి మీదుగా ఇస్లామ్ స్వీకరించారు. ఈజిప్ట్ ఏలిక, పత్రాన్ని చదివి ఇస్లామ్ స్వీకరించలేదు. కాని అతను పత్రం తెచ్చిన వారిని రాచమర్యాదలతో సత్కరించి కానుకలతో తిప్పి పంపాడు.





# ఇస్లామీయ రాజ్య ప్రతిష్ఠత

మదీనా నుండి బనూ నజీర్ (యూదులు) బహిష్కరింప బడినప్పుడు వారు ఖైబర్ ప్రాంతాల్లో నివాసమేర్పరచుకున్నారు. ఖైబర్ మదీనా నుండి దాదాపు 200 మైళ్ల దూరంలో వాయువ్య (North West) దిశన ఉన్న ప్రాంతం. ఇక్కడ యూదులు దృఢమయిన అనేక కోటల్ని నిర్మించుకున్నారు. ఖైబర్ అప్పట్లో ఇస్లామీయ ఉద్యమ విరోధానికి చాలా పెద్ద కేంద్రం. అది ఇస్లామ్‌కు శాశ్వత ప్రమాదంగా పరిణమించింది. కందకపు పోరాటంలో, మదీనాపై అంత తీవ్రమయిన దాడి జరగడానికి ఖైబర్ యూదులే ముఖ్య కారకులు, అప్పుడు దైవం వారి ఎత్తుగడను సాగనివ్వలేదు. ఆ తరువాత సయితం ఇస్లా మీయ ఉద్యమం నామరూపాల్లేకుండా సమసిపోవాలన్న ధ్యాసతో యూదులు అనుదినం ఏదో ఒక పన్నాగం పన్నేవారు. ఈ లక్ష్యానికి వారు అరబ్బుల్లోని విభిన్న తెగలతో ముఖ్యంగా ఖురైషీలతో మంతనాలు జరిపి కుట్రలు పన్నడంతోపాటు మదీనాలోని కపటుల్ని సయితం పురికొల్ప సాగారు. ముస్లిములలో ఉంటూ లోలోనే ముస్లిముల నిర్మూ లనా కార్యాన్ని శీఘ్రగతిన కొనసాగించాలని, ఆ తరువాత బయటి విరోధులు ఇస్లామ్ 'ప్రమాదాన్ని' శాశ్వతంగా రూపుమాపుతారని వారికి ఆశ కల్పించారు. యూదులు చేసే ఈ కుతంత్రాలన్నీ మహాప్రవక్త (సల్లల్లాహు అలైహివసల్లమ్)కు తెలుస్తూనే ఉన్నాయి. యూదులతో ఏదయినా సముచిత మయిన ఒప్పందం కుదిరితే వారి ఆటల్ని అరికట్టవచ్చని మహాప్రవక్త (స) భావించి అందుకు ప్రయత్నాలు సాగించారు. కనుక ఈ ఉద్దేశ్యంతో తానే ఇలాంటి ప్రతిపాదన కూడా చేశారు మహాప్రవక్త (స). కాని యూదులు తమ కుట్రలను వదల్లేదు. చివరికి తమతో కలిసి మదీనాపై దండెత్తితే తమ ఖర్జూరపు తోటల పంటను శాశ్వతంగా సగం పంచియిస్తూ వుంటామని విభిన్న తెగల వారికి సందేశం పంపారు. యూదుల ఈ ఎత్తుగడ పారింది. తత్ఫలితంగా ఎన్నో తెగల మనస్సులు మారాయి. వారు అందరూ కలసి మదీనాపై దాడి చేయాలన్న విషయంపై ఏకాభిప్రాయానికి రాసాగారు.

## ముందడుగు

ఇంతవరకూ ముస్లిములు తమ రక్షణకై పోరాడారు. విరోధులు వీరిని అంత మొందించడానికి వీరిపై దాడి చేసేవారు. వీరేమో తమ రక్షణ కోసమని కరవాలం పట్టేవారు. దైవ సహాయం తోడయింది. శత్రువులు పరాజితులయ్యారు. కాని ఇప్పుడు పరిస్థితులు మరో రూపం దాల్చాయి. నేడు ఏర్పడిన ఆవశ్యకత రీత్యా, ఇప్పుడు ఇస్లామీయ ఉద్యమానికి ఎక్కడయినా ప్రమాదం ఉత్పన్నమయ్యే సూచనలు గోచరిస్తే, ఆ ప్రమాదం బాగా పటిష్ఠం కాకమునుపే దాన్ని అంతమొందించాలి. ఇస్లామీయ ఉద్యమ సంస్థాపన, దాని రక్షణకు జరిపే సమరం మాత్రమే కాక అవసరమయితే స్వయంగా ఇస్లామీయ యోధులు ముందడుగు వేసి శత్రువుపై దాడి చెయ్యడం కూడా అత్యవసరమే; ఇస్లామ్ ఒక జీవన వ్యవస్థ, ఒక పరిపూర్ణ జీవన విధానం. ఈ వ్యవస్థను ఈ విధానాన్ని స్థాపించ డానికి కేవలం ఇస్లామేతర వ్యవస్థల దాడిని ఎదుర్కొని రక్షించుకోవడం మాత్రమే కాదు, ఇస్లామేతర వ్యవస్థల నిర్మూలన చేయడానికి ముందంజ వేసి కృషిచేసే అవసరం కూడా కలుగుతుంది.

కందకం పోరాటం తర్వాత ఇస్లామీయ ఉద్యమం 'కేవలం రక్షణతో సరిపోదు, ఇక ముందంజ వెయ్యాలి' అనే దశలో ప్రవేశించింది. ఇప్పుడు అవసరమయితే స్వయంగా ముందంజవేసి ప్రమాదాన్ని దూరం చేసే సమయం ఆసన్నమయింది కనుకనే కందకం పోరాటం ముగియగానే మహాప్రవక్త (స) అన్నారు, "జనులు మనపై దాడి చేసేకాలం పోయింది. ఇక మీదట అవసరమయితే మనమే పురోగమించి దాడి చేస్తాము."

## ఖైబర్‌పై దాడి

ఖైబర్ యూదులవల్ల పెరుగుతున్న ప్రమాదాన్ని సకాలంలో అణచివేసే సమయం ఆసన్నమయింది కనుక మహాప్రవక్త (స) ఖైబర్‌పై దండెత్తడానికి సన్నాహాలు చేయసాగారు. యూదుల తరఫున జరగబోయే దాడుల్ని ప్రతి ఘటించడానికి ఆయనే మదీనా వెలుపలికి రావలసి వచ్చింది. అది ముహర్రం మాసం హి.శ.7వ సంవత్సరం. ఆ సమరంలో ముస్లింల సైన్యం 1600 మందిలో 200 మందికి మాత్రమే వాహనాలు వున్నాయి.

ఖైబర్‌లో ఆరు దుర్గాలుండేవి. వాటిలో ఇరవైవేల మంది సిపాయిలు ఉండేవారు. ఖైబర్ చేరిన తరువాత, యూదులు యుద్ధానికే సిద్ధంగా ఉన్నారనీ ఏ రూపంలోనూ ఒప్పందానికీ, లేదా సంధికీ ఒప్పుకోరని తెలుసుకున్నారు మహాప్రవక్త (స). తరువాత 'జిహాద్' (శక్తివంచన లేకుండా సలిపే నిరంతర కృషి)ని గురించి సహాబా సమక్షంలో ఒక ప్రసంగం చేశారు. వారిని అల్లాహ్ ధర్మం కొరకు ప్రాణాన్ని సయితం ధారపోసేందుకు సిద్ధంగా ఉండాలని ఉపదేశించారు. దాదాపు 20 రోజుల దిగ్బంధం తరువాత అల్లాహ్ ముస్లిములకే విజయాన్ని అనుగ్రహించాడు. ఆ యుద్ధంలో 93 మంది యూదులు హతమయ్యారు. 15 మంది ముస్లిములు అమరగతి పొందారు. యుద్ధంలో యూదుల గొప్ప మల్లయోధుడు



'మర్హబ్' హజరత్ అలీ చేత హతమయ్యాడు. ఈ పహిల్వాన్ హతమవడం ఎంతో మహాత్కార్యంగా భావించబడింది. ఎందుకంటే అతని శక్తిని గురించి యూదులు మహా గర్వించేవారు.

ముస్లిముల విజయానంతరం యూదులు ఒక మనవి చేసుకున్నారు. వాళ్ళ అధీనంలో ఇంతవరకూ వున్న కమతాలను అలాగే విడిచిపెట్టినట్లయితే తాము వాటి పంటల్లో సగం ముస్లింలకు అందజేస్తూ ఉంటామని విన్నవించుకున్నారు. మహాప్రవక్త(స) ఈ విన్నపాన్ని ఆమోదించారు. ఆ తరువాతి సంవత్సరాల్లో ఆ సగం పంటను వసూలు చేయడానికి వెళ్ళిన ముస్లిమ్ అధికారులు యూదుల యెడల అవలంబించిన న్యాయరీతివల్ల క్రమంగా వారి హృదయాలు మారసాగాయి. ముస్లిమ్ అధికారులు మొత్తం పంటను రెండు రాసులుగా పోసి కమతందార్లకు తమకు నచ్చిన రాసిని ఎన్నుకోవడానికి స్వేచ్ఛ ఇచ్చేవారు.

## ముస్లిం సమాజం- సుశిక్షణ

ఉహుద్ పోరాటం తరువాత ఇస్లామీయ ఉద్యమానికి బయటి నుంచి వాటిల్లే ప్రమాదాలు ఎంతో అధికమయ్యాయి. కందకం పోరాటం తర్వాత సంభవించిన సంఘటనల ద్వారా ఈ విషయం బాగా విశదమవుతుంది. ఈ కాలం తీవ్రమయిన సంఘర్షణా కాలం. ఇదంతా జరుగుతున్నప్పటికీ ఇస్లామీయ ఉద్యమ సందేశదాత (స) ఈ పరిస్థితుల్ని ప్రజ్ఞావంతుడయిన సేనాపతిలా అదుపులో ఉంచారు. ఇంకా ఆ పరిస్థితు ల్లోనే ఒక నైతిక ఉపదేశకునిలా ఆత్మల శుద్ధీకరణ కార్యాన్నీ వదల్లేదు. తన అనుయాయుల సుశిక్షణపట్ల శ్రద్ధ చూపుతూనేవున్నారు. ఈ ఇస్లామీయ నవసమాజానికి ఆవశ్యమయిన నియమాలు నిబంధనలు సయితం సతతం బోధించబడుతూ వున్నాయి. ఆ కాలంలో అవతరించిన రెండు ప్రముఖ సూరాలు 'నిసా', 'మాయిదా'లను అధ్యయనం చేస్తే ఆ రోజుల్లో ఇస్లామ్ కోరే సచ్ఛీలత కొరకు, స్వరూప స్వభావాల కొరకు, ముస్లిమ్ సమాజ నిర్మాణానికి ఎలాంటి ముఖ్యమయిన చట్టాలు, నియమాలు బోధించబడ్డాయో అర్థమవు తుంది.

'నిసా' సూరా హి.శ.4,5 సంవత్సరాలలో విభిన్న కాలాల్లో అవతరించింది. దాన్ని పఠిస్తే అప్పుడు మహాప్రవక్త (స) ఆ కొత్త ఇస్లామీయ సంఘాన్ని ఏ విధంగా పురాతన మూఢాచారాల నుండి పరిశుద్ధపరచి ఎలా సంఘటిత పరిచారో, ఇంకా జీవన వ్యవస్థను నైతిక, నాగరిక, సామాజిక, ఆర్థిక వ్యవస్థ స్వరూపానికి సంబంధించిన కొత్త సిద్ధాంతాలు పునాదిగా పునర్నిర్మించారో బోధపడుతుంది. ముస్లిములు తమ వ్యక్తిగత జీవితంతోపాటు సామాజిక జీవితాన్ని ఏ విధంగా ఇస్లామ్ సూత్రాల ఆధారంగా చక్కదిద్దు కోవాలో అల్లాహ్ తరఫున స్పష్టమయిన ఆదేశాలు లభించసాగాయి. వారి కుటుంబ వ్యవస్థీకరణ కొరకు సూత్రాలు తెలుపబడ్డాయి. వివాహం, విడాకులకు సంబంధించిన విశదమయిన నిర్దేశాలు సూచించబడ్డాయి. స్త్రీ పురుషుల హక్కుల్ని, అధికారాల్ని నిర్ణయించి సమాజంలోని ఎన్నో కీడుల్ని దూరం చెయ్యడం జరిగింది. అనాథల, ఆర్తుల హక్కుల్ని పరిరక్షించేందుకు తాకీదు

చెయ్యబడింది. వారసత్వపు విభజనకు సంబంధించిన చట్టాలు నిర్మించబడ్డాయి. ఇచ్చిపుచ్చుకోవడానికి సంబంధించిన వ్యవహారాల సంస్కరణకై ఆదేశాలు లభించాయి. కుటుంబంలోని తగదాలను ఎలా పరిష్కరించుకోవాలో తెలుపటం జరిగింది. మద్య పానాన్ని నిషేధించటం జరిగింది. పారిశుద్ధ్యం, పరిశుభ్రతల ఆదేశాలు అందాయి. సత్ప్రవర్తన, సచ్ఛీలత గల వ్యక్తి సంబంధం తన దైవంతో ఎలా ఉండాలో, దేవుని దాసు లయిన తోటి మానవులతో ఏ విధంగా వారు మెలగాలో ముస్లింలకు బోధ పరచబడింది. దీనికితోడుగా గ్రంథం కలవారి (యూదులు, క్రైస్తవుల) తప్పుడు ధోరణిని, అనుచితమయిన జీవిత విధానాన్ని విమర్శించి వారి తప్పులు విశదపరచబడేవి. ముస్లిమ్‌లను అలాంటి తప్పుల నుండి దూరంగా ఉండాలని హెచ్చరించడం కూడా జరిగేది.

ఇస్లామీయ ఉద్యమం ప్రత్యేకత ఇదే. ఈ రీతిలో ముస్లిముల సంస్కరణ జరక్కపోతే మిథ్యావాదానికి అభిముఖంగా వారికి విజయం లభించడం దుర్లభం. ఇస్లామీయ ఉద్యమ అనుయాయులు కేవలం వ్యక్తిగతంగా మిథ్యావాదుల సమక్షంలో ఉన్నతంగా ఉండడమేకాక వారొక ఆదర్శప్రాయమయిన సమాజాన్ని స్థాపించాలి. అది దాని స్వరూప స్వభావాల ద్వారానే ఇస్లామేతర సమాజాలకన్నా దాని ఆధిక్యతను చాటుకోవాలి; దాని ఘనతను నిరూపించుకోవాలి. ఈ లక్ష్యసాధనకై ప్రత్యేకమయిన ఏర్పాట్లు, లేదా కృత్రిమైన వాతావరణం సృజించే అవసరం లేదు. ఉద్యమం ధ్వజవాహకుల్లో దైవం పట్ల భయభక్తులు, ఇహ్‌సాన్ స్థితి ఉత్పన్నమయితే కావలసిన పరిణామాలు వాటంతటవే సంభవిస్తాయి. ప్రవక్తలు నడిపే సంస్కరణాత్మక, విప్లవాత్మక ఉద్యమాల తీరుతెన్నులు, ఈ రంగంలోని ఇతర ఉద్యమాలకు భిన్నంగా ప్రత్యేకంగా ఉంటాయి. ప్రవక్త తన అనుయాయుల బోధన, సుశిక్షణ, ఆత్మ శుద్ధీకరణకు ప్రాధాన్యత ఇచ్చి ఆ విషయాలపైనే తన దృష్టిని కేంద్రీకరింప జేస్తాడు. తన సంబోధిత ప్రజలకు సందేశం అందజేసేందుకు కృషి సలపడానికి వ్యాకుల పడటం కంటే అధికంగా అనుయాయుల తర్ఫీదు కొరకు బాధపడతాడు. ఈ విశేష గుణం 'నిసా' సూరాలో ప్రస్తావించబడిన విషయాల్లో కానవస్తుంది. ఈ సూరాలో నైతికత, నాగరికత, సామాజిక వ్యవస్థకు సంబంధించిన నియమ నిబంధనలు వివరించబడిన చోటే, దానికి తోడుగా సందేశ ప్రచార విషయం కూడా ఉంది. బహు దైవారాధకులకు, గ్రంథం కలవారికి సత్యధర్మం వైపునకు ఆహ్వానం కూడా తప్పనిసరిగా ఉంది.

హుదైబియా ఒప్పందానికి పిదప, దాదాపు హి.శ. 7వ సంవత్సరం 'మాయిదా' సూరా అవతరించింది. హుదైబియా ఒప్పందం ప్రకారం ముస్లిములు ఆ సంవత్సరం 'ఉమరా' చెయ్యలేదు. కాని మరుసటి సంవత్సరం కాబా సందర్శనానికి రాగలరని నిర్ణయమయింది గనుక, ఆ రానున్న అవకాశానికి ముందే కాబా సందర్శనానికి సంబం ధించిన అనేక మర్యాదల్ని, లాంఛనాల్ని పాటించవలసిన విధుల్ని సూచించటం జరిగింది. తిరస్కారులు అత్యాచారం చేసినప్పటికీ ముస్లిములు తమ పక్షంగా ఎలాంటి అత్యాచారం జరగనివ్వకూడదని బోధించడం జరిగింది.



ఇథియోపియా రాజుకు



సఫా మర్వాం మధ్య సయీ చేస్తున్న హాజ్ యాత్రికులు



'మాయిదా' సూరా అవతరణాకాలానికి ముస్లిముల పరిస్థితులు ఎంతో మారిపొయ్యాయి. ఇస్లామ్‌కు నాలుగువైపుల నుంచి ముంచుకు వస్తున్న ప్రమాదాలు ఇప్పుడు లేవు. అలాంటి పరిస్థితి ఉహుద్ పోరాటం తరువాత ఏర్పడిందే కాని ఇప్పుడు అంతా మారిపోయింది. ఇస్లామ్ నేడు ఎదురులేని శక్తిగా విజృంభించింది. ఇస్లామీయ రాజ్యం బాగా విస్తరించింది. మదీనాకు నలువైపులా దాదాపు రెండు మైళ్ళ వరకు ఉన్న విరోధి తెగల పీడ విరగడ అయింది. మదీనా యూదులవల్ల నిత్యం ప్రాణసంకటంగా వున్న పరిస్థితి అంతమయింది. యూదులు ఎక్కడయినా మిగిలివుంటే, వారు లొంగి ఉండటానికి అంగీకరించారు. ఇప్పుడు ఇస్లామ్ కేవలం సాధారణ పరిభాషలో 'మతం' అనబడే కొన్ని విశ్వాసాల సమూహం మాత్రమే కాదనీ, దాని సంబంధం కేవలం మానవుని మనోమస్తిష్కాలతో మాత్రమే లేదనీ, అది ఒక సంపూర్ణమయిన జీవన వ్యవస్థ అనీ అది మానవుని మనోమస్తిష్కాలతోసహా యావత్తు జీవితంతోనూ ముడిపడి ఉందని విస్పష్టంగా తెలిసిపోయింది. ఇందులో ప్రభుత్వ వ్యవహారాలు, రాజకీయాలు, సంధి, సమరరంగాలు సమస్తం అంతర్లీనమయి ఉన్నాయి. అదీగాక ఇప్పుడు ముస్లింలు కూడా శక్తిని పుంజుకున్నారని, తద్వారా వారు చైతన్యవంతంగా, స్వీకరించిన ధర్మానికీ, జీవన వ్యవస్థకు అను గుణంగా, తమ జీవితాన్ని ఎలాంటి ఆటంకం లేకుండా గడుపుకోగలరని అందరికీ అర్థమయింది. ఇప్పుడు ఇతర ఏ వ్యవస్థ అయినా, ఏ పరిపాలనా బంధాలయినా వారి మార్గానికి అంతరాయం కలిగించలేవని, వారు తాము ఆశ్రయించిన ధర్మం వైపునకు ఇతరులను సయితం ఆహ్వానిస్తూ పోగలరని కూడా విశదమయిపోయింది.

అప్పటికే ముస్లిమ్‌లకు తమదంటూ ఒక ప్రత్యేక సంస్కృతి రూపొందింది. అది ఇతర సంస్కృతుల్లో ఓ ప్రత్యేకతను సంతరించుకుంటూ వుంది. వారి నైతికతకు, వారి దైనందిన వ్యవహారాలకు సంబంధించిన సిద్ధాంతాలు, సంప్రదాయాలు చూపబడ్డాయి. వారు జరిపే వాణిజ్య వ్యవహారాలు, వారి పరస్పర సంబంధబాంధవ్యాలు, ఒకటేమిటి వారి పూర్తి జీవితపు స్వరూపమే ఇస్లామీయ సూత్రాలకు ప్రతిరూపంగా మారుతూ పోతోంది. వారికి ఇతరుల సమక్షంలో స్పష్టమైన ప్రత్యేకతలు ప్రాప్తమవుతున్నాయి. వారికి ప్రత్యేకమయిన 'సివిల్', 'క్రిమినల్' చట్టాలు వున్నాయి. వారి న్యాయస్థానాలున్నాయి. ఇచ్చిపుచ్చుకోవడాలకు, క్రయవిక్రయాలకు వారికి తమ ప్రత్యేక విధానాలున్నాయి. వారసత్వానికి సంబంధించిన చట్టాలు, వివాహాలు విడాకుల నియమాలు, సమాజంలో స్త్రీ పురుషుల పరిధుల్ని నిర్దిష్టపరిచే 'పర్దా' వ్యవస్థ వారికి ప్రత్యేకంగానే ఏర్పడ్డాయి. చివరికి నలుగురితో మసలుకునే రీతులు, భోజన పానీయాలు పుచ్చుకునే విధానాలు, పరస్పరం కలుసుకునే, పలకరించుకునే పద్ధతులు కూడా వివరంగా నిర్దేశింపబడ్డాయి. ఇవన్నీ చేరి ఇస్లామీయ సమాజాన్ని, ఇస్లామీయ జీవిత విధానాన్ని, ఇస్లామేతర సమాజా లన్నింటికీ వేరుగా ప్రత్యేక స్థానాన్ని విశిష్ట రూపాన్ని

ప్రసాదించాయి. ఇదంతా మహాప్రవక్త(స) ఎంతో దీక్షతో జరుపుతున్న శిక్షణా బోధనల ఫలితమే. ఆ బోధనల ఫలితంగానే ముస్లిముల జీవితాలు పరిశుద్ధంగా, పావనంగా రూపొంద సాగాయి.

'మాయిదా' సూరాలో హజ్ యాత్రలో పాటించవలసిన నియమాలు, అన్న పానీయాలూ, ధర్మాధర్మాల గుర్తింపు, వుజూ, స్నానం, 'తయమ్ముమ్' (నీరు లభించనప్పుడు పారిశుధ్యం కోసం అవలంబించవలసిన విధానం) తదితర విషయాల నియమాలు చూపబడ్డాయి. మద్యం, జూదం లాంటి వాటిని అధర్మమైనవిగా ప్రకటించడం, సాక్ష్యానికి సంబంధించిన చట్టాల నిర్మాణం, నీతి న్యాయాలపై నిలకడ కలిగి ఉండాలని తాకీదు చెయ్యటం లాంటి విషయాలకు, ఇస్లామీయ సమాజానికి అత్యంత ఆవశ్యకమైన విషయాలకు ప్రాముఖ్యత ఇవ్వబడింది.

## ఉమరా యాత్ర

హుదైబియా ఒప్పందంలోని షరతుల్లో ఒకటి ముస్లిమ్‌లు ఒప్పందానికి మరుసటి సంవత్సరం వచ్చి 'ఉమరా' చేసుకోవచ్చుననేది. తదనుగుణంగా అంటే హి.శ. 7వ సంవత్సరం మహాప్రవక్త (స) ముస్లిములను చాలా మందిని తీసుకుని కాబాను సందర్శిం చారు. ఆ సందర్భంలో సహాబా ఆనందానికీ, ఆవేశానికీ ఒక విశేషమయిన తన్మయత్వానికి హద్దులు, మేరలు లేవు. ఆ దృశ్యం చూసి కురైషీ తిరస్కారుల ఆంతర్యంలో అణిగివున్న ఈర్ష్య, ఓర్వలేని తనం రెచ్చిపోయాయి. తమ అభీష్టం ప్రకారం తమదే పైచేయి అని స్ఫురించేలా చేసుకున్న హుదైబియా ఒప్పందం కడు హీనంగా కనిపించింది ఆనాడు వారికి.



# మక్కా ప్రవేశం

## హుదైబియా ఒప్పందం అతిక్రమణ

హుదైబియా ఒప్పందం ప్రకారం అరేబియాలోని తెగలకు ముస్లిమ్‌లతోనైనా లేదా కురైషీలతోనైనా ఒడంబడిక చేసుకోవడానికి హక్కుంది. తదనుగుణంగానే 'ఖుజాఅ' తెగ ముస్లిమ్‌లతో ఒడంబడిక చేసుకుంది. 'బనూబక్ర్' తెగ కురైషీలకు తోడయింది. దాదాపు ఒకటిన్నర సంవత్సరాల వరకు ఒప్పందం అమలు జరిగింది. కాని ఆ తరువాత ఒక సంఘటన జరిగింది. 'ఖుజాఅ' 'బనూబక్ర్' తెగలు ఎంతో కాలంగా పరస్పరం పోరాడు కుంటున్నాయి. ఇప్పుడు మళ్ళీ ఏదో సాకుతో వారి మధ్యన పోరాటం ప్రారంభమయింది. 'బనూబక్ర్', 'ఖుజాఅ'పై దాడి చేసింది. దానికి కురైషీలు సహకరించారు. ఖుజాఅ తెగ, ముస్లిములతో ఒడంబడిక చేసుకోవడం కురైషీలకు కోపకారణమయింది. అందువల్ల బనూబక్ర్, కురైషీలు కలిసి ఖుజాఅను హతమార్చసాగారు. చివరికి ఖుజాఅ కాబా గృహంలో శరణుతీసుకున్నా, అక్కడా వారిని విడువలేదు. 'హరమ్'లోను ఖుజాఅ రక్తం పారింది!

'ఖుజాఅ' తెగవారు మార్గాంతరంలేక మహాప్రవక్త (సల్లల్లాహు అలైహివసల్లమ్)కు సమాచారం అందజేశారు. తాము మహాప్రవక్తతో చేసుకున్న ఒడంబడిక ప్రకారం సహాయాన్ని అర్థించారు. ఖుజాఅ దీనావస్థను వినగానే మహాప్రవక్త (స)కు ఎంతోబాధ కలిగింది. అయినా కురైష్ వద్దకు సందేశం పంపారు. తక్షణం తమ దారుణాన్ని విరమించు కోవాలని, ఇంకా ఈ క్రింది మూడు షరతుల్లో దేన్ని స్వీకరిస్తారో తెలుపాలని ఆయన తన సందేశంలో పేర్కొన్నారు:

1. ఖుజాఅ తెగకు చెందిన హతుల 'రక్త పరిహారం' చెల్లించాలి.

   లేదా

2. కురైషీలు, బనూబక్ర్‌కు సహకరించడం మానివెయ్యాలి, లేదా
3. హుదైబియా ఒప్పందం ఇక మీదట అమలు జరగదని ప్రకటించాలి.

ఈ సందేశం వినగానే కురైషీల్లోని ఒక వ్యక్తి 'కర్తబిన్ ఉమర్' మేము మూడో

షరతును స్వీకరిస్తున్నాము అని అన్నాడు. సందేశం తెచ్చిన వ్యక్తి వెళ్ళిపొయ్యాక కురైషీలకు చాలా బాధకలిగింది. వారు తిరిగి అబూసుఫ్యాన్‌ని రాయబారిగా పంపారు. వెళ్ళి హుదైబియా ఒప్పందాన్ని తిరిగి అమలు జరుపదలచుకున్నామని తెలిపి దాని పునఃస్థాపన కొరకు అర్థించడానికి పంపారు. కాని మహాప్రవక్త (స)కు అందిన వార్త దృష్ట్యా, కురైషీలు ఇంతవరకు అవలంబించిన ధోరణి మూలంగా ఆయన (స)కు వారిపై సరిగ్గా నమ్మకం కుదరలేదు. అందువల్ల అబూసుఫ్యాన్ తెచ్చిన ప్రతిపాదనను సమ్మతించలేక పోయారు.

## మక్కాపై దాడి

కాబా గృహం హజరత్ ఇబ్రాహీమ్ (అలైహిస్సలామ్)కేవలం స్వచ్ఛమయిన ఒకే దేవుని ఆరాధనకై నిర్మించిన, దేవుని ఏకత్వాన్ని చాటే గొప్ప కేంద్రం. కాని అది ఇంకా బహుదైవారాధకుల చేతుల్లోనే వుంది. బహుదైవారాధనకు నిలయమయింది. మహాప్రవక్త (స) హజరత్ ఇబ్రాహీమ్ తెచ్చిన ధర్మం వైపునే అందర్నీ ఆహ్వానిస్తున్నారు. శుద్ధమయిన ఏకేశ్వరారాధనను చాటుతున్నారు. ఈ విషయాల దృష్ట్యా, ఏకేశ్వర వాదనకు కేంద్రమయిన ఈ పవిత్ర స్థలాన్ని బహుదైవారాధన మలినాల నుండి అతి శీఘ్రంగా పరిశుద్ధ పరచడం ఎంతయినా అవసరం. కాని ఇంతవరకు పరిస్థితులు దానికి అనుకూలించలేదు. ఇప్పుడు ఈ పవిత్ర దైవగృహాన్ని కేవలం ఆయన ఆరాధనకే ప్రత్యేకించడానికి, విగ్రహారాధనకు సంబంధించిన అపరిశుద్ధతలన్నింటినీ ఈ గృహాన్నుంచి దూరం చెయ్యడానికి తగిన సమయం ఆసన్నమయిందని మహాప్రవక్త(స) భావించారు. తదనుగుణంగా మహాప్రవక్త (స) తమతో ఒడంబడిక చేసుకున్న తెగలన్నింటికీ ఈ సందర్భంలో సందేశాలు పంపారు. మక్కా వారికి ఈ సన్నాహాల సమాచారం చేరకుండా తగు జాగ్రత్తలు కూడా తీసుకున్నారు. కావలసిన యేర్పాట్లన్నీ పూర్తయ్యాక హి.శ. 8వ ఏట రమజాన్ 10వ తారీఖున మహాప్రవక్త (స) మక్కా వైపునకు బయల్దేరారు. ఇంచుమించు 10 వేల మంది సైనికులతో ఎంతో ఘనంగా అత్యంత వైభవంగా బయల్దేరారు. త్రోవలో అరేబియాలోని ఇతర తెగలు వచ్చి చేరుతూపొయ్యాయి.

## అబూసుఫ్యాన్ పట్టివేత

ఇస్లామీయ సైన్యం మక్కా దరిదాపుల్లో ఉంది. రహస్యంగా సైన్యాన్ని గురించి సమాచారాలు సేకరిస్తూ అబూసుఫ్యాన్ పట్టుబడ్డారు. ఆయన్ని మహాప్రవక్త (స) సన్నిధిలో హాజరుపరిచారు. ఇంతవరకూ ఇస్లామ్ విరోధంలో అగ్రగణ్యులయినవారు ఈయనే. ఈయనే మాటిమాటికి మదీనాపై దాడి జరిపే పన్నాగాలన్నీ పన్నారు. చివరికి మహాప్రవక్త (స) హత్యాయత్నాన్ని రహస్యంగా చేసింది కూడా ఈయనే. ఈ కారణాలవల్ల అబూ సుఫ్యాన్‌ని వెంటనే సంహరించటమే సమంజసం. కాని మహాప్రవక్త (స) ఆయనను కటాక్షించారు. “వెళ్ళు, నిన్ను ఈ వేళ ఏదీ ప్రశ్నించడం జరగదు. అల్లాహ్ నిన్ను మన్నించు గాక, ఆయనే



కనికరించే వారందరికంటే అధికంగా కనికరించే వాడు” అని సెలవిచ్చారు. అబూసుఫ్యాన్‌తో ఇలా వ్యవహరించడం ఎంతో వింతయిన విషయం. లోక కారుణ్యమూర్తి, కరుణాస్వరూపుడు ముహమ్మద్ (స) ప్రదర్శించిన ఈ కృపాగుణంచేత అబూసుఫ్యాన్‌కు కనువిప్పు కలిగింది. మక్కాపై దండెత్తిన ఈ వ్యక్తి తన శత్రువులతో ప్రతీకారం తీర్చుకునే వాడూ వారి రక్తపిపాసీ కాడు. ప్రపంచంలోని రాజుల్లా గర్వం, అహంభావం కలవాడు కూడా కాడని ఆయనకు తెలిసిపోయింది. ఈ కారణంగానే మహాప్రవక్త (స) ఆయన్ని మన్నించి స్వేచ్ఛగా వదలి వేసినప్పటికీ ఆయన మక్కా వెళ్ళలేదు. ఇస్లామ్ స్వీకరించి త్యాగశీలురయిన మహాప్రవక్త(స) సహచరుల్లో చేరిపొయ్యారు.

## మక్కా ప్రవేశం

అప్పుడు మహాప్రవక్త (స) హజరత్ ఖాలిద్ బిన్ వలీద్‌ను మక్కాలో ఒక మార్గం గుండా ప్రవేశించమని ఆదేశించారు. ఎవరినీ చంపవద్దనీ, అయితే ఎవరయినా ఆయనపై దెబ్బతీస్తే ఆయన కూడా రక్షణ కోసం చర్య తీసుకోవచ్చని, ఆ అనుమతి ఉందనీ ఉపదేశించి పంపారు. స్వయంగా మహాప్రవక్త (స) మరొక మార్గం ద్వారా ప్రవేశించారు. హజరత్ ఖాలిద్ వెంటనున్న సైన్యాన్ని ప్రతిఘటిస్తూ ఖురైష్ తెగల్లోని వారు కొందరు బాణాలు విసిరారు. ముస్లిములు ముగ్గురు అమరగతులయ్యారు. అందుచేతనే హజరత్ ఖాలిద్ కూడా ఎదుర్కొనవలసి వచ్చింది. ప్రతిఘటించిన వారిలో 13 మంది హతమయ్యారు, తతిమ్మావారు పలాయనం చిత్తగించారు. మహాప్రవక్త (స) హజరత్ ఖాలిద్ తీసుకున్న చర్య సమాచారం తెలిసిన తరువాత ఆయన్ని విచారించారు. కాని అసలు విషయం తెలుసుకుని “పోనీ దైవ నిర్ణయం అలా జరగాలని ఉందేమో” అని అన్నారు. రెండో వైపు నుంచి మహాప్రవక్త (స) ఎలాంటి ప్రతిఘటన లేకుండా ప్రవేశించారు. ఆయన సైన్యం చేతిలో ఎవరూ హతమవలేదు.

## మక్కాలో శాంతి ప్రకటన

మహాప్రవక్త (స) మక్కాలో ప్రవేశించగానే ఈ ప్రకటన చేశారు:

- తన ఇంటిలో ద్వారాలు మూసుకుని ఉండే వ్యక్తికి మన్నింపు ఇవ్వబడుతోంది.
- అబూ సుఫ్యాన్ ఇంటిలో ప్రవేశించిన వారికి మన్నింపు ఇవ్వబడుతోంది.
- కాబా గృహంలో రక్షణ తీసుకున్న వ్యక్తికీ మన్నింపు ఇవ్వబడుతోంది.

ఈ సర్వసామాన్య మన్నింపు ప్రకటన నుండి ఆరేడుగురిని మినహాయించడం జరిగింది. వారు ఇస్లామ్ విరోధంలో అగ్రగణ్యులైనవారు. వారిని నిర్మూలించడం అత్యవసరమని భావించటం జరిగింది.

మహాప్రవక్త (స) మక్కా ప్రవేశించిన శుభ సన్నివేశంలో ఆయన ధ్వజ చిహ్నం తెల్లదిగాను, పతాకం నల్లదిగాను ఉండింది. తలమీద ‘మగ్‌ఫర్’ అనే తలపాగా ధరించారు.

దానిపై నల్లని 'అమామా' కట్టుకున్నారు. "ఇన్నా ఫతహనా" సూరా బిగ్గరగా పారాయణం చేస్తున్నారు. దైవ సన్నిధిలో వినయ విధేయత భావాలతో ఎంతో వినమ్రులై ముందుకు సాగారు. ఆయన అధిరోహించిన ఒంటెపై వినమ్రులయి కూర్చోవడం మూలాన ఆయన పవిత్ర శిరస్సు ఒంటె మూపురానికి తగులుతూ ఉంది.

## కాబా ప్రవేశం

మహాప్రవక్త మస్జిదుల్ హరామ్ (కాబా)లో ప్రవేశించగానే విగ్రహాలన్నింటినీ తీసిపారవేయాలని ఆదేశించారు. అప్పుడు కాబాలో 360 విగ్రహాలుండేవి. గోడలపై చిత్రాలుండేవి. అవి తుడిచివేయబడ్డాయి. ఈ విధంగా ఆ అల్లాహ్ గృహాన్ని బహుదైవారాధన మాలిన్యాన్నుండి పరిశుద్ధం చేయటం జరిగింది. ఆ తరువాత ఆయన దైవ మహోన్నతను కొనియాడుతూ తక్బీరు పఠించారు. కాబా గృహ ప్రదక్షిణ చేశారు. మకామె ఇబ్రాహీమ్‌పైన నిలబడి నమాజ్ చేశారు. ఇదే ఆయన జరిపిన విజయోత్సవం. దీన్నిచూసి మక్కా ప్రజలకు కనువిప్పు కలిగింది. ఇలాంటి ఆనందప్రదమయిన సందర్భంలోనూ, ఇంత అఖండమైన దిగ్విజయం లభించినప్పుడు కూడా ఈ ప్రజలు ఎలాంటి వైభవం, ఠీవి కనబరచటం లేదనీ, గర్వం అహంభావాల ప్రదర్శన చెయ్యడంలేదనీ, దానికి భిన్నంగా ఎంతో వినయ వినమ్రతలతో కృతజ్ఞతాభావంతో తమ ప్రభువు ఎదుట మోకరిల్లు తున్నారనీ, ఇలా దైవ స్తోత్రమూ దైవోన్నతి కొనియాడటంలోనే తన్మయులయిపోతున్నారనీ వీక్షించి, సంభ్రమాశ్చర్యాల్లో మునిగిపోయ్యారు. ఈ దృశ్యాన్ని చూసిన ఏ వ్యక్తి అయినా వాస్తవంగా ఇది రాజరికం కాదని, దేశ విస్తీరణా పథకం అంతకన్నా కాదనీ, ఇది ఏదో కొత్త మార్గమే అని ఇట్టే గ్రహించగలదు.

## విజయానంతర ప్రసంగం

మక్కాను జయించిన తరువాత ఆయన (స) ఎంతో ప్రాముఖ్యం గల చారిత్రక మయిన ఒక ప్రసంగం చేశారు. దాని కొన్ని భాగాలు హదీస్ పుస్తకాల్లో ఉల్లేఖించబడ్డాయి.

"అల్లాహ్ ఒక్కడే తప్ప మరొక దైవం లేదు. ఆయన దైవత్వంలో భాగస్వాములు ఎవరూ లేరు. ఆయన తానిచ్చిన మాటను నిలబెట్టుకున్నాడు. ఆయన తన దాసునికి సహాయం చేశాడు. ఇతర ముఠాలన్నింటినీ ఏకాకులుగా చేసివేశాడు. ఆ! బాగా వినండి, గర్వకారణాలయిన విషయాలన్నీ, పురాతన హత్యలు, హత్యా ప్రతీకారాలు సమస్తం నా పాదాల కింద ఉన్నాయి. (నేను వాటిని అంతమొందిస్తున్నాను) కేవలం కాబా సంరక్షణ, తత్సంబంధమైన కార్యాలు, హజ్ యాత్రికులకు నీటి సరఫరా కార్యాలు మినహాయించి సర్వం నా హస్తగతమయివున్నాయి. ఖురైష్ ప్రజలారా! అజ్ఞాన కాలపు అహంభావాల్నీ,



వంశం, గోత్రం గురించి గర్వపడటాన్ని అల్లాహ్ రూపుమాపాడు. మానవులంతా ఆదమ్ సంతతిలోని వారే ఆదమ్ మన్నుతో సృజించబడ్డారన్న విషయం మరువకండి".

ఆ తరువాత దివ్యఖుర్ఆన్ ఆయత్‌ను పఠించారు :

"జనులారా! నేను మిమ్మల్ని ఒకే స్త్రీ పురుషుల జంట ద్వారా పుట్టించాను. మీ ద్వారా తెగలను, వంశాలను సృజించాను. తద్వారా మీరు పరస్పరం పరిచయం చేసుకోవాలని, ఐతే దేవుని దృష్టిలో భయభక్తులు అధికంగాగల వ్యక్తియే ఉత్తముడు. అల్లాహ్ సర్వం తెలిసినవాడు, దేన్నయినా తెలుసుకోగలవాడు".

(అల్ హుజురాత్:20)

దీనికితోడు ఇంకా కొన్ని ముఖ్య విషయాల్ని మహాప్రవక్త (స) ఉపదేశించారు.

అత్యంత ఘనమయిన విజయాల్ని సాధించిన ఇస్లామ్ యోధుడు విజయానంతరం చేసిన ప్రసంగంలోని ధోరణి ఇది! దీనిలో విరోధులపట్ల ఎలాంటి క్రోధమూ లేదు, ద్వేషమూ లేదు. ఇంకా తాను సాధించిన కార్యంపట్ల గర్వపడనూ లేదు. దాన్ని కనీసం ప్రస్తావించనైనా లేదు. తన త్యాగశీలురయిన అనుయాయుల్ని పొగడనూ లేదు. పైగా పొగడ్త, స్తోత్రం ఏదైనా ఉంటే అది కేవలం అల్లాహ్‌కు మాత్రమే చెందుతుంది అని, జరిగిన దంతా, లభించినదంతా, ఆయన అనుగ్రహంవల్లనే జరిగింది, ఆయన కటాక్షం వల్లనే లభించింది అనీ చాటారు.

అరేబియాలో హత్యకు ప్రతీకారం తీర్చుకోవడం ఎంతో ముఖ్యమయింది. ఒక వంశంలో ఎవరయినా చంపబడితే హతుని వంశంలో ఈ విషయాన్ని ఎప్పటికీ జ్ఞాపక ముండేలా చూస్తారు. ఏళ్ళు గడచినా, ఆపైన వచ్చే సంతతిలోనివారు, హంతకుని వంశ ప్రజలతో ఆ హత్యకు ప్రతీకారం తీర్చుకోనంతవరకు స్థిమితంగా కూర్చోరు. అయితే మహాప్రవక్త (స) మక్కాను జయించిన సందర్భంలో ఆయన ఇలాంటి ప్రతీకారాలన్నింటినీ అంతం చేశారు. అంటే అరేబియాకు యదార్థమైన శాంతిసుఖాల జీవితాన్ని ప్రదానం చేశారన్నమాట. ఇలాగే అరేబియాలో వంశం, గోత్రాల రీత్యా గర్వపడటం ఎంతో పాతరోగం. ఇస్లామ్ ప్రకారం కేవలం, ఎవరు అల్లాహ్ విధేయతను పాటిస్తున్నారు, ఎంత వరకు పాటిస్తున్నారు అనే విషయంతప్ప మరో విషయం ఆధారంగా మనిషి మనిషీ మధ్యన ఎలాంటి వివక్ష, భేదభావం చూపేది లేదు. ఏ వ్యక్తి అల్లాహ్ ఆజ్ఞల్ని పాటించడంలో ఎంతవరకు విధేయుడో, ఆయన ఆగ్రహం పట్ల ఎంత భీతి కలిగి వుంటాడో అతను అంతే గౌరవనీయుడు, అంతే శ్రేష్ఠుడయిన వాడు. వంశం శ్రేష్ఠతకు ఇస్లామ్‌లో ఏ మాత్రం తావులేదు. వంశాలు కేవలం పరస్పర పరిచయానికి సంబంధించినంతవరకే ఉపకరిస్తాయి. అల్లాహ్ సందేశహరుడు (స) ఈ సందర్భంలో ఈ రుగ్మతల్ని సయితం సమాప్తం చేశారు. మానవుల మధ్య సర్వసమానతను ప్రకటించారు. నేటికీ ఇస్లామ్ తప్ప వేరే మతం ఏదీ ఈ సర్వసమానతను మానవాళికి ప్రసాదించలేకపోయింది.

## సర్వసామాన్యమయిన మన్నింపు

పైన పేర్కొన్న ప్రసంగం చేస్తున్నప్పుడు సమావేశమయిన సమూహంలో ఖురైషీలకు చెందిన గొప్ప గొప్ప విరోధులు తలబిరుసుతనం గలవారు వున్నారు. ఇస్లామ్‌ను నామ రూపాలు లేకుండా నిర్మూలించాలని ప్రతిజ్ఞ పూనిన వారు కూడా ఉన్నారు. ముస్లిములు తమ స్వస్థలాన్ని విడిచిపెట్టేంత వరకు వారిని బాధించినవారు కూడా వున్నారు. ముస్లిమ్‌ల ఆస్తులను తమ కైవసం చేసుకుని అనుభవిస్తున్నవారు సయితం వున్నారు. వారిలో ఇంకా, మహాప్రవక్త (స)ను దూషించినవారు, ఆయన నడిచే మార్గంలో ముళ్ళకంప పరచినవారు, ఆయన మీద చెత్త చెదారం వేసినవారు, చివరికి ఆయన్ని హత్య చేసేందుకు సంకల్పించిన వారు కూడా వున్నారు. మహాప్రవక్త(స) పినతండ్రిని హత్యచేసి ఆయన పచ్చి కాలేయాన్ని నమిలిన క్రూరులు సయితం వున్నారు. ఎంతో మంది ముస్లిములను వారు కేవలం ఏకైక దేవుని ఆరాధించే ప్రకటన చేసినందుకే అంతమొందించినవారు సైతం ఆ సమూహంలో ఉన్నారు. వారందరిని మహాప్రవక్త (స) ఒకసారి చూచారు. "చెప్పండి నేను ఈ వేళ మీతో ఏ విధంగా ప్రవర్తిస్తానో మీకు తెలుసా?" అని అడిగారాయన. వారంతా దైవప్రవక్త (స) మక్కాలో ప్రవేశించిన తీరును, ఇంతవరకు ఆయన ప్రవర్తనను తిలకించారు. కాబట్టి తక్షణం సమాధానం ఇచ్చారు.

"మీరు ఉత్తములయిన సోదరులు, ఉత్తముడయిన సోదరుని కుమారులు" ఇది విని కారుణ్యమూర్తి "వెళ్ళండి నేడు మీ మీద ఏ ఆరోపణ లేదు. మీరంతా స్వతంత్రులు!" అని సెలవిచ్చారు.

ముస్లింలు విడిచి వెళ్ళిన గృహాలను సయితం ఆయన తిరిగి ఇప్పించలేదు. ముహాజిర్లకు తమ హక్కును వదలుకొమ్మని ఆదేశించారు.

మహాప్రవక్త (స) చూపిన ఈ అసాధారణ ఔదార్యం, మంచి ప్రవర్తన ప్రభావం ఎలా పరిణమించిందంటే గొప్ప గొప్ప మొండిఘట్టాలు పాదాక్రాంతులయ్యారు. వారు, "మీరు వాస్తవంగా దైవసందేశహరులే. దేశాలు జయించే రాజు ఏ మాత్రం కాదు. మీరు ప్రచారం చేసే సందేశమే పరమ సత్యమయినది" అని ఎలుగెత్తి చాటారు.

ఇవి మక్కాను జయించిన తీరు తెన్నులు. ఈ విజయం భూమినీ, ఆస్తులనీ, ధనాన్నీ జయించేందుకు లభించిన విజయం కాదు. దీనిద్వారా హృదయ సీమల్ని జయించడం జరిగింది. ఇదే దిగ్విజయం!





# హునైన్ పోరాటం

## మక్కా విజయం - దాని ప్రభావం

మహాప్రవక్త (సల్లల్లాహు అలైహివసల్లమ్) ఉదారప్రవర్తన, ముస్లింల ప్రశాంత సహజీవనం వల్ల ఒకవైపున మక్కాలో జనులు తండోపతండాలుగా ఇస్లామ్ స్వీకరించ సాగారు. మరొకవైపున మక్కాను జయించిన కారణంగా దాని ప్రభావం అరేబియా అంతటా తెగలన్నింటిపైనా పడసాగింది. ఇస్లామ్ సందేశకుడు అధికారవాంఛ, ధన పిపాస కలవాడు ఎంత మాత్రం కాదని, కేవలం నిజమయిన అల్లాహ్ సందేశహరుడే అని వారు తెలుసుకున్నారు. అంతేకాక అప్పటికే ఇస్లామ్, దాని ప్రత్యేకతలు మరుగున ఉన్న విషయాలేమీ కావు. దాదాపు అరేబియా ప్రజలందరికీ ఈ సందేశం ఏమిటో బాగా బోధపడింది. ఇంకా గ్రహించే శక్తిగలవారు ఇదే పరమసత్యమని గ్రహించారు కూడా. కనుకనే మక్కా విజయానికి తరువాతే అరేబియాలో నలుమూలల నుంచి వివిధ తెగల ప్రతినిధి వర్గాలు వచ్చి ఇస్లామ్ స్వీకరించసాగారు. పరిస్థితుల ఈ స్వరూపం చూసి ఇస్లామీయ ఉద్యమం పట్ల ద్వేషం, క్రోధం మిగిలి ఉన్నవాళ్ళు లోలోన ఎంతో బాధపడ్డారు. వారి అంతర్యంలో సంకుచిత భావం, ద్వేషం, విరోధం మంటల్లా ప్రజ్వలించాయి. వారిలో 'హవాజున్', 'సఖీఫ్' అనే తెగలవారు ప్రముఖులు. వీరు పూర్వం నిత్యం పోరాడు కునే ప్రవృత్తిగలవారు. ఇస్లాం ప్రగతి చూసి ఎంతో కలవరపడిపోయారు. మక్కా తరువాత తమవంతే వస్తుందని గ్రహించారు. ఈ రెండు తెగల నాయకులు కలసి మంతనాలు జరిపారు. ఏది ఏమయినా ముస్లిములను ప్రతిఘటించవలసిందే, ఈ పెరుగుతున్న ప్రమాదాన్ని అణచవలసిందే. లేకపోతే మనకు క్షేమకరం కాదని నిర్ణయించుకున్నారు. వారు తమ నాయకుడి ఒకణ్ణి, 'మాలిక్ ఇబ్నెఔఫ్ నజరీ'ను తమ రాజుగా ఎన్నుకున్నారు. ముస్లిములను ఎదుర్కోవడానికి సన్నాహాలు చేయసాగారు. వారు తామేకాక ఇంకా ఇతర తెగలవాళ్ళను చాలా మందిని తమకు తోడుగా తీసుకున్నారు.

# హునైన్ లోయలో

మహాప్రవక్త (స)కు ఈ సమాచారం తెలియగానే సహాబాను పిలిచి సంప్రతించారు. రానున్న ఆపదను సకాలంలో అణిచివేసే ప్రయత్నం అత్యవసరం అని అందరూ అభిప్రాయ పడ్డారు. కనుక హి.శ. 8వ సంవత్సరం షవ్వాల్ మాసం 10 వ తారీఖున ఇంచుమించు 12 వేల మంది సిపాయిలతో ఆయన శత్రువుల్ని ఎదుర్కొనడానికి బయలుదేరారు. అప్పుడు ఇస్లామీయ సైన్యాన్ని, దాని సంఖ్యాబలాన్ని, ఆయుధ బలాన్ని శత్రువులు చూసీ చూడగానే భయపడి రంగం నుంచి పలాయనమవుతారని పూర్తి నమ్మకం కుదిరింది. ఇంకా కొందరు ముస్లింల నోటి నుండి "ఈ వేళ మనల్ని జయించేవాడెవడు?" అన్న అతిశయ వాక్కులు పెగిలాయి. కాని ఇలా భావించడం ముస్లిం ఉన్నత స్థానానికి ఎంతో భిన్నమయింది. ముస్లిం ఎన్నటికీ తన స్వశక్తి సామర్థ్యాలపై భరోసాచెయ్యడు. అతని శక్తి, విశ్వాసం అంతా కేవలం అల్లాహ్ కరుణానుగ్రహాల మీదే ఉంటాయి. దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ ఈ విధంగా సెలవిచ్చాడు.

"హునైన్ దినాన్ని కాస్త గుర్తుకు తెచ్చుకోండి. అప్పుడు మీరు తమ ఆధిక్యతపై ఎంతో గర్వపడ్డారు. కాని అది మీకు ఉపకరించలేకపోయింది. సువిశాలమయిన భూమి ఆ రోజు మీ కొరకు కుంచించుకు పోయిందా అన్నట్టు సంభవించింది. మీరు వెన్నుచూపి పలాయనమవసాగారు. అయితే అల్లాహ్ తన సందేశహరునిపైనా, ముస్లింలపైనా తన తరఫున ఓదార్పును, తృప్తిని అవతరింపజేశాడు. మీ కొరకు అగోచరమైన సైన్యాల్ని పంపాడు. తిరస్కారుల కొరకు శిక్షను అవతరింపజేసాడు. ఇదే తిరస్కారులకు తగిన శాస్తి"

(తౌబా : 25, 26)

హునైన్ లోయ మక్కా, తాయిఫ్‌ల మధ్యన ఉంది. అక్కడే ఈ యుద్ధం జరిగింది. ఇస్లామీయ సైన్యం శత్రువుల్ని ఎదిరించినప్పుడు శత్రువులు చుట్టుప్రక్కలున్న కొండలపై నుంచి ఒక్క సారిగా బాణాల వర్షం కురిపించారు. ముస్లింలు ఈ పరిస్థితిని ఊహించలేదు. కాబట్టి ఈ బాణాల కారణంగా వారిపంక్తులు చిందు వందు అయ్యాయి. కొంతసేపు వరకు నిలద్రొక్కుకోలేకపొయ్యారు. ఎందరో పల్లెవాసులైన తెగలవాళ్లు పరుగెత్తసాగారు. వీరిలో చాలామంది అప్పుడే విశ్వాసం స్వీకరించినవారవడంచేత వారికి శిక్షణ జరగలేదు. ఈ అలజడిలో మహాప్రవక్త (స) ఎంతో ప్రశాంతంగా రణరంగంలో నిలబడి ముస్లిములను పిలుస్తూనే ఉన్నారు. శత్రువుల్ని ఎదుర్కోవాలనీ యుద్ధరంగం నుంచి వెనుతిరగకూడదని పదే పదే హెచ్చరిస్తున్నారు. ఆయన స్థయిర్యాన్ని, దృఢసంకల్పాన్ని ఆయన చుట్టూ ఉన్న అనేక మంది దీక్షాపరులయిన సహచరుల నిలకడను చూసి చెల్లాచెదురవుతున్న ముస్లిములు తిరిగి నిలద్రొక్కుకోగలిగారు. తరువాత ప్రతివ్యక్తి ఎంతో ధైర్య సాహసాలతో శూరత్వంతో వైరుల్ని ఎదుర్కోసాగారు. మహాప్రవక్త (స), ఆయన సహచరుల ఈ స్థయిర్యాన్నే తన



తరఫున అవతరించిన ప్రశాంతత, తృప్తి అని పేర్కొన్నాడు అల్లాహ్. దీని పర్యవసానంగా దైవానుగ్రహంవల్ల కొంతసేపటికే రణరంగం పూర్తిగా మారిపోయింది. ముస్లిమ్‌లకు దిగ్విజయం ప్రాప్తించింది. దైవధర్మ తిరస్కారులు దాదాపు డెబ్బైమంది హతమయ్యారు. వేల మంది ఖైదీలయ్యారు.

# శత్రువులకు ఆశీస్సులు

తిరస్కారుల మిగిలిన సైన్యం పారిపోయి తాయిఫ్‌లో శరణుపొందింది. అది సురక్షిత మైన స్థలంగా భావించబడేది. మహాప్రవక్త (స) శత్రువుల్ని వెంబడించి తాయిఫ్‌ను చుట్టుముట్టారు. తాయిఫ్‌లో ఎంతో ఖ్యాతిగల దృఢమైన కోట కూడా ఉండేది. అందులోనే తిరస్కారులు తలదాచుకున్నారు. ఆ దిగ్బంధం సుమారు ఇరవై రోజులవరకు సాగింది. కాని మహాప్రవక్త (స) శత్రుబలం క్షీణించిందని పసిగట్టి, ఇక వాళ్ళకు తలెత్తే ధైర్యం లేదని గ్రహించారు. అందువల్ల దిగ్బంధం ముగించారు. వారి కోసం ఈ విధంగా ప్రార్థన చేశారు. 'దేవా! సఖీఫ్ తెగవారికి సన్మార్గాన్ని చూపు నన్ను కలుసుకునే సద్బుద్ధి వారికి కలిగించు".

కేవలం ధర్మ సంస్థాపన కొరకు కృషి సలిపే దైవప్రవక్త తప్ప మరెవరయినా ఇంత కరుణానురాగాలు కలవాడు కాగలడా! ఇలాంటి దుర్భర పరిస్థితిలోనూ విరోధులకై ఇలా ఆశీస్సులు పలుకగలడా?

# తబూక్ పోరాటం

## 'రోము' ప్రభుత్వంతో ఘర్షణ

అరేబియాకు ఉత్తరాన ఉన్న ప్రభుత్వాల్లో రోము ప్రభుత్వం గొప్పది. మక్కా విజయానికి పూర్వమే ముస్లిములకు దానితో ఘర్షణ ప్రారంభమయింది. సిరియా సరిహద్దుల దాపులో నివసిస్తున్న తెగలకు ఇస్లామ్ సందేశాన్ని అందజేయడానికి మహాప్రవక్త(సల్లల్లాహు అలైహివసల్లమ్) ఒక ప్రతినిధివర్గాన్ని ఉత్తర దిశకు పంపారు. ఆ తెగల వాళ్ళు సర్వసామాన్యంగా క్రైస్తవులు, రోము ప్రభుత్వాధికారానికి లొంగి జీవిస్తున్నారు. వారు ఇస్లామీయ ప్రతినిధి వర్గంలోని 15 మందిని చంపివేశారు. ప్రతినిధి వర్గ నాయకుడు హజ్రత్ కఅబ్ బిన్ ఉమర్ గిఫారీ తప్పించుకుని తిరిగి వచ్చారు. ఆ కాలంలోనే మహాప్రవక్త (స) బస్రా అధినేత పేరిట ఇస్లామ్ సందేశాన్ని పంపారు. కాని అతను మహాప్రవక్త (స) రాయబారి, హజ్రత్ హారిస్ బిన్ ఉమైర్‌ని చంపివేశాడు. బస్రా అధినేత కూడా రోము రాజు ఆజ్ఞలకు లోబడినవాడే. ఈ కారణాలవల్ల మహాప్రవక్త (స) హి.శ. 8వ ఏట జమాదిఉల్ ఊలాలో 3 వేల మంది ముస్లిముల సైన్యాన్ని సిరియా సరిహద్దుల వైపునకు పంపారు. ముస్లిములను గురించి మరీ చులకనగా భావించి కష్టపెట్టే ధోరణి మారాలనే ఉద్దేశ్యంతో అలా చేశారు. దీని సమాచారం పర్వేజ్‌కు అంది అతను సుమారు 2 లక్షల మంది సైనికుల్ని తీసుకుని ఎదిరించడానికి బయల్దేరాడు. ముస్లిములు ఈ విషయం తెలిసినప్పటికీ పురోగమిస్తూనే ఉన్నారు. రోము ప్రభువు ఆ రోజుల్లో "హమస్"లో ఉన్నాడు. అతను కూడా తన సోదరునికి ఒక లక్ష మంది సైనికులనిచ్చి పంపాడు. అయినా ముస్లిములు మాత్రం ముందుకు సాగుతూనే ఉన్నారు. చివరికి "మూతా" ప్రాంతంలో ఈ మూడు వేల మంది ముస్లిము శూరులు అంతగొప్ప రోము సైన్యాన్ని ఢీకొన్నారు. పైకి అగుపించే పరిస్థితుల రీత్యా ఈ చర్యవల్ల రావలసిన పరిణామం ఒక్కటే. అంతగొప్ప సైన్యాన్ని ఎదుర్కొన్న ముస్లింల స్వల్ప బలగం నామరూపాల్లేకుండా సమసిపోవలసింది. కాని దైవానుగ్రహం తోడైంది. రోమనుల అంత



భారీ సైన్యం ముస్లిమ్‌లకు ఏ మాత్రం కీడు చెయ్యలేక పోయింది. ఈ సంఘటన సామాన్యమైంది కాదు. చుట్టుప్రక్కల ఉన్న తెగలన్నీ ముస్లింలంటే కాస్త జడిసి మరీ మెలగసాగాయి. దూరదూరాల్లో ఉండే తెగలు సయితం ఇస్లాంను గురించి ఆలోచించ సాగాయి. వారిలో ఎన్నోవేల మంది ముస్లింలుగా మారారు.

అంతకంటే చెప్పుకోదగ్గ విషయమేమంటే రోము సైన్యంలోని ఒక కమాండర్ 'ఫర్వా బిన్ అమ్రుల్ జుజామీ' ఇస్లామ్ బోధనల్ని అధ్యయనం చేసి ముస్లిం అయ్యాడు. ఆయన తన విశ్వాస శక్తిని ఎంతో ధైర్యంతో నిరూపించారు కూడా. రోము ప్రభువు "కైసర్" ఆయన్ని బంధించి ఇస్లామ్ త్యజించి తన పదవిని తిరిగి పొందవచ్చు లేదా మరణశిక్షకు సిద్ధమయి ఉండవలసి ఉంటుందని భయపెట్టాడు. ఆయన తన హోదాను అధికారాన్ని కాలదన్ని పరలోక సాఫల్యానికి బదులు ప్రాపంచిక నాయకత్వం స్వీకరించ డానికి సిద్ధంగా లేనని బదులిచ్చారు. ఆయన్ని రోమన్ ప్రభుత్వం హతమార్చింది. ఈ సంఘటన వల్ల వేనవేల మంది ఇస్లామ్ నైతిక శక్తిని దాని ప్రాముఖ్యతను సునాయాసంగా అర్థం చేసుకోగలిగారు, ఈ కొత్త ఉద్యమం ద్వారా కట్టలు తెంపుకొని తమ వైపునకు పారుతూ వస్తున్న ప్రవాహాన్ని ఆపడం సాధ్యపడే పని కాదని కూడా వారు గ్రహించారు.

## కైసర్ సన్నాహాలు

ఆ మరుసటి సంవత్సరమే తనకు 'మూతా' పోరాటంలో ముస్లింల వల్ల కలిగిన పరాభవానికి ప్రతీకారం తీర్చుకోవడానికి 'కైసర్' సిరియా సరిహద్దుల వద్ద సైన్యాన్ని మోహరించసాగాడు. తన ఆధీనంలో ఉన్న అరబ్బు సైన్యాన్ని సమీకరించసాగాడు. మహాప్రవక్త (స)కు కూడా ఈ సమాచారాలు అందుతూనే ఉన్నాయి. అది ఇస్లామీయ ఉద్యమానికి ఎంతో సంకటావస్థ. ఆ పరిస్థితుల్లో ఏ మాత్రం ఏమరపాటుకు లోనయినా చేసినదంతా చేజారిపోతుంది. అప్పుడప్పుడే మక్కా హునైన్ యుద్ధాల్లో పరాజయం పాలయిన అరేబియా తెగలన్నీ తిరిగి తలెత్తుతాయి. మరొకవైపు, నిత్యం ఇస్లామ్ శత్రుగణంతో కలిసి కుట్రలు పన్నే మదీనాలోని కపటులు ఇస్లామీయ సమాజంలో మాపలేని కలతలను సృష్టిస్తారు. అలా జరిగితే ఇక ఉద్యమాన్ని, వ్యవస్థ వ్యవహారాలను కొనసాగనివ్వడం కష్టసాధ్యమై పోయేది. అలాంటి పరిస్థితుల్లో రోము ప్రభుత్వం చేసే దాడిని ఎదుర్కొనడం సామాన్య విషయం కాదు. అంతేకాక ఈ మూడు దాడుల పరంపరను భరించలేక ఇస్లామీయ ఉద్యమం తిరస్కార వ్యవస్థ యెదుట పరాజయం పొందే ప్రమాదం కూడా లేకపోలేదు. ఈ కారణాలవల్లనే మహాప్రవక్త (స) దైవికమైన తన అనుపమ దూరదృష్టిని ఉపయోగించి, మీనమేషాలు లెక్కవేస్తూ కూర్చోక భారీ ఎత్తున కదలివస్తున్న కైసర్ శక్తిని ఎదిరించడమే భావ్యమని నిర్ణయించారు. ఎందుకంటే ఆ సందర్భన ఏ కొంత దౌర్భల్యం చూపినా కాచినదంతా బూడిద పాలవుతుంది.

## ఎదిరించే నిర్ణయం

అప్పట్లో ముస్లిమ్‌లు యుద్ధ సన్నాహాలు చేయడానికి సమ్మతించడం ఎంతో కష్టంతో కూడుకున్న పని, దేశాన్ని కాటకం పట్టి పీడిస్తోంది. కణకణ మండే ఎండలు ఒక వైపున మాడ్చేస్తున్నాయి. ఖర్జూరపు పంటలు పండి కోతకు సిద్ధంగా ఉన్నాయి. ఇటు చూస్తే యుద్ధ సామగ్రి చాలినంతగా లేదు. బహు దూరప్రయాణం, అందునా, ఎదుర్కోవలసిన వాళ్ళేమో గట్టి బలగం గల శత్రువులు. పరిస్థితులు ఇలా ఉన్నప్పటికీ మహాప్రవక్త (స) వచ్చిపడిన విపత్తులో గల విషమ రూపాన్ని అంచనావేసి యుద్ధ ప్రకటన చేసివేశారు. దీన్ని చరిత్రలో 'తబూక్' పోరాటంగా పేర్కొంటారు. పోవలసింది ఎక్కడికో, ఎందుకో బాగా వివరించారు ముస్లింలందరికి.

ఇక్కడ ఒక విషయం గుర్తుంచుకోవాలి. ఇంతవరకు ఇస్లామీయ ఉద్యమం బహాటంగా ఎదుర్కొన్నది బయటి శత్రువుల్నే కనుక, మక్కా, హునైన్ విజయాల తరువాత బయటి శత్రువుల వ్యతిరేకత క్షీణించింది. అయితే ఇంత వరకు అంతర్గత శత్రువుల పట్ల (అంటే కపటుల పట్ల) సాధారణంగా మన్నింపు వైఖరినే వహించడం జరిగింది. అలా జరగటానికి కారణం అప్పటి వరకు ఉద్యమం ఇంటా బయటా శత్రువుల్ని ఎదుర్కొనేటంత శక్తిమంతం కాలేక పోవడమే. అదీకాక కపటుల్లో అందరూ ఒకే నైజానికి చెందినవారు కాదు. విశ్వాస బలహీనతకు లోనైనవారూ లేక కొన్ని సందేహాలు, సంశయాలకు గురయినవారు ఉన్నారు. ఇలాంటి వారికి కొంత వ్యవధి లభించడం అత్యవసరం. తద్వారా వారు బలహీనతను, సందేహాలు సంశయాలను దూరం చేసుకోగలుగుతారు. ఇకపోతే కేవలం ఇష్టపూర్వకంగా ఇస్లామ్‌ను నిర్మూలించే ఆలోచనతో ముస్లింలలో చొరబడినవారు మాత్రమే మిగిలిపోతారు. అందువల్లనే సుదీర్ఘకాలం వరకు ఈ వ్యక్తులకి నయానా భయాన నచ్చజెప్పే ప్రయత్నాలు జరిగాయి. తత్ఫలితంగా వారిలో ఏ మాత్ర మయినా సహృదయత ఉన్న వ్యక్తులు సన్మార్గాన్ని స్వీకరించసాగారు. ఇప్పుడు అలాంటి అవకాశాలు, వ్యవధులు అన్నీ ముగిసాయి. ముస్లిమ్‌లు దేశంలో తమకు ఎదురైన వ్యతిరేకతను చాలా వరకు అణిచివేశారు. ఇక దేశాంతర శక్తులతో పోరాటం ప్రారంభం కావస్తోంది. ఇలాంటి విషమపరిస్థితుల్లో అంతర్గత విరోధాల్ని అణగద్రొక్కడం ఎంతయినా అవసరమే. లేకపోతే వీరు బయటి విరోధులతో మంతనాలు జరిపి కుతంత్రాలు పన్ని, ఏ క్షణంలో ఎలాంటి ఉపద్రవం తెచ్చిపెడతారో చెప్పడానికి వీల్లేదు.

## కపటం పటాపంచలయింది

మునాఫిక్‌లను (కపటుల్ని) రూపుమాపాలంటే మొదట వారి బూటకపు నాటకమంతా బట్టబయలు కావాలి. వారు తమ ముఖాలపై వేసుకున్న ఇస్లామ్ ముసుగు తొలగాలి.



వారి నిజస్వరూపం ఇస్లామీయ సమాజంలో అందరికీ తెలిసిరావాలి. అప్పుడే వారు ముస్లిమ్‌ల వ్యవహారాల్లో ముస్లింలుగా నటిస్తూ జోక్యం కలుగజేసుకోవటానికి అవకాశం ఉండదు. చిత్తశుద్ధి కల ముస్లిమ్‌లకు ఉన్న స్థానం ముస్లిమ్ సమాజంలో వారికి ప్రాప్తం కాదు. తబూక్ పోరాటంలో పాల్గొనబోయే నిర్ణయం ప్రకటించగానే కపటులు బయటపడ్డారు. ఈ సందర్భంలో స్వచ్ఛమయిన విశ్వాసం కలవారు. చిత్తశుద్ధికల ముస్లిమ్‌లు నిండు హృదయంతో 'జిహాద్' కోసం సిద్ధమయ్యారు. యుద్ధసన్నాహాల కోసం ధనం లేకపోతే తమవద్ద ఉన్నదంతా తెచ్చి సమర్పించుకున్నారు. కొందరికి వాహనం లేకపోవడం వల్ల మహాప్రవక్త(స)తో ప్రయాణమయ్యే ఈ అవకాశం లభించకపోయేసరికి తమ దురదృష్టానికి వారు ఎంతో బాధపడ్డారు. అమితంగా వగిచారు. ఈ విధంగా ఇస్లామీయ సంఘంలో ఎంతమంది చిత్తశుద్ధి కలవారో తేటతెల్లమయింది.

యుద్ధ ప్రకటన వినగానే ఎవరి ఆంతర్యాల్లో విశ్వాసం లేదో వారి పైప్రాణాలు పైనే పోయినంతపనయింది. అలాంటి వారంతా రకరకాలుగా సాకులు చెప్పసాగారు. యుద్ధంలో పాల్గొనలేమని మహాప్రవక్త (స)వద్ద శెలవు తీసుకోసాగారు. మహాప్రవక్త (స) సయితం ఎంతో ఉదార బుద్ధిని కనబరిచారు. అలాంటి వారందరికీ శెలవు ఇచ్చివేశారు. అయితే ఈ కపటులు తాము ఈ యుద్ధంలో పోకుండా వుండటమే కాకుండా ఇతరుల్ని కూడా వెళ్ళకుండా ఆపారు. ముస్లిములను రకరకాలుగా వారించసాగారు. ఒకసారి "ఈ ఎండల్లో పోయి వట్టిగా ప్రాణాలు పోగొట్టుకోవలసిందే" అని, మరొకప్పుడు "రోమను రాజ్యంతో పోరాడి ఈ కొద్దిమంది ముస్లిములు బ్రతికి బయటపడతారా?" అని ఇంకొకప్పుడు "కళ్ళారా చూస్తూ సర్వనాశనాన్ని కొనితెచ్చుకోవడమేగా" అనీ ప్రచారం చెయ్యసాగారు.

మొత్తానికి ఈ యుద్ధప్రకటన మూలంగా కపటులు పూర్తిగా బయటపడి పోయారు. ఇప్పుడు అలాంటి వారికి ప్రతికూలంగా తగిన చర్య తీసుకోవడానికి అవకాశం లభించింది. కనుక మహాప్రవక్త (స) తబూక్ నుండి తిరిగి వచ్చాక ఆ విషయంలో శ్రద్ధ చూపారు.

## తబూక్‌కు ప్రయాణం

మహాప్రవక్త (స) హి.శ. 9వ ఏట 'రజబ్' మాసంలో ముప్ఫయివేల మంది సైనికులతో మదీనా నుండి బయలుదేరారు. సైనికుల్లో పదివేల మంది వాహనాలు కలవారు ఉన్నారు. ఒంటెల కొరతవల్ల ఒక్కొక్క ఒంటెపై ఎంతోమంది వంతుల వారిగా ఎక్కేవారు. పైగా తీవ్రమయిన ఎండలు, నీళ్ళ కొరత. కాని విశ్వసించిన వారు ఈ సందర్భంలో తమ విశ్వాసాన్ని, చిత్తశుద్ధిని, ప్రవక్తపట్ల విధేయతను, అల్లాహ్ మార్గంలో ప్రాణాలనైనా త్యాగం చేయగల ఉత్తేజాన్ని రుజువు చేసుకున్నారు. వీరి ఈ వైఖరికి అల్లాహ్ ప్రసన్నత, వారి సత్కార్యాలకు ఆయన స్వీకారం లభించింది. తత్ఫలితంగా మహాప్రవక్త (స) మదీనా నుండి ఏ లక్ష్యసిద్ధికై బయల్దేరారో అది ఎలాంటి యుద్ధం జరక్కుండానే సిద్ధించింది. తబూక్ వెళ్ళిన తర్వాత 'కైసర్' తన సైన్యాన్ని సరిహద్దుల నుండే మరలించుకున్నాడని, యుద్ధంలో

ఎదిరించే వారే లేరని వార్తలు అందాయి. అసలు జరిగిన విషయమేమంటే కైసర్ భారీ ఎత్తున యుద్ధ సన్నాహాలు చేస్తున్న సమాచారం తెలిసినప్పటికీ ముస్లిమ్‌లు స్వయంగానే పోరాడటానికి మదీనా నుండి నిర్భయంగా తరలి వస్తున్నారు. ఇంకా ముందుకు సాగుతూనే వున్నారు. ఇది గమనించి ఇక తన సైన్యాన్ని వెనక్కి మరల్చడమే శ్రేయస్కరమని భావించాడు కైసర్. ఎందుకంటే తానంతకుముందే 'మూతా' యుద్ధంలో కేవలం మూడువేల మంది ఇస్లామీయ యోధులు రెండు లక్షల సైన్యాన్ని ఎదిరించి ఎలా తమ శౌర్యాన్ని నిరూపించు కున్నారో కళ్ళారా చూశాడు. అందువల్ల మహాప్రవక్త (స) స్వయంగా ముప్పయివేల సైన్యంతో వచ్చేస్తున్నారని విన్నప్పుడు ఈ ప్రవాహాన్ని అరికట్టడానికి ప్రయత్నించడంలో ఔచిత్యం ఏమీ లేదని, యుద్ధంలో క్షేత్రం ముస్లిముల హస్తగతమయితే తన పేరు ప్రతిష్టలు దెబ్బతింటాయని కైసర్ భావించాడు.

## తబూక్‌లో....

కైసర్ ఈ విధంగా రంగం నుంచి నిష్క్రమించడమే మేలని మహాప్రవక్త (స) భావించారు. అతన్ని వెంబడించడం కన్నా ఆ ప్రాంతంలో తమ ప్రభావాన్ని పటిష్టం చేసు కోవడమే ఉచితమని తలచారు. కనుక ఆయన అక్కడ ఇరవయి రోజులు మకాం వేశారు. ఆ వ్యవధిలో ఇస్లామీయ ప్రభుత్వానికి రోము రాజ్యానికీ మధ్య రోము పలుకుబడిలో వున్న చిన్న చిన్న ప్రాంతాల్ని ఇస్లామీయ ప్రభుత్వానికి సామంత రాజ్యాలుగా కప్పం చెల్లించుకునేలా నిర్ణయించుకున్నారు. ఈ విధంగా ఇంతవరకు రోము రాజుతో సహకరిస్తూ ఉండిన అక్కడి అరేబియా తెగలు ఇస్లామీయ రాజ్యకూటమిలో చేరాయి.

## అబూ ఆమిర్ కుతంత్రాలు

మహాప్రవక్త (స) మదీనాకు దయచేయడానికి ముందే మదీనాలో 'అబూ ఆమిర్' అనే క్రైస్తవ సన్యాసి తపోనిష్టలో ఎంతో ఖ్యాతి చెందాడు. జనులు అతన్ని ఎంతగానో గౌరవించేవారు. మహాప్రవక్త (స) మదీనాకు విచ్చేసిన తరువాత అతను, తన భక్తీ తత్పరత, పాండిత్యం ఫలితంగా ఈ సన్మార్గ కాంతిని గ్రహించి దైవభక్తికి సరియైన మార్గాన్ని అందరికంటే ముందే స్వీకరించవలసింది. కాని పాండిత్యం, దైవభక్తుల తప్పుడు భావన, సాంప్రదాయికమైన ధర్మ పరాయణతలు మనిషిని సాధారణంగా సన్మార్గాన్ని స్వీకరించకుండా చేస్తాయి. అలాగే అబూఆమిర్ కూడా ఇస్లామీయ సందేశం పట్ల వక్రభావమే గ్రహించాడు. అతని దృష్టి తన ధార్మిక వ్యాపారంపై బడింది. ఇక ఈ కొత్త ఉద్యమం బలపడితే తన సన్యాసం, మతగురువు పదవి చెలామణి కానేరవని తెలుసుకున్నాడు. అందుకే అతను ఈ ఉద్యమానికి వ్యతిరేకంగా అందరికంటే ముందే లంఘించాడు.

ప్రప్రథమంలో, ఈ ఉద్యమం మూన్నాళ్ళ ముచ్చటని, ఇలాంటి దైవభక్తిని, ఈ ధార్మిక నిబంధనల్ని జనులు స్వీకరించరని ఆశించాడు. కాని బద్ర్ యుద్ధంలో ఖురైషీలు


దైవ గృహంలో ఆరాధకులు బారులు తీరి నమాజ్ చేస్తున్న దృశ్యం



కాబా దైవ గృహం. కాబా - హజ్ కాలంలో దైవారాధకుల సమూహం



పరాజయం పొందగానే అతను విలవిల్లాడాడు. తన అంతర్యంలోని మంటల కారణంగా అతను కురైషీలను ఇంకా ఇతర తెగల వాళ్ళని ఇస్లామ్‌కు ప్రతికూలంగా రెచ్చగొట్టడానికి శాయశక్తులా ప్రయత్నించాడు. ఉహుద్ సంగ్రామంలోను, కందకం పోరాటంలోను ముస్లిమ్‌లు ఎదుర్కొన్న పరిస్థితులకు చాలా వరకు ఈ సన్యాసి కూడా కారకుడే. ఈ క్రైస్తవ సన్యాసి ముస్లిమ్‌లకు ప్రతికూలంగా బహుదైవారాధకులతో కుతంత్రాలు పన్నడంలోను ఏకేశ్వరదీపికను ఆర్పివేయడానికి బహుదైవవాదన గాలిదుమారాలు లేపడంలోను ఎలాంటి అవకాశాన్నీ జారవిడుచుకోలేదు. కాని క్రమంగా ఇది ఊదితే ఆరిపోయే దీపం కాదనీ, ఇస్లామ్ మాత్రమే అరేబియా మొత్తాన్నీ అదుపులో ఉంచుకోగల శక్తి అని తెలుసుకున్నాడు. ఇక ఈ 'దైవభక్తు'ని కలవరానికి హద్దులేదు. ఆగలేక రోము దేశానికి ప్రయాణమయ్యాడు. అక్కడికి వెళ్ళి అపాయమని ఎర్రజెండా చూపిస్తే కైసర్ శ్రద్ధ తీసుకుని ఉవ్వెత్తున లేచే ఈ విప్లవతరంగాలను అరికట్టగలడని ఆశించారు.

అబూ ఆమిర్ జరిపిన ఈ కృషిలో మదీనాలోని కొందరు కపటులు తోడయ్యారు. వారంతా పరస్పరం సమాలోచనలు జరిపి ఇస్లామీయ ఉద్యమాన్ని తుదముట్టించే ప్రయత్నాలు చేసేవారు. ఈ సన్యాసి సలహాల పైనే మదీనా మునాఫిక్‌లు కొందరు తమకుగాను మస్జిద్ ఒకటి వేరుగా నిర్మించుకున్నారు. వారక్కడ చేరి ముస్లింలను అణచివేసే ఎత్తుగడలు వేసేవారు.

## కపటుల ఎత్తుగడ

మహాప్రవక్త (స) తబూక్ యుద్ధానికి మదీనా నుండి బయలు దేరినప్పుడు, మనస్ఫూర్తిగా ముస్లిమ్‌లు కాకపోయినా తమ స్వంత ప్రయోజనాల కొరకు ఇస్లామీయ సమాజంలో వచ్చి చేరిన వ్యక్తులంతా మదీనాలోనే ఉండిపోయారు. ముస్లిమ్‌లు బ్రతికి ప్రాణాలతో తిరిగి రాలేరని వీరందరి గట్టి నమ్మకం. వారి ఈ అభిప్రాయానికి కారణం ఏమంటే, కొంతమంది తీవ్రమైన వాతావరణానికి తట్టుకోలేక ప్రయాణపు కష్టాలకు ఆహుతి అవుతారని, అలా కాకపోయినా అంతులేని కైసర్ సైన్యం ఎదుట వారంతా నామరూపాల్లేకుండా సమసిపోతారని వారు భావించారు. కపటులు నిర్మించుకున్న ప్రత్యేక మస్జిద్ (మస్జిద్ జిరార్)లో వీరంతా నమాజ్ నెపంతో ముస్లిమ్‌లతో వేరుపడి సమావేశమై రహస్య సమాలోచనలు జరుపుకునే వారు. ఈ సందర్భంలో వీరు ఇస్లామీయ ఉద్యమాన్ని నష్టపరచడానికి ఎన్నెన్నో కుట్రలు పన్నారు. చివరికి, తబూక్ యుద్ధంలో, వారి నమ్మకం ప్రకారం, ముస్లిమ్‌లకు ఓటమి తప్పదు కనుక, వారు అబ్దుల్లాహ్ బిన్ ఉబయ్‌ని మదీనా రాజుగా చేసుకోవాలని కూడా నిర్ణయించుకున్నారు.

కాని దైవ నిర్ణయాలే వేరు. వాస్తవానికి ఇస్లామ్ ఓటమి జరుగుతుందనే అవిశ్వాసుల ఆశలు అడియాసలయ్యాయి. ఆ ఖుతే తబూక్ యుద్ధం జరక్కుండానే ముస్లిమ్‌లకు విజయం ప్రాప్తించిందని వినగానే ఇస్లామ్ శత్రువులంతా నిస్పృహతో క్రుంగిపోయారు. ఇక వారి ఆశలకు ఆధారం లేశమయినా మిగల్లేదని తెలుసుకోవడానికి ఎంతో సమయం పట్టలేదు.

## తబూక్ తరువాత

తబూక్ నుండి తిరిగి వచ్చాక చేయవలసిన ముఖ్యమైన పనులు మూడు మహాప్రవక్త (స) ఎదుట ఉన్నాయి:

★ మునాఫిక్‌ల పట్ల విస్పష్టమయిన విధానాన్ని అమలు జరపడం, వారుచేసే కుతంత్రాల బారి నుండి ఇస్లామీయ ఉద్యమాన్ని కాపాడే ఏర్పాట్లు చెయ్యడం.

★ నిజవిశ్వాసుల సుశిక్షణ, వారి స్వరూప స్వభావాల సంస్కరణ సముద్ధరణ. ఈ సంస్కరణ జరక్కపోతే మహాప్రవక్త (స) పర్యవేక్షణలో తయారవుతున్న ఈ శిష్టజనుల సంఘసభ్యులు అతి త్వరలో తమ భుజస్కంధాలపై పడబోయే సత్యసాక్ష్యం కార్యభారాన్ని మోయలేరు.

★ దారుల్ ఇస్లామ్‌గా కొత్తగా రూపొందిన ఇస్లామీయ రాజ్యానికి ప్రాతిపదిక అయిన రాజనీతిని ప్రకటించడం.

## మునాఫిక్‌ల వ్యవహారం

మహాప్రవక్త (స) ఇంకా తబూక్ నుండి తిరిగి మదీనాకు రాక మునుపే మార్గంలోనే తౌబా సూరా అవతరించింది. మదీనా చేరిన తరువాత ఆచరించవలసిన ఎన్నో ఆదేశాలు అల్లాహ్ తన సందేశహరునికి అందులో అనుగ్రహించాడు. ఇంతవరకు మునాఫిక్‌ల పట్ల అవలంబించిన ఉదారవిధానాన్ని పూర్తిగా మార్చివేయవలసిందిగా అల్లాహ్ తరఫున ఆదేశించడం జరిగింది. ఈ విధానం రీత్యానే వారు తమ ప్రాణాన్ని దక్కించుకోడానికి తబూక్ సంగ్రామంలో పాల్గొనక పోయినందుకు సాకులు చెబితే అవి స్వీకరించబడ్డాయి. కాని ఇప్పుడు వారితో అతి కఠినంగా ప్రవర్తించవలసిందని అతిస్పష్టమయిన ఆదేశాలు అందాయి. ఇంకా వీరు తమ బూటకపు విశ్వాసాన్ని నిజమని నిరూపించడానికిగాను ధనం సమర్పిస్తే దాన్ని స్వీకరించకూడదనీ, వారిలో ఎవరయినా చనిపోతే వారి జనాజా నమాజ్ చెయ్యకూడదని, ముస్లిమ్‌లు తమకు వ్యక్తిగత స్థాయిలోను కటుంబ స్థాయిలోనూ వారితో ఉన్న బాంధవ్యాల మూలంగా వారితో స్నేహం సుహృద్భావాలతో మెలగకూడదని ఆదేశించటం కూడా జరిగింది.

## జిరార్ మస్జిద్

అప్పట్లో మదీనాలో రెండు మస్జిద్‌లుండేవి. ఒకటి పట్టణ పొలిమేరల్లో ఉండే 'మస్జిదె కబా' రెండవది 'ప్రవక్త మస్జిద్'. ఇది నగరం మధ్యలో ఉండేది. ఇవి ఉండగా మూడవ మస్జిద్ వాస్తవానికి అవసరం లేకపోయింది. కాని కపటులు కొందరు, ముసలివారు వికలాంగులు ఈ రెండు మస్జిద్‌లకు పోవడం కాస్త ఇబ్బందిగా ఉంది అనే సాకుతో మరొక



మస్జిద్ నిర్మించారు. మహాప్రవక్త (స) ఒకసారి వచ్చి అందులో నమాజ్ చేస్తే దాని ప్రారంభోత్సవం శుభప్రదంగా జరిపినట్టు ఉంటుందని మహాప్రవక్త (స)తో వేడుకున్నారు. "ఇప్పుడైతే తబూక్ యాత్రపై వెళ్ళుతున్నాను, తిరిగి వచ్చాక దాని గురించి ఆలోచిద్దాం" అని మహాప్రవక్త (స) చెప్పారు. అయితే తిరుగు ప్రయాణంలో అవతరించిన దైవవాణిలో ఆ మస్జిద్‌లో నమాజ్ చేయకూడదని అతిస్పష్టంగా నిషేధాజ్ఞ యివ్వటం జరిగింది. ఇంకా, ముస్లిములకు ప్రతికూలంగా మంతనాలు జరపడానికి ఒక మాటుగా ఆ స్థలం ఉపయోగించబడుతోందని, అందువల్ల అందులో మహాప్రవక్త(స) నమాజ్ చెయ్యడం ఏమాత్రం తగదని వివరించటం జరిగింది. కనుక కొందరు మదీనా వెళ్ళి మహాప్రవక్త (స) అక్కడికి చేరే ముందు దాన్ని పడగొట్టవలసిందిగా ఆజ్ఞాపించారు. ఈ విధంగా ఆ మస్జిద్‌ను పడగొట్టడం ద్వారా, మునాఫిక్‌ల ఎడల ముస్లిముల ప్రవర్తన ఏ విధంగా ఉండబోతోందో అతిస్పష్టంగా వెల్లడయింది. దాని మీదట ఆ విధంగానే వారితో ప్రవర్తించడం జరిగింది.

## విశ్వాసుల సుశిక్షణ

ఇస్లామీయ ఉద్యమం విశ్వజనీన స్థాయిలో గొప్ప ఉద్యమంగా విలసిల్లే సమయం ఆసన్నమయింది. అరేబియాలోని ఈ ముస్లిములు, ఇస్లామ్ గురించి ఏమీ తెలియని ప్రపంచానికి, అల్లాహ్ ఆమోదాన్ని పొందిన ఈ ధర్మ సందేశాన్ని పరిచయం చేసే కార్యక్రమం ప్రారంభించడానికి ఇక ఎంతో కాలం పట్టదు. ఇలాంటి తరుణంలో ఉద్యమకార్యకర్తల్లో ఉండే అతి స్వల్పమయిన లోటుపాట్లు, బలహీనతలు సయితం పెద్ద అవాంతరంగా పరిణమించగలవు. అందుకే ఈ సమయంలోనే విశ్వసించిన వారి సుశిక్షణను సంపూర్ణం చెయ్యడం పట్ల దృష్టిని కేంద్రీకరించటం జరిగింది. వారిలోని విశ్వాస బలహీనతని ప్రతిబింబించే ఒక్కొక్క అంశాన్ని వెదకి వెదకి తీయడం జరిగింది. దాన్ని దూరం చేసేందుకు తాకీదు చెయ్యబడింది.

తబూక్ యుద్ధం సందర్భంలో, అంతర్యంలో అణుమాత్రం విశ్వాసంకానీ, ఇస్లామ్ పట్ల ప్రేమకానీ లేని కొందరు వెనక్కి తగ్గారు. అలాగే కొందరు నిజమైన ముస్లిములు, చిత్తశుద్ధికల విశ్వాసులు కూడా తాత్కాలిక బలహీనతకు లేక అలసత్వానికి లోనయి రంగంలో విశ్వసించిన వారికి తోడునిలవలేక పొయ్యారు. ఇలాంటి వారి అవగుణాలను చక్కదిద్దడానికి ఎంతో కఠినమైన విధానం అవలంబించటం జరిగింది. ఇకపై అలాంటి బలహీనత కనబరచ కుండా చెయ్యటానికి ఈ విధానాన్ని అవలంబించడం అనివార్య మయింది. ఈ సందర్భంగా ముగ్గురు సహాబా మహనీయుల పట్ల అవలంబించబడిన వైఖరి గొప్ప గుణపాఠం నేర్పుతుంది. వారు, హజ్రత్ కఅబ్ బిన్ మాలిక్, హిలాల్ బిన్ ఉమయ్యా, మూరారా బిన్ రబీ (రజి అల్లాహు అన్‌హుమ్.) వీరి గాథను తెలుసుకుంటే, మహాప్రవక్త (స) తన సహచరుల సుశిక్షణకై అవలంబించిన పద్ధతి ఏమిటో అవలీలగా అర్థం చేసుకోవచ్చు.

ఈ ముగ్గురు సహాబా చిత్తశుద్ధి గలవారే. ఇంతకుముందు వారి చిత్తశుద్ధికూడా అనుభవపూర్వకంగా రుజువైనదే. కాని కేవలం బద్ధకం వల్ల వారు తబూక్ పోరాటంలో పాల్గొనలేకపోయ్యారు. అందువల్ల వారిని అతి కఠినంగా నిలదీసి అడగటం జరిగింది. మహాప్రవక్త (స) తబూక్ నుండి తిరిగి వచ్చిన పిదప ఈ ముగ్గురితో ఎవరూ మాట్లాడ కూడదని ముస్లిములందరినీ ఆదేశించారు. 40 రోజులు ఇలా గడిచాక వారి భార్యల్ని సయితం వారికి దూరంగా ఉండవలసిందిగా ఆజ్ఞాపించారు. 50 రోజుల తరువాత అల్లాహ్ వారి తౌబాను, (పశ్చాత్తాపాన్ని) స్వీకరించాడు. అల్లాహ్ వారిని మన్నించినట్లు దైవవాణి అవతరించింది. ఈ విషయం తౌబా సూరాలో ఉంది. వారిలో ఒకరయిన హజ్రత్ కఅబ్ బిన్ మాలిక్ గారి వృత్తాంతం వివరంగా వారు స్వయంగా వినిపించినట్లు హదీసు గ్రంథాల్లో వుంది. దాని ద్వారా మంచి గుణపాఠం నేర్చుకోవచ్చు. ఆయన ఇలా చెప్పారు:

## హజ్రత్ కఅబ్ వృత్తాంతం

"మహాప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లమ్) ముస్లింలను తబూక్ పోరాటానికి సమాయత్త పరుస్తున్నప్పుడు నేను కూడా ఇక ప్రయాణానికి సిద్ధమవ్వాలని సంకల్పం చేసుకున్నాను. కాని బద్ధకంవల్ల ఇప్పుడే తొందర ఏముంది? పోవలసి వచ్చినప్పటికి సిద్ధమవడం ఎంతో సేపు పట్టదు అని జాగు చేసే వాణ్ణి. ఇలాగే కాలం దాటుకుంటూ పోయింది. చివరికి బయలుదేరే సమయం కూడా ఆసన్నమయింది. నేనయితే సిద్ధంగా లేను. సైన్యం బయలుదేరిన తరువాత రెండు రోజుల్లో బయల్దేరినా చాలు, నేను అందుకోగలనని తాత్సారం చేశాను. ఇలాగే కాలయాపన జరిగింది. కడకు నేను పోలేకపొయ్యాను.

"ఆ తరువాత నా చుట్టూ ఉన్న వారిని చూసుకుంటే, నాలాగే జిహాద్‌లో పాల్గొనక ఉండిపోయిన వారంతా మునాఫిక్‌లు (కపటులు), బలహీనులు, వికలాంగులు తప్ప మరెవ్వరూ లేరు. ఇది చూసి నా మనస్సు చివుక్కుమన్నది. ఎంతో బాధపడ్డాను. నా అవస్థను చూసుకుని ఎంతో క్రుంగిపోయాను.

"మహాప్రవక్త (స) ప్రయాణం నుండి తిరిగి వచ్చాక యథాప్రకారం మస్జిద్‌లో రెండు రకాతులు నమాజ్ చేశారు. తరువాత జనుల్ని కలుసుకోవడానికి కూర్చున్నారు. అప్పుడు కపటులు వచ్చి ఒక్కొక్కరే తాము జిహాద్‌లో పాల్గొనలేకపోయినందుకు కుంటి సాకులు చెప్పుకోసాగారు. ప్రమాణాలకు ప్రమాణాలు చేసి తమ అశక్తతను, ఇబ్బందుల్ని వెలిబుచ్చి మహాప్రవక్త(స)ను నమ్మించే ప్రయత్నం చేసేవారు. ఇలాంటి వారు 80 మంది కంటే అధికంగానే వున్నారు. మహాప్రవక్త (స) వారి కట్టు కథలు అన్నీ విన్నారు. వారు బాహ్యంగా కనబరచిన అవాంతరాలన్నింటినీ స్వీకరించి వారి అంతర్యాన్ని దైవం పైన వదిలిపెట్టారు. వారిని క్షమించి వేశారు. ఇక నా వంతు వచ్చింది. నేను ముందుకు వచ్చి



మీనాలో హజ్ యాత్రికులు



అరఫాత్ మైదానం - ఇక్కడే అంతిమ దైవ సందేశ హరుడు తమ అంతిమ హజ్ ప్రసంగం చేశారు.



సలాము చేశాను. ఆయన నా వైపు చూసి మందహాసం చేశారు, "చెప్పండి, మీకు ఏ అవాంతరం వాటిల్లిందో" అని అడిగారు. "దేవుని సాక్షిగా చెబుతున్నాను, ప్రాపంచిక వ్యక్తుల ఎదుటనయితే ఏదో ఒక సాకు చెప్పి ఒప్పించే వాణ్ణి. కాని నాకు గట్టి నమ్మకముంది. ఇప్పుడు మీ ముందు ఏదో కట్టు కథ చెప్పి ప్రస్తుతానికి మిమ్మల్ని ఒప్పించుకున్నా అల్లాహ్ మీకు నా గురించి అసలు సంగతిని తెలిపి మీకు నాపై ఆగ్రహం కలుగజేస్తాడు. కాని ఉన్నది ఉన్నట్టు విన్నవించుకుంటే మీరు ప్రస్తుతానికి ఆగ్రహించినా దైవం నా మన్నింపు కోసం ఏదయినా దారి చూపిస్తాడని ఆశ ఉంది. అసలు విషయం ఏమంటే, నేను చెప్పుకోడానికి మొండిసాకు ఏదీ లేదు. వెళ్ళటానికి ఏ అవాంతరమూ లేకపోయింది" అని విన్నవించుకున్నాను. "అయితే, ఇక లే, అల్లాహ్ నీ విషయంలో ఏదో నిర్ణయం చేసే వరకు వేచి ఉండు" అని ఆదేశించారు మహాప్రవక్త (స). నేను లేచి వచ్చి నా తెగ వారితోపాటు కూర్చున్నాను. నాతోనే ఇంకా ఇద్దరు వ్యక్తులు (మురారా బిన్ రబీ, హిలాల్ బిన్ ఉమయ్యా) కూడా నేను విన్నవించుకున్న రీతిలోనే వాస్తవాన్ని విన్నవించు కున్నారు.

ఆ తరువాత మహాప్రవక్త (స) మా ముగ్గురితో ఎవరూ మాట్లాడకూడదని ఆజ్ఞాపించారు. వారిద్దరయితే ఇంటిలోనే ఉండిపోయ్యారు. కాని నేను బయటికి వచ్చేవాణ్ణి. జమాఅత్‌తో నమాజ్ చేసేవాణ్ణి. బజార్లలో తిరిగే వాణ్ణి. కాని నాతో ఎవరూ మాట్లాడేవారు కారు. లోకమే మారిపోయిందా అన్నట్టు, నేను యేదో పరదేశినయినట్టు, ఇక్కడ నన్ను ఎరిగినవారు ఎవరూ లేనట్టు తోచసాగింది. నమాజ్ కోసం మస్జిద్‌కు వెళ్ళేవాణ్ణి. ప్రవక్త శ్రేష్ఠులకు సలామ్ చేసి సమాధానంగా ఆయన పెదాలు కదులుతాయా అని నిరీక్షిస్తూ ఉండిపొయ్యేవాణ్ణి. నమాజ్‌లో మహాప్రవక్త వైపు క్రీగంట చూసేవాణ్ణి. ఆయన నా వైపు ఎలా చూస్తున్నారో చూడాలని. కాని నేను నమాజ్ చేసే అంతవరకూ ఆయన నా వైపు చూస్తూఉండే వారు. కాని నేను సలామ్‌తో నమాజ్‌ను ముగించగానే ఆయన చూపు మరల్చుకొనేవారు. ఒకరోజు బేజారెత్తి మా బాబాయి కుమారుడు, చిన్ననాటి మిత్రుడయిన అబూకతాదా వద్దకు వెళ్ళి ఆయన తోట గోడ ఎక్కి ఆయనకు సలామ్ చేశాను. కాని ఆ సజ్జనుడు సమాధానమే ఇవ్వలేదు. నేనప్పుడు "అబూకతాదా! నేనడుగుతున్నాను, దేవుని సాక్షిగా చెప్పు, నేను అల్లాహ్ యెడల ఆయన ప్రవక్త యెడల ప్రేమ కలవాడిని కానా?" అనడిగాను. అతను పలకలేదు. మళ్ళీ అడిగాను, అతను సమాధానమివ్వలేదు. మూడవసారి, "అల్లాహ్‌కూ, ఆయన సందేశహరునికే తెలుసు" అని మాత్రం చెప్పి మౌనం వహించాడు. నాకు కళ్ళ నీళ్ళ పర్యంతమయింది. ఇక భరించలేక గోడదిగి వచ్చేశాను. ఆ రోజుల్లోనే ఒకసారి బజారులో వెళుతుండగా ఒక సిరియన్ వ్యక్తి గస్సాన్ రాజు పంపిన ఉత్తరాన్ని పట్టుబట్టలో చుట్టి నాకు ఇచ్చాడు. నేను దానిని తెరచి చదివాను. అందులో "మీ నాయకుడు నీకు ఎంతో అన్యాయం చేస్తున్నాడని విన్నాము. నీవు మామూలు మనిషివి కావు.

నీవు మా దగ్గరికి వచ్చెయ్యి. మేము నిన్ను తగురీతిలో సత్కరించి గౌరవిస్తాము" అని ఉంది. "గోరుచుట్టుపై రోకటి పోటులా ఇదొకటి" అనుకున్నాను. తక్షణం ఆ పత్రాన్ని చించేసి మండుతున్న పొయ్యిలో పారవేశాను.

"ఇలా 40 రోజులు గడిచాక మహాప్రవక్త (స) తరఫున ఆదేశం వచ్చింది. భార్యతో సయితం దూరంగా ఉండాలని, విడాకులు ఇవ్వమంటారా? అని అడిగాను. కాదు దూరంగా మాత్రం ఉండాలి అని సమాధానం వచ్చింది. నేను నా భార్యను పుట్టింటికి పంపివేశాను, "అల్లాహ్ ఈ విషయంలో ఏదో ఒకటి నిర్ణయించేవరకు వేచి ఉండమని" ఆమెతో అన్నాను.

"యాభయ్యో దినం నేను మా మిద్దెపై కూర్చొని ఉన్నాను. నా పరిస్థితిని తలచుకుంటూ ఉంటే, నాకు విసుగుతోపాటు ప్రాణాలపై వెగటుకూడా కలుగసాగింది. అకస్మాత్తుగా ఎవరో బిగ్గరగా అరిచారు: "కఅబ్ బిన్ మాలిక్! నీకు శుభం!" అని వినబడింది. వినగానే సజ్దాలో పడిపొయ్యాను, ఇది నా మన్నింపు ప్రకటన అని మాత్రం అర్థమయ్యింది. ఇక జనులు తండోపతండాలుగా పరుగెత్తి వస్తున్నారు. ప్రతివాడు ఇతరుల కంటే ముందు వచ్చి అభినందిస్తున్నాడు. "నీ తౌబా, పశ్చాత్తాపభావం దైవ సన్నిధిలో స్వీకరించబడింది" అంటున్నాడు. నేను లేచి నేరుగా ప్రవక్త (స) మస్జిద్‌వైపుకు బయల్దేరాను. అక్కడ దైవప్రవక్త (స) ముఖారవిందం ఆనందంతో నిగనిగలాడటం గమనించాను. సలామ్ చేశాను.

"నీకు శుభం, అభినందనలు, ఈ దినం నీ జీవితంలో ఒక పర్వదినం!" అని సెలవిచ్చారు.

"ఈ మన్నింపు ప్రవక్త తరఫున అనుగ్రహింపబడిందో దైవం తరఫునో......" అనడిగాను.

దానికి సమాధానంగా ఆయన "దైవం తరఫునే" అంటూ దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఈ పశ్చాత్తాపాన్ని స్వీకరిస్తూ అవతరింపజేసిన ఆయత్‌లు వినిపించారు.

"దైవప్రవక్తా! నా పశ్చాత్తాపంలో, నాకున్న సర్వస్వాన్నీ దైవ మార్గంలో దానం చేయడం కూడా ఉంది" అని నేను విన్నవించుకున్నాను.

"కొంత ఉంచుకో, అదే శ్రేయస్కరం" అని సెలవిచ్చారు మహాప్రవక్త (స).

"ఈ ఆనతి ప్రకారం నేను నా ఖైబర్ వాటాను నా కోసం ఉంచుకుని మిగతాదంతా దానం చేసివేశాను. ఆ తరువాత, ఏ నిజం చెప్పడం మూలంగా అల్లాహ్ నన్ను మన్నించాడో జీవితాంతం ఆ నిజంపై నిలకడగా ఉంటానని, దాన్ని ఆసరాగా తీసుకుని జీవిస్తానని దైవంతో ప్రతిజ్ఞ చేసుకున్నాను. తదనుగుణంగానే నేటి వరకు నేను తెలిసీ ఏమాటా యదార్థానికి విరుద్ధంగా పలకలేదు. ఇకపైనా అల్లాహ్ నన్ను ఈ విషయంలో రక్షిస్తాడని ఆశిస్తున్నాను".



## ముస్లిం సమాజం ప్రత్యేకతలు

ఈ సంఘటన వివరాల ద్వారా సహాబా మహనీయుల సమాజం, దాని రూపు రేఖలు మన ముందు సాక్షాత్కరిస్తాయి. వీటికి ప్రతి ముస్లిమ్ తన అంతర్యంలో చోటివ్వాలి. వీటివల్ల ఇస్లామీయ ఉద్యమం దాని అనుయాయుల స్వభావాన్ని ఎలా మలచుతుందో బోధపడుతుంది.

వీటిలో మొదటి విషయమేమంటే, ఇస్లామ్, తిరస్కారాల సంఘర్షణ ఆసన్నమయి నప్పుడు అది విశ్వసించిన వారికి ఎంతో సంక్లిష్టమయిన కాలం. ఆ తరుణంలో, అశ్రద్ధ కనబరిస్తే జీవితాంతం చేసినదంతా, ఏదో ఒక చిన్న నిర్లక్ష్యం వల్ల సర్వనాశనమయి పొయ్యే ప్రమాదం ఉంది. ఎందుకంటే ఇలాంటి సమయాల్లో విశ్వసించిన వ్యక్తి ఇస్లామ్ కొరకు పాటుపడకపోతే అతడు ఏ దుష్ట సంకల్పంతోనో, దుర్బుద్ధితోనో అలా చెయ్యక పోయినా, జీవితంలో ఒకేసారి అలా జరిగినా అతని ఈ ప్రవర్తన జీవితాంతం చేసిన సత్కార్యాలన్నింటినీ, ఆరాధనల్ని నిష్ఫలం చేసే ప్రమాదముంది. ఎలాంటి పరిస్థితిలో నయినా ఒక ముస్లిమ్ ఇస్లామ్‌కు బదులు తిరస్కారానికి తోడ్పడటం కాని, ఇస్లామేతర ఉద్యమానికి దోహదకరమయ్యే పనిని చేయడం కాని జరగరాదు. అయితే ముఖ్యంగా ఇస్లామేతర ఉద్యమాలకు అభిముఖంగా ఇస్లామీయ ఉద్యమం ఉన్నప్పుడు విశ్వాసుల శక్తిసామర్థ్యాలు, దైవధర్మ ఉన్నతికి బదులు వేరే వ్యసనాల్లో ఉపయోగపడుతున్నట్లయితే పరిస్థితుల ఈ స్వరూపం ఇంకా ఎంతో తీవ్రత దాల్చుతుంది.

రెండవ విషయమేమంటే ఒక విధ్యుక్తధర్మాన్ని నెరవేర్చే అవకాశం లభించగానే విశ్వసించినవారు వాటిని నెరవేర్చడంలో జాగుచేయడం ఉచితం కాదు. బద్ధకంగా వ్యవహరిస్తే సమయం దాటిపోతుంది. ఆ తరువాత "చిత్తశుద్ధిలేమివల్ల అలా చేయలేదు కదా" అని సమాధానపడటం ఏ విధంగానూ లాభదాయకం కాదు.

సహాబా మహనీయుల పరిస్థితి ఏమంటే ఒకవైపున కపటులు కట్టు కథలతో సాకులు చెప్పుతున్నారు. వారు చెప్పేదంతా బూటకం అని అందరికీ తెలిసిన విషయమే. కాని మహాప్రవక్త (స) వారి కల్లబొల్లి మాటలు విని వారి అపరాధాన్ని మన్నించి పంపు తున్నారు. వారు ఏదయినా పరీక్షా సమయం ఆసన్నమయినప్పుడు చిత్తశుద్ధిగా ప్రవర్తిస్తారని ఆశే లేదు. రెండోవైపున కొందరు విశ్వసించినవారు ఇంతకుముందే ఎన్నోసార్లు తమ విశ్వాసశక్తిని, చిత్తశుద్ధిని రుజువు చేసుకున్నవారు అబద్ధాలు చెప్పడానికి ఇష్టపడరు. నేరుగా తమ తప్పుల్ని ఒప్పుకుంటారు, అయితే ఇలా సత్యం పలికిన దానికి వారికి లభించిన బహుమానం? వారి ఎడల అవలంబించిన విధానం? వారిని సమాజం మొత్తానికి దూరంగా బహిష్కరించడం! కారణం, వారి విశ్వాసంలోనూ, చిత్తశుద్ధిలోనూ ఏదయినా లోపమో, దానిపట్ల సందేహం ఏర్పడటం వల్లనో కాదు, కపటులు చేసే పని వారు చేశారనే! ఇదే వారి అపరాధం. చిత్రమేమిటంటే నాయకుడు ఎంత హుందాగా శిక్షిస్తాడో, అనుచరుడు ఎంత ఉదారంగా

అనుగ్రహాన్ని ప్రసాదిస్తాను" అని. ఇక ఏ వ్యక్తి అల్లాహ్ తెలిపిన అభీష్టాన్ని అంగీకరించి, తన ధన ప్రాణాలను కేవలం అల్లాహ్ ఇష్టపడే పనుల్లో మాత్రమే వినియోగిస్తానని వాగ్దానం చేస్తాడో, దీనికి బదులు పరలోక జీవితంలో స్వర్గం పొందడానికి సుముఖుడవుతాడో అతనే నిజమయిన విశ్వాసి. ఇలాంటి వ్యక్తి విశ్వాసాన్నే అల్లాహ్ క్రయవిక్రయాలుగా పేర్కొన్నాడు. అల్లాహ్ చేసే ఆ ప్రకటనను కాదనే వ్యక్తి ఇంకా, తన ధన ప్రాణాల్ని అల్లాహ్ అభీష్టానికి విముఖంగా వినియోగించే వ్యక్తి అల్లాహ్‌తో క్రయవిక్రయాల ఆ వ్యవహారంలో పాల్గొనడన్నమాట. అతనే తిరస్కారి. అతను ఈ విధంగా తిరస్కరించడమే కుఫ్ర్.

తబూక్ పోరాటానికి సంసిద్ధులవడానికి ఎవరికయితే ఆదేశించబడిందో వారంతా మేము విశ్వాసులమని ఒప్పుకున్నవారే, అంటే వీరంతా, పైన పేర్కొన్న అల్లాహ్‌తో క్రయ విక్రయాల వ్యవహారాన్ని ఒప్పుకున్నవారన్నమాట. అయితే ఈ మాటను నిలబెట్టుకో వలసిన పరీక్షా సమయం ఆసన్నమయినప్పుడు వారిలో కొంతమంది నెగ్గలేకపొయ్యారు. వీరు తమ ధన ప్రాణాల్ని అల్లాహ్ మార్గంలో వినియోగించటానికి వెనుకాడారు. ఇలాంటి వారిలో చాలామంది కపటులున్నారు. వీరి విశ్వాసం బూటకమయింది. వీరు కేవలం ఏదో అవసరానికో లేదా ఒత్తిడి వల్లనో ఇస్లామీయ సమాజంలో వచ్చి చేరారు, వీరిదంతా ఆపద్ధర్మ విశ్వాసం. కాని కొందరు కేవలం బద్ధకం, అలక్ష్యం వల్ల ఈ పొరపాటు చేశారు. అందుచేతనే ఇలాంటి వారందరినీ నిశితంగా విమర్శించిన పిదప, "కేవలం దేవుడు ఉన్నాడు, ఆయన ఒక్కడే" అని నమ్మడమే విశ్వాసం కాదు వాస్తవంగా విశ్వాసం అంటే దేవుడే మన ధన ప్రాణాల ఏకైక స్వామి అని అంగీకరించాలన్న మాట. ఆయన్ని ఈ విధంగా స్వామిగా స్వీకరించిన తరువాత ఎవడయినా తన ధన ప్రాణాల్ని అల్లాహ్ మార్గంలో వినియోగించడానికి వెనుకాడినట్లయితే, వాటిని ఈ మార్గం వదలి వేరే మార్గాల్లో వినియోగిస్తే తాను తన అంగీకారంలో అబద్ధాన్ని పలికినట్లు నిరూపించుకుంటాడు. విశ్వాసం స్వీకరించామని ప్రకటించేవారంతా తమ అంగీకారానికి వెనకనున్న సత్యాన్ని నిత్యం గుర్తుంచుకోవాలి. అల్లాహ్ మార్గంలో కృషి సలపడంలో ఎప్పుడూ వెనుకాడకూడదు.

## ప్రజల ధార్మిక సముద్ధరణ

ఇస్లామ్ ప్రప్రథమంగా పరిచయమైన కాలంలో ఇస్లామ్ సత్యత ఎవరి ఆంతర్యాల్లో స్థానమేర్పర్చుకున్నదో, ఎవరయితే విషయాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకుని మరీ ఇస్లామ్‌ను స్వీకరిస్తున్నారో, అలాంటి వారే ఈ ఉద్యమంతో సహకరించడానికి సమాయత్తమయ్యే వారు. కాని ఇప్పుడు ఇస్లామ్ నలువైపుల వ్యాపించసాగింది. బస్తీలకు బస్తీలే తండోప తండాలుగా ఇస్లామ్‌ను స్వీకరిస్తున్నాయి. వారిలో బహుకొద్దిమందే ఇస్లామ్‌ను పూర్తిగా అవగాహన చేసుకుని విశ్వసించినవారున్నారు. అధికంగా జనులు అన్ని కోణాల నుంచి ఆలోచించకుండానే ఇస్లామీయ ఉద్యమానికి తోడయ్యారు.



స్థూలంగా చూస్తే పరిస్థితుల ఈ స్వరూపం ఎంతో ఆశాజనకంగా వుంది. వేనవేల జనులు ఇస్లామ్‌లో చేరడం వల్ల ఇస్లామ్ శక్తిమంతం అయినట్లు పైకి అగుపించినా ఇస్లామ్‌లో ప్రవేశించిన జనసందోహం ఇస్లామ్ కోరే అవసరాలను బాగా అర్థం చేసుకోలేక పోతే, అది దాని అనుయాయులపై విధించే నైతిక బంధనాల్ని పాటించలేకపోతే, వాస్తవానికి ఇలాంటి వారు ఇస్లామీయ వ్యవస్థకు నష్టదాయకంగా తయారవుతారు. ఇలాంటి పరిస్థితులే ఆ కాలంలో ఉత్పన్నమవసాగాయి. తబూక్ పోరాటం సందర్భంలో వాటిని అంచనా వేయటం కూడా జరిగింది. కనుక ఆ సందర్భంలో ఇస్లామీయ ఉద్యమాన్ని ఈ ఆంతరంగిక బలహీనత నుండి రక్షించడానికి అతి ముఖ్యమైన ఆదేశాలు జారీ చెయ్యబడ్డాయి. గ్రామాలనుండి ప్రజలు మక్కా మదీనాలాంటి ఇస్లామీయ రాజ్య ముఖ్యపట్టణాలకు వచ్చి ఇస్లామ్ బోధనల్ని, ఉపదేశాల్ని వివరంగా నేర్చుకోవాలి. నిజమైన ఇస్లామ్ సారాన్ని జీర్ణం చేసుకోవాలి. తిరిగి తమ తమ గ్రామాలకు పోయి మిగిలిన ప్రజలకు బోధించే ఏర్పాట్లు, వారి సుశిక్షణల ఏర్పాట్లు చెయ్యాలి. అప్పుడే ముస్లిమ్ జనావాసాల్లో నిజమైన ఇస్లామ్‌కు సంబంధించిన చైతన్యం కలుగుతుంది. అల్లాహ్ ఆదేశాలు ఏమిటో అందరూ తెలుసుకో గలుగుతారు.

ఇస్లామీయ బోధనల్ని సర్వసామాన్యం చెయ్యడం అంటే ప్రజల్ని కేవలం అక్షరాస్యులుగా చెయ్యటం మాత్రమే ఉద్దేశ్యం కాదు. దాని అసలు లక్ష్యం ప్రజల్లో ధార్మిక జ్ఞానం పెంపొందడం. వారు ఇస్లామ్, ఇస్లామేతర జీవన విధానాల్లోగల వ్యత్యాసం ఏమిటో తెలుసుకోవడం. ఈ పని అక్షరజ్ఞానం కలిగిన తర్వాత లేదా అదిలేకుండానే జరిగినా ఫరవాలేదు. అసలు ఉద్దేశ్యం మాత్రం నిజమయిన ధార్మిక చైతన్యం కలిగించడమే. అక్షరజ్ఞానం గరపటం దానికి సాధనమే కాగలదు కాని అదే లక్ష్యం కాజాలదు.

## దారుల్ ఇస్లాం రాజనీతి

ఎప్పటికయినా ఇస్లామీయ ఉద్యమంపై, దాన్ని అంతమొందించేందుకు దెబ్బతీయ గలమనే ఆశతో జీవిస్తున్న ఆశాజీవుల కోరికలు తబూక్ పోరాటం తరువాత వమ్మయి పొయ్యాయి. ఇలాంటి వారందరికీ ఇక ఇస్లామ్ శరణు జొచ్చడంకన్నా గత్యంతరం లేకపోయింది. ఈ విధంగా ఈ దివ్యానుగ్రహాన్ని పొంది స్వయంగా వారు ప్రయోజనం పొందకపోయినా వారి భావిసంతతిలోని వారయినా ఇస్లామ్‌ను పూర్తిగా ఆశ్రయించ గలుగుతారని ఆశించడం జరిగింది.

అప్పుడు దాదాపు అరేబియా మొత్తం ముస్లిమ్‌ల పరిపాలన క్రిందే వుంది. వారిని ప్రతిఘటించగల గణనీయమయిన శక్తి ఏదీ మిగల్లేదు. అందుచేత ఇస్లామీయ ప్రభుత్వం తన అంతరంగ రాజనీతిని స్పష్టంగా ప్రకటించే సమయం ఆసన్నమైంది.

(అ) బహుదైవారాధనను అరేబియా భూభాగాన్నుండి పూర్తిగా నిర్మూలించడం జరుగుతుంది. ప్రాచీన బహుదైవారాధనకు (షిర్క్‌కు) సంబంధించిన వ్యవస్థను రూపుమాపి అరేబియాను శాశ్వతంగా స్వచ్ఛమయిన ఇస్లామీయ కేంద్రంగా రూపొందించటం

జరుగు తుంది. దీనికిగాను బహుదైవారాధకులతో ధార్మిక సంబంధాలన్నిటినీ పూర్తిగా తెంపు కోవడం జరుగుతుంది. వారితో చేసుకున్న ఒప్పందాలన్నింటికీ ముగింపు పాడడం జరుగుతుంది.

తదనుగుణంగా హి.శ. 9వ సంవత్సరం హజ్ సందర్భంలో మహాప్రవక్త (స) హజ్రత్ అలీ (ర) ద్వారా హాజీల బహిరంగ సమావేశంలో ఈ క్రింది ప్రకటన చేయించారు:

- ఇస్లామ్ ధర్మాన్ని స్వీకరించేందుకు నిరాకరించే వ్యక్తి స్వర్గంలో ప్రవేశించలేదు.
- ఈ సంవత్సరం తరువాత బహు దైవారాధకులు కాబా గృహంలో ప్రవేశించడం నిషిద్ధం.
- దిగంబరులై దైవ గృహం చుట్టూ ప్రదక్షిణం చెయ్యటానికి ఎవరికీ అనుమతి లేదు.
- ఎవరెవరితో మహాప్రవక్త ఒప్పందం చేశారో వారు తమ ఒప్పందంలోని వ్యవధిలో దాన్ని ఏ విధంగాను ఉల్లంఘించకపోతే ఆ కాలపరిధిలో ఒప్పందాన్ని పాటించటం జరుగుతుంది.
- కాని, ఒప్పందం చేసుకున్నప్పటికీ ఇస్లామీయ ఉద్యమానికి వ్యతిరేకంగా కుట్రలు చేసిన వారికి ఇందుమూలంగా నాలుగు నెలల గడువు ఇవ్వబడుతోంది. ఈ గడువు కాలంలో వారు ముస్లిములతో పోరాడి తమకు ప్రాప్తించ గల భాగ్యం ఏదో పరీక్షించుకోవాలి లేదా దేశాన్నయినా వదలివెళ్ళాలి లేదా బాగా ఆలోచించి అల్లాహ్ ధర్మాన్ని స్వీకరించి ఇస్లామీయ వ్యవస్థలో చేరిపోవాలి.

(ఆ) కాబా నిర్వహణ, దాని సంరక్షణ ఇకపై పూర్తిగా ఏకేశ్వరోపాసకులైన ముస్లిమ్‌ల హస్తాల్లోనే వుంటుంది. బహుదైవారాధకులకు దానిలో ఎలాంటి భాగముండదు. ఇక కాబాలో బహుదైవారాధనకు సంబంధించిన ఏ ఆచారాలూ జరగడానికి వీల్లేదు. బహుదైవారాధకులు ఇకపై ఈ పరిశుద్ధ గృహం సమీపానికి రారాదు.





# అంతిమ యాత్ర

## హజ్జ్‌కై ప్రయాణం

హిజ్రత్ పదవ ఏట మహాప్రవక్త (సల్లల్లాహు అలైహివసల్లమ్) హజ్జ్ చేసే సంకల్పం చేసుకున్నారు. మహాప్రవక్త (స) హజ్జ్ కొరకు ప్రయాణం కానున్నారని హి.శ. 10వ సంవత్సరం జీకఅద నెలలో ప్రకటన వెలువడింది. ఈ వార్త అరేబియా అంతటా తెలిసి పోయింది. ఇంతటి శుభప్రదమయిన సందర్భాన మహాప్రవక్త (స)తో హజ్జ్ చేసే మహదవకాశం పొందాలని అరేబియా నలుమూలలనుంచీ జనం పెల్లుబికి వచ్చారు. జీకఅద నెల చివరి రోజుల్లో ఆయన మదీనా నుండి బయలుదేరారు. జిల్‌హజ్ మాసం 4వ తేదీ ఉదయాన మక్కా చేరుకున్నారు. రావటంతోటే ముందు కాబా ప్రదక్షిణ చేశారు. తరువాత మకామె ఇబ్రాహీమ్‌లో రెండు రకాతుల నమాజ్ చేశారు. అక్కణ్ణుంచి సఫా గుట్టపైకి వెళ్ళారు. తిరిగి మర్వా గుట్టకు వచ్చారు. ఈ మధ్య సతతం దైవ స్తోత్రాన్ని కొనియాడుతూనే ఉన్నారు, ప్రార్థనలు చేస్తూనే ఉన్నారు. ప్రదక్షిణ 'సఫా' 'మర్వాల' 'సయీ' జరిపిన తరువాత ఆయన గురువారం నాడుఎనిమిదవ తారీఖున వెంటవచ్చిన ముస్లిము లందరితో 'మినా'లో మకాం వేశారు. రెండో రోజు జిల్‌హజ్ 9వ తారీఖున ప్రాతఃకాలపు నమాజ్ తరువాత ఆయన మినా నుండి బయలుదేరి 'అరఫాత్' చేరారు. ఇక్కడే ఆయన తన చారిత్రాత్మకమయిన హజ్ ప్రసంగాన్ని వినిపించారు. ఇందులో ఇస్లామ్, దాని పరిపూర్ణ వైభవంతో వర్ణించబడింది. ఈ ప్రసంగంలో ఆయన ఎన్నో ముఖ్యవిషయాలను ఉపదేశించారు. వాటిలో కొన్ని ఇవి:

## అంతిమ హజ్జ్ ప్రసంగం

"బాగా వినండి, అజ్ఞానకాలపు ఆచారాలన్నీ నా పాదాల క్రిందున్నాయి. (అంత మయిపొయ్యాయి). అరబ్బు వ్యక్తికి అరబ్బేతరునిపైగాని, అరబ్బేతరునికి అరబ్బుపైగాని ఎలాంటి ఆధిక్యత లేదు. మీరంతా ఆదమ్ సంతతిలోని వారే, ఆదమ్ మట్టితోనే సృజించ బడ్డారన్నది మరువకండి.

"ముస్లిములంతా పరస్పరం సోదరులు."

"మీ బానిసలు! మీ బానిసలు!! మీరు స్వయంగా తినే భోజనమే వారికి కూడా పెట్టండి. మీరు స్వయంగా ధరించే బట్టలే వారికి కూడా ధరించడానికి యివ్వండి.

"అజ్ఞానకాలపు హత్యాపరిహారాలన్నీ నేటితో అంతం చేయబడ్డాయి. (ఇక ఎవరికీ ఎవరి హత్య ప్రతీకారమూ తీర్చుకునే అధికారం లేదు). ప్రప్రథమంగా నేనే నా వంశంలో రబియా బిన్ అల్ హారస్ కుమారుని హత్య ప్రతీకారాన్ని అంతం చేస్తున్నాను.

"అజ్ఞానకాలపు వడ్డీ లెక్కలన్నీ రద్దు చెయ్యబడ్డాయి. (ఇక ఎవరికీ వడ్డీని అడిగే హక్కు లేదు) ప్రప్రథమంగా నేనే నా వంశంలో అబ్బాస్ బిన్ అబ్దుల్ ముత్తలిబ్‌గారి వడ్డీని అంతం చేస్తున్నాను.

"మహిళల గురించి దేవునికి భయపడి మెలగండి, మీకు స్త్రీలపై ఏ విధంగా హక్కు ఉందో అదే విధంగా వారికి కూడా మీపై హక్కు వుంది.

"మీ రక్తం (ప్రాణం), మీ ధనం ప్రళయం వరకు ఒకరిదొకరికి పవిత్రం (అంటే నిషిద్ధం, వాటికి హాని చేయరాదు)– ఈ రోజు, ఈ నెల, ఈ నగరం పవిత్రమైనట్టు!

"నేను మీ కొరకు ఒక వస్తువును వదిలి వెడుతున్నాను, దాన్ని మీరు దృఢంగా పట్టుకుని అనుసరించారంటే మీరు దారి తప్పరు– అదే దైవగ్రంథం ఖుర్‌ఆన్."

ఆ తరువాత మహాప్రవక్త (స) ఎన్నో షరీఅత్ ఆదేశాలు తెలిపారు. పిదప సమావేశమయిన వారిని సంబోధిస్తూ, "దైవసన్నిధిలో మిమ్మల్ని నా గురించి ప్రశ్నించి నపుడు మీరు ఏమని సమాధానమిస్తారు?" అనడిగారు.

"మీరు దేవుని సందేశం మాకు అందజేశారనీ, తమ కర్తవ్యాన్ని నిర్వర్తించారని బదులిస్తాం" అని జవాబు చెప్పారు సహాబా. దానికి ఆయన ఆకాశం వైపునకు వ్రేలెత్తి "అల్లాహ్! నీవే సాక్షి" అని మూడు పర్యాయాలు పలికారు. ఆ సందర్భంలోనే ఈ ఆయత్ అవతరించింది:

> "నేడు నేను మీ కొరకు మీ ధర్మాన్ని, జీవిత సంవిధానాన్ని పరిపూర్ణం గావించాను. నా అనుగ్రహాన్ని పూర్తి చేశాను. మీ కొరకు ఇస్లామ్‌నే అనుసరణీయమైన ధర్మంగా సమ్మతించాను." (మాయిదా:3)

ఈ హజ్జ్‌లోనే మహాప్రవక్త (స) హజ్జ్ సంప్రదాయాలన్నిటినీ స్వయంగా ఆచరించి హజ్జ్ ఎలా చేయాలో బోధించారు. అప్పుడే ఆయన "ఇదో, హజ్జ్‌లో పాటించ వలసిన లాంఛనాలన్నీ ఇప్పుడు నా ద్వారా నేర్చుకోండి, నాకు తెలియదు, దీని మీదట నాకు మరోసారి హజ్జ్ కొరకు వచ్చే అవకాశం లభిస్తుందో లేదో!" అని సెలవిచ్చారు.

అప్పుడే, "ఇప్పుడు ఇక్కడ ఉన్నవారు ఈ మాటలన్నీ ఇక్కడ లేనివారికి తెలియ జేయాలి" అని కూడా అన్నారాయన.



## అస్వస్థత

హి.శ. 11వ సంవత్సరం సఫర్ మాసం 18 లేక 19వ తేదీన ఆయన ఆరోగ్యం కాస్త చెడింది. ఆ దినం బుధవారం. సోమవారం నాటికి వ్యాధి తీవ్రత హెచ్చింది. శక్తి మేరకు ఆయన మస్జిద్‌కు వచ్చి నమాజ్ చేయిస్తూ ఉన్నారు. చివరన ఆయన చేయించింది మగ్‌రిబ్ (సూర్యాస్తమయానంతరం) నమాజ్. అప్పుడు ఆయనకు తల నొప్పిగా ఉండింది. తలకు తువ్వాలు చుట్టుకుని వచ్చారు. నమాజ్‌లో అల్‌ముర్సలాత్ సూరా పఠించారు. ఇషా నమాజ్ వేళకి బలహీనత అధికమయింది. అందువల్ల ఆయన నమాజ్‌కు రాలేకపొయ్యారు. అప్పుడు అబూబక్ర్ (రజి అల్లాహు అన్‌హు) నమాజ్ చేయించాలని చెప్పారు మహాప్రవక్త (స). తదనుగుణంగా హజ్రత్ అబూబక్ర్ (ర) చాలా దినాల వరకు నమాజ్ చేయించారు.

## అంతిమ నిర్దేశాలు

ఆ మధ్య ఒకరోజున ఒంట్లో కాస్త కులాసాగా ఉన్నట్లు అగుపిస్తే ఆయన స్నానం చేసి మస్జిద్ విచ్చేశారు. అక్కడ ఒక ప్రసంగం చేశారు. అది ఆయన జీవితంలో చేసిన కట్టకడపటి ప్రసంగం, అందులో ఆయన ఇలా సెలవిచ్చారు:

"దైవం తన దాసునికి, ఇష్టమయితే ప్రాపంచిక భాగ్యాలను స్వీకరించవచ్చు లేదా దేవుని వద్ద పరలోకంలో వున్న దాన్ని స్వీకరించవచ్చు అని స్వేచ్ఛగా కోరుకునే అధికారాలనిస్తే అతను దేవుని వద్ద ఉన్నదాన్నే స్వీకరించాడు."

ఇది వినగానే, దానికి అర్థం ఏమిటో తెలుసుకున్న హజ్రత్ అబూబక్ర్ (ర) విలపించసాగారు. ఆయన (స) ఇంకా ఇలా అన్నారు:

"నేను అత్యధికంగా ఎవరి ధనానికయినా, ఎవరి మైత్రికయినా రుణపడి ఉన్నా నంటే, ఆయన అబూబక్ర్. నేను ప్రపంచంలో నా అనుచర సంఘంలోని వారిని ఎవరి నయినా మిత్రునిగా ఎన్నుకోవాలంటే అది అబూబక్ర్‌నే అయివుండేది. కాని, మైత్రీ అనుబంధాలకు సరయిన ఆధారం ఇస్లామ్ మాత్రమే.

"ఇంకా బాగా వినండి, మీ కంటే ముందు ఉండిన అనుచర సమాజాలు తమ ప్రవక్తల సమాధుల్ని తమ మహనీయుల 'గోరీ'లను ఆరాధనాలయాలుగా మార్చుకున్నారు. జాగ్రత్త! మీరు అలా చేయకూడదు. నేను వారించి మరీ వెళుతున్నాను.

"హలాల్ (ధర్మసమ్మతమయిన), హరామ్ (అధర్మమయిన) వాటికి సంబంధించిన నిర్ణయాన్ని నాకు ఆపాదించకండి. దైవం హలాల్ చేసిన వాటినే నేనూ హలాల్ అని అన్నాను. దైవం హరామ్‌గా నిర్ణయించిన వాటినే హరామ్‌గా చెప్పాను."

ఇలా అనారోగ్యంగా ఉన్నప్పుడే ఒక రోజున తన కుటుంబం వారిని ఉద్దేశించి ఇలా చెప్పారు:

"దైవ సందేశహరుని కూతురు ఫాతిమా! దైవ సందేశహరుని అత్త సఫియా! దేవుని సన్నిధిలో మీకు పెన్నిధిగా ఉపకరించే దాన్ని ఇప్పుడే సిద్ధం చేసుకోండి. నేను మాత్రం మిమ్మల్ని దేవుని పరీక్ష నుండి తప్పించలేను."

ఒకరోజు బాధ అధికమయింది. ఆయన ఒకప్పుడు దుప్పటితో ముఖాన్ని కప్పుకుంటున్నారు, మరొకప్పుడు తీసివేస్తున్నారు. ఈ పరిస్థితిలో హజ్రత్ ఆయిషా (రజిఅల్లాహు అన్హా) ఆయన పవిత్రమయిన నోటినుండి ఈ శబ్దాలు వెలువడినట్లు గమనించారు.

"యూదులపై, క్రైస్తవులపై దైవాగ్రహం కలుగుగాక! వారు తమ ప్రవక్తల సమాధుల్ని ఆరాధనాలయాలుగా నిర్మించుకున్నారు."

ఆయన ఎప్పుడో హజ్రత్ ఆయిషా వద్ద కొన్ని సవరాల బంగారం భద్రపరచి పెట్టారు. ఈ వ్యాకుల సమయంలోనే ఒకసారి అడిగారు "ఆయిషా! ఆ సవరాలెక్కడ! ముహమ్మద్ దైవంపట్ల అనుమానంలోపడి ఆయనతో కలుస్తాడా? వెళ్ళు, వెళ్ళి వాటిని దైవమార్గంలో దానం చేసివెయ్యి."

## పరమోన్నత మిత్రుని వైపునకు

బాధ ఒక్కోసారి అధికమవుతోంది, ఒక్కోమారు తగ్గుతోంది. సోమవారం నాడు కాస్త ప్రశాంతత ఏర్పడినట్లు గోచరించింది. కాని ప్రొద్దెక్కినకొద్దీ ఆయన మాటిమాటికీ స్పృహ కోల్పోవడం జరుగుతోంది. ఈ పరిస్థితిలో తరచుగా "దైవానుగ్రహం పొందిన వారితో" అనే మాటలు వినిపించేవి.

మరొకసారి, "అల్లాహ్! పరమోన్నత మిత్రుడు" అని.

ఇంకొకసారి. "ఎవరూ కారు ఆ పరమమిత్రుడే అవసరం" అని పలికేవారు.

ఇలా పలుకుతూవుండగా పరిస్థితి విషమించింది. ఆయన పవిత్ర ఆత్మ పావన లోకాలకు పయనించింది.

అల్లాహుమ్మ సల్లి అలా ముహమ్మదిన్ బారిక్ వ సల్లిమ్.

దేవా! ముహమ్మద్‌పై శాంతిని కురిపించు, శుభాలను కురిపించు.

ఆయన పరమపదించిన తేది హి.శ. 11వ సంవత్సరం రబీఉల్ అవ్వల్ మాసం సోమవారం రోజున 12వ తారీఖు అని ప్రతీతి.

రెండవ రోజున అంత్యక్రియలు జరిగాయి. సాయంత్రానికల్లా ఆయన పరమ పవిత్ర దేహాన్ని ఆయన దివంగతులయిన గదిలోనే సమాధి చేయటం జరిగింది.

ఇన్నా లిల్లాహి వఇన్నా ఇలైహి రాజిఊన్

మీరు మరణించారు, అందరూ మరణించవలసిన వారే, మేమూ దైవం కొరకే, అందరూ మరలిపోవలసిందీ ఆయన వైపునకే!!



### రోము చక్రవర్తి హిరక్ల్ (Heraclius) కు పంపిన పత్రం

కరుణామయుడు కృపాకరుడయిన అల్లాహ్ పేరుతో

ముహమ్మద్ దైవదాసుడు దైవ సందేశహరుని తరఫున చక్రవర్తి హిరక్ల్ కైసర్ పేరిట.

దైవోపదేశాన్ని స్వీకరించినవారికి శాంతి కలుగుగాక! నేను మీకు ఇస్లామ్ సందేశాన్నిస్తున్నాను. మీరు ఇస్లామ్ స్వీకరిస్తే అల్లాహ్ మీకు రెండింతలు పుణ్యఫలాన్నిస్తాడు. ఒకవేళ తిరస్కరిస్తే జాతి మొత్తం మార్గవిహీనతా భారం మీపై పడుతుంది.

'గ్రంథం కలవారలారా! విభేదాలన్నింటినీ విస్మరించి మీకు, మాకు మధ్యన సమంగా అంగీకృతమయిన ఒక్క మాటపై ఏకీభవిద్దాము, అదేమంటే, మనం దైవం తప్ప ఇతరులెవరినీ ఆరాధించము, ఎవరినీ ఆయనకు సహవర్తులుగా భావించము. అల్లాహ్ తప్ప ఇతరుల్ని మన ప్రభువుగా అంగీకరించము. మీరు దీన్ని తిరస్కరించినట్లయితే మేము మాత్రం దేవుని ఏకత్వంలో నమ్మకమున్నవాళ్ళమని మీరు గ్రహించాలి.

(ఇట్లు)
ముహమ్మద్
దైవసందేశహరుడు

## బహెరెయిన్ గవర్నరు ముస్జిర్ పేరిట పంపిన పత్రం

కరుణామయుడు కృపాకరుడయిన అల్లాహ్ పేరుతో

ముహమ్మద్ దైవ సందేశహరుని తరపున ముస్జిర్ బిన్ సాకు అస్సలాముఅలైకుమ్! ఒక్కడే అయిన, సహవర్తులు లేని అల్లాహ్‌ను కీర్తిస్తున్నాను. నేను సాక్ష్యమిస్తున్నాను - దేవుని ఏకత్వానికి, నేను అల్లాహ్ దాసుణ్ణి, ఆయన సందేశహరుణ్ణి అన్న విషయాలకు.

నేను మీకు దైవాన్ని గుర్తుచేస్తున్నాను. ఎవరయితే ప్రబోధాన్ని స్వీకరిస్తారో వారు తమకే మేలు చేసుకుంటారు. ఎవరైతే నా వార్తాహరుల్ని అనుసరిస్తారో వారి ఆదేశానుసారం ప్రవర్తిస్తారో వారు నిజానికి నన్ను అనుసరించినట్లే. ఎవరయితే వారి ఉపదేశాన్ని స్వీకరిస్తారో వారు నా ఉపదేశాన్ని స్వీకరించినట్లే.

నా వార్తాహరులు మీ నడవడికను ఎంతో కొనియాడారు. మిమ్మల్ని మీ పదవిలో యధావిధిగా ఖాయపరుస్తున్నాము. మీరు దైవంపట్ల దైవ సందేశహరుని పట్ల శ్రేయోభిలాషులుగా మెలగాలి. బెహ్రేయిన్ వాసుల గురించి మీరు చేసిన సిఫారసును ఆమోదిస్తున్నాము. నేను తప్పులు చేసిన వారిని మన్నిస్తాను. మీరు కూడా వారిని మన్నించండి. మరె వరయితే యుదులుగా, మజూసీలుగా ఉండిపోతారో వారి నుండి జిజియా మాత్రం వసూలు చెయ్యడం జరుగుతుంది.

(ఇట్లు)
ముహమ్మద్
దైవసందేశహరుడు



## ఈరాన్ రాజు ఖుస్రో పర్వేజ్ పేరిట పంపిన లేఖ

కరణామయుడు కృపాకరుడయిన అల్లాహ్ పేరుతో

దైవ సందేశహరుడు ముహమ్మద్ తరపున ఈరాన్ రాజు ఖుస్రో పేరిట - దైవ మార్గదర్శకత్వాన్ని అనుసరించి అల్లాహ్‌ను ఆయన సందేశహరుణ్ణి విశ్వసించిన వారికి శాంతి కలుగు గాక! తానొక్కడే అయిన, తనకు సహవర్తులు లేని అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యదైవం లేదని, ముహమ్మద్ ఆయన దాసుడు, ఆయన సందేశహరుడని నేను సాక్ష్యమిస్తున్నాను. బ్రతికి ఉన్న మానవులందరినీ దైవభీతిని బోధించ దానికి, దేవుడు నన్ను యావజ్జగత్తుకై ప్రవక్తగా ప్రభవింపజేశాడు - మీరు ఇస్లామ్ స్వీకరించండి, రక్షింపబడతారు. మీరు తిరస్కరిస్తే అగ్ని పూజారులైన మజూసీల పాపభారమంతా మీపై పడుతుంది.

(ఇట్లు)
ముహమ్మద్
దైవసందేశహరుడు

## ఈజిప్ట్ పాలకుడు మకౌకిస్‌కు పంపిన పత్రం

కరుణామయుడు కృపాకరుడయిన అల్లాహ్ పేరుతో

దేవుని దాసుడు, ఆయన సందేశహరుడయిన ముహమ్మద్ తరఫున ఈజిప్ట్ పాలకులు మకౌకిస్ పేర. సన్మార్గాన్ని అవలంబించే వారిపై శాంతి నెలకొనుగాక! నేను మీకు ఇస్లామ్ సందేశాన్ని ఇస్తున్నాను. మీరు మీ శ్రేయాన్నే కాంక్షించేవారే అయితే ఇస్లామ్‌ను స్వీకరించండి. మీరు ఇస్లామ్ స్వీకరిస్తే అల్లాహ్ మీకు ద్విగుణీకృతమయిన పుణ్యఫలాన్ని ప్రసాదిస్తాడు. మీరు తిరస్కరిస్తే మొత్తం జాతి మార్గవిహీనతకు మీరే బాధ్యులవుతారు.

"గ్రంథం కలవారలారా! విభేదాలన్నింటిని విస్మరించి మీకూ మాకూ మధ్యన సమంగా అంగీకృతమయిన ఒక్క మాటపై ఏకీ భవిద్దాము. అదేమంటే, మనం దైవం తప్ప ఇతరులెవరినీ ఆరాధించము. ఎవరినీ ఆయనకు సహవర్తులుగా భావించము. అల్లాహ్ తప్ప ఇతరుల్ని మన ప్రభువుగా అంగీకరించము. మీరు దీన్ని తిరస్కరించినట్లయితే మేము మాత్రం దేవుని ఏకత్వంలో నమ్ముకున్న వాళ్ళమని మీరు గ్రహించాలి.

(ఇట్లు)
ముహమ్మద్
దైవసందేశహరుడు



**Hayat-e-Tayyiba**
(Telugu)

# మహాప్రవక్త ముహమ్మద్

(సల్లల్లాహు అలైహి వ సల్లమ్)

*ఆధారం:*
**హయాతె తయ్యిబా**

*రచన:*
**అబూ సలీమ్ అబ్దుల్ హై**

*అనువాదం, సంపాదకత్వం:*
**ఎస్.ఎమ్. మలిక్**





**తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్**
సందేశభవనం, లక్కడ్‌కోట్,
హైదరాబాద్-500 002. ఫోన్: 24564583